# అయోధ్యాకాండము

## అభిషేకఖండము

శ్రీ పరిణతత్రిచతుర్లో
కీపుణ్యాకార! బహుముఖస్వాకారా!
గ్లౌపాండుజటాభారా!
ఔపనిషదసంవిదనితరాత్మాకారా!

గీ. అంత ముక్తినేల యవనిపాలుఁడు చంద్ర
మౌళి నృపతి వినిన లీలఁగాను
విశ్వనాథ! నీకు వినిపించెద నయోధ్య
విశ్వనాథవంశవిధుఁడ నేను

గీ. గోళకాంతిచ్ఛటల్ పెఱగోళములకుఁ
బయనముం జేయ నబ్దముల్ పట్టునట్లు
రాచదేవిడీలందు వార్తలును జేరఁ
బ్రభువు ప్రభువును మధ్య నబ్దములు పట్టు

ఉ. రామున కాత్మలో నొక విరాగము కల్గినమాట యా విరా
గామితతీవ్రతల్ చెడి తనంతన శాంతివహించు పిమ్మటన్
దా ముదిఱేనికిన్ దశరథక్షితిజాని కెఱుంగనయ్యెఁబోఁ
బ్రామిన భీతియున్ దరతఱై మనుజేశుఁడు దందడించుచున్

గీ. బ్రహ్మచారి సుతుండు విరాగియైన
జనకుఁ డూహించు సుతు గృహస్థునిఁ బొనర్పఁ
దా గృహస్థుండె సుతుఁడు విరాగియైనఁ
దండ్రి వ్యవహార మతనిని దాల్పఁజేయు.

క. అని లోకతంత్ర మెంచుచు
ననఘమతిని యౌవరాజ్యమందున నభిషి
క్తునిఁ జేయ రామచంద్రుని
మనమునఁ స్ఫురియించినంత మానవపతియున్

గీ. తాదృశోత్సవములను సుతద్వయంబు
భరతశత్రుఘ్నులను బిల్వఁబంప లేదు
నొకరితోఁ జెప్ప లే 'దెంత చకితుఁడయ్యొ
నంత తొందరపడుచు ధరాధినేత

వ. ఆ సమయంబున నవ్యంబైన రాజకార్యాగతులైనకోసల నీవృత
సర్వనగరస్థ రాజకార్యదక్షులును సాకేతంబున నునికిఁ బ్రధాన
సామంతనృపులును వారును మంత్రిపురోహితులును గూడిన
మహాపరిషత్తునఁ దత్పరిషత్కార్యనిర్వాహణానంతరంబున

గీ. తూర్నవిభుఁడు సింహపీఠిపైఁ గదలకున్న
సభ యవిజ్ఞాతహేతువై సంభ్రమించె
నుదుటిపై రెండు మూఁడైన ముదుక చెమట
ముత్తెములు తోఁచ నిట్లనె భూమినేత

మ. తనకున్ గుండలహేమనూతనహరిద్రాకాంతి కర్ణాంతకే
శనిపీతోగనముజ్జరాసితవిశేషాక్రాంతి డీలొప్పెనున్
తనకున్ షష్టిసహస్రవర్షధరణీతాత్పర్యచింతాభిరగ
తన రేఖన్ బలసంఘుతాలు చలితత్వాకల్పనార్యయం జేఁ చెమున్

గీ. భూమిభారంబు రాముని బుజములందుఁ
జేర్చి విశ్రాంతిఁ బొంద వాంఛింతు నేను
రాముఁడు సుబాహుతాటకాప్రాణహర్త
రాముఁడు వశిష్ఠపదసమారాధకుండు.

మ. అనయంబున్ బిశితాశి యింద్రియవశుండై రాజు బంగారు నే
లను నాగేళ్లఁ ద్వచంబు గాక గునపాలన్ గీకసంబంటఁ గ్రు
మ్మను సాధూత్తముఁడున్ జితేంద్రియుఁడు రాముండీ ధరాభార మా
తని బాహాయుగమధ్యసీమ నభినీతంబైన మన్నింపదే? ౧౨

గీ. ధాత్రిజనసమ్మతధిష్ఠితధర్మనావఁ
గడప రామచంద్రుండు చుక్కాని బిగువు
ఆ మహాధర్మనౌకాగ్రమందు మూఁడు
జగములైనను చుక్కాని బిగువు చెడదు

చ. అతనికి యౌవరాజ్యపద మానిచి రొడ్డిగిలంగ నెంతు స
మ్మతియగునొక్కొ మీకును సమంజసమై కనిపించు నాకు నా
మతిహితముల్ తలంపఁకుడు మధ్యులు మీరలు క్లిశ్యమానప
ద్ధతియగు నర్థమందుఁ జరితవ్యము మధ్యులవాక్య మెంతయున్

మ. అనినంతన్ సభలోపలన్ గదలికై యంతంత వాచాలతా
ఘనమై దుందుభిమేఘనిస్వనములై తెల్లభృత్సభాసౌధ మొ
క్కనిమేషంబున లేచిపోవునటులన్ గన్పించి క్షీరాబ్ధి పొం
గిన చాయం దగె సర్వపారిషదదృక్కేళీప్రమోదార్ద్రితన్

గీ. సభను గల పెద్ద లందఱు సంప్రతించి
వృద్ధబ్రాహ్మణక్షత్రియవీరు లొక్క
కొంతమంది ధరాపతి చెంతఁ జేరి
సుప్రసన్నాననములతో శోభ తేరి

శా. నీ మాటాడినసవ్వడుల్ తరఁగలై నీరేజబంధ్వంశమా
లామార్గంబులు పుల్కరించినవి మాలాబద్ధసానందబా
ష్పామందచ్ఛవిఁ గందళించినవి సర్వాస్యద్దృశాశ్రేణులున్
రాముం డింతకు మున్నె కావలయు మా రాజన్న భావంబునన్

క. వేలాదియేండ్లు లో భూ
పాలా ! పాలించి మిగుల బడలితి వేలా?
హేలామాధవు రాఘవు
బాలార్కప్రతిముఁ జేయు బాలనృపాలున్

వ. అనిన దశరథుండు నిభృతవదనుండై సూచ్యగ్రంబులైన చూపులతో

క. నే నన్నా నని యంకరో
కానీ రాముండు మీకుఁ గడుఁ గూర్చురొ? వాఁ
డైన నృపభావయోగ్య
స్థానం బగు నంచు మీరు చర్చించితిరో! ౧౦

వ. అనిన బ్రాహ్మణు లిట్లనిరి

గీ. లవము కాదయ్య కాదు మాలాశతాంగ !
లవమునుం గాదు దృష్టిహేలాకురంగ !
మా యనిన గొల్లమాటలు మా యెడంద
లాంచికొన్నవి యరితమిస్రాపతంగ !

గీ. ఇతర దుష్టారినృపులపై నెత్తిపోయి
యనుజునను దా నయోధ్యను నరుగుదెంచి
రామచంద్రుండు ప్రేమతో క్షేమ మరయుఁ
బేరుపేరున మఱి పిల్ల పిల్ల నరుస

శా. నానాదేవశిఖాగమాస్త్రమయనిష్ణాతుండు శ్రీరాముఁడే
నానాస్వాదుసుధావచస్సుమయనిష్ణాతుండు శ్రీరాముఁడే
తానై రాముఁ డంబరీషరఘుమాంధాత్రాది రాజన్యతే
జోనిర్ణీతనృపాలభావమతిసంశుద్ధుం డవిద్ధాత్ముఁడున్

వ. అనిన క్షత్రియు లిట్లనిరి

మ. చదు వేకన్ దితిజాపై కొడ్డగెడవై చన్నన్ సురశ్రీ, పదం
బోదుల్ పాదారౌకఁడే సపాటముగఁ జేయున్ రామచంద్రుండు పా
యదు శ్రీరాముని నేత్రయుగ్మమున ధైర్యశ్రీమహారేఖ పా
యదు శ్రీరాముని బాహుయుగ్మమున శౌర్యశ్రీమహారేఖయున్

ఉ. చిన్నకునెత్తి రావణుఁడు చేడ్పడఁ డీసునఁ గాలుదువ్వి తా
నెవ్వఁడొకాని గాధికొడు కిచ్చిన యంపఱవెల్లిమున్గఁ డా
మన్నపుఁ జేటిలా నరికుమారుఁడు రాముఁడు నీతిబుద్ధికిన్
విన్నరిముల్లు పూత సమలిప్తకృతిన్ దార్చెదు యౌవరాజ్యమున్

వ. అంతఁ గోశాగారనిర్వాహకు లయిన వైశ్యోత్తము లిట్లనిరి

గీ. నేలనీటిమార్గంబుల నేలునట్టి
బహుళవాణిజ్యబహుసభాపతులు సఖులు
రామచంద్రున కతఁడు వార్తానయార్థ
శాస్త్రధిషణాపయోరాశిచంద్ర రేఖ

ఉ. చిట్టిరఘూద్వహుండు దయచేసిన చిక్కని యొక్కమాట తా
కట్టుగ నీ మహాఖిలజగద్వణిజుల్ తమహేమరత్నముల్
బుట్టలఁ దట్టిన్ గొలిచిపోయుదురే వెనుదీయకుండఁగా
గుట్టలుగాఁగ రాఘవుఁడు కూరిమి తేఁ డగునంచుఁ బట్టదే?

వ. అనిన రాజమహోద్యోగులై వయఃపాండిత్యవృద్ధులైన యుత్తమ
శూద్రు లిట్లనిరి

గీ. అలుగఁ డలుగు నేము యతఁడె యాత్మ నెఱుంగు
నుఱునుఁ [illegible]ఱుము నేము యెఱుఁగు నతఁడె
యతనిమాట మోము నమితప్రసన్నముల్
రాజు రాముఁడైన రాజు రాజు

మ. పదిరెండేడ్లగునాఁటి బాణ మసురీప్రాణంబు ఘోణంబుగాఁ
జదియన్ దూసెనఁటే మహానటమహాచాపం బరూపంబుగాఁ
జదురుల్ చూపెనఁటే త్రిలోకపదవీసామ్రాజ్య మర్పించున
ట్టిదికా దీ యొక కోసలంబులకు తేఁడే యింత యూహించుటో!

వ. అనినంతఁ బట్టరాని మహోద్ధాహాజయరావంబుల నడుమ
సుయజ్ఞుండు లేచి

మ. కడఁకన్ రాజయి తాను గోసలపుఁ జెక్కన్, చాఁచినన్ జాలదే
గుడుసై గుప్పిలి పెచ్చువిల్లెసుము డక్కంగాక ముల్లోక మా
వడిఁగాఁ డేమిరయొనర్చు నాతని ప్రభావం బెందు సాకేతముం
విడి యూరీకృతదోఃపరాక్రమరసావిర్భూతి యేపారునో!

మ. జన్నంబుల్ పొసరించునో గుణమణిస్థానంబు కానోపునో
మిన్నుల్ ముట్టిన బ్రహ్మవేత్త యగునో మేలెంచి పాలించునో
యన్నన్ సర్వము సిద్ధ మాతనిదెసం బ్రారంభముల్ దోఃప్రభా
సన్నక్లిష్టము లన్యదుర్లభములం సాధింపనే కావలెం

వ. అనిన నెల్లరు సెబా సని రంత

ఉ. భూపతి కంటికోసలను బొల్చిన చిన్నరి మోదబాష్పబిం
దూపరిదృశ్యమానకలితోజ్జ్వలరత్నమణిప్రదీపికా

శ్రీ, పరిదీప్తమై వెలువరించెను భూపతిగుండెలోని ర
త్నాపణవద్గద్గితమైన మహోత్సవకాంతి యెల్లయుఁ

గీ. పారిషదహృత్ప్రమోదరాశి పరమశయ్య
సుఖశయానునకును మధుసూదనునకు
ద్రుతకృతాంజలికోశమాత్రునిందు రాజు
నడిగిపోయెఁ బ్రత్యర్చానవోక్తి లేక

గీ. జయనినాదఘోష చనుచున్న సభతోడ
దూరవీథియందుఁ దోఁచుదాఁక
ప్రాలి మఱల మాటరాలేదు పులకిత
ప్రమదవివశుఁడై రాజు నోట

వ. అంత శ్రీ వశిష్ఠులు తత్తదధికార్యవలోకనంబుగా నిట్లనిరి. రేపాడి రామయ్యకు యౌవరాజ్యంపుఁబున్నెంపునీరాడియుత్సవంబుగావున సువర్ణరత్నబల్యోషధులు శుక్లమాల్యాలాజమధుసర్పిస్సులు, పట్టుసీరలు,రథసర్వాయుధచతురంగబలంబులుకట్టాయితంబుసేయుఁడు, పల్లనిగురుతులుగల యేనుఁగు, తెల్లని చమరితోఁకయు, వెల్లని పడగయుఁ జల్లని గొడుగును నెట్టిగా మెఱుఁగు తెచ్చిన వంద బంగారు కుండలును బైడికొమ్ముల యెద్దును సనఖదంష్ట్రివాలంబైన పులి తోలును నగ్నిగృహంబున రేపాడి సమకూర్పఁజను

గీ. కపురఁపు ఘుమ్మగు మంచిగంధఁపుఁగలాపి
ప్రసవమాలా త్తతోరణప్రచయములును
వాసనావధు లగురుధూపములు నింట
నింట ముంగిట నెసఁగవలయు

శా. సర్వబ్రాహ్మణయాయజూక పరిషత్సంతర్పణప్రక్రియా
సర్వాన్నాదికపాకయత్న ఘణితుల్ శాసింప నంతఃపురం
బుర్వీశుండు సుమంత్రుతోఁ జని సుమంత్రోహత్త దృక్పక్ష్మలాం
తార్వాచీనకళానుమానకలితస్వాకూతి నీ రీతిగన్

చ. పొలుపునఁ బల్కెఁ దమ్మిపువుచట్టపువంగసపింటిదివ్వియుఁ
బిలుచుచునుంటినంచుఁ జని వెంబడిఁ దెమ్ము ప్రజాప్రియంబు నేఁ

దెలిపెద నీవ కొంచు నరుదెమ్మ సుఖాసుఖసర్వవైఖరిన్
జలజహితాన్వయంబునకు సాక్షివి నీవకదా యుగాదిగన్

క. ఒక తెలియని కనుబొమకద
లికతోడ సుమంత్రుఁడున్ జలించెను బిత్రా
జ్ఞకు వచ్చె రాముఁడును సూ
ర్యకరాహూతికిని వార్షికాభ్రమువోలెన్

సీ. మరకత వైదూర్య మాణిక్య నీలచ్ఛ
టాత్తిచే బర్హిబర్హాభ చూడు
సహజ నిశ్చల మనస్సంచారధీరతా
ప్రతిభచే శ్రీగజరాజగమను
స్వాంతన్నిలీనబ్రహ్మజ్ఞానకీర్తిచే
నిశ్చలసౌదామనీదృశాక్షు
మందవీచీపరిస్పందానిలాధ్వరం
జన బలాకాగరుత్సదృశచేలు

వక్షలక్ష్మీసమాసన్నవత్సుఁడైన
ప్రౌఢపర్జన్యదేవుఁ డభ్రంబు వదలి
నడచి వచ్చెడు చందాన నయనపర్వ
మోదమును గాంచెఁ బతి మేడమీఁది నుండి

. శీఘ్రమ గథావతరణంబు చేసి సాంజ
లియు సుమంత్రుండు నొత్తిగిలి మునురాఁగ
మేడనెక్కె రాముఁడు ప్రణమిల్లుదాఁక
పుత్త్రుఁగాంచిన తొలిసొమ్ము పోదు పతికి

సీ. చిటికెనవ్రేలితో శివుని విల్వ్రేచిన
ఘోరబాహుని నెత్తికోను నగునె
యనుభూతదనుజమర్దన కాలవికటత్వ
మీతని బుగ్గ ముద్దిడఁగ నగునె
కోసలరాజ్య సింహాసనాధ్యాసన త
ర్కితుఁ దొడ నితని నెక్కింప నగునె

తన కాలిచెప్పు రాముని కాల సరిపోవు
వయసులోఁ గౌఁగిలింపంగఁ దగునె
రామచంద్రుని వయసు కారణముగాఁగ
నవనిపతి పొంగులగు ప్రేమ నగ్రగమైన
నతఁడు పూనిన యంజలి నంజలించి
యతని యంజలిలో ముద్దులాడె నృపతి

వ. అంత నాసీనుఁడై తండ్రిసంక సాకూతమ్ముగఁ గాంచు రామ చంద్రునితో సుమంత్రుండు, "ఆర్య! ప్రకృతిజనంబులు మిమ్ము యౌవరాజ్యమందభిలషించి"రని వచియింపఁగా దశరథుం డిట్లనియె

క. భయసహితుఁ డగును భూపతి
నయేతరపరికటవర్తనమునఁ జటిలు మృ
ణ్మయపాత్ర కాల్పుతగ్గిన
నయశాస్త్రము గీసినట్లు నడువఁగవలయున్

గీ. గ్రామ్య పశువులఁ బొలిమేరఁ గాచి చంపు
పులుల మందిడి యాటవికులు వధించు
నట్టులు ప్రజాపకారపర్యాప్తుఁడైన
క్షితిపతికి బిట్టుసిలుఁగు తెచ్చెదరు ప్రజలు

గీ. క్షితిపతియు మహావ్యసని పుచ్చి నుసి రాలు
దూల మట్టులు తొలుత మంత్రులును నిలువఁ
బెట్టినను బోటిగా నిల్చి తుట్టతుదకుఁ
గుప్పకూలంగఁ జను వింటికప్పువోలె

గీ. పాళముగఁ బాకమారిన పాత్రివోలెఁ
గహనసంచారియైన వ్యాఘ్రంబువోలె
జేవ తఱుగని దూలంబు రేవ నీవు
నయపరాక్రమస్థైర్యరత్నాకరమవు

వ. పట్టమహిషి కౌసల్యాగర్భమవు నీవు యౌవరాజ్యపదవీ యోగ్యుఁడ వైతి వన

ఉ. తా నిటువంటిమాట వసుధాపతినోట వినిర్గమించు వే
గా నిరతప్రతీక్ష యెద లాగిన రాముని మిత్రముల్ ప్రమో
దానిలధూతులై నటుల నంతనఁ గోసలరాజపుత్త్రికా
శ్రీనిలయంబునం జని వచించి రచించి రనంత శోభలన్

శా. కౌసల్యాగృహసీమలందున నలంకారంబు లానందరే
ఖాసంపాదితహాస్యలాస్యరచనాకాంతాకృతిప్రస్ఫుర
ద్దాసీదాసజనంబులున్ బహుళగోదానాదికస్వీకృతి
వ్యాసక్తద్విజమంత్రవర్ణనినదప్రారంభముల్ సెల్లెడిన్

క. రాముఁడు తండ్రిని వీడ్కొని
శ్రీమంతములౌ స్వగేహసీమలఁ జేరన్
రాముని పోయినత్రోవ జ
నామోఘాశీర్జయజయనాదము లేచెన్

ఆ. భూమిపతియు రేపు పుష్యయోగంబునఁ
గొడుకు సింహపీఠిఁ గూరుచుండు
నని వినిశ్చయించి యాత్మఁ దేలికపడె
బరువుతీరినట్లు ప్రశ్వసించి

వ. అంత రాజాంతర్గృహంబు సేరి పునఃపునారామదర్శనాకాంక్షియై రాముని మరలఁ గొనిరమ్మని పరిచారకుం బంచిన

శా. శంకించెన్ మది రాముఁడున్ గడియయున్ జన్దెంచి కాలేదు పో
యింకన్ వెంటనె యేల రమ్మనియె భూమీశుండహా, లేక, మీ
నాంకాకారుని నిన్నుఁ జూచుటకె దేవా! యన్న మీమాంసలన్
సుంకుల్ తేరిన రాఘవుండు పదమంచున్ వెంటనే పోవఁగన్

ఉ. లేచి తనూభవున్ గవుఁగిలించి నృపాలకుఁ డిన్నినాళ్లుగా
వేఁచిన రాజ్యలక్ష్మి యెదవేఁ నినుఁ బొందుట రేపు పుష్యయో
గోచితపుణ్యలగ్నమున నొందుము నేఁడుపవాస ముండి ని
ష్ఠాచటులత్వ మేర్పడఁ గడంగు హృషీకములన్ నియంతవై

వ. నీవు యజ్ఞమవు నీవు బ్రహ్మమవు నీవు తపస్సు వనఁ దండ్రియొక్క-

సంప్రత్తికకర్మాభిముఖమైన మనస్సుం గాంచి రామచంద్రుంప
కళవళంపడిన దశరథుండు

గీ. నీ వయసుకల్మి నేను నిందింతు నోయి
నేడు నిన్నెత్తికొంచు ముద్దాడలేక
నీ వయసుకల్మి నేను నందింతు నేడు
నీవు కోసలరాజ్యమ్ము నిర్వహింప

శా. నేనుం జేసితి జన్నముల్ ధరణిఁ బండింపించితిన్ ధర్మముల్
నేనుం జేసితి సత్క్రియాతతి సురానీకంబు కార్యంబులున్
నేనుం దాల్చితి బిట్టుగా నటితిఁ దండ్రీ! యోయి కాకుత్స్థ! కా
గా నేఁ డీ తల తెల్లనైనది శరత్కాశప్రతీకాశమై

ఉ. ఊరుపు తీసికో నను వొప్పని యీ ధరణీభరంబు నీ
సారభుజాస్థలంబునఁ బ్రసన్నతఁ దాల్పుము శ్రావణాంబుద
శ్రీరుచిరాకృతిన్ సనదరింపుము చల్లనివాన శౌర్యరే
ఖారయనిర్జితాసుగనికాయ! ప్రశాంతధరిత్రి నేలవే!

చ. తులితశ్రమాన్వితుండు భరతుండును దా నట మేనమామ లిం
డ్లలఁ జని తేపు దాఁటినఁ గడన్ శుభలగ్నము లే దరిష్టముల్
బలముగఁ జెప్పుచుండిరని సత్వరమంతయు రాజసంతయం
బులు మొదలిడ్డి శీఘ్రముగఁ బూనుము రాజ్యము మాఱు చెప్పకన్

ఆ. చిట్టితల్లితోడ సీతమ్మతోడ నీ
వాచరింపు తీవ్రమైన వ్రతము
ముగురుతల్లులకును మ్రొక్కి యాశీర్వాద
ములను బొందుమయ్య ముద్దుతండ్రి!

చ. కలితమహత్త్వమా బొమిడికంబు శిరస్సున వెల్లివీవనల్
వలపల దాపలన్ నృపతిభావము మోహనమూర్తి తాల్చిన
ట్లు లలితుఁ జూచి నిన్ గనులలో నమృతంబులు పోసికొందురా
తెలతెలవారినన్ ఋషులదీవన లన్నియు సార్థకంబుగా

వ. పోయి నిష్ఠాపరుండవు కమ్మని పంచిన రాముండు కౌసల్యాగృహంబులు సేరి

శా. తల్లిన్ బ్రక్కల నిల్చి లక్ష్మణసుమిత్రాజానకుల్ భక్తిదీ
వ్యల్లీలాకృష్టులై మనోజ్ఞపరిచర్యాతంద్రులై యొప్పఁగన్
దల్లిన్ రంగనివాసిపాదజలజాతధ్యానసంలగ్నదృ
గ్వల్లిన్ విఘ్నసమూహపాటనమతిన్ గండ్లారఁగాఁ గాంచుచున్

క. అమ్మా! యనుటయు స్వాంతం
గమ్మగఁ! బ్రణమిల్లుటయును కౌసల్య దృగ
ధ్వమ్ముల రంగనివాసియుఁ
గ్రమ్మిన కొడుకు కొక్కరొకరుగాఁ గననగుటన్

గీ. యోగపద్యసమాచారమైన నామె
నిష్ఠ నిలిచెనో చెదరెనో నేగదయ్యొ
రాముఁ డభినవజలధరశ్యాముఁ డెదుర
స్వామి నిల్చినయట్లు సాక్షాత్కరించె

శా. అమ్మా! నాయను ఱేఁపు భూమిపతి తా నై యౌవరాజ్యాభిషే
కమ్మించాడెను నెల్లయున్ బ్రకృతివర్గంబున్ నదంగీకృతిన్
సమ్మోదంబును జూపె జానకియు నిష్ఠాదీప్తి పాంసువ్రతా
ద్యమ్మున్ సద్వ్రతపాళి నేలవలె నీవై యామెఁ జేయింపుమా!

మ. అనినన్ గోసలరాజకన్య దరహాసాందోళితాకారయై
చనఁగా మైథిలి యామె [illegible] రాముఁ [illegible]
జ్జను బొం[illegible] దను గాంచ సీత, మఱి లజ్జాసందమున్ [illegible]
నసఁగా రాముఁకు సీత, తల్లులకుఁ జిర్ణవ్యాల్ పిసాళింప నన్

ఆ. అత్తగారి చీరయంచును బూని ల
జ్జానతాస్యయైన జనకదుహిత
జేరఁదీసి రాణి చిన్నారికొడుకుతో
నోయి రామ! యోయి యోయి బిడ్డ!

చ. ఇలనుసడినాలుగేండ్లుగ నిదెప్పు డిదెప్పు డటంచుఁ గన్నులం
దెలచి ప్రతీక్ష చేయుదుగదే. జగదేకధనుష్కలానిధీ!
విలచిన వెండికొండదొరవింటిని వింటినిగాని చూడ తే
దలుతనహింప ధాత్రిఁ గనులారఁగఁ జూతునురా కుమారకా! ౨౫

చ. ఎడపఁగరాద యూర్మిళకు నీతని విన్ననునుండి వీఁడు నీ
కుడిబుజమైన లక్ష్మణునకుఁ దెలి నీ తలపాగనీడకై
విడుగవరానిదా గొడుగుబెత్తముగా ధర యేలికొందు ద
వ్వడికిన మేము నీదు గొడుగూనిన చల్లదనానఁ దేఁగఁ

క. అన రాముఁడు లక్ష్మణుఁ జే
కొని కౌఁగిలిగాఁగ నెదురుకొని "లచ్చీ" రా
జని రాముఁడైన యెడ రా
జని లక్ష్మణుఁ డేలకాఁడురా యని యొత్తెఁ

వ. అమ్మఱునాడు దశరథార్థితుఁడై వశిష్ఠముని లోపలిహజారమ్ము
దాఁక రథమ్ముపై వచ్చి రామునిచే స్వయమ్ముగా నవతరింపించికొని
యుపవాసాదివ్రతమ్ముపదేశించి చనినంత

ఉ. శ్రీరఘురామచంద్రు గృహసీమ సుయజ్ఞుఁడు నాది మిత్రబృం
దారభమాణహాస్యమధురాలపనంబులు నాగతోత్సవా
ధారభమాణనూత్నమృదుయత్నములుఁ గలనాదగీతికా
వారము వారవారము రువారపు నవ్వులతోఁ జెలంగఁగఁ

సీ. ఒక్కరొక్కరుగ రాజోద్యోగు లరుదెంచి
రమణీయనూత్నగౌరవము నెఱప
నాత్మీయులౌ సఖు లభిమతాభరణముల్
రామచంద్రున కిష్టరచన సేయఁ
దీయకుండఁగ నొక్కటేయైన వార్తలు
పితృమాతృగేహసంతతులు పంప
మరియాదలను నహామహమికాకృతములఁ
బరిచారికలు ప్రియంపడి మెలంగ

నానిశాత్యయంబు నాదినాత్యయమును
మోదరేఖ కలనినాదరేఖ
యగురుఖండఖండనామోదరేఖయు
గృహములందు నేకరేఖ యయ్యె ౬౦

సీ. ఎప్పుడు తెలవారునే యంచు నంతలోఁ
దరపడలేను సుందరులు మున్న
అంత కథ చెప్పుమూయకపోవుటను బాధ
లేకపోవుట చూడలేను మున్న
అంత జే జాము జామై నిమేషము నిమే
షమైనట్టి యొరయిక చనదు మున్న
అంత యుత్సనరేఖదగు రాత్రికాలరఘు
నీదారణము పుట్టలేదు మున్న
ఆ మహానిశఁ గల వినాదాభిరామ
మైన సాకేతపురమురాజ్యరమ కళి వి
నాదమధురసంకేతవనాంతరమ్య
వీధివోలెఁ బ్రతీక్షాబ్ధివేల యయ్యె

వ. అంత నుపవాసి రాముండు ప్రాణాయామంబు మ్మానిన ప్రియామశేష
రాత్రంబున

క. కాలమయమైన ప్రాణం
బాలో బ్రహ్మమయమైన ప్రాణము తానై
కాలము బ్రహ్మము దివిష
జ్జాలోపరిదృష్టి రామచంద్రుని యెదలో

ఉ. దేవతలై రమామదనతీవ్రతతీమధుకృత్యమారకా!
దైవతలోకకార్యచరిత్రవ్రత ! విత్యదశావతారధా
రావిదితాఖిలోత్తమపురాణకథాకమనీయమూర్తి ! దే
వావలికంటకాపనయనా ! యని పిల్చినయట్లు తోఁచినన్

ఉ. ఆరని యచ్చమైన తెలివై చని, లోన వినత్ర మానుఁడై
శ్రీరఘురామమూర్తి తనచేతముసంపుననఁ దక్త్రివిక్రమా
కారునిగా రచించి సురకాండము లోచనపుండరీకమా
లారుచిరచ్ఛవిన్ గని విలాసహరింబలె నైనయట్లుఁగా

ఉ. స్వామికి జ్ఞప్తియుండదు ప్రసన్నత కల్గదు నిర్వికారస
త్త్వామహనీయవార్ధికిని దానవసింహము పంక్తికంధరుం

డే మయిపోయె మా మనవు లేమయిపోయె భవత్ప్రతిజ్ఞ తా
నే మయిపోయెఁ గోసలనరేశ్వరు యజ్ఞహవిస్సమాహృతిన్

ఉ. పలికరాని ధరావలయ మేలుట యిష్టము యేని వేలయేం
డ్లేలఁగవచ్చు నేను జగ మేలఁగవచ్చును ధర్మశాస్త్రపై
వ్రాలిన దాన నేను నొక చాలికతూపునఁ గూలనేసి యా
పై లసమానధాత్రిసతిపావనసంగమముతో సుఖింపుమా!

ఉ. ఆడిన దైవశక్తి ప్రభునాత్మకు బంధుగు లేగుదెంచి యా
టాడిన యట్లుగా నయిన సమాధియు విశ్లథమై యెడందలో
గాడి నెమొసర్పినట్లు వియతకులుగా నిట రాజ్యవాంఛయున్
వాడిన కోర్కెగా నటుల భావము రెంటఁగఁ జీలి తోఁచినన్

శా. సీతాప్రేమము మైఁ మరల్చికొనినన్ జేతంబు దచ్చోత మా
నీతంబై చను రాజ్యకాంక్షకును బూనెన్ గోని బ్రహ్మత్వ మా
ద్యోతంబై వెనువెంటరా నడుమ నేనో నేఁ గొనుక్కొండు తా
నై తోఁతెంచిన దేవతావిషయమై యంతంతఁ బాగాడుచో

ఉ. ఆ యపరాత్రిమున్ రఘువరాన్వయదీపము మెల్ల లేచి కై
కేయిగృహంబులన్ జనియెఁ గేకయరాజతనూజ మోదరే
ఖాయతి శోభవిష్యదధిక ప్రియపుత్రసనాభిషేకవా
ర్తాయుతభావనానుగతయై తన మేనను మున్నె గొప్పఁగాన్

క. అమ్మాఁ గన్గొని రాముం
డమ్మా యని పిలువఁ గేకయాధిపసుత "రా
అమ్మా" యని తోడ్తోనఁ ద
తమ్మా భయమందెఁ దద్వ్రతస్ఖలనమతిన్

చ. చెలువుగ యౌవరాజ్య మభిషేక మిదేమి జేపుప్రొద్దునన్
గెలునడి నీవు సద్వ్రతము సేయనుబుచ్చి గాదేమి రాక? లో
కులు నను నాడిపోసెదరు కుట్టని సద్వ్రతభంగకారిణిం
బలె మఱి యేమి ముంచుకొనివచ్చిన దీ నడిరాత్రి వేళలో

గీ. అనిన రాముండు తల్లి! సమాధి నిలువ
దాయె నే నేమి చేయుదు నమ్మ యనుచు

తే పుమొదలుగ బద్ధవాలిగజేంద్ర
మట్లు కదలఁగ వీలులే దనుకొనెదను

ఉ. అమ్మ! సమాధిలో నిటలమందున నేఁబుంబినచ్చి నన్ను రా
జ్యమ్మును జేయవద్దనినయట్లుగ తోఁచెనేమి తోఁచ కే
నిమ్మెయి వచ్చితిన్ నిజమదేమిరయో నాకును గూడ నట్టి రా
జ్యమ్మునయందుఁ గోర్కి యనునట్టిది గుండియఁబట్టి లేదునన్

మ. అనినన్ గైకయి యుప్పు డట్లెయగు తే సంకస్థయా జానకిం
గని సింహాసనసీమ వేఱొకగతిన్ గన్పించుఁ బొమ్మన్న రా
ముని నేత్రంబుల నొక్కతీవ్రకళ గ్రాము స్నిప్ర నువ్వొత్తు నే
ర్పిన కోదండకళావిచిత్రగమన శ్రీ రామునుఁ జెప్పవే!

చ. కనలున నమ్ములన్ బొమిడికంబున బొమ్మలు చెక్కికొందునా?
నను నతిసేయవచ్చిన జనంబుల వ్యూహములన్ బడల్తునా?
యనినను కేకయాత్మసుత యబ్రము నొందినయట్లు చూచి నీ
ధనువుననున్న చిక్కన సుతారము లెందునకో వచింపునాన్

వ. శ్రీరామచంద్రుండు, తల్లీ! అది కాదమ్మా!

గీ. నేను రాజ్యమ్ము సేయుట నిక్కమముగ
లేదు వేల్పుల కిష్టమ్ము లేదనంగ
రామచంద్రుని తీక్ష్ణనేత్రములు చూచి
తాను కైకేయి సౌధములోని కేగ

సీ. ఉయ్యాల లూచిన ట్లుదితంబులైన నా
నావాద్యఘోషసంతతులు నిగుడఁ
బూలదండలు వ్రేలుపోల్కి భూషాంబ
స్థగితాకృతులు పౌరతతులు నడువ
కుంకుమపోసిన ట్లుంకోష్ఠతశశాంక
లలితాననల మొత్తములు నిలంగ
నమృతంబు వాఱిన టాసారితాసారి
తానందరేఖామహస్సు వెలుఁగఁ

బ్రొద్దు కెంజాయ తొలికొండ నద్దినంత
విస్ఫుటీకృతసాకేతవీథులందు
నగదములు గుల్మములు నేస్తులైన కాల్వ
తూము వదలినరీతిగాఁ దోఁచినంత

మ. నడివగరుప్పునందు సైతము నిగంతస్వేదధారాళమా
నోడలన్ మాఁగెడునట్టి మంథర వసంతోపాంతకాలంబునన్
జడిగొని చెన్నొంట చల్లనై యనిలముల్ సాగించు నప్పొద్దుటన్
సుడియన్ సౌధముపైకి నారుబయలంచుం బోయి తాఁగాంచుచున్

మ. కళశముల్ కట్టిన పౌరసంతతు లయోధ్యావీథులం దెట్టచీ
మలబారుల్ బలె గుమ్ములై చని వియన్మధ్యంబునన్ దిఙ్ముఖం
బులఁ బేడెత్తిన సన్నవాద్యనినదంబుల్ మిన్ను గీపెట్టుటం
బలెఁగాఁ గన్నులు బైరులెక్కి చెవులున్ భగ్నంబులై పొల్చినన్

చ. తన జనిహేతువై చనిన దైత్యగుణం బది పొంగి రామచం
ద్రుని యభిషేకమంచని యెఱుంగకనో సహజక్రుధామతిన్
జని పరివారికాసమితి సంగతి కన్గొని కర్ణవీథిఁ దా
దాకిన యభిషేకవార్త భుజగీవిష మెక్కినయట్లు లెక్కనన్

చ. కనురెపయట్టులె నుదుకు కన్నులఁ బాపలు తావు తప్పి ము
చ్చెమటలుపోసి మూర్ఛఁగొని సీత్కృతి లేచి రయమ్మునాఁగఁ దై
కమ గదికేగి సిలితెగగప్పి సుఖాసుఖనిద్రపోవుఁ గై
కముఁ గని కొంపమున్గెనని కైవడి పాదవిఘట్టయానయై

. చని యామె మొగముమీఁది ముసుఁగుదీసి యామె యరదెఱ
చిన కనులలోఁ జూచుచు

. అవునె దౌర్భాగ్య మాకారమైనదాన!
నీకు నిద్దుర యెట్టుపట్టునే దరిద్రు
రాల! యొకవంక నింటిచూరంటుకొనిన
సొగసుగాఁ జలిక్రాఁగెదుఁబగిది తోఁప

క. మిన్నొక పెడపెడ చీలుచు
కొన్నది యాయేమి గుబులుకొన్న సవంబో ౧౦౭

నిన్నను లే దభిషేకపు
సన్నయము నే మంత దొంగచాటుతనంబో!

సీ. పిల్లవానిని భరతుఁ బంపించినాఁడు
మేనమామల యిండ్లకుఁ దా నెఱుంగు
మన్నుదిన్న పాము వటంచు నిన్ను రాజు
ఇంక భయ మేటికో? దాచు టేలొ యింక?

మ. తనకుం గన్నులు విప్పుకో ల్పడవటే, తా వచ్చి పెద్దమ్మ నె
త్తినిఁగూర్చున్నది యేమొ కావలయు, ధాత్రీజాని రాముండె య
య్యెనయేని తినఁగూడులేదుజుమి నా కేకాదు నీకుణ్ బుగా
తనవైరంబులు సర్వముణ్ సవతి పంతా ల్వాతకల్ తీసెఁదుణ్

క. అనుచున్న దానిమాటలు
వినివినక యర్ధనిద్ర వెడలి ప్రమోదా
నన కైకయి యభిషేకం
బున కంగీకార మంచుఁ బూనెను చెప్పుమా!

చ. చెడుకల వచ్చె నాకు నభిషేకము వద్దనినట్లు రాముఁ డి
ప్పుడు తెలిసెణ్ సమస్తశుభమూర్తికి రామున కేమిలోపమే?
నడు నడు! సర్వభూపతనాథతనూనతనూతనాకృతిణ్
నడినడిఁ బోయి బాలునిశుభంబుఁ గనుల్ తెరదీయఁ జూచెదణ్

వ. అనిన వెర్రిటునడ్డ పసరంబుపగిది కుంచుకపోయిన మంథర తెప్పిలి,

సీ. గిడసపారుమనిసి వడికాఁడు నీపతి
వెలఁదికంటె ధూర్తిషి౦జె నయము
రాచకొలముచేటు రాక వేళావేళ
మేది యెట్లో సుంత మెలుగ వెట్లు?

క. నీవంతు కల్లబొల్లి వృ
థావాక్యము లర్థమెల్లఁ దనవంతై ధా
త్రీవిభుని పెద్దభార్య సు
ఖావధి యగు రాజు చేసినట్టి గరగరణ్ ౧౧౩

చ. మొగమున లేఁతనవ్వులును మూఁతలు వెట్టిన గుండెఁ ద్రాఁచుపా
ము కరణినైన రాముఁడును భూపతి యాచు సమస్తజంతుమ
స్తకములఁ గాలు వెట్టిన వృథాకుపితుం డగు పుత్రు తోడుగా
సఖి! పరిచారికాధమవిషాదమహార్ణవ మెటు లీదెదో!

వ. అనిన నర్ధతిరస్కృతిమందహాస యైన కైకేయి

శా. రాజే పాము నిజంబుగా భరతుఁడో రాముండొ యెవ్వాఁడొ! వి
భ్రాజచ్చాపకలావిలాసనిధియౌ రాముండె రాజౌట మేల్
రాజై నీభరతుండు నాభరతుడుం రాఁదీయునో స్వర్గముల్
రాజై రాముఁడు నంపనాదర సముద్రాంభస్సు లింకించెఁడుం

క. ప్రియమైనమాట చెప్పితి
రయమున నీ నగను గొమ్ము రావే యనినం
భయకోపవివశ మంథర
"యయ్యో యయ్యో" యనుచు నేడ్వ నారంభించెం

గీ. అంతఁ గైకయి చేత నున్నట్టి భూష
పెఱికికొని దూరముగఁ బాఱవేసి విసరి
యేడ్వవలసిన వేళలో నిట్లు నవ్వ
దాని నిగ్గంటి నీ సముద్రాలనడుమ

గీ. సవతి శత్రువైన సవతిపుత్త్రుం డేమి
యౌను తెలివికలుగుదాన! చెప్పుమ
నృపుఁడు గద్దెపైని నిలువఁద్రొక్కికొనంగ
నేమి యేమి చేయు నెట్లు చెప్పు?

మ. ఒకదాయాదియె నిప్పుతో సమము పై నూహించుమా! నీ కుమా
రకుఁ డాసన్నతగల్గు వారసుఁడు, నా రాముం డసృక్సర్వబిం
దుకవైశ్వానరుఁ డింకఁ దోడుకలఁ డా తో డుగ్రధన్వుండు పా
యక సౌమిత్రి తదీదృశంబులు త్వదూహాప్రాంతభద్రంబులుం

వ. అని మఱల నేడ్చుచున్న మంథరయెడఁ బ్రసన్నయై కైకేయి,

శా. ఓసీ! యోసి! యిదేమి దుఃఖమె విచిత్రోదంతవాచాల! స
ర్వాసుప్రాంగణముగ్ధదీపిక కదే యాబిడ్డ (శ్రీ)రాముఁ డా ౧౨౨

శాసంపాదకుఁ డెల్ల జీవులకు దీక్షాధర్మపారంపరీ
వ్యాసంగుం డతఁ డొండురాజయిన నెగ్గా? నీకునున్ నాకునున్

క. భరతుఁడు రాజై నాకును
నొరిగించెడి దేమి రాముఁ డొరిగించని దే
మి, రమాసక్తస్వాస్థ్యుఁడు
నరోత్తముని రాముఁజూచినం జాలుఁగదే!

ఉ. మాండవికన్న జానకియె మన్ననసేయును నన్ను, బిడ్డ రా
ముండును దల్లికంటె ననుఁ బూజలుపట్టును దానిమాట య
ట్లుండఁగనిమ్ము, రాముఁ డొకయోగి మఱిన్ దితిజోగ్రవైరిమా
ర్తాండుఁడు దానికై తనువుఁదాల్చె రహస్యముసుమ్ము మంథరా!

మ. అనినన్ మంథర యోగియైనయెడ నేలా రాజ్యవాంఛల్? మహా
దనుజోగ్రాంబుపతంగుఁ డైనను నయోధ్యావీథులం దుండిరో
దనుజుల్? రాముని చేతఁ జంపఁబడఁగాఁ; దావచ్చి తాఁ బైకి న
వ్వినమాత్రాన భ్రమింతు వేమిటికొ హృద్వీథీసుధావాహినుల్

మ. పరమార్థంబును జూడఁజాలరు మతిభ్రాంతుల్ సమాయాతభీ
కరదుఃఖాంబుధివీచితాడితనుతిన్ గానంగలే వేది యే
కరణిన్ దేలునొ; వేలయేండ్లుగనునై కౌసల్యతో నైన నీ
విరసం బూరక తేలిపొప్పునంటె యో విజ్ఞానవారాన్నిధీ!

చ. ధరణియు రామునందు ననుదారత దారతఁ గాంచెనేని నీ
భరతుఁడు ధాత్రి నేలనుఁడు; ధారణినాథుఁడు జ్యేష్ఠపుత్రునిన్
ధరణికి రాజుఁజేయునుగదా! పెఱపుత్రులు యోగ్యతాగుణా
భరణులు నైననున్ జనువు పంచిన దోషపథప్రతారితుల్

చ. కడువడి నీకనుంగె యగుఁగాక నిజంబుగ రాముఁ డక్కటా
కడుపునఁబడ్డ బిడ్డ యవ్వఁగా భరతుం; డవమానవారిధిం
బడియెడు వానికైన నొకపాటిప్రయత్నముసేయవచ్చు; నీ
తడబడుబుద్ధి నీకుఁగల ధైర్యము నాకును లేదె కైకయీ!

మ. చని నీవై పరిచర్యసేయుదువు కౌసల్యామహారాజ్ఞికిన్
చని నన్నున్ బరిచర్యసేయుమనెదో? చానైనఁజత్తున్ దుదిన్

వినుఁ జేసీతను పెంచినందుకు ఫలానీకంబు సిద్ధించె, నా
యన రాజ్ఞై చనఁ దొత్తుక్రింద బడితో త్రై యొత్తు లే నొత్తఁగన్

క. ఎక్కడ భరతుఁడు ప్రజలకు
మిక్కిలి ప్రియుఁ డౌనో యంచు మేదినిపతి యే
యొక్కపరి పట్టుమని తా
నిక్కడ నీకొడుకు నిలువనీయఁ డయోధ్యన్

క. నల్లని వన్నియు నీళ్లులు
తెల్లనియవి పాలటంచుఁ దెలిసినదానా!
అల్ల తొలినాటినుండియుఁ
జెల్లించిన రాజనీతి చివరి కెటుఁగవో?

ఉ. ఆతఁడు రామభద్రుఁడు మహాశమవార్థికదా! ప్రజాన్వీధా
భూతము గౌరవంబు తన ముద్దులతమ్మునికోసమై ధురా
నీతి సహించియుండు, ధరణీపతి యెవ్వఁడుగాని వానికిన్
మూతిని గట్టునో వలసపుచ్చునో రాముఁడు చేయఁ డాగతిన్

గీ. కలసిమెలసియున్నఁ, గైదోడు వాదోడు
కలిగియున్న సొత్తు కలియకున్నఁ
బైమెఱుంగు వలపు పచరించు లోకంబు
దానికైన నిచట దారిలేదు.

గీ. త్రోవ కడ్డమైన తులసిమ్రోడైనను
బెల్లగించు నటవె పృథ్వీజనము
పడగలెత్తి పైకి వచ్చు సర్పంబును
రాముఁ డొకఁడె ప్రేమఁ బ్రాముపాఁడు

సీ. ఈసేగి సౌమిత్రి కేల లేదన్న చీ
మును నెత్రి చచ్చినవనిత తల్లి
ఆ తల్లికొడుకు తా నంటఁ గ్రాఁగెను రాము
నట రాజ్యకాంక్ష లే దా కతాన
నగు భీతియును లేద యా సర్వమయినట్టి
భయమును సిద్ధించ భరతునంద ౧౩౫

పట్టమ్ము లేనట్టి భరతునకును బ్రాగి
ములు దక్కవలె నన్నుఁ బోయి వనము
లందు నివసింప మేలు రామాధిపత్య
మైన నేల పోసఁగిన మ్మహితతతికిఁ
జుట్టుపట్టులఁ బెఱమొక్క నెట్టనీకు
సార మాకట్టుకొను నారికేళవిటపి

శా. ఇన్నాళ్లున్ గడుఁజిక్కనైన యడవిన్ హేలాత్వరాలంఘనా
సన్నక్లిష్టమహీజశాఖలసడిన్ సాధ్యంబు గాకుండఁ బో
వు న్నీపుత్త్రుఁడు సింహక్షితికి ద్వీపంబున్ బోలె నిర్వృక్షమా
మన్నుం బీడున నేమిచేసెదవొ కుంభశ్రోదనాదాభ్రమున్

వ. అనిన దీర్ఘోపన్యాసంబునకుఁ బ్రతివాదశూన్యమైన కైకేయి నవ్వ
యిట్లనియె.

శా. నవనీతంబునకంటె మెత్తనయి సంధ్యాచంద్రరేఖాంశను
ద్భవచాంద్రీసుకుమారమౌ నెడపసీపాకంబు (శ్రీ)రామచం
ద్రవిలాసామృతమూర్తి వాసిగొడ మాత్సర్యంబు వాటించు నీ
చివురాకున్ మెదువైన గుండియకు నాశీర్వాదమే మంథరా!

వ. అని నిరాదరశ్రమసూచిగా శయ్యాగతయైన కైకయిం దీక్ష్ణం
బుగాఁ జూచి రొక్కపెట్టున శోకావేగంబున బద్ధలై చీరయంచు
చించి సన్నవియురి పోసికొనుచున్న మంథర యాథార్థ్యంబు జూచి
మనస్సహజదౌర్బల్యవశంవదయయి కైకేయి యామెను వారించి,

క. నిజమా యనినను మంథర
నిజమే యనె, నొట్టె? యనిన నీపయినొట్టే
గిజిగాడు గూడు లేనిది
రజనిన్ బెనుగూబపజ్జ రాజై చనునా?

గీ. అనినఁ గైకేయి సూచీదృశాంత, యోసి
యోసి మంథర! యూహించి యూది చెప్పుము!
అసలు నాయది మొండిపట్టంతవఱకు
నీడ్చుకొనిపోకువే నన్ను నూష్పుపొంటె ౧౪౦

రథోద్ధతము—

ఏనొ పూనినటు లేచి కైకయున్, దాదిఁ జంపుటకొ తాను చావనో
యేదిచేయుటకు నింతలేక శో, భాదరిద్రి మగు వాక్యవైఖరిన్

శా. ఈ యెల్లన్ ధర నా కుమారకుఁడు తా నేలుంజుమీ రాఘవా!
ఘోర్యాయోషన్ విడి నీవు పొమ్మన, శిరఃకల్యాణమాలాకృతిన్
నాయాజ్ఞ గొని రాముఁ డేగుఁజుమి కాంతారమ్ము, ధాత్రీసుఁ డే
లా యంగీకృతిఁజూపు నో, నెపము వాలాయంబు గల్పించెదన్

వ. అనిన మంథర నీ కిష్టమేని యుపాయమ్ము లేదా యనఁ గైక యగ్ని జ్వాలవలె నాకిష్టమని యెవరు చెప్పిరి? యుపాయమ్ము చెప్పు మన మంథర సగముసగమైన ప్రాతికూల్యానుకూల్యములు స్ఫురించి యిట్లనియె.

ఉ. శంబరుఁ డన్న రాక్షసుఁ డసాధ్యుఁడు దక్షిణవీథి వైజయం
తంబను పట్టణంబున నితాంతపరాక్రమ రేఖ నొప్పు స్వ
ర్గంబునఁ గన్నుగుట్టి, సురకాండము వాని నెదుర్పఁబోవ నా
రంబన మేగి యెల్లరు నిలాపతులున్ గణ మాచరింపఁగాన్

సీ. పనలు గగాన గాయపడి పట్టని నిద్దుర పట్టియున్న భూ
ధవులను రాత్రిరాత్రియె వధింబుగ దీర్ఘసుషుప్తిఁబుచ్చుచున్
దివిజాలసుంకెదివ్వెయలు దిగ్గన నార్పుచు దైత్యసైన్య మా
హవపథమెల్లఁ గ్రొక్కదలుకట్లు విజృంభణ సేయువేళలన్

శా. వింటం జిక్కని యస్త్రముల్ గను ధనుర్విద్యానిధానంబు నిన్
వెంటంగైకొని యేగెఁబో దశరథోర్వీనేత దైత్యావలిన్
గంటన్ యుద్ధధరిత్రి దైత్యవిశిఖాక్రాంతుఁడై మూర్ఛయుం
గంటన్ జెన్నిటి సొమ్మసిల్లుటకు దుఃఖాబ్ధిని నీ వంతటన్

గీ. సారథికిఁ జేతగాని కౌశల మెసంగ
రథము మఱలించుకొంచు దూరమ్ముపోన
దేరుకొని తేఁడుమెలపునఁ దేరు కొంచుఁ
జన్న నీ విక్రమమునకు సంతసించి

చ. అరదము నేర్పుమైఁ దివిచినందుల కొక్కఁడు, నా యసువ్రజం
బురువడి నిల్పినందులకు నొక్కఁడు, రెండు వరంబులిత్తు సంగరన్

త్వరమునఁ గోరుకొన్నవిగ, దానికి నిప్పుడుకాదు భీతివం
ధగము గువేళలో నసుగుదాన నటంచు వచించియుంటివే!

క. ఇది నీవు చెప్పినదిగొ
యది జ్ఞాపకముంచుకొంటి నవసరమగు సం
దిగితంబై నది భీతియు
నదీనహంసీమనోజ్ఞయానా ! నీకున్

చ. అగదము నేర్పుమైఁ దివిచినంములకే ధరయెల్ల నేలఁగా
భరతుని రాజుఁ జేయవలెఁ, బ్రాణములన్ నిలఁబెట్టినందుకున్
బోరిఁ బదుమూఁడువర్షములు పోవలె రాముఁడు వన్యసీమలన్
దిరుగుచు దైత్యసంహననదీక్షను, నీ వనినావుగా యనన్

గీ. బిరుసు గాలిపడగ పెడగాఁగఁ దాఁచిన
బుస్సు మన్నతాఁచుపొలతివోలె
కైక రానుమూర్తి కఠినరాక్షస కీట
రాజిఁ గాలిక్రింద రాచు నన్న,

ఉ. అంతటి కోప మేమిటికి? నా కనియేకద చెప్పుచుంటి నే
నెంతలుదైత్యులో మఱియు నెంతయొ రాఘుఁడు నాకు నేల? నా
చింత, కుమారుఁడౌ భరతునేనుముమాత్రము నిన్నుఁబట్టి నా
కింతయుఁగూడునుం దొరకదేమొ యటన్న భయంబు మాత్రమే

శా. నీ నా మేలునుగోరి చెప్పెదను గాని నీకు గష్టంబు లే
దేనిన్ నాకును లేదు పో యిదియుఁ బోనిమ్మన్న గ్రీష్మ ర్త్వర
ణ్యానీదానవిధూతధూమశకలోద్యద్భ్రాంతిమశ్యేకికే
శానిర్హ్రాదసుదీర్ఘహాసపృథురేఖాభిన్నగండాగ్రయై

ఉ. ఆగకు మాగ కా నడుమ నాగకు మిట్టి వరద్వయంబు తా
నే గతి నీయనొప్పు ధరణీశుఁడు చెప్పుచునున్నఁ గుబ్జ, నీ
వాగము సేయఁగావలయు నాడినమాటను జెత్త తప్పినో
రే గద రాఘవుల్ కుపితపేర్యని రొమ్ము త్రిశిచేయ నందులో

వ. అపగతభూషవై యుపహతాఖిలలేపనవై నిరస్తసౌ
భ్రపటవు లోచనాంగణపరాభవదంజనవైన విన్ను వి ౧౪౬

స్త్రపను సుఖార్థిమై సతము ప్రాణములన్ గొలవోయుచున్న ధా
త్రిపు డసురాజితోనయినఁ దీర్చును నీ వరణీయ మెంతయేన్

చ. విటుగనికామమహా ముసలిపెన్మిటి సాగెఁడు వానపాము పి
న్నెటిగున బిట్టుగా పకుచుపెండ్లము సాచినపట్టు సాఁగు నా
తెటిన పరార్థిమైన నిలుతెచ్చును జచ్చునుగాక యామె క
న్నెతికమురోయి యట్లు వగణీయము తీర్చక యుండఁగల్గునే?

గీ. అనినఁ గ్రైకేయి కోపగృహంబు నన్ను
జేరు మనెదవో యనిన హాస్సియసి యగు
దాది వెలగల దుస్తులు దాల్చినట్టి
బిచ్చగానికి బిచ్చమ్ము పెట్ట రెవరు.

క. బెదరించిన బతిమాలిన
విదలించుచు మాటుపెస్తు వెలయించినఁ ద
ప్పదనుచు ననిపించినఁ ద
న్నుడు రభిలషితముల భూమిపులునున్ భగల్

ఉ. చచ్చుటకైన సిద్ధపడు సాహసముం బచరింపకున్నచో
మెచ్చరు రాజు లూరకయ మేలిమిపూంతల మాటలాడినన్
మెచ్చరు ప్రాణదమ్మునయి మిత్రికిఁ దెచ్చినఁగాని దేవతల్
మెచ్చరు భూమినాలనులు మెచ్చరు కోర్కెలు తీర్చువేళకున్

ఉ. గట్టిగఁజూచి మంథరను గ్రైకయి యిట్లనెఁ బొట్టిదానికిన్
బుట్టెను బుద్ధులున్న నుడి పోలును నీమతివైభవంబు నీ
పట్టెనపట్టు నీతివినసంబును లోకగహాస్యవేత్తృసా
మార్ట్టుతనంబు చెల్లునుసుమా! యొకనీకె తలంచిచూచినన్

క. ఒక పదక మ్మొత్తితివా
యొకకాలికిఁ దేనుగలన యుర్వి సకలమున్
వికృతుఁడు విధాత నినుఁ గు
బ్జకచేసిన దానికే విచారము సుమ్మా!

చ. క్షితికిని నెల్ల నీ తెలివికిన్ సితచామర మొక్కఁజెల్లి యొం
డతుకులులేన్ని వుండవలె, నంతఃపిడానవు మెచ్చవచ్చు నీ

మతివిభవమ్ము నీ సొగసు మంథరమైన వివేకహేతుతో
న్వితవయి మంథరాఖ్యను గణించితి పూరక నీకు వచ్చెనా?

క. మా మంథగ నెవరో మఱి
యేమో యేమో యటందు రేమియెఱుగిరో?
గూమె యాటవిరూపి యాటవె
వామనియాటె కన్నులున్నవా? వారలకున్

సీ. మేఘమ్ము చీల్చిన మెఱుపు తీవియకదా
మంథరాదమ్యసీమంత రేఖ
జంటకొండలమధ్య సాగునిర్ఝరికదా
తత్కుచమధ్యముక్తాసరంబు
జంభారిమదకుంభికుంభస్థలమ్ముకా
దాని పీవరము నితంబసీమ
సెలయేఱుచుట్టి వచ్చిన పాటిలంకకా
సవకాంచివృతజఘనస్థలంబు
అవున దాది! నీదె. చెవితమ్మి చేమంతి
యడ్డబాస నీది యనిసెపూవు
పడుచుఁదనము పట్టపగలైన నీ మొడల్
తెలియ లేదుగాక పలుకమూక

క. ఏకాదశగంధర్వగ
ణాకీర్ణముకాని విషమహాసాగరమీ
చీకటితావరము సుమి
శ్రీరాగము నీకు బొడ్డుచిఱుబావి బళీ!

వ. అని మొక్క పెట్టునఁ గ్రోధమూర్తియై

క. నీ వడిగినయది చేసెద
నీ వించుక నాకునెదుట నిలువకు మింకన్
నా విధము నేన యెఱుఁగను
నీవో నేనో చను మరణింపకమున్నే

వ. అనిన భయభీతయైన మంథర కైకేయి [illegible]
జారిన



(4)

శా. దీనాంతర్వ్యథ నందుఁ దిన్నపులివోలెన్ గైక లోలోన లో
లోనన్ దా గుడుసుళ్లు వొందుచు మనోలోభంబో, ధాత్రీనచో
దానక్లేశము, తోఁచరానిది యెదో దైన్యమో ప్రేరణ
గ్లానిన్ గన్నులు చింతనిప్పుగఁ దనూకంపంబు సంధిల్లఁగన్

వ. గోదోహనకాలమ్ము శిలాప్రతిమవలెనై హాహాద్వికృతహాసమ్ము సేసి

ఉ. మా పనులెల్లనుం జెడుసుమా! రఘునాయక! యబ్ధిమేఖలా
వ్యాప్రతబుద్ధివైన నని యాడిరఁటా సుర, లంతె కావాలెన్
గోపన సన్నఁగాని కయికోఁడట తేఁ డటులైనఁ గాని యే
లా పతి జ్యోతిషాంపతికులంబున మాటను వీటఁబుచ్చెదున్

శా. ఓహో! కైకయి! నీ ప్రయోగము విధివ్యాహప్రభేదక్రియా
బాహాటంబగుఁబో సుధాంతసులునై పాలింతువో నీ మతి
వ్యాహారంబులు రామభద్రుని వనీపర్యంతముం జూచికా
నీ! హా! హా! పినతల్లి కైకయి మఱిన్ నిద్రించ దే నాటికిన్

చ. అని పరివేగతో నుపగతమైన విభూషణవస్త్రపాళిగాఁ
జనిచని కోపగేహమున సన్నని క్రొమ్మణివెల్గు రేక లా
రిన యెడ బూదిరంగు వివరించిన దుప్పటిఁగప్పి వాలుసం
జను బాదమాటు నాదుపులిచాడ్పున నిశ్వసనోగ్రమూర్తియై

మ. తన యానందసహస్రమార్గములలోఁ దానైయధిష్ఠాత్రియై
చను కైకేయికిఁగాని చెప్పనియెడన్ సంపూర్ణతం గాంచనే
రని పుత్త్రాభినవాభిషేకమధువార్త్రం జెప్పఁగా రాజు తీ
రనిచోఁ దీక్షకచేసికొంచుఁ జనె నారాద్వేగయానంబునన్

ఉ. కన్నులు చూడలేవు త్రుటికాలము పాయసదానవేళఁ బ
ర్వాన్నమునన్ బ్రజాపతి మహాపురుషుండయి వొచ్చెనేమొ! లే
కున్నను నాదు వాయన, రఘూత్తముఁ డీదృశదివ్యకాంతిసం
పన్నత యెట్లుకల్గు? రఘువంశము పండిన దిన్నినాళ్లకున్
తనతో నేను వచించు రాముని కథల్ తా నాచు నాతోడఁ జె
ప్పిన వెన్నెన్ని కథల్ కుమారకుని పృథ్వీపాలసంగూర్చి నా
తనకాకుత్స్థునియుత్సవంబున వినోదంబుల్ మఱేమేమి చె
[illegible] కథల్ పినతల్లి పుత్త్రప్రణయాంభోరాశి కైకేయి తాన్
[illegible]

...... ౨౦౦౮ జూలై

ఉ. పొంగులుగాఁగ నిట్లు తలపోయుచు ధారుణినేత కైక యి
ల్లుంగిట సర్వశోభనవిభూతియు లేమిని గాంచి పొక్కుచున్
బంగరుచెప్పుకాలు తొలిద్వారముదేహళిఁ గొట్టుకొన్నచో
ముంగలఁ దూలి రా జశుభమున్ మొయిలేదిన వాన నెంచుచున్

ఉ. మాలిమియైన బాలశిఖి మన్నన సేయదు వచ్చి సాధువా
చాలము మత్తుమందెనను చల్లిరొ! పంజరబద్ధశారికా
జాలము మూఁగవోయినది చాన యొకర్తుక లేదు ముంగిటం
బోలిన రాజు తా నగుటఁ బోయెనొ? రామగతప్రశస్తిచే

క. పదిపిలుపులు పిలిచిన పై
మదవతి యొకదాసి తోఁచి మానవపతిచే
నదలింపించుకొని కుబ్జా
సదన కుబ్జాసదనవసతి సన్నఁగఁ జెప్పన్

గీ. చెప్పుమడములు కొట్టుకో సీలమండ
లదటునడ నేగి వృద్ధధరాధినేత
వెలుఁగులోనుండి వచ్చి కన్పింపరాక
తరుణిదరిఁజేరి చీఁకటిఁ దడుముకొంచు

మ. తరుణీపీనమృదూరుభాగమున హస్తంబుంచి వేఱొక్కచే
శిరమున్ స్పర్శనచేసి యోసి మదిరాక్షీ! వారిముగ్రేఖికా
స్ఫురణంబైనను లేని వాన యిది యే చోద్యంబు? నీ నాహృదం
తరచంద్రామృతవర్తి రాముని శుభోద్యన్మంజులోషస్సునన్

ఉ. నా ప్రియురాలు నాయెదకు నచ్చిన నెచ్చెలి యిన్నియేండ్లు తా
విప్రియమం చెఱుంగకయ వేడుకనా నిది వచ్చి వచ్చి రా
మప్రియతాభిషేకసుకుమారపువేఁకువఁ గోప మూనెనా?
క్షిప్రపుతెల్లనన్ నలుపుఁగానని యచ్చపుఁగాంతి యుండదో?

ఉ. సుందరి! నాకునై యెదురుచూచుచు నుండుదు రెల్లమంత్రులే
విందు నిమేషమున్ నిలుచు టింతయు నొప్పదు కారణంబు నే
విందు వచింపవే! వినుము ప్రేయసి! నీ వని కోప మూనినన్
వందురి కోపగేహమును బట్టుటయున్ వలెనా! సుధాననా! ౧౮౪

క. నీ కేదివలయునో యని
యాకున వ్రాసిన నృపాజ్ఞయె చెల్లుఁగదా!
యీ కోపము కోపగృహ
మ్మాకులపాటయ్యె హిమగతాంభోజాక్షీ!

వ. అనినఁ గైకేయి ముసుఁ గెడలించి లేచి దూరముగా నిలుచుండినఁ జీఁకటి కలవాటుపడిన రాజు శోకాకృతియైన ముద్దుటిల్లాలింగాంచి కళవళంపడి

మ. ఉవిదా! కోపము నందియుంటి వని నే నూహించితింగాని యిం
తవుశోకంబు వహించితం చెఱుఁగ నేలా యింత దుఃఖంబునాఁ
జివురుంగన్నులఁ దెచ్చికోలగు కుత్రిధాక్షేపంబుగాఁ గైక, భూ
ధవ! కోపంబును శోకమం చనెద వద్ధా! వంచనప్రక్రియల్

చ. ఇషువుల నొడ్డుచుఁ నిలిపి యేటికిఁ గోటికి లాగు వాజులన్
గృషి మెయి మూర్ఛితున్ నిను భరించినదానికి వైజయంతపున్
విషమమహాహవక్షితిని వేడక యిచ్చి వరద్వయంబు పౌ
రుష మిదిగాక యిప్పటికి రూపముఁదాల్ప వహో! వరంబులున్

ఉ. వ్రాలిన చూరుతోఁ జెఱుగవాక్షుముమాత్రము కల్గియున్న కో
పాలయమందుఁగూడ భవదంశుప్రసారము తగ్గకున్న యో
వేలుప! నీ కులానఁ బృథివీపతి యొక్కఁడు మాటయిచ్చినా
వ్రాలవలెన్సుమీ తనువు వాక్ఫలపూర్తి ఘటిల్లునంతకున్

క. నా యెదకున్ నచ్చిన చెలి,
నా యసువులలోని యసువు, నా నీ భేదం
బే యెఱుఁగని తాదాత్మ్య
శ్రీ! యాహా! యేమి పలుకరించెడి మెలపో!

వ. అనిన భూపతి,

ఉ. మాటలలోపలంగల చమత్క్రియ యుండఁగనిమ్ము నీవ యీ
మాటను నప్పుతెచ్చితివి? మాన్పితి నప్పుడు నేనుగాని? నీ
మాటవి క్రొత్తకల్పనల మాఁగిన నాలుక కాక, కోరు మే
పాటివొ నీదుకోరికలు! ప్రాఁతఋణం బిప్పుడైన నీఁగెదన్ ౧౯౨

మ. అవినం గైకయి శోకకోపములు పెల్లై యొడ్డ భూమీశుడున్
వనితా! చిత్తగకత్తె, వాదు విదిగో! వాంఛింపు మే నిత్తు న
న్నను గంపంబును బొంది కైక ధరణీందా)! యిత్తు నన్నంత చు
లకనగా దిచ్చుట యన్న, భూమిపతియున్ గన్నుల్ సెరల్ కెంపులై

ఉ. ఏ పసికూన మాకులము నేలెడు చిన్నరివెల్గు రాముడా
పాపనిమీద నొట్టిడెడు బ్రాతవరంబులు నాదు ప్రాణరే
ఖాపరమావధిం జనిన గండరకత్తెరలైన నిచ్చెదన్
గోపన కైక రాఘవులకోవకు మచ్చను జెప్పకుండగన్

శా. ఆమాటల్ వినుచున్ లతాంగి భయభీతాత్ముల్ విదారించి, యో
హో మార్తాండముఖాఖిలామరచమూ! యో భూతసంతానమా!
మీ మీ సాక్షిరిభావముల్ గనుడు! భూమీనేత యీదృక్ప్రతి
జ్ఞామోహావిలపారవశ్యకలితాజ్ఞావశ్యుడై పల్కెడున్.

క. తనబిడ్డ మీద నొట్టిడు
కొనినాడ నటంచె మొఱుగు క్షోణిపతి, తనం
తన రామమూర్తి క్షోణీ
జనులమొదల దివ్వెయగుటం జనునె మొఱుంగన్

శా. కౌసల్యాసుతుడైన రాము నపేకం బాపి యీతండు వ
న్యాసీమన్ బదునాల్గువత్సరము లుండన్ బంపగా నొక్కడున్
త్మాసర్వంబును నా సుతుండు భరతుం బ్రాపించు టొక్కటము నా
యాసల్ రెండివి తత్ప్రమాణముగ బొల్యంబుల్ ధరాపాలుచే

చ. పృథివికి సర్వ మగ్నియగు వేలుపు సూర్యుడు, సూర్యమండలీ
పృథుతరకుక్షిసంస్థమగు వేలుపు రాముడు, వీరు సాక్షు లీ
పృథివిపతిప్రణీతమగు బిట్టు ప్రతిజ్ఞకు సర్వభావసా
రథి యగు బాలమానవుడు రాముడు వాకున నిల్చి నిల్పెడున్

ఉ. పచ్చని చెట్టుపై బిడుగుపడ్డవిధంబున గుప్పకూలి రా
జచ్చెరువున్ భయంబు హృదయంబునయం దసమప్రచారవా
యూచ్చలదుగ్రతాడనరయోదతి నొప్పగ మేధ, దృష్టి, మ
త్యుచ్ఛమనీషలున్ స్మృతిక్రతుల్ వశజాతులులేక బాయిమై గన్

మ. ఒక విశ్వామిత్రు సిరాపథంబుల ననుస్యూతంబుగా నేగిన
ట్లకటా! యకయ్యో! యిదేమి యన్న నుడు లాస్యంబును సజ్ఞాతవా
చకముల్ పుట్టఁగ దవ్వుగా విగతసంజ్ఞం బొల్చి పైఁ గొంతకొం
తకుగాఁ జెప్పెటి తాఁ గసంబడినయంతం గైక, భీతాత్ముఁడై

గీ. ఓసి పులి! నన్ను భక్షింపు మెప్పు ముందు
పైనఁ బసివాఁడు రామునిపైకిఁ బోకుమన్న
టంచుఁ జేతులు చాచి తా నడ్డముగను
నిలచినట్లుగ నిలచి చంచలశిరోధి

చ. అవునవు కాదుకాదు పులి వాదనుకొంటి, నెవరో యాడుదా
నవు, మఱి యేలొకో నిలచినా విట? నేనును గోపలేశ్వరుం
డవుదును, నీ వహో తెలియనైనది కైకవు, నేఁడయయ్యో నీ
పనలున నెల్ల జ్ఞాపకమువచ్చిన దే మనినావు చెప్పుమా!

చ. ఇది నిజమాడితో హృదయ మేమొ ఘోఱుగఁగ నాడితో మఱిక
హృదయమె ఘుఱుంగ నాడుటకు నింతటి ఘోరపుమాట నెవ్వరా
డుదు రిలవంటి క్రూరపుఁగటుత్వపుభావమొ రాదు, వచ్చి యీ
డెద రెన, రెవ్వ రంత ప్రకటింతురో, యంత తెంపుకుండినఁ

చ. మొగిన దినంగఁ జంపుటకు ము న్నసికుం జెలఁగి కోడ నాడిన
ట్లుగ నృశీ బాలు రామునిఁ గడంగడు దగ్గఱఁదీసి మొన్నిఁక
పగలను బోయినావు? వెఱువంకలఁ జంపఁగ నీళ్లు తెచ్చి నీ
వుగ మును వాని నీ భయదపుం బ్రతికారముకోస మాటితో?

మ. సవతుల్ లోకమునందు లేగటవె! యీచాయన్ బ్రతీకారకై
తవనకృతుస్నులు గాని యుండరు, కిరాతంబైన యీ యాహా యీ
తెవ్వు లే తోవను బుట్టె నీకును విషాదీ! పాముఁ బాల్పోసి పెం
చువిధానన్ నినుఁ బ్రోదిచేసితి నహో! శుద్ధావివేకంబునన్

క. వర మిచ్చిన ప్రభునకు శిం
కరునె తిని చేయిపెట్టుకరణిని నాచే
వరముఁగొని హరీ! హరి! నా
వరమున నన్నుణఁగఁద్రొక్కు పాతాళమునన్ ౨౦౬

చ. తెలియన్ను జూడఁజూడఁగ నదే నొక రాక్షసమైన భావపుం
బలమునఁగాక యీ పగిది నచ్చి యనాగతమౌ ప్రసూనముం
బలెఁ బొలిపోనియంగముల ప్రౌఢియు వాడని యంద మేగతిన్
నిలుచును నీకు? నేను గమనింపగఁజాలక మోసపోయితిన్

ఉ. ఏమొడ నేర్పుగల్గుటయు నెంతయు నేర్పునకున్ ఫలంబు రాఁ
దీయుటయున్ సమస్తజగతిన్ మఱిచూడ బహుస్థలంబులన్
బాయకయుండు, నా ఫలముపట్ల నసాధువు, సాధువౌట దై
తేయుల కాదితేయులకుఁ దెచ్చిన భేద మిదేకదా! కనన్

ఉ. అంత త్వరాకృతాకృతఘనాగతమై చను శ్లక్ష్ణతాధురా
క్రాంతియు వేగచాలన మిరమ్మదసన్నిభమున్ సుదీర్ఘదే
హాంతవిలాసరేఖయు నిరంతరచిక్కణమూర్తియు త్రత్రాఁ
చంతటి యందమైనదగు ప్రాణియు నుండునటే జగంబునన్

చ. కను చెదరంగ రజ్జువునుగాంచి భుజంగమటంచు భ్రాంతి పొం
దను దగుఁగాని, యెవ్వఁడును నావలెఁ బామునుగాంచి త్రాడటం
చనుకొనఁడద్ది భ్రాంతియయి యంతట నింతట వీడు, నిద్ది ర
మ్మని యుసివాటుకాటుకొని ప్రాణములన్ నిలుచున్ యమాకృతిన్

ఉ. దానివిసంబు పాప మది దష్టునిమాత్రమె యంటు, నీ విషం
బైనను జిత్రమెల్లయగు నన్వయమున్ బెనవెట్టిచుట్టుఁ, గా
లానలతుత్వరాకృతమహాఘమహాగశిఖావిధాభుజం
గీ! నినుఁగాని పాణిగత కేవలనాకముగా భజించితిన్

వ. అని మఱియు నిట్లనియె

చ. అలయక నీవు వింటిచదువందలి సూక్ష్మములున్ రహస్యముల్
మెలఁకువలున్ స్వహస్తముగ నేర్పితి పేరిమిఁ దల్లికంటె నీ
వలనునఁ బ్రేమయున్ జనవు వానికి మిక్కిలి, రే బవల్ నినుం
దలచుచు నుండు వానిపని, దాని ప్రతిక్రియ యింతసేయుటో?

ఉ. లీలకు వేనినైనఁ గదలించినఁ జాలును వాని విద్దెలున్
శీలముఁగూర్చి చెప్పినది చెప్పక చెప్పుము రింత పల్కనం
జాలును రత్నముల్ మణులు సన్నని ముత్తెము, లట్టిబిడ్డపై
నీలుపురాల! యెంతపగ యెత్తితి మెత్తనికత్తి వోలికన్ ౨౧౪

ఉ. తామగపూర్వుబంధువగు దైవముఁ దొట్టి మదన్వయంబునన్
రామునివంటి యందమగు రానిసువే యుదయింపఁ డంచు మా
గీమునఁ బున్నెముల్ గృతయుగీనులు చెప్పెద రల్ల బ్రాహ్మణుల్
ధీమహితుల్ వశిష్ఠమునిదేవత, లేమివరంబు కోరితే!

క. తరుణి! మన సొంపక హృదం
తరాంతరమునందు దాగినది యొక్క విధి
స్మరణము నీ వరణీయము
మరణం బిది నాది నీవు మదినెంచెదవో!

ఉ. రాముఁడు నాకు స్నానమగు రాముఁడు నాకు జపంబు ధ్యానముల్
రాముఁడె యెల్ల నాబ్రతుకు రాముఁడు నన్నును గన్నతండ్రి యీ
రాముబినా నిమేష మవురా! మనఁజాలను కాదయేనియున్
రాముని వీడి యీ యఖిలరాజ్యముఁగైకొనరాదె కైకయీ!

ఉ. రామునియున్కి చే భగతురాజ్యపుభద్రత తెక్కవందువా!
రాముఁడు నేను నీ యఖిలరాజ్యప్రజల్ ప్రకృతుల్ మహర్షులున్
రామున కీ ధరావలయరాజ్యముపై నధికార మేమియున్
లేమికిఁ బూటయిచ్చెదము లేమ! యనుగ్రహ మింత చూపవే

చ. అరుదగు నెంత వింతచదురైనను జిమ్మను గంద్రకోన నొం
టరితనమందు సాయపడునా! పడి నా దురదృష్ట మేమనన్
దిరుగనిమాటయౌఁ గులముఁ బ్రిప్పలువెట్టెకు కాదయేని నీ
వరమున నన్నుఁగూడఁ గలుపంపెగదా! వనవాస మీగఁగన్

గీ. వెలది! హృది నెత్తువాకలు వెనుకనడక
నడచు మన్నట్లు తోఁచుచున్నది విచిత్ర
మైన యొక చెడ్డ యనుభూతి యైన పూర్వ
మననుభూతము భయము నాయందుఁదోఁచు

క. నా మైమప్రాణములలో
రాయిడి నెక్కవగుపాళ్లు రామునిలోనం
బోయి ప్రవేశించినయవి
యీ యలుపపుఁబాళ్లు నిలువవే రాము వినా! ౨౨౧

మ. తొలియిక్ష్వాకుల వంశకర్తములు నాతో నేటికిన్ నిల్చెనో
యిల సర్వంబున వీడిపోవుటకుఁ గానీ దేహ మున్నన్ని నా
ళ్ళులు ధాత్రీపరిచర్యరూపమయి నాలో నిల్చె రాజత్వ మా
వలఁ బోనైనను గాక రాముని వనీవాసంబుపర్యంతమున్

వ. అని మఱియు నిట్లనియె

ఉ. శ్రీమతి తాను బట్టమహిషీపదమందియు దాసివోలికన్
దా మసలున్ సమస్తపు నిదానపుఁద్రోవల రామచంద్రగ
ర్భామృతవేచి కోసలనృపాత్మజ యెంతయొఁ గర్చినాఁడ నీ
పై మరులూని యామె పతిభక్తియు నాదు విరక్తియున్ దగన్

ఉ. వాలికచూపులన్ బసిడివాఁగుగనుండిన నవ్వులీను పై
తొలుకు దెచ్చికోలయిన తోరపుసిగ్గును బైని ప్రేమవా
చాలతఁగాంచి మోహవివశంబగు లోకము, కాని యచ్ఛమౌ
శీలము గుండెలోపలివిశేషమె యక్కఱలేదు దానికిన్

ఉ. అల్లకుమారు రాముఁగని యామెయుఁ బాపము నా నిరాదరం
బెల్లయు విస్మరించినది యిప్పటికిన్ దుది ధైర్య మద్దియున్
జెల్లెను నీ కృపాగుణవిశేషము నామె యొకర్తు కాదు నే
మెల్లర నిల్లె దానిరుచి యేమొ యెఱింగినవారమైతి నే!

చ. పొలతుక! జీవులందుఁ దొలి మూఁడుయుగంబుల భావనాబలం
బలమి గుణానురూపమగు నాకృతి రాక్షసనాగభేదముల్
తెలియు నసౌమ్యసౌమ్యగతి, దిక్కృతకాలికధర్మభావనన్
గలి సుకుమారరూపమును గల్గును రాక్షసబుద్ధికల్గియున్

ఉ. క్షుద్రమయైన బుద్ధి పొడసూపు నుపద్రవ మందెడున్ దశా
చ్ఛిద్రమునందుఁ బోలె బహుజీవులకున్ యుగసంధులందు సో
పద్రవమౌచుఁ ద్రేతయును ద్వాపరమున్ గలియంగఁ బోయెడున్
భద్రత లేదు కాలమున భామ! యభద్రత నీవుగాఁ జనన్

వ. అని మఱియు

శా. పూవుందోటల నిన్ను నూచితిఁగదే పూఁబోడి! పున్నాగవా
టీవీటీమదవాసనావివశహృట్టీకన్ నిదుంశేసి మ
త్సేవారూపములై యనన్యజవధూస్మేరాననదాంతంబులోఁ
బూవుల్ నీ కభిషేక మార్చితిఁగదే పుష్పంధయాంతాలకా!

చ. పొలపముదక్కి రక్కసులపోరులలోఁ జెలఁగంట్ల వీటిగ
డ్డల సురగంగయొడ్డుల గుడారములన్ మనుటెల్ల నీదుమే
ప్పొలకయి కాదటే? యెఱుపుసొంగిన నా బ్రదుకెల్ల నీవు నీ
వలపును నాకుఁ ద్రాకఁబకువాదున రాచిన రాపు కాదటే?

ఉ. నీవును నేనుమాత్రమయి నిల్చిన ప్రేమపుఁదీవయోవరుల్
పూవులవాడు సూపవు నభోగతదీపికలైన వెల్గులన్
గేవల మూహలెల్లఁ బులకించిన యా వల పెంచియైన నా
యీవిధి లేని ప్రార్థన సహింపగరాదటవే కృపామతీ!

ఉ. వంచనబల్మి నీవగుచుఁ బట్టినపట్టును నింతదాఁక నె
గ్గించితి నన్ను నింతయుడికించితి చాలును మంచిత్రోవ పా
లించుమ యింకఁ బట్టు సడలించుము కోసలభూప్రజాసమో
దంచితవాంఛతీర, తెగుదాఁక బిగింపకువే దురాగ్రహా!

చ. కొడుకనఁ దల్లి తండ్రులనఁ గూఁతురునా మఱి తోడఁబుట్టునా
విడువక జీవితాంతమును బెట్టినబంధము, కామహేతువోఁ
బడఁతి నిమేషకాలకృతబంధమ యెప్పుడు కష్టక్రాంతయై
యుడిగియుపోవునో యనుట కున్ముఖమై నిలుచున్ విచిత్రమై

వ. మఱియు రాజు క్రోధోద్దీపితుండై

మ. కొలిధర్మంబది మున్నె పావుచెడె నాతో నర్థహానిం గనుం
జెఁ జాతా పుత్రవంశపున్ సహజమా సత్యవ్రతంబేన్ దుదిం
గలదై పోవునుగాక దుష్టవరయుగ్మం బీయనేయీయ నా
వల నేమా నగుఁగాక రాముఁ వ్యధకుం బ్రాఁతే మృషాగ్నిచ్ఛటల్

శా. ఏతాదృగ్వరయాచనాకుటిలబుద్ధీ! నిన్నుఁ బట్టించి శి
క్షాతీవ్రోజ్జ్వలమైన మార్గములలో శాసింతు ధర్మచ్యుతిన్
త్రేతాంతంబున నాఁగెదన్ దశరథోర్వీనేత నే నెవ్వరన్
జేతంబున్నదొ? చండశాసనత వచ్చెన్ నా యభిఖ్యంబడిన్ ౨౩౭

ఉ. సూనరి గోత్రియన్ బలియఁజూచినకైవడి తొల్లి పోరిలో
ప్రాణమునిల్పి నేఁడిపుడు రామువనీగమనవ్యథామతిన్
ప్రాణము తీయఁజూచెదవు పట్టి వధింపఁగ నేను గోత్రియం
గాను భవద్దురాశయనికాయనిబర్హణ మాచరించెదన్

ఉ. ఇంటికిఁ బెద్దయైన కొడు కేలెడుదానికి నే విధంబునన్
వెంట జనించువాఁడు పృథివీపతి కాఁగలఁ డెవ్వ రైననున్
వింటకుఁ గంటకున్ దగవు వేఁడగ వద్దటె? యిట్టికోర్కి నీ
వంటిది కోరఁగావలయు నట్టిన సిగ్గు త్యజించు జీవమై

క. ఏకాంతమైన న్యాయపు
టాకారము గోచరించనట్టివరంబా,
యీ కోరుట? నిర్లజ్జా
ప్రాకృతరాజ్యమున కీవు పట్టమహిషివై

వ. మరియు రాజు పరమదైన్యంబున

చ. విడువకు రాముపైనిగల ప్రేముడి మూఁడవసారికూడ నీ
కడుపునఁ బుట్టెదన్ భరతుకంటెను రాముఁడు తేఁటుకావుటన్
జెదుటయుఁ గల్గునే పదియుఁ జెప్పితి వందయుఁ జెప్పి తీస వాఁ
డొడయఁడు కాఁగ భూమిప్రజ యుత్సవకోటికి నెక్కుఫక్కికల్

క. ఇవి చేతులు కావే యో
పవిఘాతవచోదుగంత! బతిమాలెద నిం
తవుదాఁకఁ బెంచితివి యిం
తవుదాఁక ఘటింపకే వరానన! రామున్

ఉ. కొడుకులకోసమై దిగులుకొంటి మొగంబును వాచి కంటి నీ
కొడుకును గాంచితిన్ మువురకున్ గడుఁ బెద్దను, ద్రెంచి కాని యీ
ముడి విడఁదీయరానిదిగఁ బొందితి రామునిలో నసుప్రజం
బిడి, యిడియించకే ప్రజలు యెల్లయుఁ బ్రార్థనగాఁగ వేఁడెదన్

చ. రఘుకుల మెల్లయున్ దరతరంబులఁ గొల్వఁగ నిన్ను దేవతా
పఘునవిధాశిలాప్రతిమ భాసిలఁ జేయుదుసుమ్ము దేవళం
బఘటితపూర్వమం దునిచి "యమ్మ" యటంచును నిన్నుఁ బిల్తునే
లఘుతమమైన యీరఘుకులంబు దయారసబుద్ధిఁ గాంచవే ౨౮౫

మ. మును శృంగారరసంబుదోషము పదాంభోజంబులన్ దాఁకినాఁ
డను గాఁబోలు నఘంబు తత్సకల మీఁదంబో శిరోజాతవే
ష్టనమూర్ధాఖిల కేతనంబుగ నమస్కారంబుఁ గావించెదన్
గనఁగోవే దయ రాముఁ గానలకుఁ గాఁగాసీకు వే కైకయీ!

వ. తుదకు నిస్సహాయుఁడై రా జిట్లనియె

ఉ. ప్రాంశువు లెంతయున్ భరతుభావము లాతనిబుద్ధి కే యప
భ్రంశపుఁగార్యముల్ పనికిరావు నెఱుంగుదు నేను వాని నీ
యంశమునందు నీ తలచినట్లు తలంపఁడు వానిపేరునన్
వంశపుమచ్చ దెచ్చెదవు వ్యర్థమె యాఁజమి యింతయత్నముల్

క. ఒక వేళ రాముఁడగు జా
నకినైనం గాంచి యిట్లనందగదే యే
కొకిబికిమేనిది చెప్పెనె?
యకటా! నిన్నిట్టినరము లడుగు మటంచున్

గీ. ఆడదానికిఁ గలుగు ధనాశ యెంతొ,
యవని మగవాని కుండుఁ గీర్త్యాశ యంత
ఆదరించునో భరతుఁ డీ యమ్మగారు
ప్రేమ నార్జించిపెట్టిన పృథ్వియెల్ల

క. మొదలఁ దనకున్న రాజ్యము
వదలుకొనం బటువె, సడుమవచ్చినదానిం
బదనుగల మొదఁగలానికి
వదలుకొనుట గోటిమీఁదిపనిగదవె చెలీ!

ఉ. నీ తొలినాటి రాముపయి నించిన మక్కువ యాస పెంపఁ బ్రా
ణాతురుఁడైనవాఁ డడుగనైన సమస్తవిధాల నడిత్రిన్
రాతిని పన్నిపోయిన కిరాతికి నచ్చునఁ జిక్కి ప్రొద్దుటన్
భీతిని బ్రార్థనాతులను బెట్టిన కృష్ణమృగంబుకై నడిన్

వ. అని సమాసన్నవిలయవేళాతీవ్రనిశ్వసనంబునమూర్ఛితుండునవలెనైన

గీ. పతివచోభిముఖీనమా పడంతి సుగాత్ర
నిముసనిముసంబునను నేనో నిఃశ్వసించె
తూస్నతలేంద్రాంగు దుఃఖవాచాంగ్రైనం
దరుశి కైకేయి దుఃఖని ష్ప్రయమ్యో

ఉ. అంత మృదుచ్ఛటల్ సునిశితాతపముల్ సెరలాడెఁ బల్లవ
ప్రాంతతటీచకచ్ఛితరాగములుఁ గృతతాపగోపనా
త్యంతమనోహరంబులు లతాంతనితాంత గమద్వసంతసా
మంతశకుంతకూజితసమంతతఉద్భ్రమితానిలాధ్వమై

సీ. గంగాజలాపూర్ణ కనకకుంభంబులు
సాగరాగతపద్మరాగమణులు
ధగధగలాడి, నూతనసమానీతపీ
తాంబరంబులు హేమదామములును
దళతళలాడి, గంధాగురుదధిఘృతం
బులుఁ బౌరజనమనోంబుజము లంత
దుకతుకలాడి, యాముంబగంబగు భద్ర
పీఠంబు వెలవెలై వెచ్చగిల్లి
వెచ్చపేలాలు పూవులవిష్ప ముదుత
లంది తెల్లన చిఱుశ్యామలత నహించి
యభినవానీత రామభద్రాభిషేక
కలితసంభారములు నెండఁ గాగిపోవ

చ. అటు మధుమాసవృక్షశిఖరాగ్రకిసాలయబంధ మూడ్చి తా
మిటు రఘుదేవుభద్రభుజ మెక్కడు భాగ్యము దూరమైనఁ ద్రో
క్కటపడుచుఁ బ్రశస్తసుమకన్యలు వాలికమొండ లింత తా
మటకును నోర్వలేక తలవంగొని వాడుచు వత్త లయ్యెడుఁ

ఉ. తేరునఁగట్టి నిల్చినవి తెల్లనినాలుగుగుఱ్ఱముల్ సితాం
భోరుహకాంతిమై పొలుచుఁ బుంగవముఁ నిలుపోపలేక మా
లూరఫలాభమంజరితలోచనకోణములందుఁ జూచుచుఁ
సూరెల గిట్టలుం దిగిన చోటులు మారిచి మార్చి నిల్చెదుఁ జిగుర

ఉ. పంజరమందు నూతననిబద్ధము తా నలుకోటసింహమే
యంజకురామిచే ముఖము నానిచి పంజరధాత్రి దాగుచున్
నెంజలి ఘూర్ణిలంగ రవనిర్భరవేణిక లూగి వొచ్చినన్
మంజరితాతపంబులు కుమారిలి కోసలు చిట్లిపోయెదున్

చ. ఉదయమె మావటీఁడు ప్రియమొప్పగఁ దమ్ములపాకుకట్టలం
బొదిగిన నల్ల మందిడినఁ బొందినమత్తు కరిమాన జాఱినన్
గదలిక తొట్రుపాటగుచు గంధగజేంద్రము మందఘీంకృతిన్
బదరుచు నెండచే నదుపుపట్టగరానివిధాన నిల్చెదున్

చ. ఇతరములెల్ల గుమ్ములగు నెండల కోడినవైనను దిర
స్ఫూర్తిఁ బచరించి నిల్చినవి గొంగు, వినూతనమృష్టకాంస్యని
ర్మితనిజయష్టికాంతి నెదిరించి విడల్చు ధనుస్సు, సన్నదో
వతిపౌరవోని యుల్లి సొగవాదర వెల్గునఁ జీల్చు గత్తియున్

గీ. క్షోణినాథు నెదురుచూచు వశిష్ఠాదు
లాది గడియ, పైని నర్ధఘటిక,
లిప్త పిదపఁ, జివర లేనికాలంబున
నెదురుచూచిచూచి బెదరుపొంది

ఉ. అంత సుమంత్రునింగని మహర్షి వశిష్ఠులు మీరు పోయి భూ
కాంతుని మేలుకొల్పికొని కైకొని రండని ప్రొద్దుచూపినన్
మంత్రియున్ బదస్ఖలనమార్గముఁ ద్రొక్కుచుఁ జిన్నరాణి శు
ద్ధాంతగృహప్రతానముసమీపరసాలములందుఁ జొచ్చుచున్

చ. కృతయుగమాది రాఘవుల కేవలమంత్రియు వృద్ధమూర్తియున్
హితతముఁడై నవానికిని హెగ్గడికత్తెలు దారియీయఁగా
క్షితిపతి ప్రేమపుంబొలఁతి కేళిగృహంబునఁ జూచి యందు ని
ర్గతుఁడయి కోపగేహమున రాజును గాంచె నపేతచేతనున్

శా. కైకేయీమతిచాతురీకలితాంగారక్రియాకల్పనా
నేకానేహసదాతప్తచేతసునిఁ ధీశుం బ్రబోధింపఁగా
నై కేకేయియు నంతయయ్యెఁ దనమాటందుం దిరస్కారమున్
జేకోదంచు నటింగి తేనిని బ్రశంసించెన్ మనోజ్ఞంబుగన్ ౨౬౯

క. అనిన సుమంత్రుండు తనలో
నన సందిగ్ధమగు రాజనందినివాక్యం
బునఁ దన కనుకూలార్థం
బును ఘటియించుకొని వేగమునఁ జనుదేరెన్

ఆ. అరుగుచున్న మంత్రి యాత్మలో మఱల భూ
పాలువద్ద కేగవలయు నన్న
యూహతో నలతోడ నూగాడుచుండఁగా
నంతిపురము వెలికి నరుగుదెంచి

వ. అచట నానాదేశాధీశులయిన సార్వభౌములును మహారాజులును రామాభిషేకదిదృక్షాప్రియులు కనిపించి యచటగో సుమంత్రుఁ డాయనను గనుగొంద మన్న మాటలతో నచ్చి

క. మే మందఱమును వచ్చితి
మీమమ్మును మీదుతేని కెఱుకపరుపగా
నేమీ! యెవ్వరు లేరిట
భూమీశ్వరుఁ డెచట? నీవు పోయి తెలుపుమా!

చ. అనిన సుమంత్రుఁ డేను నృపునాజ్ఞను రాముని గొంచుఁదేర నాఁ
జనిమొద మీఁగలందఱును సత్పురుషుల్ రఘునాథమైత్రినా
రినిధులు రాముపక్షమునఁ బృథ్వినుహేంద్రునిపక్షమున్ మిముఁ
దనర నిరామయం బడిగెడన్ ధరణీశుఁడు నిష్ఠ వచ్చెదన్

క. అని మఱల లోనికిం జని
జననాథునిఁగాంచి నీతిశాస్త్రప్రజ్ఞా
ధుని! సర్వలోకరక్షా
ఖని! పూర్వేక్ష్వాకువంశగగనద్యుమణీ!

ఉ. నీ రచియించు నీతిఁ గల నేరుపునన్ జగమెల్ల సొగడెన్
భూరమణా! యనన్ ధరణిపుండును దైన్యపయోధి, యోయిమం
త్రీ! రఘువంశబాలశశినిం గొనిరమ్మను నీమొమాట యే
లా రుచియించ దక్కట! నృపాజ్ఞ మఱేటికిఁ జేయవో యనన్ ౨౮

గీ. మంత్రి తలతోఁ గృతప్రణామముగ సాఁగి
కైకయిలు వీడి రాజమార్గమునఁ బోవ
రాజమార్గమ్ము రత్నతోరణవిరాజ
మానమార్గమ్ము శోభాసమమ్ము పొలిచె

క. రామాభిషేకగాథా
గ్రామమ్ములు చెవులు సోఁకఁగా మంత్రి కనెన్
శ్రీమత్తన్ గనకాచల
సామీప్యముఁ గన్న రామసద్మము నెదుటన్

సీ. ఇనుపతల్పులగుమ్మమును దాఁటి వచ్చెడు
వారికౌ నరుగులు నంద దాఁటి
కస్తురినీళ్ళల కలయంపితావుల
ముత్యాలతోరణమ్ములను దాఁటి
నీటిబెగ్గురులయు నెమళుల కూఁతల
తోడి ముందటిపూవుతోఁట దాఁటి
దోయిలించినచేతఁ ద్రోవ యిచ్చు గుమ్మ
ముల నున్న బంటులచూఁక దాఁటి
మాటకట్టినయటు వంగిపోయి నడచు
నట్టి మఱుగుజ్జుహెగ్గళ్ళ పట్టు దాఁటి
రాముని ప్రియాపవాహ్య ముద్దామమదగ
జమ్ము శత్రుంజయమ్ముకొట్టమ్ము దాఁటి

వ. శ్రీరామచంద్రపట్టాభిషేకప్రియకథాప్రాసంగికులయిన యనేకపౌర జానపదసమూహమ్ములఁ గడచి యంతిపురము సమీపించి యప్రమత్తులు నానాయుధధారులును గాపాయధారులయిన వేత్రపాణులును దనరాకకు వేఁచి చేతులు జోడించి దారియీయఁగా.

క. తనరాక రామచంద్రున
కును దెలియంబంచి సవిధకూటము చేరం
బనిచిన గుమ్మము కాఁపున్
వెనుజని రాఘవులమంత్రి ప్రీతాత్ముండై

సీ. ఎడమప్రక్కను నిల్చి పుడమికానుపు సీత
నెమ్మిఁబీవనగాలి నెఱులు దూల
సీమమ్ముచే నైన కోమలతనుకార్శ్య
మందమౌ మొగమున కందమీయ
వనవరాహము నెత్తురునఁబోనినియుఁ దావి
బుగులుకొల్పెడు మేనిపూఁత గొప్ప
మేలిగుప్పటితోడి మేలిమిబంగరు
సెజ్జపై నందమ్ముచిందువాని
రామచంద్రునిఁ గాంచి తాఁ బ్రాంజలించి
సుఖము నడిగించుకొని కూరుమండి నుంతి
యయ్య ! రఘురామచంద్ర ! మీయయ్య నిన్నుఁ
జూడ వాంఛించెడిని గైకతోడ నుండి

చ. అనినను రామచంద్రునయనాంతరతారకలందు వింతయై
చనుఁ జలనంబు చిర్మెఱుపుచాలిక మబ్బులవెన్క నాడెనో
యన నొక లిప్త కన్న కడునల్పపుఁగాలమునందు నాడి, సీ
తను గని తండ్రి రమ్మనియెఁ దల్లియు నున్నది వత్తునంచనన్ !

క. అని చనియెడి శ్రీరాముని
గొనకొని ధాత్రీతనూజ గున్నముదాఁకం
జని యట నిలచిన శ్రీరా
మునిఁ గనులం గాంచు చచ్చముగ నిట్లనియెన్

ఉ. మీ యలచిన్న నాటఁబడి మీకును మీకును బ్రేమ యత్త కై
కేయికి మీకు, రాఘవులు కేవలపుత్రులు కైకయత్తకున్
న్యాయమె పిన్నయత్త భవనంబుననుండియ మిమ్ముఁ బిల్చుటల్
పోయి మఱల్లి రండు శుభముల్ బరువెత్తు బుజాలుపొంగఁగన్

గీ. శచిమగఁడు తూర్పుదిక్కున, జముఁడు దక్షి
ణమునఁ బడమర వరుణుఁడు, నవనిధులకు
నొడయఁడు కుబేరదేవుండు నుత్తరమున
శ్రీరఘూత్తమ ! నిన్ను రక్షింతురుగాక

క. ఏనది కానిది యగు
వైనౌన ముఖాంచలముతోడ నవనీజాతా
పాణిస్పర్శపరాను
ర్యానూనుఁడు రామచంద్రుఁ డచ్చటు కదలెన్

ఉ. ద్వారమునందు లక్ష్మణుఁ డుదారకృతాంజలి, రమ్యమధ్యమ
ద్వారమునందు సన్నిహితులై చను సన్నిహితుల్ సఖాళి, చ
న్నొగ వెంట, నర్థుని గణించి ప్రసంగముచేసి వారితో,
శ్రీరథ మెక్కెఁ బానకపవీతశిఖాయుణ కేతనాంశువున్

సీ. పాదమూపునాల్గులు పొలిచిన దీప్తాగ్ని
యూహావనీయాభ మగద మెక్కె
మనుజులలోఁ బులిమాద్రి నొప్పెడు రాజు
పులితోలునాసనమ్మునఁ జెలంగె
హరిమణిత స్తంభ బాహారమ్యుఁడగు సామి
రథరాజ స్తంభరాజిఁ బట్టె
కడువిశాలమ్ము మేఘుస్వానమును మణి
హేమకాంతము రథమెక్కె స్వామి
మిలమిలలఁ గన్నులను మిఱుమిట్లు గొలుపు
తరణిసర్పసమగు నరదమ్ము నెక్కె
నెన్నుపిల్లలవలెఁ బరువెత్తె నంత
రాజు కాల్మోపుటెత్తిగిన వాజిచయము

స్రగ్ధర

పర్జన్యాకృతి యరదంబెక్కెన్ మేఘపటలి యాగుబ్బి
గర్జించెన్ బృఘునినదాభీలామోఘగతి ననన్ జక్ర
స్ఫూర్జన్నాదము లాలసెన్ దా సౌమిత్రి సుగియతో వింటన్
ధూర్జాగ్రన్నయనము లొప్పన్ నిల్చుండె దొనము వెన్నుబట్టెన్

చంద్రరేఖ.

శ్రీరామచంద్రరత్నశ్శితాకథారాజి యెల్లన్
సారామృతాభగీతాసంతానసంతానసూన
స్ఫారోక్తి వందిబృందవ్యాఖ్యాతమై చాపహస్తుల్
శూరాళి మార్గమెల్లన్ జోదిళ్ళ సేవించుచుండన్ ౨౯౮

మధ్యాక్కర.

సౌధాగ్రభాగస్థసతులు శారదచంద్రాభవదను
సాధుమూర్తిని రాముఁ గాంచి సంతోషజలధాసు లగుచు
నీ ధీరు హరిమణిఖండభృత్సారు నెంచి కౌసల్య
భాగ్యలబ్ధియు విల్లు పెక్కుపట్టుగాఁ బ్రమదంబుఁ గాంచు

మధ్యాక్కర.

జనకభూమీనాథుదుహితృసకలసామ్రాజ్యసంపదలు
కనులకు వెన్నెలవర్తిగా నైన కౌసల్యబిడ్డ
తనువుగా నింద్రనీలమణి తనుకారు తలతలల్ గాఁగఁ
దనరారెఁ గోసలసర్వధరరాజధానివీథులను

మధ్యాక్కర.

ఈ కోసలావనిప్రజలు నెన్నెన్ని యెన్నెన్ని నోము
లీ కాలమున కొగ్గునట్లు నెన్నడు నెప్పటఁ జేసి
రోకదా! యీ రామమూర్తి యుర్వికి నొడయఁ డౌచుండె
నే కార్యము ఫలంబు పొందు నెప్పుడో యెవ్వరి కెఱుక?

మధ్యాక్కర.

అనుచు నానందాస్య లగుచు నాడెదు నంగనోక్తులును
వినిపించకయు నేదో సుంత వినిపించి ప్రియముగా వించు
చని పురీనికటంబు రామచంద్రుండు చక్కఁగా నగురు
పునుగు కస్తురి కమ్మతావి బుగులుగాఁ బొలుచు వీథులను

మధ్యాక్కర.

నానాజనాకీర్ణమైన నగరకంఠంబునం దోర
ణానేకముక్తాస్ఫటికనవాంశుల భూషణంబులను
గానవౌ మరకతరత్నఘటితసంఘంబుల దీప్తి
యానంద మందిచ్చుచుండఁ బ్రాణమూలాంగణంబందు

మధ్యాక్కర.

అనుభవశాలులు వృద్ధు లభివందించి యయ్యా! శ్రీరామ!
మనువంశపతులు మీతండ్రి మఱి తాత మఱి తాతతాత
చనినట్టి చక్కనిత్రోవఁ జనుమయ్యా చక్కనిసామి
యని నమస్కృతి దీవనలును నాడి తా రంతంతఁ బోవ 300

మధ్యాక్కర.

ఏ కెలంకునను జూచినను నీప్రక్క నీప్రక్క సఖులె
సాకుఁ జల్లగను శ్రీరామచంద్రుండు సకలభూపప్రజలఁ
బ్రాకారివలె నన్నయట్టి పలుకులే ప్రబలమై తోఁచె
మూఁకలందున నెమ్మదిగనె పోఁజొచ్చె మొల్లమై రథము

చంద్రరేఖ

శ్రీరామచంద్రుఁ గనుచుం బ్రేమోదవధిం బొంగినట్టుల్
దూరంబుచూచి యల్లే తూఁగాడుచుండెం బ్రజాళుల్
శ్రీరాముఁ గాంచలేక సీమాంతమం దున్నవారల్
వారెంతొ యాత్మనిందావ్యాపారనిమగ్నులౌచున్

స్వాగతము.

వేత్రత్రోవను జనఁగా జొట్టెనంచు వెడలి శ్రీరాముం
డా త్రోవల్ బడి ప్రజ దారియన్ దగ్గరయుత్రోవం బో
నై తేనింగనఁ గనియెన్ మేఘానీకహారణ మాహాత్మ్యం
బెళ్ళుంబోలిన మణికాంతిశ్రీ కంట నెసఁగ మిర్మిల్లై

చ. వెలిఁగెడు రాజసౌధముఁ బ్రవేశమునంది మహాధనుష్కులన్
బలిసినయట్టి రక్షకు లభంగురగుప్తి వెలుంగు మూఁడుక
క్ష్యలును పదాతిరక్షణఁ గృతాంతగృహంబులవోని రెండుక
క్ష్యలును గమించి రాఘవుఁడు నంతిపురంబును జొచ్చె నంతటన్

క. తొడితొడిఁ దనుబడి రాకయు
పెడపెడఁ జనుమన్న నదుపుపెట్టఁగ నుట్టిం
బొడిచిన మృతిఁగను బిడ్డం
బడి దుఃఖాకారమైన వనశేలలివలెన్

క. రాహుత్తు శత్రుబాణ
వ్యాహతుఁడై కాళ్లక్రిందఁ బడిన విరాళిన్
మోహరము పోలము తొలఁగక
యాహాతదృశమైన యు త్తమాశ్వము వోలెన్ ౩౧౬

క. ముక్కుం జెవులుం జేతులుఁ
జెక్కంబడి యందమెల్ల జెడి దేవళపుం
బ్రక్కను నోరిగి శిలాత్వము
దక్క మిగులనట్టి దేవతాప్రతిను వలెన్

గీ. ఉనికిగలుగుఁ దండ్రిఁ గనుచు నిర్విణ్ణుఁడై
పాదములను జేతఁబట్టి తాఁకు
సుఖముపొంది మెడఁదసుడి బిగ్గపట్టుక
మొగిడి కైకపాదములకు మ్రొక్కి

శా. నీయాజ్ఞంబడి వచ్చినాఁడ నని తండ్రింగాంచి ప్రత్యుత్తర
చ్ఛాయాదూరముగాఁగ నున్న పితృనాస్యంబుం గనుంగొంచుఁ గై
కేయిం జూచి, యిదేమి తల్లి మఱి నాకేలంది సన్నంకసం
స్థాయిం జేయఁడు జిత్తముద్దుగోసఁ డాశ్చర్యంబు వాటిల్లెనన్

శా. అమ్మా! నేఁ గనిపించినన్ మఱియుఁ జా లానందధీపారవ
శ్యమ్మున్ బొంది గవుంగిలించుకొని ముద్దాడంగనౌ తండ్రి యే
లమ్మా! పాదములందు నాకరముతోఁగైకూడఁ గన్నెత్తి పా
దమ్ముల్ పుల్కలఁజూచుకోఁడు,కత మింతం గాంచ నొక్కింతయున్

చ. తెలియక యేమిచేసితినో తెచ్చిన యెల్లయు తండ్రి ప్రేమకున్
బొలమగు రాజు కన్ను లిటు పుచ్చఁడు నాయెడ దోస మేదియేఁ
గలిగిన నేనురాకమునుగా మఱి నీవను జెప్పియుందుఁ దం
డ్రిలకును నెంతకోప మగునో నను నింతఁగఁ జూడకుండఁగన్

మ. ఒకయేదో బెడిదంపుదోస మని నే నూహింతు, లేకున్న తే
నికిఁ దానింతటి దైన్యముం గలుగునే నిక్కంబుగాఁ దల్లి! యిం
తను నేఁ జాలుదునా? ధరాపతికి నేతాదృక్క్రుద్ధా హేతుపా
తక మే నేమి పొనర్చియుంకును జింతాదుర్గమం బయ్యెడిన్

గీ. తండ్రి ముఖనిర్గతము మధుధారఁ జొక్కు
నీలభృంగమ్ము నేను దల్లి! లవము ల
వంగపుమ్మొగ్గయంతటి పలుకు నైన
వినఁగరాదట్టె? తీవ్రమే యనుము నేను ౩౧౩

మ. తనయానంబడి యగ్నిలో దుముకనే? తానింత "ఊఁ" యన్నచో
వనధిం దూఁకనె? యేమిచేయ నని చెప్పన్ వచ్చు, నాతండ్రి నా
కును బ్రత్యక్షమురారి, హే విషసృదాకున్నిఘ్నగండాంతరా
స్థిని నిద్రింపుమటన్నఁ బోయి మఱి నిద్రింపన్? సహింపఁగదే

మ. అని కైకేయి మొగంబువంకఁ గని యాస్యంబందు నా రాణి పా
టున నిప్పుల్ కనుజేటలన్ జెటిగినట్టుల్ చూడ "నేమమ్మ" నీ
కును నాపై నది యంత వచ్చెనటవే కోపమ్ము! నేనై పొస
ర్చిన దోసమ్మది మీదు దంపతులకుం జెప్పంగదే నావుడున్

శా. ఆకంఠమ్ముగ వచ్చు దుఃఖమును గోపావేశమున్ నేత్రరే
ఖాకోణమ్మున యత్నమై యదిమి చిక్కంబట్టి దంతద్వయీ
స్తోకాఘట్టనఁ జేసి క్రీఁగెదవి నెత్రుంజిమ్మ నల్లంతనే
పాఁకంబట్టిన పొంగునన్ వెనుకపాటావేళ శ్రీ సీతగన్

క. అవునోయీ రాఘవుఁడ! పి
తృవాక్యపరిపాలనంబు దెప్పగమై పా
ల్యవిధిం గొప్పరమా నహిత
మవినయులకుఁ జేతఁగానిసువ్రతముసుమీ!

క. అది నీవు చేయఁగలవా?
మొదలిడి పట్టాభిషేకమునకును యువరా
ట్పదమునకు సిద్ధపడితివి,
మది నాలోచించి బదులు మాటాడు మనన్

చ. దశరథపుత్రు నేత్రములఁ దారక లీరిక లెత్తినట్లుగన్
బ్రశమితమై యెదో స్మగణభావము గొట్టినయట్లు తోఁచి నీ
దశ పులకించి యిట్లనియెఁ దల్లి! యహల్యకు గౌతమర్షి దే
వి శమితలాలసాహృదయవీథికి నీకును నాత్మ యొక్కఁడా ?

క. నీ చెప్పినదప్పు వ్రతమును
బ్రాచీనోత్తమమహర్షిభార్య లహల్యల్
మోచాఫలమధురిమగురు
వాచాలలు చెప్పిరమ్మ! పరమహితముగన్ ౩౨౧

మ. తొలుతన్ జ్ఞాపకమున్నదో మఱియు లేదో నీకు, నే సీతఁ బెం
డిలియై యింటికి వచ్చుచో రథములన్ నే నమ్ముగ్గొఁ జెప్పి య
ల్లలఁ దోలించితి నామెఁగమ్మున నహల్యాదేవతాపర్ణశా
లల, కానాటి గురూపదేశవిధి యేలా విస్మృతిం గాంచెన్

గీ. కైక కన్నులు చిన్నవిగాఁగఁ జేసి
చిన్ని సూదులు గ్రుచ్చిన చెలువు గాఁగ
నల్ల రాఘవు హృదయంబు యాగపద్య
ముకుళవికసనకారియాఁబోల్కి గాంచి

చ. మును పల నాకు రెండువరముల్ దయచేసెను నీకు తండ్రి, దా
నను నొకదాన నీవు వనయానన్ బదునాలుగువత్సరంబు లే
గనువలె వెంబడిం జటివి కానను, రెండవదానఁ జేసి నా
తనుభవుఁ డిప్పుడే సకలధాత్రికి నీవలె రాజు కావలెన్

శా. రామా ! యిన్ని దినాలుఁ దాఁచితిని రా రక్షోవిఘంబై సప
త్నీమాత్సర్యము నేఁడు బ్రద్దలయి సంధిన్ గండ్రకోనన్ ధను
శ్శ్రీమత్పాణివి నీవు నొంటరివి నీ సేనాంబు క్లిష్టంబె యా
నో మాటిచ్చిన మీరు రాఘవులు పోగో సత్యవాక్పాలనన్

శా. రక్షోజాతిని నాముయూనవదశాప్రాచుర్యముం బోదు వృ
ద్ధక్షోణీపతి నీకుతండ్రికిని జేతఃకామముం జావ దౌ
రా ! క్షోణీభరతరవారణావతరణప్రాచీనలీలాకృతీ !
దక్షుం డొక్కఁడ నీవు భూమిపతిదత్తంబౌ వరవ్యక్తికిన్

క. అడిగిన దేమో యడిగితి
బుడుతఁడ ! మునుమాఁచి తిట్టిపోయెడు తండ్రిం
బడి నీవును దఱిమితఱిమి
యడిగించినతండ్రి యిట్టులైనాఁడుగదా !

శా. నాకున్ నీకృతమైన యే యపకృతిన్ నాకోర్కి యిట్లా నటం
చాకారించెదవేమొ? చెప్పితినిగాదా నేను రక్షస్సునం
తే కా దెంతయుఁ గోసలాధిపసుతాహృత్క్షేత్రకుద్దాలన
ప్రాకామ్యాకృతి నీవెఱుంగవు ననున్, రాజో మెఱుంగున్ ననున్

క. మామువ్వురు రాణులకును
స్వామీ! పుత్రికులు మీరు జన్మింతు రటం
చేమో యెఱుఁగుదు నెప్పుడో
యీ మంచియనేహ మెంచి యిట్లులు సేయన్

శా. ఆయెంబో, ననుఁ బెంచినట్టిదికదా యా రండ, కాండీరుఁ డా
దో యాష్ట్రీకుఁడ వౌదొ, యమ్ములను ముద్దాయంగ వెద్దాయన
ధ్యాయాధ్యాయము చాపశిక్షణకళన్ దై తెక్క లాడించినా
వే యా మంథర, యూరకే చనునటో యీ చిన్నికార్యంబులేన్

మ. అనుచుం జేయు ప్రసంగవాహినిబడిన్ బ్రారంభదుఃఖంబు తోఁ
పని యుద్విగ్నగళస్వనం బెసఁగ సంబంధించుఁ దల్లిన్ గనుం
గొనలన్ దెల్విని నప్పువన్ గఘుకులాకూపారజై వాత్మకుం
డును గన్గొంచును నిట్లు చెప్పె మృదుపాండుప్రౌఢగండాగ్రుఁడై

ఉ. నీ యుపకారమున్ మఱువనే మఱి యో జననీ! యెవండుగా
నీ యొకసత్కృతిన్ సలుప నీవగు దింకొక రాదు రెవ్వరో
చేయక యే సహాయపడి చేయఁగరాదను దత్ఫలంబు రాఁ
జేయఁగరాదు లోకమున సేమము త్వాదృశులందు నిల్చెడున్

మ. జనని! యేమహనీయులైన నుపదేశం బిచ్చినన్ దానిభా
వనయున్ భావనగాఁగ నిల్చిన ఘల్బ్రభా! దేవతామూర్తి ని
న్ననుబోలెం జనుదెంచి యాచరణమందుం జొన్పకున్నన్ నినున్
విను మన్నింతు నహల్యకన్నను హిమానీసత్కృపారాశిగన్

ఉ. ఏ వరయుగ్మ మీ వడిగితే వరయుగ్మము రా జొసంగె నే
నా వరయుగ్మపాలనకృతార్థజనుష్కుఁడ నైతినేని నా
యా వరపాలనాత్తసుకృతాఖిలదివ్యత యందుఁ దల్లి! (శ్రీ)
దేవత నీవు, నన్ననుమతింము నీదు పదార్చకుండుగా

చ. వసుధయు దీనివెంటఁబడి వచ్చెడుఁ జొక్కులు తప్పు లింతయున్
ముసరవు నా మనస్సునను బున్నెపుకర్జ మొకండు సేయు నూ
హాసారిది నా యెడంద మఱి యాఁచినయట్లుల నివ్వి యాఁచ నీ
రస మది నీకు నిచ్చిన వరంబున బుట్టిన సేగి కాదు వే 33౮

మ. తనునాళంబుల సూర్యతేజములసంతానంబు నాయందుఁ బో
లెను నా తమ్మునియందునుం గలవ తల్లీ! నేను మాతండ్రిమా
టను బాలింతు నతండు మత్పితృకిరీటం బందుఁ బాలించు నొ
క్కనికిన్ రెండవ్రుతోత్రివ లోకక్రపరి యేగన్ వీలటే చెప్పవమా!

క. నీ వడిగినయది మఱియును
భూవిభుఁ డిచ్చినది యిపుడు భూపతి మౌనం
బే వెలయించెడు నిజ మని
నా వరపాలనమె మిగిలినది కాదటవే!

ఉ. ఇంకొక తల్లియైనయెడ నేనును గానకుఁ బోవుటొక్కఁ డా
వంకన కోరియుండు, బరివాగ యెఱింగినబుద్ధి యూట నా
తంకములేక నేల తొలిదారిని నేల్బడి సాగుటెంచి భూ
పాంకము తమ్మునందు నెఱపాఱఁగఁ గోరితి, నీతివార్నిధీ!

చ. కడఁకను వెంటనే జటనిగావుట కోరుట కొంత వేళకుం
బొడమెడు సందియంబులను బుట్టక తుంచుట మేలుసేసినన్
గడువడి నిట్లు ముందువెనుకల్ పరిశీలనచేసి చేయఁగా
నొడికమున్ కల్గి చేయవలె నగ్గముకట్టినయట్లు భద్రమై

చ. కొడుకునకున్ శుభం బలముకోసము కోసలులాడబిడ్డ యె
న్నుడుద్రతముల్ పొనర్చు ననుకొందును, పిచ్చిదిసుమ్మ, తల్లికిన్
వడిఁ జని యెల్ల దేవతలవాంఛలకున్ వ్యతిరేకమంచు నే
నొడఁబడఁజేసి పోవవలయున్ గద యంత కనుజ్ఞ యీయవే!

మ. అభిషేకార్థగృహీతపావనజలవ్యాకీర్ణ కేశాంతుఁడై
శుభమూర్తిన్ జనుదెంతునం చెనురుచూచున్ దాను వైదేహియా
శుభముల్ వందలకంటె నిద్ది శుభమంచున్ నచ్చఁగాఁ జెప్పి వీ
తభయం జేసి చనంగనౌఁ గదవె! యేతాత్కాల మోర్వంగదే!

ఉ. ఏదియు మాటయున్ బలుకు నేడి శిలాకృతి రామకైక యీ
వాదము నంతయున్ వినెడువాఁడును దా విననట్టివాఁడుగాఁ
గాదని యానటంచు ననఁ గాని విచిత్రదశావిపత్తిలో
నాదిన తండ్రికిన్ రఘుకులోత్తముఁ డంత ప్రదక్షిణించుచున్ ౩౮౧

ఉ. కైకకునుం బ్రదక్షిణముగాఁ జన నాయమ మానకోపరే
ఖాకృతి విశ్వలాకృతియునై రఘుబాలుప్రదక్షిణంబునన్
గోకచెఱంగు రాఘవునకున్ గొనతాఁకెడునట్లు వీచి కో
పాకరమానసాంతరహృదంతరమందలి ప్రేమఁ జూపఁగాన్

గీ. అంత రాముఁడు మందహాసానవార
విందసుందరదర్శనావిష్కృతాంత
రుదితతీవ్రవ్రతాచరణోహఁ డమ్మ !
పూర్ణముగ దయయుంచుము పోయివత్తు

మ. అని యానందముచేత లక్ష్మణునితో నాడన్ సుమంత్రున్ వచిం
పను వారింగని వారిమోములు కుత్రిధాభావంబుచే నెఱ్ఱనై
యునికిం బల్కకపోవఁగాఁ దోడఁగె సర్వోత్సాహప్రపంచాతివ
ర్తనుఁడై రాముఁడు లక్ష్మణుండు వెనుకన్ రాఁ గోపియై చాపియై

శా. రాముండుం జనుచుండఁగా ధరణిభృత్ప్రాసాదజాలంబులన్
వామానేకనితాంతశోకమయరావంబుల్ వినన్ వచ్చె శ్రీ
రాముండున్ దనతండ్రికిన్ గలుగు భార్యల్ వేలనున్ దల్లిఁ దా
నేమాదిరిం గను నట్లె గాంచుటను వారెంతేని శోకింపఁగన్

గీ. రాముఁడును దల్లియంతిపురంబుఁ జేరి
తొలికవాటంబునన్ ముసలియుఁ బూజ్యుఁ
డైన ప్రతిహారి లేవఁగానైన లేక
లేవఁబోయినవాని శాలీనవదను

మ. కని తాతా ! మఱి నీవు లేవవలెనా ? కాకుత్స్థునిం జిన్నినా
టనుగోలెన్ దనయంకసీమ నునుపీటంజేసి కూర్చుండఁజే
సిన నీవున్ బళి! యంచు నాపి దయచేసెన్ లోనికిన్ దోడఁదో
డన తత్రత్యు లనేకసేవకులు వెంటన్ గౌరవం బూనఁగా

వ. వేదసంపన్నులు వృద్ధులుఁ బ్రాజ్ఞులభిసత్కృతులయిన బ్రాహ్మణులను ద్వితీయకక్ష్యయందును ద్వారరక్షణతత్పరలైన ముదుసలియవ్వలను బాలికలను సేమంబడుగఁబడినవారిని దృతీయకక్ష్యయందును గాంచి తల్లియున్న చోటికిఁబోయి నిశాజాగరరక్తనేత్రను బ్రాతర్విష్ణుపూజా

వ్రతధారిణివి వ్రతపరాయణతాసంతోషనదనారవిందను హుతాశన
జ్వాలాహవిర్హావయంత్రిం దల్లి నిదధ్యక్షతఘృతమోదకలాజమాల్య
పాయసకృసరసమిత్పూర్ణకుంభాదిసర్వహవిస్సంభారమధ్యస్థితమహా
లక్ష్మీదేవతాసదృశాకృతిని గాంచి నమస్కరించిన నామె

ఉ. ఆంచినప్రేమ రాఘవుని యాస్యమువంకన ఱెప్ప వేయకన్
జూచి మఱంత లేచి ప్రియసూనునిఁ గౌఁగిటికాఁచి జుత్తు మూఁ
జూచి శరీరమున్ నిమురుచాఁ ప్పునఁ జేతులు సాఁచి కన్నులం
దోఁచిన చెమ్మతోఁ బ్రియసుతున్ గనులందునఁ జూచి యిట్లనెన్

ఉ. నా పసితండ్రి! పూర్వమున నా పొనరించిన సద్వ్రతాళికిన్
రూపమ! పూర్వరాఘవులు రూపితధర్ములు దిగ్దిగంతర
వ్యాపితకీర్తులైన ఋషు లందిన తొల్లిఁటి ధర్మకీర్తులుం
జూపదుఁ గాక నీకు రఘుసింహమ! నీకు కులానురూపమై

గీ. అన్న మాటకుఁ బిసరు వెన్నాఁడనట్టి
నీదు జనకుని దర్శింపఁబోదుగాక
ఆయనయు నిన్ను యౌవరాజ్యంబునందుఁ
గృతవచస్కుఁడు సమభిషేకింపఁగలఁడు

శా. ప్రొద్దెక్కంజూమి యంతవేళకును బాబూ! సుంత యీ రత్నపుం
గద్దెన్ వెన్నను వాల్చి రంగపతికై చక్కర్యంబు నీ వోరెపు
మ్ముద్దన్, నీకుము దోసమంటదుసుమీ! మూఁజూచి పోవయ్య, నా
యొద్దన్ గొంచెముసేపు శాంతముగఁ గూర్చున్నట్లుగా నయ్యెడిన్

చ. తనవదనంబునందుఁ బినతల్లియుఁ గోరినకోర్కె దైన్యముం
జొనుపదు, మందహాసనవసుందరమంథర కాంతి చెక్కులం
దున విడిపోదు నిచ్చలు కనుంగొనుతల్లికి నెల్లెఱుంగనా
కనుకని పుత్త్రుఁడున్ సెలవుఁ గైకొన వచ్చె నటంచు నామెకున్

శా. అంతన్ రాముఁడు తల్లి యీ నెఱపు రాజ్యాశామహామోదంతపున్
సంతోసంబును గాంచి భీతిని మనస్సంచన్న వైరాగ్యవి
క్రాంతుల్ కొంతకుఁ గొంత రొమ్ము తిగిలఁగాఁ గన్మాసి యీదైన్యవృ
త్తాంతంబున్ మున్ముల్లోన నెంచమికిఁ జింతాక్రాంతి యుల్లంతగాన్

శా. అమ్మా! యింకను నీవు పూర్వపువిధంబై పల్కుచున్నావు రా
జ్యమ్ముం లేమను రాజదర్శనములే దత్యంతశోకము౧ంబుగాఁ
బొమ్మా! వే పమనాలుగేడులు వనంబుం జేరి యుండుమ రా
జ్యమ్ముం దా భరతుండు నేలు నను రాజాజ్ఞ విసంగాంచమిన్

క. నీవద్ద సెలవుగైకొని
పోవలె నని వచ్చినాఁడ భూవృత్రహు నా
జ్ఞా వైఖరి జా గోసను
నీ వింతకు ధైర్యమెల్ల నిలుపఁగవలయున్

మ. తనకుం జేరువగాఁగ నల్లధరణిన్ దా మేయుచున్నట్టి బి
డ్డను ద్రాగ్లంఘునవిస్ఫురజ్జ్వలపటిష్ఠంబై గో వ్యాఘ్రిమో
కనుచుండంగను వేసికొంచుఁ జనఁగాఁ గాల్గొదఁగా లేకపో
యిన లేటింబలె నామె తేల్చుఁ గనుదోయిం నుప్పకూలంబడెన్

క. వైరాగ్యనిష్ఠుఁ డయ్యును
శ్రీరాముఁడు మాతృదేవి క్షితి నొఱగుటచే
వేరాపు పొంది తల్లిని
గారాపుంబిడ్డవోలెఁ గౌఁగిటఁ బూనెన్

గీ. ఎత్తి పర్యంకమున్న మెత్తని సెజ్జపైఁ
జేర్చి యమ్మ! యింత సేగి యేల
పడె దటంచు నామె పాదాంబుజమ్ముల
నూను బాహుయుగము నొత్తుచుండు

వ. అంత రామాంకమ్మున సేదదేరి విరంగుళీయకము నల్పకంకణశాలిన
మైన హస్తద్వయమ్మున కొడుకుమేను బుణుమచుఁ గౌసల్యయిట్లనియె

గీ. బుడుతఁడా! నీవు కడుపునఁ బడకయున్న
నే సుఖంపడియుందు నోయూరు కుమార!
కష్టమైనను గాని సుఖాశ లేని
కష్టమైనను నిజము సుఖంబె యగును

ఉ. సంతును లేని చానకును సంతును లేదను టొక్కదుఃఖమే
సంతును గల్గు చానకును జక్కని నీయటువంటి బిడ్డయుఀ
గంతునివంటివాఁడును జగత్త్రయపాలన సొంపు లేదునుఀ
మంతిరి కాఁగలట్టేఁడు కుమారుఁడు కల్గిన వేయిదుఃఖముల్

గీ. భర్తరాజ్య మ్మది స్వరాజ్యపదవి కొడుకు
రాజ్య మది పరరాజ్య మఀ బ్రిధయుఁ గలను
అకట! మొదటిది విపరీతమయ్యె నాకు
రెండవది యిట్లుగా విపరీతమయ్యె

సీ. ఆయన వచ్చి తా నడుగఁగా దత్త
యీయమంచనుట యదేటిపాడి?
ఆ రీతిగా నీకు నప్పగారైనను
ననుఁ గష్టముల నాదుకొనఁగలేదు
నలుసంత బిడ్డ వున్నావు నీ తరమున
నైన సుఖంపడ నగునటంచుఁ
గట్టిన యీపట్టి గాలిమేడలు నేఁడు
గాలిమేడలుగాఁగఁ దేలిపోయె

నాది యేకాకిబ్రదుకయ్యె నాయనా! యొ
కొక్కజీవికి నిద్ద వొక్కబ్రదుకు
సీతఁ గొనివచ్చునప్పుడు చెప్పినావు
జ్ఞాపకం బున్నదిర సమజ్ఞానిధాన!

చ. విరిగినపాలకన్న సులువే యయిపోతిని మున్ను, నీవుగా
దొర వగుదన్న క్రొంబెరిమతో నొకతూఁకమువచ్చె, దానికిఀ
విరుగుడు పుట్టె నీవిటుల వెళ్ళిన రేపటఁ దోఁటకూరలోఁ
బురుగును దుల్పినట్లు దులుపుల్ పడనా! మతిభావనాయతీ!

గీ. ఈ రాజుకోట మునుపే
పాడాగత మంచు లేదు బాలక! నాకుఀ
నా రాముఁ డంచు లేఁడో
ఔరా! కౌసల్య యున్న దని యున్నదియూఁ?

గీ. పడగ పగ పాము చుట్ట మా పడతి కంచు
నదియు సంతోషపడితి మున్నదియు నేఁడు
మొదటఁ గాంచిన కాయలో ముషిణి ముషిణి
గాఁగఁ దెలియంగవచ్చినకరణి తోఁచె

ఉ. అక్కట నీ వియోగభరమంచును నేగతి నోర్చుదాన? నీ
చిక్కినమేన నోము లెవిచేసిన నిన్ మఱువంగవచ్చు? నీ
దిక్కఱు నేను నా జమునిదేశమునందును భాగమాదునో?
మొక్కడివాగ్ర చెప్పితివి యీ యసుఖాస్పదనైన తల్లికిన్

శా. నీ వున్నప్పుడె దిక్కులేమగద తండ్రీ! నాకు నీ వెచ్చటో
నే వైదేశికుఁడై చరించెదవొ? ఆ యే వేళనో! ప్రాణముల్
పో నీ మొండికి నప్పుడీ జనములుం బూజింతురా నన్ను? నీ
యా వేశం బాకఁడే విచిత్రముగునయ్యా! భావనాసంయమీ!

క. అని దీనకపోతింబలె
వనరుచు నున్నట్టి సాధ్విఁ బట్టపురాణిం
గని యింతకు బిగ్గంబ
ట్టిన కోపాగ్నికలును బ్రికటీకృతి పొందన్

క. సౌమిత్రి యందుకొని యా
ర్యా! మానవనాథునాజ్ఞ యగ్రజుఁ డిట్టుల్
తా మన్నించుట నాకును
నేమో యిష్టమ్ముకాద యెంతి తలఁచినన్

శా. మాకంటెన్ మఱి పెద్దవాఁడయిన రామస్వామి మొట్లనన్
త్మాకాంతుండది కాకతప్పదు, ప్రశస్యంబైన యా శీలమో!
యా కోదండమహోగ్రశిక్షణమొ! నాయందానొ? శత్రుఘ్ననం
దో? కాదా భరతుండు మాత్రము కలాఁడో? కాశ్యపీరక్షకై

క. తనతల్లి యందు జనకుని
కనితరమగు వలపు గలుగు టధికపుగుణమో?
మనుజేశుఁ డన్నఁ దేజ
స్సనాథుడును శీలి యగుట చనదే ప్రజకున్ 323

క. ఒక యాఁటదానిమాటకు
వికృతుండై రాజు వింతవింతలు సేయన్
చకితులయి యెల్లప్రజలును
నొక యేమియుఁ జేయ కూరకుండిరి ధాత్రిన్

శా. నాకున్ రాముఁడె దేవుఁ డాయన వనాంతం బేగ నేఁ జూడలే
నీ కోదండవినిర్గతాశుగములన్ హింసింతు నెవ్వండు కా
నీ కాదన్నను, గోసలావనిఁ గలం డెవ్వండు గాధేయశి
క్షాకాలంకషశస్త్రసంచలనప్రజ్ఞన్ దట్టుకోఁజాలఁగన్

శా. దక్షత్వంబున గుంపుగుంపులయి యీ ధాత్రీప్రజల్ కైకయీ
పక్షంబూనిన నొక్కయమ్ము విడలింపంజాలు నీ మూఁకలన్
కక్షన్ రా నెదురైనఁ దండ్రి యనువాక్యం బింతయున్ లేను లో
కక్షోభంబయినన్ సరే సకలశిక్షాతీవ్రతం బాల్చెదన్

చ. అనయము పండిపోనె మనయందును వారికిలేదు, వారి యం
దున మనకేల చెప్పు, భరతుండును దమ్ముఁడుకాఁడు నీకు నా
కును మఱికా దదేదియొ నిగూఢముగాఁగను నిన్నినాళ్లు లో
నను గుమిలించుకొన్న కపటంబులు నేఁటికి వెళ్లఁబెట్టఁగా

చ. కడకును నేటి వేళకును గాటికిఁ గాళ్లులు చాచువేళ నీ
యొడయఁడు కామరాక్షసికి నూరక యిట్టుల లొంగిపోయి యీ
పుడమి వెలంది మాళిపయిఁ బూజలు కల్గిన రత్నమండనం
బొడిచినఁ జూచుచుండి యెవఁ డూరకయుండును జాపహస్తుఁడై

క. ఒకకొలికికిఁ దెచ్చెద నీ
సకలావని సాధుసరణిఁ జననేరని తం
డ్రికిఁ దండ్రితనము లేదును
వికృతులయెడ బంధుతావివేచన మేలో?

ఉ. కండలు సేసి కాకులకు గ్రద్దలకున్ బడవైతు నీప్రభా
తండము నడ్డమైచనిన ధారణినాథుని వారిమంత్రులన్
గొండొక యూరకుండు, కయికొన్న ధనుస్సకలాగమాస్త్రభే
రుండత జీల్చి చించి పెనుప్రోవులు పెట్టెద శత్రుసంహతిన్ ౩౮౦

మ. అను సౌమిత్రివచస్సులన్ వినుచు నాశాంకాగదీప్తాస్యయై
యనెఁ గౌసల్యయు, లక్ష్మణుం డనిన వృత్తాంతంబు విన్నావుగా,
మనసుం దిష్టముగాఁగ నున్నయెడ నామాదిం బొనర్పంగదే
ననుఁ గైకేయికి నప్పగించి చను టెన్న న్నీకునుం బాడియే?

మ. రహి ధర్మిష్ఠుఁడవైన, ధర్మము నొనర్పం గోర్కియుం గల్గెనే
బహిరుగ్రిల్ రిపురాజికిన్ వదలిపోవన్ న్యాయమా తల్లినిన్
నహాకల్పంబగు నీబుజంబు విడిపోవన్ ధాత్రి యే రీతి సం
దహనోదగ్రశుచావిదీన యగు నేతద్రీతి నాకుం దగున్

మ. సోరిదిన్ గాశ్యపుఁడన్నవాఁడు తొలి శుశ్రూషించి తల్లిన్ గృహం
తరసీమం జనె దేవలోకములు, మంతవ్యంబగున్ ధర్మ మే
కరణిన్ నీజనకుండు నీ కగునొ! నిక్కం బాఁగతిన్ నేనునున్
బరమంబై చను శ్రద్ధఁ దల్లి పలుకుల్ పాలింపనానేకదా!

క. నీ వరిగిన నే బ్రదుకను
నీ వరుగుట యనుమతింప నేను ధరిత్రీ
సేవాజననీశుశ్రూ
షావేశము తెచ్చికొనుమురా! రఘుతిలకా!

క. అన రాముం డిట్లనియెన్
జననీ! నేఁ దండ్రిమాట జవదాటఁగ నో
పను గైకదోస మేమియుఁ
గనిపింపద యిందు ధరణికాంతునిమాటన్

చ. పుడమిని బ్రాపుకొన్నటుల భోగములన్నియుఁ బొందఁజూచుటల్
జడులగు కామచారులకు సాజము ధర్మ మెవండుగాని కో
రెడుఁ గడు నల్పసౌఖ్యవిధురీకృతచిత్తుఁడు, కండుమాని చా
ప్పడుఁ బితృవాక్యపాలనశుభంబును గోవధ మైనఁ జేయఁడే!

మ. మనపూర్వుల్ సగరాత్మజాతు లఖిలక్ష్మాఁ ద్రివ్వి భూమిస్థజం
తునికాయంబును గోట్లు లక్షలు మృతిన్ డొంగన్ విహారంబు చే
సినదెల్లన్ బితృవాక్యపాలనభుజాక్షేపంబె ధర్మేతరం
బని చెప్పన్ గలదే తదీయకృతి నూహాక్షేత్రపారమ్యమున్ ౩౮౨

మ. ఒక యే యూరును జేరులేనివగు దైత్యోద్రేకముల్ మాన్పి శూ
రకదంబంబునయందు శూరుఁ డను పేరన్ నేను జెల్లన్ గృపా
ప్రకటీభూతమనస్కుఁ డేలె! నను నంబా! జామదగ్న్యుండు నా
యకనున్ రేణుకఁ దల్లిఁ జంపెఁగదవే, యా తండ్రియానం బడిన్

గీ. ఇది పురాదేవసములైన ఋషులచేతఁ
జేయఁబడినది నే నల్లె చేయువాఁడ
నిది సనాతనధర్మంబ యిద్దిచేయఁ
దరతరమ్ముల కిద్ది యాదర్శకంబు

వ. అని సౌమిత్రిం గాంచి యిట్లనియె

క. నాయెడ నీకుం గలిగిన
ప్రేమోభావంబు నవధి పెట్టినయది సం
స్థాయధురావహము సదా
జేయము నీశౌర్యరేఖ క్షితి నెందైనన్

శా. నాతల్లిం గొంఅమాటలాడి కడుదైన్యం బందఁగాఁ జేసి తే
నీతిం గైకొని గాదిసూతికృత మానీతిన్ ద్వదేకాశ్రియం
బా? తీర్థంకరుఁడైన మౌని మును నా కందిచ్చె, నీ కిచ్చితిన్
జేతోమర్శముగాఁగఁ జూడు మదియుం జెల్లింతువా? యిచ్చటన్

మ. ఒకధర్మంబును నాశ్రయించి మఱియేదో తల్లియో తండ్రియో
చకితుండై చను బ్రాహ్మణుండో పలుకన్ జాపక్రియాదక్షుఁ డూ
రకపోఁ డీ ముప్పురందు నెవ్వరు సధర్మప్రక్రియం బల్కరే
నొక నెవ్వండును జేయ మిందలి రహస్యోదారతం జూడుమా!

ఉ. ఇంపగు నీమహత్త్వమును నెంచి వృథా జననీసుచారిత్రిం
బెంపకుమంచుఁ దల్లిఁగని పెద్దయు దుఃఖము మాని నన్నుఁ బం
పింపవె నాకు దీవనలు పెట్టవె? యీ పదునాలుగేండ్ల కే
కొంపలు మున్గెనా! తిరిగి కోసల మేగెద నింతలోపలన్

శా. సౌమిత్రింబడి నీవుచేసిన వచస్సంతాన మింతైన నీ
నేమంబున్ మతిశుద్ధియున్ సకలరాజ్ఞీత్వంబు యోగించునా?
ఆమోదింపుము మాటకున్ దిరుగుమా టందీకు మీ ధర్మము
ద్దామం బచ్చసనాతనంబు శుభసంధాదీప్రవపాత్రిలా! ౩౬౫

మ. అని సౌమిత్రిని గాంచి యొక్కరుఁడు బాహాశౌర్యదీప్తిం డయేఁ
వనధుల్ నాల్గిట నంపనిప్పు లురలింపన్ జూచుటే ధర్మమా?
తనశక్తిన్ గుదియించి ధర్మకలనాతాత్పర్యమార్గంబునం
దునసే పోవుట దేవతాపథము వేఱ్ఱోవల్ సురారాతికా

మ. తనకుం జియ్యయుఁబట్టి క్రూరమృగయూథం బమ్మ నాన్నంచు నే
రని దీ మానవలోక మా పగిదివారా? ధర్మమన్నట్టి చి
క్కని యా చక్కనివస్తు వెచ్చటనొ స్వర్గంబందునా కల్గు, నీ
కును నాకున్ మది సాధువైన యొడలన్ గూలంకషం బిచ్చటన్

క. పలుమంది బాహుబలశా
లులు కల్గిన యింత మనుజలోకంబున వి
హ్వాలులై బలహీనజనం
బుల విఱచుక తినుట లేదె ముగ్ధవిచారా!

ఉ. ఏ జనకుండునున్ ముసలియేన్ జనసత్త్వము లారియుండు వీ
రో జవసత్త్వముల్ కలిగియుందురు పుత్త్రులు యౌవనోదయ
శ్రీజయశాలులై, పితలు చేతికి గుప్పెడు కారు తెచ్చినన్
గాఁజరలట్లు వీరిలెదరు కాదె మఱేటికిఁ జేయ రా గతిన్

ఉ. తల్లియుఁ దండ్రితమ్ములును ధారణినాథుఁడు నన్నదెల్ల, నీ
యుల్లములోపలన్ గలుగు నూహలు భావసమాశ్రితంబు లీ
యెల్లయు ధర్మ మిద్ది యెవఁడేనియుఁ బాలన సేయు మానవుం
డల్లతఁ డొక్కఁడున్, పెఱజనావళి హావళి తెచ్చు రక్కసుల్

శా. ఈ సర్వంబగుధాత్రి పావనతనూహేలాప్రకాశాకృతిన్
భాసించుం బయి కంటె నిక్కమముగా భావస్థితంబెల్ల నీ
యాసల్ కోపము లాది భావములు కట్టా! క్షుత్పిపాసల్ ద్వయం
బే సర్వంబగు దైహికంబు కనుమా! యీ ధర్మ మేపాటిదో

ఉ. ఒక్కఁడు కామినీవశత నొక్కొకదోస మొకండు రాజ్యపుస్
మక్కువ నొక్కకల్మషము మానవుఁ డొక్కొకఁ డొక్క చెట్టకుం
జిక్కను ధర్మ మిప్పగిది సేగిఁబడున్ దనయొక్కయిష్టమే
చిక్కమ యన్నవారిబడి సెత్తురు లేఱులు పాఱె ధాత్రిపై    ౪౦

మ. కికురింపంబడె దొక్క-భావమున నీ కీ లెంచుమీ, సర్వభా
వకటాహంబును ధర్మమూదుకొన దైవారుక, మఱద్దాన వా
రక నీ చేయు సమస్తకార్యములు ధర్మప్రక్రియాదూరభా
వకముల్ గాఁదగదయ్య నైయ్యమున నావంకన్ విడంబింపఁగా

మ. అని తల్లింగని తల్లి! యింకయిన నీ యాజ్ఞానుమోదంబు చూ
పను బాలించవె యన్న నామెయు దురాపంబైన శోకంబు త
గ్గనిదై యెన్నియునైనఁ జెప్పు మవియుం గా వేను నీపోఁకయం
దనుమోదంబును జూపఁజాలఁ జనవద్దయ్యా! వనీవీథికిన్

శా. తల్లిన్ బెబ్బులి వేసికొంచుఁ జనఁగాఁ దా లేడిపిల్లైన నో
పిల్లండా! నినుఁబోలె నిర్దయముగా వీడంగఁబో దేమి ధ
ర్మోల్లాసంబులు పల్కెదట్లయిన నీయూరందు నాయక్కజల్
చెల్లెన్ నేనును వత్తు నీ చను వనీసీమల్ ప్రవేశింపఁగన్

చ. నను గయికొంచుఁబొమ్ము వని నా బరు వెంతటి దౌను నీకు, నే
ర్చినదగు గాధిసూనుఁడు రచించిన యస్త్రకళావిలాసమున్
జననికిఁగూడ రక్షణము సల్పఁగఁజాలనిదా! భుజింపఁగా
నొనరిన కందమూలముల నొక్కఁడు ముక్కయు నాకుఁ జాలు నే!

చ. జనములు నుల్కలం దఱుమ సామజముల్ తొలిదారి పూనిన
ట్లనయము నాత్మశోకప్రళయంబును బొందిన తల్లిఁ గౌఁగిటం
గొని రఘునాథుఁ డమ్మ! యిదిగో! యిది శోకము కూడదంచు ల
క్ష్మణునివెసం గనుంగొనుచుఁ గన్నుల దైన్యము చిమ్ముచుండగన్

క. నీ భక్తిపరాక్రమములు
నా భాగ్యపదంబు లెఱుఁగనా? తల్లి యెటుల్
క్షోభించెదు నీ వట్టులు
క్షోభపడుచు నన్ను నేల సురిగించెదవో?

చ. ముసలి గుఱుందు రాజు పిత పుట్టినకోపము మోదమో యెదో
మసలినభావమైన తనమాటను జేయుమనంగఁ బుత్రుఁడై
నసననపోవువాఁడు మనినన్ మనకున్నను నొక్కఁ జేసుమీ
కుసులు జనింపు ధర్మ మనుకొన్నపథం బాకఁ డాశ్రయించినన్

గీ. జనకునాన నేను జవదాటఁగా లేను
భర్త యొకఁడె సతికిఁ బరమగతియు
భూమిభర్త ప్రాణములతోడ నుండఁగా...
దల్లి నాకు వెంటఁ దరలు టెట్లు?

క. నీ కన్నులయెదుటన యి
ట్లే కాంతారముల కేగి యేతెంచెదనే
నాకున్ ధర్మాచరణ
పారత్రికఫల మబ్బ నేను ప్రతిబంధకమో!

మ. తొలిధర్మమ్మును జేయనెంచఁడును బుత్త్రుం డెవ్వఁడుం గాని యా
తొలిధర్మమ్మును చేయఁబూనుకొనఁగాఁ దూలింతురే తల్లిత
ములు రాజ్యం బొక కారణంబుఁగొని యీపుణ్యంబు వద్దోయగాఁ
దలఁపన్ జూచుచుఁ జూచుచున్ నుతి మహాధర్మంబు మ్రగ్గింతునో

చ. అని బలవంత మొప్పనలయట్టుల చూపకచూపినట్లు చే
సిన తనచేఁతయం దెడముసేయక తల్లిఁ బ్రదక్షిణించి ల
క్ష్మణునకు నప్పగించి చనఁగాఁ దనతల్లిని నెంచి యంత ల
క్ష్మణుఁ గనినంత నాతఁడు భుజంగమనిశ్వసనోగ్రమూర్తియై

గీ. ఉన్నఁ గాంచి నవ్వుచున్న మోమునఁ జేరి
చిబుకమందుఁ జిన్నిచేత నిమిరి
బుజముమీఁదఁ బ్రేమ పొంగారఁ జేవైచి
దగ్గరకును లాగి బిగ్గనొత్తి

ఉ. ఎవ్వనికోసమై జగమునెల్లను భస్మముసేయ నెంచెదో
యెవ్వఁడు నీ యెడందకును నెత్తగు ప్రేమపాలంబొ వాఁడు నే
నివ్వసుధాతలంబు వరియింప నటన్నను వేనికోసమై
చివ్వకుఁ జొత్తువోయి రఘుసింహమ! సింహము వట్టికోపియా?

శా. అన్యాయ్యంబు క్షమింపు మెంతయిన ధైర్యం బూనఁగానే వలెన్
సన్యాసం బెన నూనువానికయి యీ సంత్రాస మేలా? శుచా
దైన్యం బంచెన తల్లి నేను విడి యో తమ్ముండ! నీవున్ విడన్
శూన్యంబై చనునేని నాదరువు తచ్ఛోకంబు దుర్దాంతమౌ. ౭౧౬

ఉ. ఈవును నిట్టు లున్నవఁట కీమెను బట్టుకొనంగరాదు నీ
పై వెస నెల్లయాస నిడి వచ్చిన నన్నును నిట్లుచేసెదో
నీవు నెఱుంగు దింతయిన నే ననఁ దండ్రియుఁ దల్లులందు శో
కావృతిఁ జూడఁజాలనుగదా! యొకలేశముఁ జూడఁజాలనే

మ. అట నీవుంటివి తండ్రివైనస్థితి యెట్లైయున్న దా రీతి సం
కటమం దుండిన తండ్రియా మనకుఁ గాఁగా శత్రు వామాట యు
త్కటమే, కైక వధింతు నందువా? సముద్యత్తాటకోన్మాథ మి
ప్పటికిన్ నీ యెద నొవ్వపోదుగద యెప్పాటం బొనర్తా సనిన్

చ. సరి పినతల్లి నాగొడుల శత్రువటన్న నెవండు నమ్మురా
తిరి చని యామెతోఁ బలికితిన్ నను నాయను చూచినట్లు భా
సురలగుఁ దల్లులం దెవరుక్షమాతురు? నేననఁ జచ్చిపోవునే
సరిసరి యామె, యీ విలయసంగతి కాయను యెట్లు హేతువా?

శా. నీకం టెన్ మతిరెండు మెల్పులు ధనుర్నైతృతాధిక్యమున్
నా కున్నన్ బినతల్లి కైకయికదన్నా! చేసె, నీ శౌర్యమున్
నీకోపమ్మును, నీవు నా కగుటయున్ నేరంగనే పోవదా?
యాంకై కేయియు, నిట్లుచేసిన ద దేలా! యింత విజ్ఞాత్రియై

సీ. ఇద్ది యెవ్వరు చేయలే దెవరు చేసి
రందు దైవమ్మె చేసెఁ గృతాంతుఁ డన్న
నెంతటి బలీయుఁడో మహాఋషులుకూడ
నతనికిని లొంగిపోయిరటన్నఁ జూడు

శా. నీవున్ నేనును బోన బిడ్డలముగా నిల్చెందు నాతల్లి, యా
దేవిన్ గౌరవ మాభిజాత్యమును నీదృగ్దివ్యసంపత్తిదే.
భావంబందున నిట్టియూహ కలుగన్ బ్రారబ్ధ మీరీతి దా
దైవంబే సకలంబునందున సమర్థంబౌఁగదా చూచినన్

ఉ. ఊహకు నందనట్టిదియు యుర్విని దైవమటందు మింత సం
దేహము నన్నుఁగూర్చియును నిక్కపుఁదల్లినిఁగూర్చి యేటికిం
బోహాళమందు దైవ మను మొక్కలమై చను శక్తిగాశ, తా
నై హావణించు దైవమున కడ్డము నీవును నేన? చెప్పుమా! ౮౨౩

గీ. సౌఖ్యమును సేగి లాభనష్టములు భయము
క్రోధము భవంబు నభవము క్రూరమైన
దైవకర్మ లకస్మాత్కృతంబులును న
నూహితంబులు దైవంబునఁగ్రికృతులు

ఉ. ఇందలి యీ రహస్య మిది యేను నెఱుంగుదు లోన నందుచే
నందియు నింత పొందదు నిజంబుగ నాయెద, నీవు నావలెన్
జిందఁగఁ జేసి నొవ్వ నభిషేకముఖంబగు నూహ మాను నా
యందు మనఁగల్గు ప్రేమ కిది యప్పన సేయుము నొప్పు కాన్కగా

క. రాఁబోయెడు సంపద యె
ట్లోఁ బోయిన దానికోస మెన్వం డంధుం
డో బధిరుఁడో దిగులువడున్
రాఁబోకున్నను హృదంతరములో లేదే

మ. ఇది నా నిశ్చయ మింతఁ దల్లియును నీవేన్ దండ్రియున్ హేతుతా
పదముం బొందము, దైవ మెంతయుఁ గ్రుధాపర్యంతసమాప్తిట్లు నీ
విది మన్నింపుము నాదు నిశ్చయము నాయీ యౌవరాజ్యాశ దుః
ఖద మేలా తలపోసి దానినె సశంకావృత్తిఁ బోకారుటల్

క. తల్లిం గను శోకమ్రిచు
వల్లింబలెఁ బెనఁగొంచుఁ బడియెడు నీ వా
వెల్లితముగఁ దేర్చక నా
యుల్లమ్మును నిలువ దడుగు నొక్కం డిడఁగా

ఉ. బోనున నున్న మేఁతకయి పోయి తదాకృతివాగురాపరి
జ్ఞానభయంబు నడ్డుకొని శౌర్యముచూపఁగ వీలుకానమిన్
లోనన ఘూర్ణిలంబడుచు లోఁగిన బెబ్బులివోలె లక్ష్మణుం
డానతమైన మోమునఁ దదగ్రజవాక్యము లాలకించుచున్

శా. కన్నుల్ నిప్పులు రాల్ప నీకరణి వక్కాణింపఁ డెవ్వండు నీ
కన్నన్ వేఱొకఁడైన వాఁడు, గతశంకాస్థానమున్ గల్పనా
సన్నద్ధంబగు బుద్ధి ధర్మకలనాసంధానముం జేయుచున్
దన్నావేశముగొన్న యూహలను సందర్భించి వాక్రుచ్చుచున్

క. ఆ నీ చెప్పెడు దైవము
నేను వచించెద నశక్త మిది యని, యకటా
లేని పొలంబున నూరక
పూనించెదవేల దైవమును బట్టుకలన్

గీ. కమలనాళపు జాలకంబు మెత్త
నైన ధర్మోపథలు నీకునైనఁ దెలియు
నిట్లు చేయఁగవలె నని యిట్లు చేసి
నట్టివారికి శంకయటంచుఁ గలదె?

శా. ఈపన్నాగము మున్నె సన్నె యిపుడే నొంతేనియుం ద్రొత్తఁగాఁ
జూపింపన్ దొరకొందు గెల్లగతు నీ సుధాంతరంగంబు ని
శ్లేషంబంచు నెఱుంగనైతివొ, యాలింపుచుం బాలింపటం
చా పాపంబుల తేనికిం జూగను, నీ కా ముందరే పట్టమున్

గీ. ధర్మ మని సాకుఁగొంచు సధర్మకామ
వశుల వాక్యంబుపాలింపు వంకఁబోక
నాకును బరమాసహ్య మీ సామలఁబడి
యభినయించు చెప్పఁ గైతవవ్యాపృతు లన

గీ. ఎవ్వఁడో చేతఁగాని వాఁ డెవఁడో దైన
మంచు ముడిపెట్టుకొని జప మాచరించు,
శ్లాఘ్యవీర్యుఁడు ముసలమ్మసరణి జపము
చేసి తా స్వార్థదైవమ్ము హీనపఱచు

మ. అతిదైన్యాశ్యముచే నపౌరుషమతివ్యాఘాతి దైవాభిసం
హతులౌ వారికి నేఁడుగా నిజము నే నాదేశ మిత్తున్ నిరా
కృతి నా దైవము వింటికొప్పున విదారింతున్ జనౌఘంబు లౌ
హాతమా దైవముఁ జూచి తా మెఱుఁగఁగానాఁ బౌరుషం బెట్టిదో

శా. మున్నైక్ష్వాకులు ముగ్గఁబండి పనికిం బోనైరి రా జెప్పుడే
నిన్నుంబంపఁగఁ జూచు నాతలఁపుఁ బండింపింతు నా పౌరుషం
బెన్నన్ దైవము నొక్కగాటఁ జనగా నేతున్ ద్రిలోకీసమా
సన్నంబైన విపత్తు ముంపు విడిలింపన్ జాలుదున్ జూడుమీ ౩౭

వ. అని రామచంద్రుని వదనంబుఁజూచి నొచ్చుకొని

గీ. అన్న! నాకును లేదు రాజ్యాశ యన్న
నార! యెవ్వఁడు నగునొకో వీరభాజి
కౌశికుం డిచ్చినది చాపకళ త్రిలోకి
నాఁచఁగలిగినయది చేత నమరియుండ

శా. ఏలంజూడుము రాజ్యసాగరము న న్నేలయ్య బేల్వెట్ట? నే
వేలారూపమునంది నిల్చెదను నీ విస్ఫారకారుణ్య రే
ఖాలబ్ధంబగు గాంధిజాగతధనుఃకళ్యాణపాండిత్యముల్
నే లోభంపడెదన్ త్వదర్థమయి పండింపంగఁ జేమాకృతీ!

మ. అనినన్ రాముఁడు లక్ష్మణుం గవుఁగిటం బ్రాలంబబాహుద్వయిం
గొని నాతమ్ముఁడ! నీవునుం జనకుఁ గైకో! సత్యవాగ్భంగభీ
రునిఁ దాఁ జేతికి నందినట్టి కొడుకుం బోషింతకాఁడేని వృ
ద్ధునకుం దండ్రికి వాఁడు పుత్త్రుఁడును బుత్త్రుండా! కృతాంతుండగున్

వ. అనినఁ గౌసల్య రాముఁడెట్లు నడవికిఁ బోవువాఁడే యని నిశ్చయించి యిట్లు దుఃఖించె

గీ. లక్క కగ్గి చూపులాగున సుర సుర
లాడిపోవు నాదు నంతరమున
తరములేని సిరికిఁదానకంబగు తండ్రి
యుంఛవృత్తి పూని యుండు టెట్లు

శా. నో రెట్లాడెను బుద్ధి యెట్లుపొడమెన్ నూరైన కళ్యాణముల్
తా రాముం డొనగూర్చె నీకులములన్ ధాత్రీశు లన్నన్ గృపా
పారావారులు శక్తిహీనులపయిన్ బర్వన్ దదుద్వృత్తకృపా
ప్రారంభంబులు వార్ధియుం జవిటిపట్టంబట్టి పాఱుంగదా!

మ. క్షితిపై నెవ్వనివల్ల భీతియొ ప్రవాసింపంగఁ బంపింతు రా
యతనిన్ శూరుని రాజనీతికి నపేతాచారుఁ గూరక్రియా
న్వితు, నాబిడ్డ నిరంతశాంతమతి, వానిం బంపఁగా నేల? యీ
క్షితియెల్లం దమ కొక్కరే తినఁగనీ! కేలొడ్డఁడే యింతయుం దొరా?

సీ. ఓయి కూనా! కౌసలేయ! యీ యగ్ని యే
లా కుపులుచు నుండెరా కుమార!
నీ వింకఁ గనిపింప రావన్న గాలితో
సాఁగు దుఃఖపుటూహసమిధతోడ
నుసలు బాష్పము లన్న హుతమైన యాహుతి
తో విచారోగ్రధూమావిలముగ
నూర్పు లై కొనుటయు నుజ్జనంబును సేయ
నీక యీ మంట నాయెడఁద నెల్ల
వ్యాధికై వెజ్జు వేయు లేపనము బిగిసి
పట్టుకొన్నట్లు జిప్పన బాధపెట్టు
నోయి! నా రామచంద్ర! నీ వా యటవికి
నిట్లు చను, యమపురికి నే నిట్లు చనుదు

వ. అని భరింపరాని దుఃఖమగ్నయైన తల్లిని శ్రీరామచంద్రుండు
కౌఁగిలించుకొని కన్నీరు తుడిచి యోదార్చి

శా. అమ్మా! నీవును నేను నిద్దఱము గోత్రాధీశు వృద్ధుం బతిన్
సమ్మోహావిలచేతనున్ వదలి దిక్సాంయాత్రికత్వంబు మా
సొమ్మన్నన్, బినతల్లి మాటలబడిన్ క్షుణ్ణాత్ముఁడౌ రాజు జీ
వనమ్ముల్ వాయును వారి కాదరువు విల్వన్ నీవో నేనో వలెన్

ఆ. అనాలధన్మ ముంగనకును భర్త
సకలదైవతమ్ము సంపుటమ్ము
కొంచుకుచచ్చెనేని బడి తల్లి చచ్చునా?
భర్త చచ్చెనేని బడిన జన్మ

ఉ. ఆ పతి ప్రేమయుం గల్గఁడు నయ్యది లేదను సర్వజీవితా
శాపరిణామమూర్తి బతి సాధ్వి యొకర్తుక విడిపోవు సూ
త్సూత్రపతితంబులై వెలయు నన్యసుఖంబులు లౌకికంబులై
త్రోపుడువెట్టు ధార్మికపుత్రోవల నుండెనయేన్ బరాగముల్ దగుల్

ఆ. నీవు నిలువవలయు, నీవు శుశ్రూషింప
వలయు, భర్తకంటెఁ బరములేదు
ఇది సనాతనమ్ము నింతికి ధర్మమ్ము
సడలరాదు నాదు శాసనమ్ము

వ. అనుచున్న ప్రియగంభీరుఁడు మృదుశాసనుండగు కొడుకుం గాంచి తల్లి యిట్లనియె

గీ. కొడుక! నీతండ్రికిన్ భయంపడితి మున్ను
నీకు భయపడుచుంటిని నేఁడుగాని
మదికి నిష్టమ్ము లేని యొప్పుదల నీకు
నొసఁగుచుంటిని బోయిరావోయి తండ్రి!

శా. రాముం డంత వచించె నీవిధమునన్ రాజాజ్ఞ నీ కేమి నా
కేమీ, యెవ్వరికైన దాఁటనగునో? నేమంత చేదా? యసుల్
సౌమిత్రింబలెఁ జాపశిక్షణకళాచాతుర్యముం బూనుచో
భూమీశుండని లేదు, లేవును సతీపుత్రాదిసంబంధముల్

ఉ. ఈ పదునాలుగేండ్లు వని కేగి పితృప్రియ మూని వచ్చి నే
నాపయి నీదుమాట కెదురాడను నిక్కముగాఁగ నన్న, యో
నాపఁగరాక దుఃఖమును నాపగవోలె బహిష్కృతంబుగా
నో పసితండ్రి! కొంచుఁజనవోయి వనంబుల నన్ను నైతమున్

వ. అని పెద్దపెట్టునఁ బగులఁబడిన తల్లిం గాంచి

శా. అమ్మా! అమ్మ! యిదెల్ల మోహముగదమ్మా! చూడనుం జూడ దే
హమ్మున్ దేహము నంత దగ్గరివటమ్మా! మోహముం ధర్మమున్
గామ్మా! తొల్లటి దెంత బోలొ తుదిదో కొమ్మంత యాశైన రా
జ్యమ్మున్ వీడఁగ నేమి విప్లవము సంప్రాప్తించె నీ నేలకున్

చ. సవతులలోన నవ్వట చాలమిపుట్టుట యందు వేనియున్
సవతులలోపలన్ ధరణినాథునిపట్టపుదేవి వౌట మా
నవు గద నీవు నే వనమునం జనినంతన తోఁపరాని యొ
గ్గవు నదియో యనన్ భరతుఁ డంత యధర్మపురాజ పొల్చునా?

గీ. తల్లియు సుమిత్ర యెంత శాంతాత్మ యౌనొ
కొడుకు లక్ష్మణుఁ డంతటి కోపశాలి
తల్లి కైకయి యెంత సంతప్తమతియొ
భరతుఁ డంతటి శాంతస్వభావరాశి

క. నా మేలు గూర్చి వ్రతములు
నోములు పొనరింపు మింటనుఁ దేవత లా
నోముఁ ఫలములు వనిలో
నా మసలినయనసరంబునఁ బొసగింపఁ

మ. పతిసుశ్రూషయు మత్ప్రియాచరణముఁ బాలించు నీయూహలో
నితరంబుఁ జొర దింతలోన వనికిల్లే పోయి నే వచ్చెదఁ
వ్రతధారిఁ మృతియంటుకోదును ద్రయీవాక్యార్థసామర్థ్యమా
నితమైనఁ యముఁ డెట్టిఁడో నియమ మంతే, 'రెండు నొకటండగుఁ

వ. అనినఁ గౌసల్య యిట్లనియె

క. ఓ రామ! నీదు బుద్ధిని
వారింపను రాదటంచుఁ బావనజలముఁ
దేరం బనిచి స్పృశించి ద
యారాశి రచించె మంగళాశీర్వితతుల్

గీ. వెడలి శీఘ్రమ్ముగా రమ్ము వీరసింహా!
యే మహాధర్మపాలన కింత వసుఁడ
వీవొ యా మహాధర్మరతౌవిభూతి
నీదు నియమమ్ము ధృతి నంటి నిలుచుఁగాత

మధ్యాక్కర.

చని యే మహర్షుల యజ్ఞశాలల సవినయంబుగఁ
వినమచ్ఛిరుండవై నతులు వెట్టెదో వీరావతార!
వినతు లయ్యవి యే మహాస్సుప్రియములై వెడలు నా మహాసు
లవయంబు రక్షించుఁగాత మా త్రిధర్మారామ! నిన్ను

మ. మధ్యాక్కరలు.

అనపరాధపృషత్కుఁ డౌదువయ్య రామయ్య మాయయ్య
ముని గాధిసూతి యిచ్చినవి యుగ్రాస్త్రముల్ సర్వవేళ
లను మొక్కవోనట్టి స్వగణ లక్ష్యవేళాదీప్రము లయి
యనితరాభేద్యంబు లగుచు నతిశక్తియూఁగాక నీకు

పితృమాతృశుశ్రూష సత్యసుభృతయుఁ జేర్చి నీ సేయు
వ్రతముల ఫలము నీవెంటఁబడి కాఁచివచ్చునుగాక
సతము నీ విచ్చినచోటఁ జరియించు జంతుపతాంగ
వితతులు నీ విల్లు నీళ్ళు నీసరవెట్టవుగాక !

వేదముల్ సర్వదేవతలు వేళలు వేదాంగములును
ఆదిమహర్షులు తపము లైదగునట్టి భూతములు
నీదెసలందున నిల్చి నీదారి నిర్విఘ్నముగను
బ్రోఁదిసేసెదరుగాత పరిభూషితామోఘాచ్ఛధర్మ!

రక్షఃపిశాచసంతతులు క్రవ్యాదరౌద్రజంతువులు
పక్షివృశ్చికసర్పదంష్ట్రిపలలాదబహుసత్త్వపటలి
దీక్షితుం డైనట్టి నీవు దెస నైనఁ దేరిచూడంగ
దక్షముల్ గాకపోవుతను దశరథతనయ! శ్రీరామ!

వ. అని మఱియు ననేకానేకాశీస్సు లిచ్చి బ్రాహ్మణులచేత శ్రీరామ
చంద్రునిగమనము శివాధ్వమ్ముగా వేల్చి హవిశ్శేషమ్ము కొడుకుచేతఁ
దినిపించి బ్రాహ్మణులకు దక్షిణ లిచ్చి యిట్లనియె

సీ. వృత్రమృధావధి సుత్రామునడిసంబు
లో నంత తీక్ష్ణత దేనివలన
నమృతాహరణవేళ నా సుపర్ణునితెక్క
లో నంత తీవ్రత దేనివలన
మువ్విక్రమమ్ములు పోవు వామనదేవు
ధృతి నంత విస్తృతి దేనివలన
విధుసుధోత్పాదనవేళ నాదిత్య సు
త్రికి నంత విజయమ్ము దేనివలన

వరలెనో మాతృదేవిదీవనను దానిం
గొనుమురా తండ్రి! ఋతువులు వనధిచయము
ద్వీపములు వేదములు లోకవితతు లెల్ల
నో మహాబాహు! నీకు శుభోల్బణములు

ఖండాంతము

గీ. ఇద్ది యభిషేకమయ్యె! అహీనభూష!
హీనదోష! ముక్త్యాలమహీనపోష!
సంస్కృతాంధ్రసారస్వతసరసతావి
శేషశేముషీ శేరరసస్విన్న భాష.

చ. నిన్ మదిలోన నెంచుతటి నేనొక యోగిని నీవు నామన
స్సునం జొరరాని వేళం బురసూదన! నన్ను ను మించి పాలసుం
డని ధరనుండంబోనం డకటా వికటంబుగ నా త్రికాలవే
సినగతిం జేయంగా వలదు చిత్తము దేవరచిత్త మాపయిన్

వసంతతిలకము:

పారివారభూతఫణి! పాలితపారికాంతీ!
నీవారభుక్సమితినీరజబాలజూర్ణి
ఆవర్తితాఘుఘృణి! యాప్లుతలోక కాంక్షీ!
శ్రీ వేదవాక్ఫలనివృత్తిమనోవితీర్ణి! ౮౭౮



# ప్రస్థానఖండము

క. శ్రీ హైమభూమిభృత్క
న్యాహేలాశారదికవనాంతరహేళీ!
నీహారకిరణమౌళీ
సేహానిరాకగణశేముషీరింఛోళీ!

సీ. తలపైఁ గిరీటరత్నములకు మాఱుగాఁ
జల్లి యుంచిన యక్షతలవ్రజంబు
మొగముపైఁ గస్తురిబొట్టునకు మాఱుగా
నా తల్లి యిడిన విభూతిరేఖ
బాహువులను భుజబంధులు బదులుగా
దూలుచుండిన వ్రతతోరణంబు
నలికంబు నప్రధృష్యత్వంబు బదులుగా
శాంతసౌలభ్యప్రసన్నతయును

నొప్పఁ బార్శ్వచరులు తోఁపక వెల్లని
గొడుగులేక భర్త గున్నయందు
నుఱక పైని పొరగ నున్న దైన్యంబున
ననికిఁ జూచి చూచి జనకతనయ

ఉ. తెరలుచుఁ గొన్న దిగ్భ్రమయు దీఁగ బకాలున నవ్వి రాఘవా!
యురవడి నాయెదన్ మొదటినుండియు నీ యనుమాన మట్టులే
జరిగిన దట్టులే జరిగె సంగతపెట్టినయట్టి హేతుతా
స్ఫురణము మాత్రమే తెలియఁగఁ జూచెద, దాని ననుగ్రహింపవే!

గీ. అనిన దైన్యపుఁబొర దాని యంత నదియు
యరుగఁ బొట్టలు నవ్వగిం జంత నవ్వి
మఱల మొగమున బిగువు క్రమ్మంగ స్వామి
యేమి యనుమాన మది, యది యెట్లు జరిగె? ౪

క. ఆమాత్రేపు టనుమానము
నే మాత్రము నాకుఁ జెప్ప వేలా యనినన్
స్వామీ! మీతో నన్నియుఁ
బ్రేమాదికములె యటంచు వైదేహి కడున్

చ. భయపడి పల్కి రాఘవునిపాదములందు నమస్కరింపఁగా
నయమున రామచంద్రుఁడు మనంబునఁ బుట్టిన ప్రేమచేత వి
స్మయపడియుండు రేవయినచానలు నీవును దక్క నేటి కే
మయినది నాకుఁ బట్ట మనునట్టిది చూచితివా! వధూమణీ!

ఉ. తా నొకనాఁడు పిన్నపినతల్లి వరంబులు కోరె రెండు, భూ
జానియు వాని నప్పుడు నొసంగఁడు నామెయుఁ బుచ్చుకొనఁ దా
నే నయి యౌవరాజ్యపద మెక్కెడువేళను రెండు కోరికల్
కానను నేను బోవలయుఁ గావలె నా భరతుండు రాజుగా

చ. అది యిటులన్యో నం చనఁగ నామె యదే ననవచ్చినట్టుగా
మెదలిచి సన్నక్రీఁబెదవి మే లిది నాకును నేలయంచుఁ దా
మెదలక యున్న రాముఁడు నిమీలితనేత్రుఁడు చెప్పవచ్చిన
ట్టియును జెప్ప మేనును ఘటింపను వీలగు నేమొ చూచెదన్

చ. అని బలవంతపెట్టఁగ ధరాత్మజ, కోపమువచ్చు మీకు నై
నను నచియింపు నట్టిదయినన్ మతి యేమియు లేదటన్న, నుం
డె నయిన లేదటంచు, ప్రకటింపుము, కోపమురాదు నా కటం
చని పదిసార్లు కోర్కిపడినట్లుగ నాడిన వెంట నాడినన్

శా. ఈ యన్యాయము నింతచేసినను భూమీశుండు మీ రేల యు
ల్లే యున్నారలు లక్ష్మణుండయినను లేఁడా! భవచ్చాపసం
తో యోగ్యంబుగ నెల్లధాత్రి గెలువంగా లేరొ? యూహింపలే
దా యాకీతిగ? నెట్లు లోన్వఁగలరో! యాశ్చర్య మేపారెడిన్

ఉ. జానకి యిట్టులన్న రఘుచంద్రుఁడు కోపము తెచ్చుకొంచు నే
నైనను బిన్నతల్లి నిటులాడు మటంచును జెప్పినట్లు, తా
నైనను దల్లి యో యడిగినట్లును నీదగు నూహయా? యనన్
జానకి "చాలు నిట్టివి నిజంబుగఁ బెట్టకు స్వామి నాపయిన్ ౧౧

ఉ. కోపము రాదు చెప్పు మనఁ గొండొక చెప్పితి మాట చొప్పునన్
గోపము చూపరా దడవికోసల నిల్చుట యెన్ని యేండ్లనన్
దీపరిణద్ధసూరి సుదతీమణి యాస్యము వంకఁ జూచి త
న్వీ! పదునాలుగేండ్లనిన నిల్చిరి దంపతు లట్లు చూచుచున్

ఉ. అట్టులె చూచిచూచి యొకయంతకు నిద్దఱు నట్లె నవ్వుచున్
గట్టిన మీతలంపు లనఁగా జనకాత్మజ, రామచంద్రుఁడున్
గట్టిన నీతలంపు లివిగాని నిజంబుగ నేను సేయలే
దొట్టని తల్లి నద్ద సెలవొందియు దే చనుదెంచుచుంటినే

శా. సీతో నైతము చెప్పిపోవుటకుఁగాసీ వచ్చితి న్నాగ నా
నాతోఁ జెప్పగ నేల? నే నెవ్వరితో నాస్వామి! చెప్పన్ వలెన్
మీతల్లింగని మీరు చెప్పితిరి స్వామీ! నాకు లేదా భయం
బే తీర్థంబులు నే వనంబులును గా వెందేని నాతల్లియే!

క. అన రాముఁడు ఛీ! ఛీ! నీ
చనుదెంచుట కొప్పుకోను జానకి! నీ విం
దున నిలువుము నీవును వ
చ్చినఁ దల్లినిఁ జూచువారిఁ జెప్పు మెవరినో?

క. నావచ్చువఱకు జననీ
సేవాపరతంత్రి వగుము చెలువా! నా మా
టే వుండి సేవసేయు, న
సేవాదోషంబు నన్నుఁ జేరదుసువ్వే!

ఉ. నాసతి విప్రయోగదహనంబునఁ బైకిని గందరాని నీ
యాసనుగాంచి తల్లియును నాసనహించును కైక యావరా
భ్యాసము నెంచి కోపపడ మందఱు నావెనఁ గోర్కి నేరిదా
దోసము వారిదే యెవరిదోషఫలంబును వారిదే సుమీ!

ఉ. జానకి వాడికంటఁ బతిచాయను గన్గొని తల్లి సేవకై
నేనును నిల్వఁగావలయు నే? ననుఁజూచిన నోర్పువొందునా?
కానకు మీరుపోవుట నికామముగా స్మృతి తెచ్చుచుందునా?
యే నిను వీడ దుఃఖమ్మున నిద్దఱు గ్రుగ్గుట, యిప్పు డోర్తురే! ౧౮

శా. తల్లిం గూర్చి భయంబడేటికి సుమిత్రాదేవియుండంగ, సౌ
ఖ్యోల్లాసంబును దుఃఖదీనతయు లేకున్నట్టి యాదేవి మీ
తల్లిన్ బూర్వము నాదుకొన్నది, భవత్కాంతారవాసంబునం
దెల్లన్ దానయి యాదుకోఁగలదు నేనేలా తదారాధనన్

గీ. పతి ప్రవాసగతుండైనఁ బడతి యొక్క-
నీతిఁ బుట్టింటియందైన నిలువవచ్చు
నాడుబిడ్డల మఱఁదుల యత్తలందు
రామ! ప్రోషితపతికి గౌరవము లేదు

శా. ఈవృత్తాంత మదెప్పుడో తెలిసి తా నేమౌనో మాతండ్రి, నే
నే వారింటికిఁ బోయి నాముఖముగా నే మెల్ల వాక్రుత్తునా?
నీ వెచ్చోటికి బోదు వా పొలమునం దేఁ బోదు, వైదేహియున్
నీవెంటంబడి రాక నీకు బరువా? నిర్వ్యాధకౌతేయకా!

మ. అన రాముండును ధర్మమెద్ది యది చేయంగావలెన్ దండ్రిఁ ద
ల్లిని దుఃఖావిలసాగరోన్నతపృషల్లీనత్వముం బొందకుం
డను నిచ్చోటన నిల్చి సేవమెయి నుండన్ ధర్మ వింకెద్దియై
నను నా బుద్ధికి నీకు నిప్పటికిఁ గాంతా! ధర్మమవ్వింపదే

వ. అనిన జానకీదేవి యిట్లనియె

గీ. ఆదికాలధర్మ మంగనకును భర్త
సకలదైవతములసంపుటమ్ము
పడతి పరులవెన్నుబడి నగ్గిఁ జొరదు వి
శుద్ధి భర్తనుబడిఁ జొచ్చినట్లు

మ. తన వేదంబులుఫండియున్నమతిచేతన్ దొల్లి సావిత్రి భ
ర్తను వెన్నాడి పరేతరాజును బుగర్థస్తోమసంప్రీతుఁ జే
సిన యా పాలితభర్తృసంవ్రతము నా చిత్తంబునన్ హత్తియుం
డను శ్రీరాఘవ! నే వనంబులకు నేన్ నీవెంటనే వచ్చెదన్

చ. అనినను నవ్వి రాముఁడు మహావనవీథిఁ బరేతరాజు న
న్ననుఁ గొనిపోవఁ జాలయును జనకాత్మజ కూడ నన్నుఁ బ్రో
వనువలె నన్న, సీత రఘుబంధునిఁ జూచిన చూపువాడిమిన్
జనకతనూజఁ గౌఁగిలికిఁ జాచి రఘూద్వహుఁ డోర్వపుచ్చుచున్

శా. ఈమాత్రంబున కింత కోపపడ నీ వేలాగు కాంతారవీ
థీమార్గంబుల నాదుమాటలకు నాధింబొందెదో యన్న నో
స్వామీ! దండధరుండు నిన్నుఁ గొనిపోవన్ రాదరావద్దు స్వా
మీ! మాయామతి యేడఁ డా నన్నఁ గొనిపోనీ, వాఁడొ! యింకెవ్వఁడో

వ. అనిన శ్రీరామచంద్రుండు

శా. కోపంబేచుఁ దుషారరుజ్నదుకలాకోటీరుచేఁ గాలుఁ డే
యాపతింగనెనో మృకండుసుతుప్రాణాకర్షణప్రక్రియన్
నా ప్రాణంబగు నట్టి నీదెస నెలంతా! యాతఁ డా నెవ్వఁడే
నో పద్మాసన! యంతకంటెఁ బదిరెట్లొందున్ మహాపత్తులన్

ఉ. నా విని నవ్వి జానకియు నాప్రభు! మీ రట నేనిటన్ సరే
యే విలయంబొ నాకయిన నిచ్చట నచ్చట మీకెటుంగఁగా
నే విధిఁ గూడు నన్నుఁ బ్రభు నీ ప్రతివాక్యసమర్థతాతతో
ష్ణావుకచాతురీప్రతిభ లచ్చట సాగవు వే మహాటవిన్

మధ్యాక్కరలు.

వన మన్న బహుదోష మతివ! వనవాసవాంఛ యుజ్జనము
సేనరింపు, దుఃఖము వనము పొలతి! యింపులు సుఖంబులును
తనర వచ్చుట నెల్ల కొండదరులు బ్రద్దలగునె యొక్క
వనరాజు మృగరాజు నఱన, వల దోసి! వైదేహి! వలదు

నదులెల్ల క్రూరదంష్ట్రాసనాథగంధగ్రాహసమితి
చెదరి నీళ్లులు సుళ్ళుసుళ్ళు చేరఁగాఁ జిత్తంబు కలఁచు
పదమెత్తి యింకొకపదము పరిసరించుఁ బర్యంత మున్న
పద పద! క్రొత్తయాపదలె, వల దోసి వైదేహి వలదు.

కంఠగతప్రాణు లగుచుఁ గాంతారగమనంబు సేఁత
కుంఠితసర్వశక్తులయి కుటిలోగ్రకుం[illegible]
కంఠీరవవ్యాఘ్రము మయిన కానఁ బోఁగావలె తనర
వం తీవినగ్గదే యడవి, వలదోసి వైదేహి వలదు

ముఖారి—అట.

పండిర్వాలినయాకు లేరి ప్రక్కగాఁ బఱచిన సెజ్జ
పండు కాయ లభించు వీలుపడకున్నఁ బస్తుండు తిండి
గండుగాలులు బిట్టుకొట్ట గప్పుకోఁ గైదోయి ద్విపటి
పండినపాసమే యడవి, వలదోసి వైదేహి! వలదు

తలనూనెలకు మఱ్ఱిపాలు తనువునఁ దాల్చు వల్కలను
వెలిచెట్టు బెరడులు నిశల వెలుతురు వెల్లతారకలు
కలఁచుపానల నిల్చు నెలవు గండువృక్షముల మొదళ్ళు
వలసపోయెదునేల యడవి, వలదోసి వైదేహి! వలదు

చల్లగా నున్నదంచును బ్రశస్తకాసారనిమ్నగల
మొల్లమౌ నొడ్డుల నిదురపోదుమా భుజగరాజులును
మెల్లగా వచ్చి యానుకొని మెత్తగా మెత్త నిద్రించు
వల్లగా దీవా త్రిగిలఁగ వలదోసి వైదేహి! వలదు

ఎచటఁజూచిననైనఁ బాములే యింతవృశ్చికములును
ఎచటఁజూచిననైన దైత్యులే పైని ఋక్షాదిజంతు
లెచటఁబోయిన దారి తోఁచ దెచటఁబోయిన కాలు ముండ్లు
పచరించకే యిట్టికోర్కె, వలదోసి వైదేహి! వలదు

క. ఈ కష్టంబులలోఁ బా
టో కాంతా! దేవతలు తదూహాలు నచ్చల్
నీ కాంతారాగతి త
న్వీ! కైకకు మూఁడువరము లిచ్చినయట్లౌ

వ. అని పౌనఃపున్యమున వారితయైన జానకి

ఉ. ఈ వనముల్ ఫణినివసనేచ్ఛలు నంధలికష్టసంతతుల్
కావవి నాకుఁ (గో తల్లి ష) [illegible] మానివర్లు లెం
[illegible] వలపు హెచ్చగ విన్నవె మున్ను జ్ఞానసో
భా[illegible] భాగతు లాంతరసంధిమున్నతుల్ ౪౦
.... .... ....[illegible]
.... .... .... .... .... ....[illegible]

శా. అక్కాంతారము నీవు చెప్పిన విధంబైయున్న నో రామ! నీ
వాక్యం బుంజని యందునన్నిక్కిని నే నొప్పం బ్రభూ! నేను నీ
ప్రక్కన్ మేల్కనియుందు నీవు సుఖనిద్రం గాంచు మే తిండియుం
జిక్కంబోదను మప్డు నాకు గొడపైఁ జేర్పంగనా శీఘ్రముల్

ఉ. అయ్యెడలందుఁ గంటకితమై చను ద్రోవలఁ గాళ్ళక్రింద నా
పయ్యెద నొడ్డెదన్ బెడగ వచ్చిన ముండ్లను గ్రుచ్చుకొన్న నే
కయ్యలఁ గాలుజారినను గన్నుల వెచ్చని నీళ్ళ నద్ది నీ
తొయ్యలి బాధఁదీర్చి నడతూఁకువ సాగునుగాదె రాఘవా!

గీ. వానలోనఁ జరుము వల్లభ! గొడుగును
వదలిపోవునట్టి వానిగాని
నడవియందుఁ బోన నక్కటా! వాంఛింతు
తల్లి పిడపఁ దల్లిఁ దరుణి నపలి

ఉ. ఓప్రభు! యెందుఁగాని వినియుంటిమె క్రూరములైన సత్త్వముల్
దీప్రము లౌట మౌనిజనదివ్యమహాపవిత్రతపోవనా
వప్రములైన యా ఋషులపల్లెలనేన్ ఋషికల్పుఁడైన నీ
శ్రీప్రదమైన తేజము హరించు నసగ్థచయంబు లన్నిటన్

శా. నాకున్ మిక్కిలి కోర్కెయున్న దియుఁ గానానంబు దర్శింప నా
నేకంబుల్ మృగపక్షివృక్షభుజగానీకంబులున్ వన్యభా
వాకారంబులు చూడగానగున యీయందంబు గంభీరమౌ
ప్రాకామ్యంబులు చూచి చిత్తమున నే భాసంబు దీపించునో!

సీ. జీబులల్లిన వనసీమలోఁ బులుల సిం
గముల క్రాల్జాడలు గాంచినపుడు
కొండలపై నుండి కురిసెడు సెలయేళ్ళ
సోనజల్లుల వాఁక చూచినపుడు
అలపైని గొండకొమ్ములు తెల్లనుబ్బులు
క్రమ్మిపోవుడు వేళఁ గనినయప్పుడు
ఒక పెనుగాలి యుజ్ఝాత లూగించుచోఁ
గళవళంపడు కానఁ గాంచినపుడు

భీతిపుట్టినవైనను భీతిలోనఁ
బ్రీతి తెలియకయును విడంబించుఁగాదె
యచ్చముగఁ జడ్డవస్తు వీ యవనిఁ గలదె
మించి సర్వము సుఖదుఃఖమిశ్రితంబె

సీ. కలువపూమోము రాఘవ! నీవి వాడిన
చల్లనికరములఁ జూడఁగలను
తమ్మిపూవంటిపాదము నిది నొచ్చినఁ
దరణిబాష్పంబుల విరయఁగలను
సంపెఁగవోని నీ స్వాంతమ్ము గుఱుతించి
షట్పదదూరంబు సాగఁగలను
చేమంతివోని నీ చేతఃప్రసన్నత
శిశిరమంజులత స్పృశింపఁగలను
ఏట మున్గువానిని లేపనె తెఁబోవఁ
గాళ్ళకడ్డమ్ము తిరిగి రక్షకునిప్రాణ
ములకుఁ దెచ్చెడి యూఘనిపోల్కి గాను
తక్కనవి యూరు గాను సంస్థాస్వరూప!

వ. అనిన జానకీప్రార్థనా దైన్య యాథార్థ్యంబు లెడఁదకుఁ గొట్టి శ్రీరాముండు

చ. ధరణికుమారి! నీయెడఁద దైన్యము దక్కుము నేను రాజ్యపుం
బరువును దింపుకొంట పితృబద్ధమహార్థము ప్రయ్యకున్కికిన్
హరుసమురూప! నీవు బరువా? తొలినాఁడు వశిష్ఠశ్రీపదాం
బురుహసమర్చ్య వేదశిఖ ముట్టిననాఁడును బర్వు లేవుసూ

ఉ. నీ విట నున్న నాకును వనీచరణంబున నిన్నుఁ గూర్చి యే
దో విలయంపుశంకయును దోడ మనోగతబాధ తప్పదున్
నీ వరుదేర మార్గమున నీ పదబాధకు బాధ తప్పదున్
దీవిధి రెండుబాధలను దేనిని నన్ గ్రహియింపు మందువే?

గీ. అనిన మైథిలి మొదటిది యైన నగుచు
రెండవది బాధకాదు దూరీకృతాఘ!
నిన్ను వెన్నాడి చను నాకు సేవగ యని
కలిగినంగద! బాధయుఁ గలుగు నీకు ౧౫

సీ. చిఱుగాలిపోరధూళి చెమ్మటజిగి నద్ది
యందమౌ మైపూఁత ననుసరించు
తైలసంస్కృతిరహితమ్ములు ముంగురు
లభ్యంజనానంతరార్ద్రములగు
పచ్చికబయళులఁ బండియుండుట రత్న
కంబళాసీనతాకాంతి తెచ్చు
నటవీఝరీనీర మారుట నారికే
ళాంబువుల్ ద్రావినయట్లు పోలుచు
ప్రభు! భవత్సన్నిధానసంభావనాని
రంతపులకితదేహను రాను! నాకు
నాకలియు దప్పి తోఁచునా! యన్యబాధ
లింకఁ బ్రాణులకున్ ధర నేమి కలవు?

క. వనుఁ గొనిపోకుండిన నీ
వనస్థలమునుండి తిరిగివచ్చినవేళన్
జనకసుతార్థము వెదకుచుఁ
జనెదవు కౌబేరమగు దిశావీథులలో

మ. అని బాష్పప్రళయో[1]దగ్రదృష్టి యయి సద్యఃప్రాణనిర్యాసనా
జనితాశంకము గాఁగ నున్న ధరణీజాతం గవుంగిటఁ బూ
నిన శ్రీరాముఁడు జానకీనయనకాంతిన్ సద్యఉద్భూతన
లనమౌ ప్రాణనితాంతశక్తిఁ దొలుకన్ గాంచెన్ ద్విధాభాప్రదై

శా. ఓసీ! ఓసీ! లతాంగి! నాదు కొనవ్రేలుద్వాహవేళన్ గృతా
భ్యాసస్పర్శగఁ బూనువేళకునె నాప్రాణంబు నీప్రాణముల్
సీసంబై యొకపోఁతగాఁ గరఁగెఁబో ఛేదింపఁ డంకంబు లే
దే సీతా! త్రిదివంబుకూడ వెలలేదే! నాకు నీ వున్నచో

శా. ఈకాంతారము లేలపోయెదన తన్వీ! కష్టపెట్టంగ ని
న్నాకుంబిందెను దండ్రిమాట మృషయౌ నన్నట్టి భీ చేతనే
గా కిచ్చోటను ధర్మనిష్ఠుఁడను నే నావంత ధర్మచ్యుతిం
గైకోఁజాలను సీతతో నడవిదాఁకంబోదు ధర్మార్థమై ౪౬

---

1. ఉదగ్రము - అడవిపిల్లి.

క. అస్వాధీనము దైవమ
హా! స్వాధీనుండు తండ్రి యుజ్జనమున వేఁ
డో స్వాంతవ్యభిచరణాధు
రాస్విన్నుఁడు వ్యర్థచారి ప్రారంభించున్

గీ. తండ్రిమాట యారాధించు తనయునకును
నల త్రిలోకీగతంబు భయంబు లేదు
దానమానయజ్ఞమ్ములు దక్షిణలును
బితృసమారాధనకు బోల్పఁబెట్టలేరు

సీ. నెలఁది! మాతాపితృపరాయణులకు స్వర్గ
లోకగోలోకములు బ్రహ్మలోకమైనఁ
గృచ్ఛ్రములు గావుసూవె తృప్తులవెంటఁ
దల్లి తండ్రులవెంట సాధ్యము త్రిలోకి

శా. నీకష్టంబులకైన నోర్వఁగానెదన్ నీరంధ్రకాంతానవీ
థీ[1]కైదర్యవిశాలపత్రముల నిద్రింపంగ నిద్రింపనా
గాకిచ్చోటన నేను జన్న త్రుటిలోఁగాఁ బ్రాణనిష్కాసనో
గ్రాకారంబున నున్న నిన్ను విడువంగాఁ జాలనే నుత్ప్రియా!

శా. నావెంటన్ జనకాత్మజాత కలదో, నారాచమార్గంబునన్
నావింటం దగు సూఁడునహ్నులును గాంతారవ్యథాక్లేశముల్
పూవుందాకులు నాకు, భూమితనయాపున్నాగపుష్పాభదై
ఖ్యావృత్తిం గను నేత్రకాంతి వెలుఁగుం గన్పించు నా త్రోవలో

వ. అని పలుకుచున్న ప్రాణపతికౌఁగిలింత మెల్ల సడలించుకొని జానకీదేవి ప్రస్థానానుకూల సర్వధననిచయదానక్రియాప్రసక్త మానస యయ్యె

ఉ. అంతనుమున్న దీనుఁడయి యచ్చటఁ జేరిన లక్ష్మణుండు సీ
మంతిని సీతతోడ వనమండలి పోయెడురీతిఁ గాంచి యా
క్రాంతనితాంతదుఃఖపుభరంబున మాన్పడి యానుకాదు నా
నింతయు నేరరాక యెద యెంతయు బర్వను తేలికై చనన్. ౬౩

[1] కైదర్యము = ఓటచెట్టు.

ఉ. అన్నకు దోయిలించి ప్రభువా! ననుసైత మనుగ్రహింపు మీ
వెన్నున నత్తు మీ నిదుర వేళల మేల్కను వేళలందునన్
గన్నుల నత్తు లుంచుకొని కాంచెదఁ జూచెద సర్వసౌఖ్యముల్
నన్నను గొంచుఁ జన్న రఘునందన! మీకును గాసియుండదున్

ఆ. పరమభక్తు లయినవారల యెడఁదలో
నమరులకును భద్రమైనయట్లు
నెడఁదతోడ దేహమెల్ల నాయది మీ య
ధీన మధికభద్రతానిధాన!

శా. అన్నా! పొత్తులలోనఁ గూడఁ బసిపాపై యుండునప్పైననున్
నిన్నుంబాసి మఱొక్కచో నిదుర పోనేపోనటా నన్ను నీ
విన్నుం బాయఁగఁ జేయకే మసృణచాంద్రీవాహినీసత్కృపా
సన్నద్ధాంశుమనోజ్ఞ నేత్రయుగళా! సద్భ్రాతృభావోన్నతా!

మ. అనయంబున్ బెదతల్లి పోల్కికివికాదా జానకీదేవి నం
తునకున్ విన్పడిరాఁగ నేమి ప్రతిపత్తుల్ చెప్పెదన్ నీకు నై
నను గొంపో నొకతల్లిగర్భముననైనం బుట్టలేదోయి నా
తనధర్మాచరణప్రవర్తక! సుమిత్రాపుత్రప్రాణాధికా!

క. మీముందు నడచుచున్నను
నేమూల ననర్థచయము లింతయు ముట్టం
గా మిమ్ము వెలుచు శిక్షా
సామగ్రిన్ సేవచేతుఁ జాపాంతమునన్

మ. ప్రతిషేధోక్తుల కున్ముఖత్వమును సంపాదింపకే హేతుసం
గతియేదో యొకయిష్టకల్పనము ప్రేక్షా[1]చాతురీవశ్య మా
నతులా మాదృశభక్తపాలనము చింతాదూర ముద్వేగసం
గతిగాఢాగతమా నిమేషకృతి మేఘశ్యామలాంగచ్ఛవీ!

శా. తల్లిం గోసలరాజపుత్త్రిక సుమిత్రాదేవి రక్షింపనుం
జెల్లున్ నా కన, వేయిమందిదగు గాసిం దీర్చి రక్షింప భా ౨౦

1 శిక్షా-బుద్ధి

స్వల్లీలాకృతు లామెలిద్దఱు సహస్రగ్రామసంభూతసం
పల్లీలాకృతు లామెలిద్దఱు, వనంబా కాదు సాకేతముల్

ఉ. అమ్మలు బెగ్గిలన్ భరతుఁడంతయధర్మపురాజ ! నీకునా
నమ్మకమేమొ యున్నయది నాకును నాభరతుండు విప్రతీ
పమ్ముగఁ జేసెనేన్ దిరిగివచ్చిననాటికి నమ్మలేదునుం
దమ్ముఁడులేఁడు సాయకపథమ్ముల మృత్యువు తాండవించెడున్

క. ప్రిత్యాకుమ బంధుత య
ప్రిత్యాకుమ స్నిగ్ధమైనభావమ్ము వనీ
గత్యనుమతి బలవత్తర
మత్యుత్తమమైత్రిభావనాంభోరాశీ !

ఉ. అత్తఱి గాధిసూతిదయ యాపగయై ప్రవహించువేళ నే
మెత్తని యూహతో వ్రకు నిమిత్తముచేసితొ యస్త్రదాన మా
మెత్తనియూహ కిప్పుడు నిమిత్తముసేయుము నాదురాక, లో
కోత్తరధర్మమార్గచరణోజ్జ్వలధీపరిపూతభాననా !

వ. అనిన శ్రీరామచంద్రుండు తమ్మునిఁ బ్రేమగన్నులతోఁ గవుఁగి
లించుకొని

గీ. అమ్మతోఁజెప్పి నీభార్య ననుమతింపఁ
జేసి రావోయి సౌమిత్రి, సీతవోలె
నూర్మిళయు వత్తు నన్న నే నొప్పికోను
పురము పురమెల్లఁ గదలిపోవుదుమె కుత్తు!

వ. జనకునిమహాయజ్ఞంబున వరుణదత్తంబులు రౌద్రదర్శనంబులు
ధనుస్సులును నభేద్యకవచంబులును నక్షయతూణీరంబునుహరాన్న
పిడులుగలవియు సూర్యవిమలములు ఖడ్గములును రెండు
రెండు గొనిరమ్ము, నీకోస మిందె యుండెద నన, లక్ష్మణుం డిదిగో
వచ్చితి ననిపోయి యామె యంతఃపురంబునఁ దల్లింగానక కౌసల్య
యిండ్లకుఁ బోయిరని పరిచారికలు చెప్ప విని సంశయించి కౌసల్య
గృహంబులకు మెల్లన నేగి యచ్చటఁ దల్లులకు నమస్కరించి
నిల్చుండినఁ గౌసల్య యిట్లనియె 

క. ఏమోయీ! నాయన మీా
రామునిబడి నీవు నటవిరాజ్యము పోవం
గా మము వీడఁ దలంచితె?
నీ మోమది క్రొత్తపోల్కి నెగడెదుఁ గుఱ్ఱా!

క. మ మ్మేమి చేసిపోదురు
తమ్ముఁడు నన్నయును నొక్కదారిమనస్సుల్
మిమ్ముఁ గా మాకడుపులఁ బడఁ
బమ్మిన బమ్మకు నెఱుంగఁబడనలె నెల్లన్

చ. అనిన సుమిత్ర యిట్లనియె నక్కడ రాముని గాన కేగుటల్
తనవరయుగ్మమం దొకఁడు తా పొనరించిన కైక దానిలో
నన మఱి మూఁడు కోరినది నాకొడు కింకొకరుండు సీత మూఁ
డనునది, రాజనీతినిశితాధృతి యాయమకున్ స్వభావమే

చ. ఇతఁడును రామభద్రుఁడును నెప్పుడు నిద్దఱుకారు, వారిలో
నితఁ డిటనున్న రాముఁడును నిచ్చటనున్నటులే, నరాబు ని
ర్గతఫల మెట్టులో నితఁడు రామునియంతటిచాపశీలి యా
సతి నినుఁబోలె నేవిషయచర్చయు మాలినదా? నిజంబుగన్

క. కడుకొని యిద్దఱు మిద్దఱఁ
గడుపునఁ గనువఱకె వీరు కానకు బిడ్డల్
కొడుకా! చనిరావోయీ!
యుడుగు మనుట యెట్లు నీవు నుడుగుట యెట్టుల్

వ. కౌసల్యాదేవి శ్రీరామభద్రున కెన్ని మంగళాశీస్సులు చేసె నాని
నన్నింట నీవును సీతయు భాగస్వాము లన్నఁ గౌసల్య,

ఆ. సీతకూడఁ జనునె సీత బ్రహ్మజ్ఞాని
జనకరాజపుత్త్రి సర్వమృదువు
నామెయొడలు నోర్చునా యింతకష్టమ్ము
చెట్ట యెంత నేను జేసినానో?

వ. అని మూర్ఛాగతయై సుమిత్ర శుశ్రూషింప మేల్కని యిట్లనియె

ఆ. సీత వచ్చు ననుచుఁ జెప్పలేదే నాకు
రాఘవుండుకూడ రాచనిసువె;
గూఢరాజకార్యగోపనంబులఁ దల్లు
లైన ధరణిపతుల కకట! వెలియె

క. అన లక్ష్మణుండు తల్లీ!
వినుఁ జూడఁగ వచ్చువఱకు నిజముగ తాన్మజా
తను గాంచలేద యాయన
జనకజ యాపైని రామచంద్రుని నడిగెన్

క. అటము స్నేహమైనదొ నే
నటకుం జనినప్పు డామె యాసన్నమృతి
స్ఫుటమూర్తి యగుట యాయమ
యటవీగతి కొప్పికొనుట యన్నయు జరిగెన్

వ. అనినఁ గౌసల్యా శోకాలాపసమ్మిశ్రితవధూప్రశంసాముఖ యయినఁ దటివేచి లక్ష్మణుం డిద్దఱతల్లుల చరణాభివందన మాచరించి సెలవుఁ గైకొనిపోవువేళ సుమిత్రి

గీ. సుతునివంకను నొకచూపు జూచెఁ గొడుకు
తల్లిచూపును నెడఁద భద్రమ్ముపఱుప
నొక్క-యనుమతి యొకదైన్య మొక ప్రశంస
సున్నితంబుగఁ దోఁచె నాచూపునందు

వ. అంత సౌమిత్రి యూర్మిళాభవనంబుల కేగి

చ. తన యస్పృగధ్వముల్ పరిచితంబులు పావనముల్ వ్యపేతకా
మనములు సంచితేంద్రియసమాజములౌ నొక సాధువాహినీ
వినమితమైన సంచలనవీచికలం జన నూర్మిళాగృహం
బునఁ దనభర్తృభావమును బొందియుఁ బొందకయుండె నచ్చటన్

ఉ. ఊర్మిళయున్న-చోటు నొకయుగ్మలి చెప్పఁగ లక్ష్మణుండు నా
ధర్మగృహంబుఁ జేరి యట భార్య నిమీలితనేత్రయై మృగీ
చర్మమునందు నున్కి-గని చానయు వెంటనె కన్నువిచ్చి హా
సార్మిపవిత్రనేత్రి యయి యుత్సవభావము గోచరింపఁగా

ఉ. లేచి సమర్ఘ్యపాద్యవిమలీకృతవారి శిరోగ్రవీధికన్
రాచి సమీపధాత్రిని గరంబులు మోడ్చి గృహీతభక్తి రే
ఖాచరమాకృతిన్ నిలువఁగాఁ బతి యిట్లని నోసి యోగినీ!
యాచితభారమైనయది యంతయు నైనది యెంతచెప్పితో

క. కైకమ్మ వరము కోరెను
శ్రీకాంతుఁడు వనములందుఁ జేరనె కోరెన్
భూకాంతాసుతయును దా
నై కాంతారము పోవనై యాసించెన్

శా. నేనుం బోవ్రుమనుంటినే యడవికిన్ నీ విట్లు లా నన్నదే
చానా! యక్షరశఃస్వలాకృతిఁ గనెన్ సౌమిత్రి కాంతారవీ
థీనై స్త్రీంశకతాస్వరూప మిఁక నాదేశింపు, నే నింక ల
క్ష్మీనారాయణసేవ యేపగిదిగాఁ జేయంగ నా నూర్మిళా!

గీ. చెలువ యూర్మిళ మఱల నాసీనయయ్యె
మఱలఁ జొచ్చెను బూర్ణ సమాధిలోనఁ
గూరుచున్నట్టి సౌమిత్రి కూరుచుండి
యున్నట్లుయుండియే తన రెుుడలు మఱచె

మ. ఉరకన్ జ్ఞానపథంబులన్ దిరిగ నేవో నూత్న నిర్మాణమై
ఖరిఁ గాంతారమునందు లక్ష్మణుఁడు రాకాజ్యోత్స్నలో నూరకే
తిరుగన్ వెంటనురా బలాతిబల లాదేశించు గాధేయస
త్కరుణామూర్తులు క్షుత్పిపాసలను నిద్రాదేవి శాసించుచున్

క. ఆ దేవత లిద్దఱు ని
ద్రాదేవిని గినురువెట్టి తద్రక్షితుఁడౌ
నే దీప్రమూరినో యవ
సాదించిరి తోడియస్త్రశక్తులబలిమిన్

ఆ. అంత నొడలు తెలిసె నాతని కూర్మిళ
కనులు తెఱచె నామె సనిమె భర్త
మొదలు తెలిసెఁగాని తుది నెఱుంగ నసంగ
నోయి స్వామి యంచు నూర్మిళయును

ఉ. యోగిజనౌఘసంసదుదితోజ్జ్వలసత్ప్రథమావతార! నీ
యీ గురుసత్కృపాకలిత నే నొక చెప్పెదుదానినా యనన్
సాఁగిన పిన్ననవ్వులపిసాళితనంబున లక్ష్మణుండు నే
నేగెద నంచు లేచె హరిణేక్షణ భర్తృపదంబు ముట్టుచున్

క. నీ విచ్చిన సత్కరుణా
శ్రీవైభవ మొప్ప నీదుచిత్తమునందే
నే వెలయుచుందు నిత్యము
భావస్థిర విప్రయోగపద్ధతిఁ గను నే?

ఉ. లేమయు భర్తయున్ గవుఁగిలించి రొకళ్ళ నొకళ్ళు బాహులన్
శ్రీమృదుదేహవల్లులు స్పృశించిరి నవ్వులు నవ్వ నచ్చముల్
కామన లేద యున్నదియుఁగానలెఁ జత్రిము కన్న యోగులౌ
నే మహితాత్ము లా ప్రభువు లీ గతి నంటియు నంట నన్నటుల్

వ. అంత

సీ. ఆయసవల్లిమాలాన్యోన్యసంక్లిష్ట
ఘటనాపటిష్ఠమౌఁ గవచ మొప్ప
లేలిహానాననాలీఢజిహ్వామహా
ఘోరసబాణతూణీర మొప్ప
పార్శ్వబంధితమృత్యుబద్ధభ్రుకుటితీక్ష్ణ
చండోగ్రచంద్రహాసంబు మెఱయ
పీనోన్నతాంసాగ్రపీఠికాగాఢప
రిష్వక్త కోదండరీతి మెసఁగ
చేత వేఱ యొక్కొక్క కౌక్షేయకంబు
కవచకోదండ తూణీరకములు వెలయ
నొక్కగుఱ్ఱము నెక్కి యింకొక్కదాని
కళ్ళెమును బూని తెచ్చెడుఁ గరణి వచ్చి

క. సౌమిత్రి యన్నవదినెల
ప్రేమామృతమధురదృష్టివీచీకోలా
సామోదమూర్తి తత్పద
తామరసంబులకు మ్రొక్కి దయ వీక్షింపన్ ౧౦౪

గీ. రాముఁ డిట్లనె నా ధనరత్నములును
సంపదయు బ్రాహ్మణుల దానసంచయంబు
సేయ బహ్వాశ్రితుల కీయఁ జిత్తమందుఁ
దలఁచుచుంటిని వనికి వెలలకమున్న

క. మన నే నిమ్మ సుయజ్ఞుఁడు
మునిలోకేశ్వరు వశిష్ఠపుత్రుం డార్యుం
డను బ్రాహ్మణోత్తముఁడు వేఁ
జని యాతనిఁ దోడితెమ్ము సద్భక్తి మెయిన్

ఉ. అనిన లక్ష్మణుండు చని యగ్నిహోత్రగృ
హంబునందుఁ గని సుయజ్ఞు మ్రొక్కి
యోయిసఖుఁడ! యన్నయును బిల్చుచున్నాఁడు
నెట్టు లున్న నిన్ను నట్టు లరుగ

క. విన్నావా! లేదో తన
యన్నను నీ యనుఁగునేస్త మరిగెదరు వనీ
సన్నద్ధు లగుచు నిను ర
మ్మన్నా రప్పగించి యఖిలము చనఁగా

వ. అనిన నజ్ఞాతవృత్తాంతు నాశ్చర్యశబలితవదను ననుగమింతు సుయజ్ఞు
మధ్యేమార్గంబున నెఱింగించుకొంచు వచ్చిన

గీ. అతని మొగమున నాత్మశోకాంబుపూర్ణ
మైత్రిభాండమ్ము పగిలెడు మాదిరిగాఁగ
నున్న రాముఁడు మందహాసార్మికలను
బరువు వారించి భాండమ్ము భద్రపఱచె

క. సీతోఁ జదివితి మఱియును
సీతో నాడితిని నీవు నాకును దేహా
తీత మైత్ర్యము నావియు
సీతవి సంపదలు నిన్నుఁ జెందుట వలయున్

వ. అని నిరుద్ధబాష్పక్లిశ్యమానకాతివదనునందు సుయజ్ఞునందు ౧౧౩

సీ. హారాంగదములు కేయూరము లూర్మికల్
మెల్లన మిత్రునిమేనఁ బెట్టి
సీతయొడ్డాణంబు చేతివ్రేళ్ళులమధ్య
దూర్చి యియ్యది నీకు తొయ్యలికని
పరిభోగసాక్షి యీ పర్యంక మిద్ది యా
స్మకీన మిద్ది యా స్తరణపీఠ
మివి బహురత్నసంభవములు నీ సర
మ్మని చూపి యాతని కప్పగించి

రాముఁ డిట్లనియె సుయజ్ఞుఁడా! మదీయ
మైన శత్రుంజయమ్ము మహాగజమ్ము
మఱి సహస్రగజంబులు మామకీన
ములకు నీ వధికారి వీ పూటనుండి

గీ. అనఁ బెగుల్బుక యేదో మాటాడఁబోవు
సఖున కెడ మీయకుండ లక్ష్మణునిఁగాంచి
నీ వగస్త్యుని కౌశికు నెమ్మిఁ దెమ్ము
తనపురంబునఁ బ్రాహ్మణోత్తములు వారు

చ. అనిన మొయిళ్ళపైఁ జనినయట్లుగ లక్ష్మణుఁ డేగి తెచ్చె వా
రిని రఘురామమూర్తి యురరీకృతభక్తిని వారి కిచ్చినన్
మణులును గోసహస్రసమాజము బంగరు వెండి యంతయున్
జనుచును బ్రాహ్మణుల్ కడువిష్ణులు దీవన లెన్నో యిచ్చినన్

వ. శ్రీరామచంద్రుఁ డంతఁ గౌసల్యాదేవి కాశీర్వక్త తైత్తిరీయాచా
ర్యునకుఁ దనయరదంబును గుఱ్ఱంబులును గౌశేయాంబరంబులును
చిత్రరథాఖ్యుఁడైన తనసూతునకు వృద్ధునకు రత్నాంబరమ్ములును
గఠకాలాపులయిన దండమాణవకులకు వేయియావులును నామంద
లోనిపెయ్యలును గాక వారు నిత్యస్వాధ్యాయశీలురని యనలసులని
మహాపురుషసమ్మతు లని వేయిగరిసెలధాన్యంబును రెండువందల
గి తలనుగూడ నిచ్చి దక్షిణగా వేయియావులు మఱియు నిచ్చి
కౌసల్యాదేవి నాశ్రయించియున్న మేఖలులయినవటువులకుఁ గౌసల్య

యిష్టమువచ్చినట్లు బ్రాహ్మణుల కిమ్మన్న సౌమిత్రి యేగి పెదతల్లి
చేత నిప్పించువేళ నామె యిట్లనియె

గీ. వాని పట్టాభిషేకవేళానితాంత
దానసంతోషచలితహస్తంబు బకులు
వాని కాంతారగమనవేళానితాంత
దానగత దుఃఖచలితహస్తంబు నాది.

వ. అంత శ్రీరామచంద్రుండు

సీ. తనవంకఁగాంచి మెత్తిన కన్నుదోయి వం
చుచుఁ దప్పుచేసినచొప్పుగాఁగ
కన్నీరుతుడుచుకోఁగా సిగ్గు పొందుచు
నమితదోషముచేసినట్లుగాఁగ
వెలికివచ్చెడు నేడ్పు బిగ్గఁబట్టుచు సమా
జమున నాగరకుల చాడ్పుగాఁగ
నిలువఁజాలక యట్లె నేలఁ గూలంబడు
చఖలసంధులు వ్రస్సినట్లుగాఁగ

నెంతో బలవంతపెట్టి గ్రహింపఁజేసి
నట్టికాన్కలు గొని సేవకాళి యేడ్వ
రాఘవుఁడు వారితోడ ధైర్యంపుమాట
లాడి యిట్లనె శాసించునట్లుగాఁగ

శా. ఈ నా గేహము నేను వచ్చువఱకిట్లే యుండఁగా నెవ్వ రే
రేనిఁ దా రిట నేపనిం జరుపరా దిచ్చోటనుఁ లక్ష్మణ
స్థానంబందున నంచు నంతఁ గని కోశాధ్యక్షుఁ జెప్పించుచుఁ
నానాదివ్యపురాసు లిచ్చె ధరణీనాకాలయశ్రేణికిఁ

క. ముసలులకుఁ బాలురకుఁ
గొసరికొసరి విఱుఁగఁద్రొక్కుకొనునట్లిచ్చెఁ
వెసవెస నా ధనరాసులు
మసలినచోఁ జాల వెన్నిమాసములైనఁ ౧౨౨

వ. ఆ సమయంబున

ఆ. త్రిజటుఁ డన్నయట్టి ద్విజుఁ డొక్కఁ డుం డాను
పన్న మేనివాఁడు బడుగుముసలి
తన కరానఁ గట్టు త్రవ్వుకోలయుఁ బూని
యుఱక నెపుడు తిరుగుచుండువాఁడు

ఆ. ఉంఛవృత్తివాఁడు నొక్కఁడు తనభార్య
కడకువచ్చి పిల్లగాండ్రఁ జూపి
పడుము లేమిచేత వంగిపోయినయది
భర్తతోడ నిట్లు పలికె వనిత

క. నామాటను విని కట్టు న
డేమూలనొ పాఱవేసి యేగు మయోధ్యా
రాముఁడు నలువురు చెప్పెద
రామలకం బట దరిద్రహస్తాగ్రమునన్

క. అనఁ జనుఁగులదుప్పటి య
ల్లనఁ దనువున నిట్లు నట్లు లాగికొనుచు వా
రిని వీరి నడిగి కోసల
ము నయోధ్యయు రాఘవుగృహమును బ్రాపించెన్

క. భృగువో యంగిరసుండో
మొగమునఁ గక్ష్యలను దాఁటిపోవఁగ నెవ్వం
డెగచఁడును బ్రతీహారియు
చిగురుకవాటమునఁ జూచెఁ జింతితరాముల్

క. కని నీవేనా రాముఁడ
వనదను బహుపుత్రకుండ నయ్యా! యుంఛం
బునఁ బిల్లల తీర్తారదు
ననుఁ దోలెను నాదుభార్య నను నీ కడకున్

క. ననుఁ గాంచు మనఁగ రాముఁ డ
కును నవ్వె యెల్లధనము గోవులు దానం
బును బొందె మున్న యొక మిగి
లిన దావులమంద, మందలించెద వినుమా!

క. తోలుకచన నీ వొకఁడవు
జాలెదవేఁ దోలికొంచుఁ జను మన్న ద్విజుం
డాల నిటు నట్లు పోవుచుఁ
దూలించెడు వానివెంటఁ దూలుచుఁ బడుచున్

సీ. చినిగిన దోవతి సిగ్గడలింపఁగాఁ
దోకొంచుఁ జెంగులు దోపికొంచు
తలకుఁజుట్టిన చీలికలువాలికలగుడ్డ
జాఱఁగాఁ జంకలో సర్దుకొంచు
త్రవ్వుఁగోలయుఁ గట్టు ధరణి జాఱిపడంగ
నవి వంగి తీసికో నాగికొంచు
మెడక్రిందఁబోసిన వెడఁగుచెమ్మట డొంగి
విడిసకుచ్చెలతోడఁ దుడిచికొంచు

గీ. హాళికొలఁదియు నెల్ల ప్రాణాలతోడ
వెలుచుకొంచును జనిచని వెక్కసపడి
యుస్సురని రొఁజుచును సరయువునయొడ్డు
చేరి యటఁ జాఱిపోవఁగాఁ జేలికట్టు

గీ. విడివడిన మంద యొకదారి వెడలకుండఁ
దోఁకలెత్తుచుఁ బరువులెత్తునవి కొన్ని
యూలవెనుకలు మూఁజూచునవియుఁ గొన్ని
క్రుమ్ముకొనుచు నొండొండు నేగునవి కొన్ని

గీ. అంతఁ గట్టలేక యదలింపనున్ లేక
గొడ్ల త్రొక్కిడందుఁ గుతిలపడుచు
తొడుకు కాళ్ళక్రిందఁబడి నల్గిపోయెడు
ముసలిఁజూచి రామమూర్తి కరుణ

వ. పసువులఁ దదాశ్రమంబునకుఁ దోలించి యిట్లనియె

గీ. కోపమా యిట్లుచేసె నీ కుట్టరాచ
వాఁడటంచుఁ బరాచిక మాడినాడ
నంతియే క్షమింపుమయ్యా! త్వదీయ
తేజము దురాసదంబును దెలియకొఱకు ౧౩౬

క. ఒకవేయియూల నీవొక
కాకిబికిత్తుఁగాని తోలికొంటివిగానీ
నికనముగ మందపాలకు
లోకయేఁబరిసంది బ్రాహ్మణోత్తమ వింటే!

గీ. వరుస మనుమలుఁ దాతలు పడుచువాండ్రు
ముసలులును సవ్వులాటలు మసల వేల్లు
గోసపడకుము నీ వేది కోరె దింక
నేది యడిగిన నిజముగా నిత్తు నన్న

క. తనవెనుకనె వచ్చిన యం
గనతోఁ ద్రిజటుండు రాముఁ గాంచి సహస్రం
బును గోవులు చాలును నా
కని దీవన లొక్క వేయిగాఁ గురిపించెన్

మధ్యాక్కర.
అంత సత్ప్రీతుం డొక్కఁ డక్కడ నగుపింపఁబోడు
చింతాదరిద్రుండు ధనము చేరలఁ జేర్చి దోసిళ్ళ
వంతులుగా నిల్లుచేర్చి బడలనివాఁడును లేఁడు
కాంతారగమన వేళా ప్రకామ రాఘవదానబుద్ధి

వ. అంత నొకవేళకు శ్రీజానకి రామునితో నిట్లనియె

క. తనపాలిపుడమి కిస్తురై
వనమేగెడు రాచబిడ్డ బహుహాస్యరస
మ్మున కింతగ వశుఁడే నా
తనికంటెను మంచివాఁడు ధరణిఁ గలుగునే?

ఆ. అపుడు భూమిజాత యన్నదమ్ముల యిద్ద
జేయు ధనుస్సులకును బ్రేమఁ బసుపు
పూసి కుంకుమమున బొట్లిడి పూవులు
మాలలుగను గ్రుచ్చి వ్రేలవేసె

శా. సాధుప్రాజిత యాగ సలక్షణధరాజాతుండు శ్రీరాముఁడుఁ
సాధారణ్యము తోఁచు వేసములతో సాకేతహేలాపురీ ౧౨౪

వీథీమార్గమునందుఁ దండ్రిఁగని యావేదించి పోవంగఁ దా
నైధర్మాచరణవ్రతకుఁడు మందాకూతి నేతేరఁగన్

మ. కుసుమాలంకృత రామలక్ష్మణ ధనుఃకోటీనిరాఘాట రూ
పసమున్మేషత సాధువేషములు తోఁపన్ బౌరభావంబులం
దెసఁగెన్ మానినులంబుపై నరుగునో యేమో మరుండంచుఁ దో
డెసలారన్ రతియున్ వసంతుఁ డని యూహింపంగఁ బ్రేమార్ధులై

శా. నానాపూర్వజనుర్మహాత్వములు పండన్ నేటికో రాజసం
స్థానాంతఃపురవీథికాంతరమహాసౌధాంతరాంతస్థరు
ద్రాణీమూర్తి ధరాత్మజాతయును నేత్రద్వంద్వసంప్రీతిగాఁ
గానంగాఁబడెఁ బూర్వసుస్తసుకృతాకారంబు మేల్కొన్నటుల్

ఆ. గొడుగులేక కాలినడక నచ్చెడువాని
పడతితోడ నడచి వచ్చువాని
చిన్నితమ్ముచేత సేవింపఁబడువాని
నూరుచూచె మేడ లొడ్డువిఱుగ

శా. ఓసీ! నీ వెపుడేని వింటివట వే యుర్విన్ నుఱేతాండ్రియే
నీ సర్వోజ్జ్వలసద్గుణాంబుధి సుతున్ సినంధ్రకాంతారసం
వాసార్థంబని పంపఁగా మఱియు నో వామా! సుతుండన్న నో
సీ! సాధ్వీ! సుతుఁడా? త్రివిష్టపఫలాశిప్రాజ్యరూపంబుకా!

క. అకౄరుఁడు సుశ్రుతి సా
నుక్రోశుఁడు దమియు శమియునున్ శీలియు నీ
వక్రత్వ మెట్లు పట్టెనో
చక్రభ్రమణంబు సర్వసంసారంబున్

ఉ. దక్షుఁడు రామచంద్రుఁ డరుదారగఁ దా నొకసుండె యీ ప్రజా
వృత్తుపుమూలమెవ్వా జనులెల్లను జోదయుఁ బాఁగ సాధుసం
ధృతుణమొప్పు కొమ్మలును నూల్కొను చేప్పలు పూలుపిండెలీ
వృత్తుపుఁబాటు చెప్పవలెనే యిక మూలము తప్పిపోవఁగా ౧౪౦

క. మనకోఁటలు దొల్లను రా
ణిని గైకయపుత్రి నేలనీ! వని మనముం
జనుదము రామునితో మన
మన జానకికంటె సౌకుమార్యముకలమా?

సీ. దూలాలకునుబట్టి వ్రేలాడు గబ్బిలం
బులును గంధర్వాంగనలునుగాఁగ
పందికొక్కులు త్రవ్వి పాడుచేసినయట్టి
గాదెలు సౌధసంఘములుగాఁగ
పెద్దపక్షులు రాత్రివేళల నేడ్చెడు
నేడ్పులు గానసాహిత్యములుగ
తూఁగాడు సింహశార్దూలాది మృగములు
నూల్కొను నాత్మబంధువులుగాఁగ

గీ. పాడువడిపోవు సాకేతపట్టణంబు
స్వర్గముగఁ దానె యనుభవించంగనిమ్ము
కైకయీదేవి, మనమెల్లఁ గదలిపోవు
దము మహాత్ముఁడు రఘూత్తంసు వెంట

గీ. అని యనేకవిధంబుల నాడుచున్న
జనుల మాటలు వినిపించికొనియుఁగొనక
మెల్ల నేగుచు భూమీశు మేడలకును
జేరె శ్రీరాఘవుండు నవిక్షిప్తబుద్ధి

చ. మసలు సుమంత్రునింగని సుమంత్రుఁడు రామునిఁజూచినంత నె
క్కసపడి బాష్పముల్ కనులఁగ్రమ్మఁగ వెక్కసమంత వచ్చి చీ
రచెఱఁగుఁదాపి వెద్దికగ, రాముఁడు తాత! భవాదృశుండు నీ
రసపడునా? యుగంబులు ధరాచరితంబు నెఱింగినట్టిఁడై

చ. అనిన సుమంత్రుఁడోయి శిశువా! నినుఁదెమ్మని పంప రాజు చే
కొని యభిషేకవార్త కనుగొంటిని నీవని కేగుదోసమం
దున నొక యింత నాకుఁ గలదా ననుఁబంపఁగ నేల? రోల నే
నను జనుదెంచినాఁడనని నొవ్వన నాడిన రామచంద్రుఁడుం గాశ

ఉ. నవ్వి సుమంత్రుచేయిఁగొని నాకును దీనను గానిపింపదే
నొవ్వు సదావసంతసుమనోహరమైన వనంబుఁజేరఁగా
నెవ్వఁడు నేల నొవ్వుపడ? నే నరుదెంచితినంచు తేని వా
త్రుప్పము వెంటనే సెలవుగొందును తండ్రిపదాబ్జసన్నిధిన్

చ. వెడలి సుమంత్రుఁడున్ వగపు వీడి ధరాపతిఁజేరి మ్రొక్కి రా
ముఁడు తనవెంట లక్ష్మణుఁడు భూసుతరాఁ జనుదెంచె స్వామి! సే
యమగులు మ్రొక్కవచ్చె నన నా నచియించిన వాడిమిం దడం
బడి ధరణీశుఁడంత బరిపాలితదుఃఖము మోము నెత్తుచున్

శా. వాగర్థాఖిలచాతురీసదన! రానచ్చున్ సరే లక్ష్మణుం
డాగోదూర ధరాత్మజాతయును నేలా వచ్చె? రానిమ్ము రా
నీ! గాలంబున నేల గ్రుచ్చెదవు గుండెన్, రాము నమ్మన్నమ్మ, కా
దాఁగంబోలును సర్వ మంతిపురి రమ్మన్నమ్మ! సుతుంగాంచఁగన్

క. ఒక కౌసల్యకె వాఁడు కొ
డుకా! మదంగనలకును గొడుకె యందఱకున్
సుకృతంబుగదా యిందఱు
సకియలకుఁ గొడుకు రామచంద్రుఁడు కంటే

క. ధరణీనాథుల భార్యల
సరి మున్నా రేఁబదుండు) చానల రామునిం
డరిగెడు వనములకును మీ
దరిసెన మిప్పింప ధరణిధవుడుం బిలుచున్

క. అని మంత్రి తోడితెచ్చినఁ
గనుగొలుకులు నుప్పుటేళ్ళుగా వచ్చిరి వా
రును మంత్రింగని యిప్పుడు
చనుదెమ్మని చెప్పుమనియె జనపతి రామున్

వ. అంత సుమంత్రువెన్నున వచ్చిన రామచంద్రుని గాంచి లిప్తలో

మ. నవచామీకరరత్నభూషణవిహీనంబైన రూపంబు పా
ర్థివచిహ్నంబఱుపూలియున్ మొగముత్రిప్పి బొల్చుసామాన్యమా
నవునింబోలిన రామురూపు కనినంతన్ ఆనికిన్ గైకక్కా
న్నవరంబందలి సర్వమష్టము సమంతాత్స్ఫూర్తి భాసించినన్ ౧౬౩

ఆ. రాజు మూర్ఛ నొందె రాముఁడు లక్ష్మణుం
డవనిపతినిఁ జేరి యాదుకొంచు
సేదదేర్చి పాదసేవ చేసెడు వేళఁ
గనులఁదెఱచి ఱేఁడు గాంచి రాము

**పంచచామరము.**

సబాష్పనేత్రుఁడై కరాన సంస్పృశించుచున్ సుతున్
సబాంధవంబుగా వనంబు సంచరింపనెంచితే?
సుబాహుతాటకాసమీకశూర! శైవచండచా
ప బుధ్న పాటనోగ్రపాణి! బంధుజీవలోచనా!

మ. అనినన్ రాముఁడు లేచి నిల్చి పితృపాదాంభోజముల్ తాఁకి న
చ్చిన యచ్చోటి ధరాధినాథునిమహాసీమంతినీమండలిం
గని కైమోడ్పొసరించు మీదు సెలవుం గైకొంచుఁ గాంతార మే
గను వాంఛింతు ననుగ్రహింపుఁడిదె యాజ్ఞాసాధు లాశీస్సులన్

శా. నాతో నన్నునుబోని లక్ష్మణు స్నుషన్ నావెంటఁబంపింపఁగాఁ
జేతంబాదుఁ గృపానుకూలమనసన్ శ్రీఁ గాంచ నర్థించెదన్
తాతా! నావెనువెంట నీ గరుఁగఁ గాంతారప్రతీచీనమా
ర్గాతివ్యాధియు నాకుఁదోఁచదు ఘనూరాజైన సౌమిత్రితోన్

వ. అనిన సీతాలక్ష్మణులు రామునండలి కృతజ్ఞతతో రాజునకు రాణు
లకు నమస్కరించిన దశరథుండు రామలక్ష్మణులంగాంచి యిట్లనియె

శా. బహుమాసేంద్రముఖంబులన్ నిను మహాపాతకవీజాలసం
దహనుండంచును వింటి నన్ను యువతీతాత్పర్యమోహాంధు ని
గ్రహముంజేసి సమస్తధాత్రియు నిదే కైకొండు కోదండస
న్నహనంబందున కోసలం బఖిలమైనన్ మిమ్మటం చోర్చునే?

గీ. క్షితిపతినిఁగూడ దుష్టు శాసింపవచ్చు
నిజము పితనైనఁ గుటిలు దండింపవచ్చు
మున్నుసుకృతి యిప్పుడు మాఱిపోయి యఘము
సేయువానినైన శాసింపవచ్చు ౧౭౦

శా. ఇంకన్ మీరో! మహాధనుః ప్రబలసాహిత్యాంబురాసుల్ నిరా
తంకుల్ కౌశికదానయోగ్యులు ననున్ దండించి యీ ధాత్రి ధ
ర్మాంకంబొప్పఁగ నేలుకోఁదగును శౌర్యాంకంబు దీపింప నే
వంకన్ వంకర పుట్టకుండనగు సర్వక్ష్మామహామండలిన్

వ. అనిన శ్రీరామచంద్రుండు శివ! శివా యని చెవులుమూసికొని,

క. ఓయయ్య! యేమిపాపము
మీయెడఁగల దైనఁగాని మేమా మిమ్మున్
మాయురె! శాసింతుము! క
ట్టా! యయ్యకుఁ గొడుకు లెంత యైరో ప్రేమన్

క. చనక యదోషస్థానం
బున దోషము చూచి యనుఁగుపుత్రుల మనసుల్
గొనకయ పల్కెదవును మా
వినయంబు పరీక్ష సేయు విధమా! తండ్రీ

క. ఈవలసిన వరములు నీ
వీ వారెను చాలకాల మేగిన దడిగెన్
నీ వీకతప్పు దీయక
యే వెడఁగో తా నసత్య మీఁదును తండ్రీ!

క. జనకుఁడు శాసింపందగుఁ
దనయుల శాసింపకుండఁ దనయులె చేయం
జనుఁ దండ్రి మాటఁగాదను
ప్రిణష్టచేతనుఁ డసత్యభాజి యెవండో?

ఉ. కాదని యొక్క మార్గమునఁ గైవిలుబూని నినుంజయింపఁగా
నూఁదిన నిన్నుఁ గెల్వనగునో సురరాజుకుఁ దోడుపోయి వ్యా
పాదితఘోరదానవకబంధనిబంధితదీప్త శౌర్యరే
ఖాదళితారిలోకవిముఖస్థలితానతసద్విధైర్యునిన్

క. ఏతండ్రి నాకుదైవము
ప్రోఁతిగ నాతండ్రిమాటఁ బాలించెదఁ దా
నే తండ్రిమాట సేతునొ
యాతండ్రియె వలటంచు నాడిన నైనన్ ౧౭౩

గీ. అనిన రాజు మూర్ఛనందిన రాణులు
నొక్కపెట్టు సొధ మొడ్డిగిలఁగ
నావురన్న రాముఁ డవనీపతినిఁజేరి
సేదదేర్చి తొడను శిరముఁజేర్చి

వ. తండ్రీ! నీవు ధాత్రిఁ బాలించిన దఱువది వేలయేండ్లు నం దఱునదవ
పాలు వేయి, దానఁ బదవపాలు వంద, వందలో నేడవపాలు పను
నాలుగేండ్లు

చ. ఇది యొకపెద్దకాల మని యేటికి దుఃఖపడంగఁ గానలోఁ
బనియును నాలుగేండ్లు చనివచ్చెదఁ గన్నును మూసి తెర్చున
య్యదనున వచ్చి మీపాదపదార్చన నిత్యుఁడ నౌదు నేను వ
చ్చెదనుకఁ జిన్నతమ్ముడును క్షోణిని జక్కనచూచుచుండెడిన్

శా. పంపంగావలె ధర్మకార్యకృతికై వారింప రాదట్లు వా
రింపన్ వారికి వీరికిన్ దొసఁగు నిర్ణీతంబు ధర్మంబు వా
రింపంజూచిననైనఁ దాన జరుగున్ బృథ్వీశ! యద్దాన వా
రింపంజూడకయుంట మానవులకున్ శ్రేయంబుకాదా మఱిన్

మ. అనినన్ భూపతి దుఃఖభారవివశుండై గద్గదస్వానియై
నిను వారింపఁగరాదు పొమ్ము వనికిన్ నీభార్యతోఁ దమ్మితో
నిను నానాఖిలదైవతమ్ములు దిశానీరంధ్రతేజఃప్రభా
కణసమ్మర్దముగాగ సర్వపథరక్షాశీలు రాచుండఁగాన్

క. ఏతండ్రి నీకు దైవము
యేతండ్రి నిన్ వనాళి కేగు మనియెనో
యే తండ్రి చెప్ప నాగవా
యా తండ్రియె మఱల వలదటంచును జెప్పన్

వ. అని రాజు మఱల మూర్ఛాగతుండైన

గీ. ఆత్మజాతుని రాము మర్యాదవలన
నర్ధసప్తశతీకృతలైనకోస
లాత్మజాతలు తత్రత్యలైన రాణు
లొక్కపెట్టున రోదించి రొడ్డువిఱుగ ౧౮౬

గీ. అవుర! యోయయ్య రామయ్య! అపుడు నీవు
మాకడుపులందుఁ బుట్టని శోకమయ్యె
మాకడుపులందుఁ బుట్టిన శోకమయ్యె
నిపుడు మఱియేమి బిడ్డవోయీ! కుమార!

ఆ. రాజు మూర్ఛపొందె రాణులు మూర్ఛిల్లి
రంత మూర్ఛ పొందె నా సుమంత్రుఁ
డంతిపుర మదెల్ల హాహాకృతంబయ్యెఁ
గైక యొకతె ఛాయికరణి నిల్చె

చ. కడకును నందఱుం దెలివిఁగాంచి సుమంత్రుఁడు పెద్దయూరుపుల్
నిడివిగఁ బుచ్చి దంతములు నెట్టన పీడనచేసి కోపపుం
బడలున నూగిపోవుచును బద్ధశితభ్రుకుటిౕ గళస్వనం
బడరఁగ కైకయిం గని నిరంతరవిశ్లథహాసుఁ డిట్లనెౕ

గీ. నీవు రాజునుగాని వసినితాంత
వీధులకుఁ బంప నిన్ను శపింప మింత
లజ్జను బతిఘ్ని వగుదు కులఘ్ని వగుదు
వంతె యిదియేమిచేసితి వబ్బురముగ

గీ. ఇందుఁ జచ్చెడువారు లే రెవరుగాని
యిందు సుఖపడువారు లే రెవరుగాని
అవుగ! సుకుమారశిల్పినీ! యంబునిషగ
భీరు నక్షోభ్యుఁ బతినెంత వెట్టినావు?

క. నీకొడుకే కానీ ధా
త్రీకాంతుఁడు, రామువెంటఁ దెరలుదు నేముౕ
నీకును గొడుకునకును గై
కా! కట్టంబెట్టికొమ్ము కన్నొ సకలమ్ముల్

క. ధరణి విను బ్రింగ నోరుం
దెఱువదు బ్రహ్మర్షి వాక్యదీపితశిఖా
సరణియు ని న్నంటదు నీ
..మాఘం బెంత గట్టిపడినదొ కైకా!

ఉ. తెచ్చిన వేపమొక్కకును దేనియపోయుము చేదుమానునా?
మెచ్చటఁబుట్టె నా గుణమె? యెవ్వఁడెఱుంగడు నీదుతల్లి నా
ముచ్చరి మూఁడుమూర్తులను మాకయి పుట్టితి రాఘవాన్వయా
భ్యచ్ఛ్రయహేతుకేతువవు మూర్తిమదాపదమోఘవైఖరీ!

వ. నీతండ్రి కెవ్వఁడో వరదుండు సర్వభూతరుతజ్ఞానంబు చెప్పి సతం
బొక్కనాఁడు శయ్యాగతుండై నొకపక్షికూఁత విని నవ్విన మీతల్లి
యదియేమియో చెప్పుమని కూర్చుండె; చెప్పినఁ దండ్రికాపద;
చెప్పనిచోఁ జూచుచుంటిమిగదా! నీతీరు; అట్టిది. దాన నీతండ్రి
యామెం బరిత్యజించి కుబేరునివలె సంచరించుచుండె;

క. ఆతల్లి బిడ్డ వంగన!
మాతంబడి పుట్టునంద్రు మహి, భూపతి యే
రీతిఁ దలంచునొ చేయుము
భూతలమిది నీదుఁగరుణపొంతంబోఁ జరించుఁ

ఉ. ఎయ్యదియైన మానవుల కెంతయు నోర్చుట తేలికౌఁజుమీ
ప్రయ్యెడునట్టి మానవుల పజ్జఁ జరించుటకంటెఁ బంపకే
యయ్యడవుల్ రఘూత్తముని, నాతనిమాఱుగ రాజపోవు నా
దయ్యములుఁ నినుంగని కృతజ్ఞులుగా మనుచుందు రెంతయుఁ

గీ. అని సుమంత్రుఁడు సాక్షేపసానుకంప
ముగను బతిమాలఁ గైకేయి మోమునందు
లేదు కదలిక కోపమ్ము లేదు వగపు
లేదు వదనవైవర్ణ్యమ్ము లేదు సుంత

ఉ. పమ్మిన కోపభారమునఁ బార్థివుఁ డిట్లనె దానినేలుకో
నిమ్ము సమస్తధాత్రియును నెవ్వరులేని దయోధ్య భూప్రజల్
సొమ్ములు వాహనంబులును సొత్తులు కోశము మంత్రులెల్లయ
శ్వమ్ములు సేనలుఁ వనముపట్టుఁడు రామునివెంటఁబోవఁగా

చ. అడవి యయోధ్యయౌ మఱియు నచ్చటె సంపద లుల్లసిల్లఁగా
గడుకొని రామచంద్రుఁడు సుఖంబులు సర్వమునుండఁగల్గెడిఁ
విడు విడు క్రూరదానవివి, వేడుకొనఁ దయగల్గునే శిలం
బిడిచినఁ బాలుకాఱునె కృపీటముజాఱునె యోసుమంత్రుఁడా!

మ. చని సాకేతపురంబు సర్వము మదాజ్ఞాబద్ధమై రాము వె
న్కను బోఁగావలెనంచుఁ జెప్పుము పురాణంబైన యీ రాజధా
నిని నేఁ బాడుగఁబెట్టెదన్ బురుగుగానీ నిల్వరా దిందు నేఁ
ధనముల్ ధాన్యములెల్ల రామువడి కాంతారంబుపోవుంజుమీ!

చ. అనినను రామచంద్రుఁడు కృతాంజలియై వర మిట్టు లిత్తురా?
యనయముగాఁగ నిట్లొసఁగ నయ్యెదియుం వరమౌనె! యిట్లుచే
సిన మృషకల్గుగాని వాక్సిద్ధి జనింపదు తండ్రి! నామృషా
పనయన సర్వయత్నములు వ్యర్థము సేయకె నిన్ను వేడెదన్

శా. నాకున్ రాజ్యముపైని గోర్కి యిసుమైనన్ లేదు సౌమిత్రియున్
లోకీ జానకియున్ బురాప్రస్రాయులై మోమోటునుం బెట్టి రం
తేకానీ సకలంబు వీడెదను నే నీ మైథిలంగూడఁ దం
డ్రీ! కాదన్నను నాకు, సేన్య మొకఁడే నిక్కంబు ధర్మంబగున్

శా. ఈధర్మంబును జేయ సాయపడెఁ దా నెంతో కృపారాశి యీ
సాధున్ నాపినతల్లిఁ బట్టికొని యీ సాధింపు లీ కోపముల్
బాధల్ వేల్ బెదరింపులున్ నిజము నాప్రాణంబు దుఃఖం చెడున్
సాధారణ్యము ధాత్రి యిద్దియు విశేషంబౌనె యీ నాకునున్

క. అని కైకపాదములకున్
బ్రణామ మొనరించి తల్లి! బాధపడకు పు
త్రునికతమున నగు బాధలు
జనని సహింపవయ యెరు సైరింతు రనన్

గీ. ఇంతనఱుకును భూపతి నెంతవఱకు
వరము కోరెనదో మాటపలుకు లేక
యూహయును లేక శిలవోలె నున్నయట్టి
కైక రాముఁడు కాల్వాఁకు దాఁకఁ దెలిసి

క. కా లూనిన పులకలు మైఁ
గ్రాలంగా రాముని త్తి కౌఁగిటఁ గొని భూ
పాలుం గని యసమంజసుఁ
దోలె వనికి సగరుఁ డట్టు తోలుము రాముక్ ౨౦౭

సు. ప్రవసింపంజను వేళ నేస్గులును గుఱ్ఱంబుల్ ధనంబుల్ ప్రజల్
ననలాలున్ వెనువెంటఁ బోవుదురో" యన్నన్ రాజు ఛీయంచుఁ గ
న్గొవలన్ నిప్పులుగ్రక్కె నంతట సుమంత్రుండున్ విచిత్రంబు రా
ఘవుఁడున్ మొక్కుట యామెపుల్కలోదవన్ గాగింటికింబట్టుటల్

గీ. ఇంతవఱకు మాటాడని దిపుడు మాట
లాడుటయు నందు నిట్లు మాటాడుటయును
జూచి దిగ్భ్రాంతిఁ గని యర్థసూక్ష్మతావి
వేచనాపరితారితుఁడు "నూ" వెట్టి నిలచె

వ. అంత సిద్ధార్థుఁ డనువాఁడు వృద్ధుఁడు మహామాత్యుఁడు రాజున
కిష్టుఁడు కైకయితో నిట్లనియె

క. అసమంజసుఁ డసమంజసు
డు సగరుఁడున్ వెడలనడచుటన్ దోసఁగేమీ?
పొసఁగిన వెలఁగల ముత్తెము
నిసుఁగగు రాముండు చేసె వనిన్ దోసఁ గదియున్

క. రాముని కసమంజసునకు
నేమీ! దీటా! యతండు నెల్ల యయోధ్యా
గ్రామీణుల శిశువుల సర
యూమధ్యమునందు ముంచుచుండ సదయుఁడై

ఆ. పుడమి గోలవెట్టఁ దొడఁగిన రాజును
వెడల నడచె వాఁడిఁ బుడమినుండి
పుడమి గోలవెట్టఁ దొడఁగునో నేఁడును
వెడలనడవ రాముఁ బుడమినుండి

ఉ. కందును లేని జాబిలియుఁ గా రఘురాముఁడు నాతఁడున్ వనిం
జెందుట యేమికారణముచేత! వచింపు, వచించి పంపు నీ
యందునఁ బైనిగల్గు శుభమయ్యది చెప్పుము సర్వభూప్రజా
క్రిందన మపరితిష్ఠయునుగాక లభించెడి దేమి యాపయిన్

మ. అన సిద్ధార్థుఁడు, రాజు కైకఁగని నీ వంగీకరింపంగఁబో
వుచు నీమోముగఁ జెప్పుచున్నయది యో పుణ్యాత్మ్వదూరస్థజీ ౨౧౪

వని! నే రామునితోడఁబోయెడ ధరణి బాలించుకో నీవు నీ
తనయుండుణ సితతారకావిమలచంద్రుంబైన కాలంబునుణ

వ. అనిన శ్రీరామచంద్రుఁ డిట్లనియె

క. విస్సంగునితోడ మరు
ద్భిస్సునితో మృదుపథానవిభవునితోఁ జే
తస్సంతోషము రాఁగను
స్వస్సౌఖ్యములేద వనిఁ బ్రచారమునందుణ

గీ. పసుపుపోయినంతఁ బలుపుకై యేడ్చిన
పగిది నడవివెంటఁబడి చనుచును
గొడుగులేదు నాకుఁ బడవాలులేఁడని
వగచు బుద్ధిలేనివాఁడు వాఁడు

క. నా కేమియు నక్కఱలే
దాకలములు మేయువాని కన్నియు నేలా?
చేకొను నారచీరలు
నా కిప్పింపుము ద్విషజ్జనప్రళయాగ్ని !

గీ. వెనుక మందర జాగ్రత్త పెట్టినట్టి
నారచీరలు కేకయధారుణీంద్ర
దుహిత శ్రీరామచంద్రుచేతులకు నిచ్చి
ప్రీతమతివోలె నివ్వి ధరింపు మనియె

క. చీచీ యను తత్రత్యుల
వాచాస్వన మొక్కసారి బాహిరలె రా
కాచాంద్రిదిక్కణహా
సాచరణము రాము వదసమంమున దోఁచెణ

వ. అంత శ్రీరామలక్ష్మణులు తమ జిల్గువల్వ లూడఁదీసి యా ముదక
గుడ్డలు ధరించిన

గీ. చను కిరాతి పన్ని చన్నట్టి వలఁగాంచి
లేటివోలె బెదరి బోటి సీత
నారచీరఁగాంచి నాథునికోదండ
మానుకొనియె మేను బ్రమానుకొనఁగ ౨౨౩

చ. అది గని రాజకన్నులు జలార్ణవమయ్యెను గైక రామునిన్
వదనమునందుఁ దీవ్రమగు వైఖరిఁ గాంచెను రాముఁ డంతటన్
బెదరుట కాద యీవలువఁ బెట్టుకొటుఃఱుంగమి యంచుఁ దానుగాఁ
గదియుచుఁ బట్టచీరపయిఁ గట్టెను సీతకు నారచీరలన్

ఉ. సీతను రామచంద్రుఁడును జీర ధరింపఁగఁ జేయుచుండఁగాఁ
జేతము సొమ్మసిల్లి నృపుచేడియలందఱుఁ జేతులెత్తి వ
న్యాతిథి! కోడలా! రఘువరాన్వయదీపపుఁదైలవర్తికా!
నూతనభార్గవీ! యనుచు నూల్కొన రోదన మాచరింపఁగా

శా. అందొక్కరుక రామచంద్రుఁగని యయ్యా! చిన్నిరామయ్య! మా
యందున్ నీకును గౌరవంబుగలదే నస్మద్వచఃపాలనం
బందున్ బూన్పుము బుద్ధి నీచనెడి సత్యార్థ్వంబు భంగంబులే
దెందున్ జానకి కానలోఁ దిరుగలే దింతైన నోబాలకా!

శా. నిన్నుం జూడఁగ నోచుకో మదియుఁ గాసీ! యోయి నీమాటుగాఁ
గన్నుంపమ్ముల నిచ్చఁ జూతుము స్నుషన్ గాంతారమున్ గొంచుఁ బో
కున్న స్నిగ్ధను రాజవే నదియులే దొక్కొండు మాకోర్కి తీ
ర్ప న్నొక్కంటయు లేద కోడలిని నిల్పం జూడుమీ యిచ్చలన్

ఉ. కన్నులకర్వ్రతీర నినుఁ గాంచుటె గాని యొకప్పుడైన మా
చిన్నికుమార! యంచు నినుఁ జేరఁగబిల్చుటె లేద యెప్పుడున్
మున్నిపు డీ ప్రయోజనము పుట్టెను విన్నని మాటలాడెనం
బున్నె ముకగ్గె దానిఫలముం బలెఁ గోడలి నిందె యుంచుమా!

సీ. ఈతల్లి మెకువైన చేతులుగని వనీ
కిసలయంబులు కాంతి నెసఁగినట్లె
యీ బిడ్డ కన్నుల యొసపమ్ముఁగని సరో
విమలపద్మమ్ములు విచ్చినట్లె
యీబాల పలుకు రాయిడిపొంకుగని శుకీ
పరభృతుల్ మధువెల్లఁ బాడినట్లె
యీనాతి తళుకారు మేనుగాంచి నభో
నీతసౌదామినుల్ నిక్కినట్లె

యే వనంబున గౌరవం బెక్కి నీవు
పోవుచుంటివో యా వనంబునకు సిగ్గు
చేటు సీతను గొనియేగఁ జెల్లునోటు
సీతఁగొనిపోకుమోయి యో చిన్నికుఱ్ఱ!

వ. అంత వశిష్ఠుండు సీతకుఁ గట్టుచున్న రాముని చేతిలోని చీర లాగి కొని యిట్లనియె.

క. ధరియించు నారచీరల
నరుంధతి, ధరాత్మజాత కవి కట్టఁగరా
దరయఁ జెటిసగముగా నీ
దరిద్రితాస్థితి పతివ్రితాలోకములన్

వ. అప్పు డరుంధతి యిట్లనియె

ఆ. తూఁక మయిదుమళ్ళు తొమ్మిదిమూరల
నారచీరఁ గట్టినావె సీత
కామె మోయలేద యందు మునిగియపోవుఁ
గాళ్ళు కడ్డముపడి కదలలేదు

ఆ. అనుచుఁ బొంగివచ్చునట్టి దుఃఖము మింగి
కోప మడరఁ బుడమికూఁతు నడవి
కంపువారలను శపింపఁగా దొరకొని
మఱల మనసు నెల్ల మార్చికొంచు

గీ. తిరిగి రాముఁడు వచ్చెదునంతకు నేను
మీ గడపఁ ద్రొక్క నని చెప్పి యేగనంత
నఖిలఋషిలోకమూర్ధన్యుఁడగు వశిష్ఠ
దేవుఁ డిట్లనెఁ గైకేయి తెన్నుఁగాంచి

క. సౌమిత్రికంటె భక్తుఁడు
రామునకున్ భరతుఁ డతఁడు రాజ్యముఁగొనునే?
మే మెవ్వరమును లేనిది
యీ మహియెల్ల యును నీవ యేలఁదలచితే? ౨౩౮

(14)

చ. భరతునిఁగంటి నీ వతని పాలన పంపక మెల్ల నీ కడన్
జరుగుట కిష్ట మింతయును జాలక కేకయరాజు తానుగా
జరిపెను, గంగిగో వతఁడు శాంతుఁడు దాంతుఁడు నగ్రజుం డనో
నరుఁ డని తోఁచిసిరాజనఁడు ధారణి నీవయి యేలు టొప్పెడున్

శా. బ్రహ్మర్షిత్వముకోరి గాధిజుఁడు సంభాళించుకోలేక తా
జిహ్మత్వంబున బిట్టుకోపమున రాఁజెన్ మత్సరాశ్రేణి న
బ్రహ్మణ్యంబుగఁ జంపె నప్పుడును గోపంబేదితిన్ నేఁడు నీ
జిహ్మప్రక్రియఁజూచి కోపమును నా చిత్తంబునం దేఁమనో?

క. అని బిగియఁబట్టికొని మో
మున సప్తర్షి జగదేకమూర్ధన్యుఁడు పో
యినఁ గొలఁగి రాజు కైకయిఁ
గని యిట్లనె వెల్లమొగము గంటుపడంగన్

శా. హ్రీసన్న్యాసిని! శ్రీవశిష్ఠముని మాటే పట్టులేదాయెఁ బో
నీ! సీమంతిని సీత నీవరమునన్ నిల్వంగ నేలా! దయా
శ్రీసామాన్యము కోరెదన్ స్నుష వనీసీమన్ బ్రవేశింప నా
యాసంబా నని యొక్కఁడున్ వదలవే యాయ స్తసూర్యాన్వయా!

చ. జనకుఁడు శ్రీవశిష్ఠులును జాన! నిజం బొక యెత్తు నాకు, నా
జనకుఁడువచ్చి నా తనయ జానకిఁ జూపుమటన్న నేమిచే
యఁదవలె నేను సీత కుసుమాభశరీరయు ముక్కుపచ్చలా
రనిదియు సీత నాయెడల రామునికంటెను భక్తురాలుసూ!

ఉ. ఈ సుకుమారి నల్కలము నిట్లనెకాంచి విమోహితాత్మ యా
యాసముపొందె నీయెడఁ గృపార్థిని జానకి తేపు వృద్ధ స
న్న్యాసినివోలెనై తిరుగు నా వనసీమను రత్నభూషణా
భ్యాసమ్మృదూత్తరీయ జనకాత్మజ యేగునుగాక కానకున్

క. నీ కిచ్చిన వరమందున
నా కోడలు లేద యామె నారలు కట్టన్
నా కిష్టమ్మను లే దది
కాక జనకదుహిత నార కట్టను వలదున్

క. ఏ యపకృతి చేసినదే
యో యాసురి! నీకుఁ గోడ లుగ్రవనతరు
చ్ఛాయలకుం బంపించెదు
నీయడిగిన వరమునందు నెగడెను స్నుషయున్

ఉ. నీమొగముం గనుంగొనిన నిక్కము పాపముకల్గు నంచు నిం
దామతి రాజన్ ధరణినాథునిఁగై కొని రామచంద్రుఁ డో
స్వామి! వృథాక్రుధాసరణి పల్కెదు కైకయి జానకిన్ వనీ
భూమికిఁ బోకతప్ప దని పుచ్చెనొ జానకి తాన కోరెనో!

చ. ఒగిఁ బినతల్లి యగ్రసుతు నొక్కని కానకుఁ బంపు మన్న దే
నుగఁ జనుచుంటి నీనిజము నూల్కొనఁజేయగఁ బోకతప్పదున్
మిగిలిన వీర లిద్దఱును మేమయి వత్తు మటన్న మూఁడురె
ట్లగు నెడబాటుదుఃఖమునయందునఁ దో లటిపాలె యామెకున్

శా. నీకున్ మిక్కిలి యిష్టమైనకొడుకే నీ కోడలింగొంచుఁబోఁ
గై కేయీకృతమంచుఁ జెప్ప నగునే కానిమ్ము నేఁబోమొదన్
నా కాంతారనివాస మెంతవఱ కన్నాళుల్ కృపారాశివై
యా కౌసల్యను నాదుతల్లిఁ గనవయ్యా! సూర్యవంశోత్తమా!

శా. నాపై నాసలనెల్లఁ బెట్టికొని యున్నాళుల్ మనెన్ దల్లి నే
నో పోవంగను సయ్యెఁ గానను వియోగోగ్రానలజ్వాల మా
లాపీతాకృతిఁ గాకయుండ బహువేళారక్షఁ గావింపవే
యాపై నే నరుదెంచి నీకరుణ పాత్రీణాంతంబు పాలించెదన్

క. అటుఁ గై కేయికిఁ దగిలిన
దిటురాజున కైనఁ దగిలె నిద్దఱును శిలా
స్ఫుటమూర్తులు కాఁగా నం
తట రాముఁడు వారికిం బ్రదక్షిణ మొప్పన్

ఉ. పోవుము నున్న భూమిపతి మూర్ఛ నెఱింగి సుమంత్రుఁగాంచి తా
నా వనమందుఁ గాల్నడకకై చననే చను నీ యయోధ్యలోఁ
బోవుచొ తానుగా నడచి భూపతి కాఁగలవాఁడు తాను వీ
డావలిదాఁక నేన్ రథమునందునఁ గై కొని దించిరాఁగదే ౨౫౦

చ. కొని పదునాలుగేండ్లవఱకున్ సరిపోయెడి పట్టుచీరలున్
మణులును భూషణంబులును మైథిలికోసము పెట్టి పంపుమా
యనిన సుమంత్రుఁడన్నియుఁ దనంతన తెచ్చి వినీతుఁడౌచు రా
జునకును జెప్పె రాము వనిఁ జొచ్చెడు వేళకు నెల్ల రేడ్వఁగాన్

శా. కౌసల్యాసతి ముద్దుకోడలి వెసన్ గౌఁగిటికింబట్టి బా
హాసమాగ్జన మాచరించి మృదుమూర్ధాఘ్రాణముం జేసి త
ల్లీ! సీతా! నను నీవును వదలిపోవే! నేను నేకాకినై
నా సీతా! మఱి మీరువచ్చువఱకైనన్ ప్రాణముల్ నిల్తునే?

ఉ. లోకమునందుఁ గామినులు లోలుపబుద్ధులు పెన్మిటిన్ వృథా
వ్యాకులపెట్టుచుందురును నవ్వియుఁ గానలె నివ్వి కానలెన్
నా కనుచున్ సగౌరవమనంబున భర్తను గాంచలేర! యా
పోకిళులందుఁబోకువె యభూపతియా పతియం దశీలవై

ఉ. భర్త కుబేరుఁడైన వెంభామినికైవడి గౌరవించుచున్
భర్త దరిద్రుఁడైనఁ బరభామినికైవడి నీసడించుచున్
ధూర్తలు భర్తృసౌఖ్యమును ద్రోతురు సుళ్ళగు పెద్దగంగలో
ధూర్తవు కాకు రాఘవునితోడిది ఛాయగ సంచరింపవే!

క. నాబిడ్డ సుగుణఖని ధ
ర్మాబద్ధజటానిటాలుఁ డంతియకానీ
శ్రీబంధురసాకేత
క్ష్మాబంధుజ్యేష్ఠుఁ డైన శౌర్యము కలఁడే

సీ. వనిలోన నేరితెచ్చిన కందమూలముల్
చిమసుమంటలపైనఁ జిముడనీక
దారి నేగెడువేళ ధరణీంద్రుకథలతోఁ
బువ్వైనమనసును నొవ్వనీక
చెట్టునీడల బడలెంది నిల్చిన వీఁచి
పయ్యెదఁ జెమ్మట పట్టనీక
యేదో కావలె నని యెడదను నెఱపి యె
ప్పుడు వనీదూరముల్ పోవనీక

కాచుకొనవమ్మ భర్తను గాంత! నీవు
తరుణి వని కాక యాతని తల్లి వంచు
నూహాపెంచితివేని నాయుక్తు లెల్ల
నాచరించుట కెల్ల సమర్థ వగుదు

ఆ. తల్లి కడుపు చూచుఁ దరుణి వీఁపును జూచు
పురుషుఁడైన నింటి కరుగుదేఁ
దరుణివో లెఁగాక తల్లిపోలిక నీవు
చాన! యెల్ల వేళ సాఁకుకొనుము

చ. తనకతి సుఖంబు లేద యరుదారఁగ సౌఖ్యము లేద భర్తకే
వనితయు గట్టువాయయిన వచ్చెడి దేమిఫలంబు శ్యామలా
ననయయి ధూర్తతాఫలము నల్లురి నోళ్ళఁ బడకుఁ వధూవికా!
ననుఁ గయికోవె దైవతి మనంబతి కానను సంచరింపుమా!

వ. అనిన సీత యిట్లనియె

గీ. నీ కొడుకు సాలభూజంబు నేను లతను
నీ కొడుకు హారాన్న వీణియ నేను తీఁగ
నీ కొడుకు వార్షికాభ్రంబు నేను మెఱుపు
నీ కొడుకు సూర్యదేవుండు నేను వెలుఁగు

క. అతఁడు కులాలుఁడు మెత్తని
క్షితిమృత్తును నే నతండు చివురాకు సమీ
హితనై గనిగ్యమును నే
నతండు దైవంబు భక్తురాలను నేనుఁ

చ. పతియు జలంబు నేనును బ్రవాహము రాఘవుఁ డాకసంబు నే
నతమృదుగీతి విందుఁడగు నాయన నేను హవిస్సు వేదముల్
సుతుఁడు స్వరంబు నేను రఘుశూరుఁడు తా రసమూర్తి స్థాయి నే
నతనికి నాకునైన యవినాస్థితి దుస్థితి పొంద చెప్పుడుఁ

గీ. ఈ శరీరమ్ము లురలి మే మెప్పుడైన
నొక్క ద్రవ్యమ్ముగా నగుచున్న దేమొ
యా మహాస్థితి సర్థించి యంబ! నీవు
పంపవే సాదుదీవనపాట పాడి

క. ఆ వేళయందుఁ గౌస
ల్యా వైదేహీ సమార్ద్రలలితకపోల
వ్యావల్గద్బాష్పఝరీ
ప్రావృట్సంగమము పొల్చెఁ బావన మగుచున్

ఉ. కోడలిఁ గౌఁగిటం బొదివి కోసలకన్యక యామె కంఠమున్
వీడక దుఃఖమొంద రఘువీరుఁడు తల్లినిఁ గాంచి "యమ్మ నీ
వోడకువే ధరాపతి వియోగశుచా పరిదీనుఁ జూచుకో
గాడిన గుండెతో ధరణికాంతుఁడు విశ్లథచిత్తుఁ డౌనొకో

శా. అమ్మా! తండ్రిని వేయికన్నులను నీవై చూడకున్నన్ నితాం
తమ్మున్ గైకయి సేవఁ గైకొనని యీ ధాత్రీశుఁ డేమౌనా ధ
ర్మమ్మేలా కయికోవు భర్తను బుత్రప్రేమయే యెక్కువా!
యమ్మా! పుత్రునికంటెఁ గోడ లధికంబా! చిత్రమీ దుఃఖముల్

ఆ. నీవు స్నుషను వదలలేవు నీ స్నుష నిన్ను
వదలుగాని పతిని వదల లేదు
పతియు మిమ్ము వదలు వనమును వదలఁడు
నిద్దఱొకరి కొక్క రెవ్వ రిందు?

క. అనినట్టి కొడుకుమాటల
కును గోసలరాజకన్య కోడలి విడిచి ని
ల్చిన రాముఁడు మాతృప్రద
క్షిణంబుచేసి జనకునకుఁ జేసె వినతుఁడై

మ. నులివెచ్చూర్పులు పుచ్చుచున్ నిలువ మున్నూర్న రేబమండ్రైన త్రో
తులభృద్భార్యల కెల్లఁ గేల్మొగిచి యో తల్లుల్ మదజ్ఞాతముల్
కలుగన్ వచ్చును నేను చేసినవి నిక్కంబైన దోసమ్ము లా
వలనన్ నన్ను క్షమించి దీవనలఁ బంపం బోలునం చాడినన్

ఉ. అందఱు గొల్లుమన్నను ధరాధిపుడున్ సుతుఁ గాంచి రాఘవా!
యిందుల కేగుదెంచెద వ దెప్పుడొ యప్పుడు తండ్రిఁ గాంచ లే
విందన నా వియోగదహనేంధను నా రఘురామపూరి నా
యందున నింతనిర్దయుఁడ వయ్యెద వేల నటంచు మ్రొక్కుచున్

వ. రాముఁడు తల్లులందఱకుఁ బ్రదక్షిణించి సుమిత్రాదేవి హస్తంబు
నెత్తి తన చెక్కిలి నాన్చుకొని

క. అమ్మా! నే నింకెవ్వరి
నమ్మను సాగరగభీర సమ్మోద నిను మా
యమ్మయు క్షణమైనను నీ
సమ్ముఖ మెడఁబాయకున్కి చను భద్రతకై

మ. అని కైకేయిపదమ్ము లందుకొని నీ వాశీస్సు లీవున్నఁబో
వ నటన్నన్ విని తల్లి మూర్ఛగని లిప్తం దేరి పోవోయి నీ
వనముల్ నాకొడు కింక రాజగును నీ బాహాధనుఃక్రూరమా
ర్గణముల్ చేయు నుపద్రవంబున మహాకాంతారముల్ ఘోషిలున్

గీ. నిరభిమానను నిర్లజ్జ నిర్భయాత్మఁ
జేసితివి నన్ను సర్వసన్యాసినిన్ వ
నిన్ జనుముర! సవతితల్లి నిన్ ననున్ శ
పించి సవతితల్లిగనె చూపించినావు

క. నా యాశీస్సు లవేఁటికి
నోయీ! రఘురామ నీకు నున్నవి చాలున్
నా యాశీస్సులు భరతుని
కై యివి నినుఁబోలె నాతఁ డగుటకు రామా!

వ. అనిన నందఱుఁ జీచీ యనిరి, రాముండు తల్లి చివరిదాఁక రక్షించు
టకు సంతసించె నంతఁ బాదాభివందన మాచరించిన కొడుకుఁ
గాంచి సుమిత్ర యిట్లనియె

మధ్యాక్కఱ.

ఎఱుఁగుము రాము దశరథుఁడే యని యే నని సీత
నెఱుఁగుము వన మయోధ్య యని యెఱిఁగి పొమ్మెదవేని పొమ్మ
కలదలేటికి నీలమేఘకాంతాపఘనుఁడైన రాము
మఱువకు సౌదామనీసమశరీర మఱువకు సీత ౨౭౭

సీ. తలపైఁ జిరత్న రత్న సమూహకాంతిచ్ఛ
టాహేమమయ కిరీటమ్ముతోడ
రత్నకంకణసమారాధితహస్తాగ్ర
చలితలీలాసరోజమ్ముతోడ
నూత్నకింకిణి కుంకుమకాంచన మేఖలా
కలనాత్త జఘనభాగమ్ముతోడ
శంఖసుందరగళస్థల లంబమాన ము
క్తామణీహారసంతతులతో
నిఱుదెసఁ రామలక్ష్మణు లిద్ద ఱొలసి
తుండములువోని ధనువులతోడ నొప్ప
రక్తిమెయి సుమంత్రానీతరథమునిండ
జానకీదేవి గజలక్ష్మిసరణిఁ బొలిచె

సీ. త్రయ్యధ్వమున స్వరితానుదాత్తములచే
దీపించెడు నుదాత్తదీధితివలె
సత్త్వరజోగుణసంసేవితంబైన
లీనతమోగుణలేఖవోలె
నీశాన్య మాగ్నేయ మిఱుదెసఁ బలిసిన
ప్రాచీదిశాకాంతిభరమువోలె
నాగిననరాహదంష్ట్రాగ్రశేషాహిఫ
ణాగ్రభూషిత వసుంధరయుఁబోలె
హృష్టిత నారద తుంబురు ఋషివిపంచి
కాసమాభిషేవిత సామగానవిద్య
వోలె (శ్రీ) జానకీదేవి వొలిచె సంత
ప్రభుతమెయి సుమంత్రానీతరథమునిండ

సీ. సింహమహాక్షు సంసేవ్యమానోభయ
పార్శ్వహిమాలయప్రభుకుమారి
యానంద సత్సనాథానూన సుస్థితి
ప్రథమానచిత్కళా ప్రథమరేఖ

మత్స్యకేతన మధుమాస సేవాస్వీకృ
తిప్రౌఢకళ రతీదేవిమూర్తి
వీరరౌద్రరససావిష్కార మోదాఢ్య
చరమభాగస్థ యుత్సాహకళిక
బుద్ధ్యహంకార యుగళాంత మధ్యభాగ
నిహిత మనఇంద్రియంబున నెగడు తెలివి
రాణమెయి సుమంత్రానీతరథమునీఁద
జానకీదేవి సర్వభూషణయుఁ బొలిచె

సీ. కామధేను విషాణక్రమఫాలస్థలీ
మధ్యస్థ మందమౌ మచ్చ విరిసి
శివజటాకుటి బాలశీతాంశు కొమ్ముల
నడిమి సుధారేఖ విడిలఁబాటి
అవపతానోర్ధ్వమ్ములగు సూర్యరశ్ముల
నడిమి చల్లనిరోచి వెడఁగుచూపి
మహితమార్గములు కర్మజ్ఞానములలోని
యోగముద్రారేఖ సాగుదేటి
రామలక్ష్మణ సహిత ధరాతనూజ
మూర్తిగా వచ్చినట్టులు పొలుపుగాంచె
రాణమెయి సుమంత్రానీతరథమునీఁద
పృథులము సుమంత్రచోదిత రథమునీఁద

వ. కదలిపోవు రథమ్ము వెంటఁబడి తత్రత్యులయిన జను లిట్లనిరి

గీ. రథము మేఘాలపై సుమంత్రా! సుమంత్రి!
తోలుకొని పోకుమోయి పంతాలుపట్టి
పదియు నాల్గేండ్ల లో సుంతభాగమైన
నింత నెమ్మదిగాఁ దోలితేవిఁగాదు

సీ. అంతిపురమ్ములో నప్పుడులే దిప్పు
డైనఁ జూతుము కన్నులార సీత
రాజౌట నపుడు చేరఁగరాద యిపుడైన
రామచంద్రుని దగ్గరగ నిలుతుము ౨౮౪

ఒగి లక్ష్మణుండు మా యూహాప్రకారమ్ము
చనుఁ బట్టుకుము పరిష్వంగ మతని
రాజు కాకున్నట్టి రాముసకుం జూపు
దుము మాదు నిజమైన విమలభక్తి
రథము మేఘాలపై సుమంత్రా! సుమంత్ర!
తోలుకొని పోకుమోయి పంతాలుగాగ
బండిచక్రాల క్రిందను బడి యసువులు
వదలు పున్నెము నే మాకుఁ బట్టనీవా?

ఉ. రాముఁడు పోవుచుండె నని రాజును రాణులు లేచి ద్వారపుం
భూమికినచ్చినట్ల ధరణీపుండును బుత్త్రునిఁగాంచి తీవ్రని
ష్ఠామతి! తండ్రిమాటను నసమ్మతి సమ్మతిచూపువాఁడ! యే
లా మృదువయ్యె నీ మనసు లాగునుబో! కఠినంపుత్రోవలన్

గీ. నన్ను వదలిపోకు నా తండ్రి యని చాచి
బాహుయుగము కూలఁబడియె రాజు
వల దటన్న మూఁడువందల యేఁబది
మంది రాణులయును మనుసు ఖరలు

వ. అంతఁ గౌసల్య

ఉ. ద్వారముదాఁటిపోయిన రథంబును బన్నునఁబోయి చేరి చ
క్రారము లాచిపట్టుకొని యంబుదదేహా! మ జీవు పోయినన్
దీగనిబెట్ట నాయెదఁ దెచ్చిన నెంజిలితీర్చువా రహో!
యేరిక? పుత్త్రికా యనుచు నేర్చిన గుండియఁ గుప్పకూలినన్

గీ. ఏడునందల సైనికు లీలు లెత్తి
నిలువినట్టులు రాణుల నిగుడు హస్త
ముకుళములువొల్చి యచ్చటిభూమి యెల్ల
బొలిచె వేదనావధి యుద్ధభూమి వోలె

గీ. రామునకు గుండె కరుగదు రాజుఁ గాంచి
రాణులంగాంచి కరుగదు రాముగుండె
తల్లిఁ గౌసల్యఁ గనియైనఁ దల్లడిలఁడు
త్రోలు మరదం బటంచును దొందరించు

ఉ. పోయినఁ జచ్చిపోయెదము పోవఁగనీము రథం బటంచు వా
పోయెదు పౌరులం దొలఁచిపోవఁగ రాదు రథంబు రాముఁడున్
దూయఁగ గుంపునన్ రథము తోలుమటంచు వచించు మంత్రియున్
జేయునరాక తోలుటకుఁ జిత్రమువోలికఁ బగ్గ మూనుచున్

ఆ. ఉగ్రఘుంఘుచేత నొరగి వెన్కకుముందు
తరలరాని జంటతాళ్ల వోలె
వల దటన్న ప్రజల పద మన్న రాముని
వలన నొప్పె మంత్రిబాహుయుగము

వ. అంత రాముండు రథం బవతరించి తల్లిని సేదదేర్చి తండ్రిదగ్గరకుఁ
గొనిపోయి యిరువురకు నమస్కరించి యిట్లనియె.

క. యతియును మృతుఁడును లోకపు
గతివారలు కారు వారికై చింతాసం
గతి యేలఁ గన్నవారికి
యతి నయముకదా సజీవుఁడై యుండుటచే

క. సంసారులు మీరలు ని
స్సంసారుఁడ నేను నేమి సంబంధము ప్ర
ధ్వంసము పొందిన భోగరి
రంసామతితోడ మీకు రామునితోడన్

క. మీ రెవ్వరు నే నెవ రె
వ్వారికి నెవ్వరు విమూఢభావనకాకన్
స్వారాజ్యవిమతుఁడౌ నను
నీ రాజ్యము లోభపెట్టునే యిఁకఁ జనుఁడా!

చ. అని రథ మెక్కినన్ మొగములందున శోకము లొత్తిగిల్లఁ బు
త్త్రుని దెలివేదునేత్రములతోఁ గనుచున్ నిలుచుండి రెల్లవా
రును రథమున్ సుమంత్రుఁడు నిరూపితధర్ముఁడు తోలుకొంచుఁబో
యెను బురవీథి ధూళి గగనేందిరకున్ దెలిగందపుంబొడిన్ ౨౯౭

చ. తమ కనుచూపుమేర యరదంబును దాటెడుదాఁకఁ జూచి నే
త్రములకుఁ జూపునందని పథం బరదంబునుబట్టి నంతలోఁ
గ్రమమున నందఱుం దెలిసి క్ష్మాపతి 'హా! యతి! హా! సుపుత్ర! హా
విమలయశోనిధీ!' యనుచు వెక్కి స్మృతిం మఱచెం గుచానుభూతిన్

ఉ. అందఱు రాజు నాదుకొని యందలి వేదికఁ జేర్చి రంత రా
జుం దెలివొంది శోకమునఁ జుట్టునుగల్గిన వారిఁజూచి న
న్నిందుల కేలఁ జేర్చితిరి యే నట వీథిని ధూళిలోఁ బలం
గ్రుందుదు రాముఁ బోయిన పురంబున నే బ్రిదుకన్ నిజంబుగన్

క. అటువంటి కొడుకు పోఁగా
నిటు రాయివిధాన బ్రదుకు నేనే మనిసిన్
గటగట! యీ ప్రాణము లెం
తటి తీపో! సిగ్గులేని నాకుం గనుడీ!

చ. అనిన సుమిత్ర యీ యశుభ మాడఁగ నేటికి బిడ్డ రాముఁడున్
వనమున కేగినన్ దిరిగివచ్చును జేపు భయంబులేదు నా
మనుజవిభుండు నీ వనినమాట నిజంబునుగాదు వాఁడు పో
యిన వనసీమనుండి యతు లెవ్వరు రారు పునఃప్రయాతులై

క. వాఁ డెందుకువచ్చును నే
చూఁడించితి వానిగుండె శూలం బగ్గిన్
వాఁడిమి యిడి నేఁ దండ్రిని
వాఁడు కొడుకు తండ్రిఁ గాంచవచ్చును మఱలన్

వ. అంత మఱల మూర్ఛాగతుఁడైన రాజును గౌసల్యా కైకేయులు చెఱియొకవైపు పట్టుకొనఁ గైకేయీస్పర్శచే ఝుంఝుస్పృష్ట పార్శ్వమైన కోడెత్రాఁచు మలఁగి కసిగాటుకొనినట్లు రాజు చేయి విదలించి

శా. నన్నున్ ముట్టకువే నిశాచరవధూ! నా మేను నీ స్పర్శచే
మున్నే రాక్షసమైన దింక నయినన్ ముట్టంగరాఁబోకు మ
గ్గి న్నీవై చనునో భవత్కరసదాకీర్ణంబు పాపచ్ఛటా
సాన్నిధ్యంబున రాక్షసత్వము హృదచ్ఛస్రోతసుల్ పట్టునో 3౧౪

ఆ. నాకు నీవు లేవు నీకు నేనును లేను
నన్ను వదలిపోవె మిన్ను నాగ!
యంచు మొఱల మూర్ఛనందు నంతను రాము
రథము ధూళికాండ రాను కనఁగ

ఉ. లూనదృశాంబువుల్ నగరులోనికి రాణులు కొంచుఁ జన్న భూ
జానిని రథ్యలం జనెడు జానకినాయకు బండితో నయో
ధ్యానగరంపు భూప్రజలు దప్పఁగఁబోవుచు దీనవాక్య సం
ధానముగాఁగ రొప్పుచుఁ జనన్ బయనెత్తెను వాగలై చనన్

సీ. అధరపర్యంతమ్ము నరుఁగుఁదెంచిన తియ్య
తేనెగిండి కరంబులోన జాఱె
పరమపదంబు సోపానంబు పైమెట్టు
వఱకు వచ్చిన కాయఁ బాముకఱచె
షడ్రసోపేత భోజనముకై కూర్చున్న
యప్పుడు దుర్వార్త యరుగుదెంచె
పట్టాభిషేకార్థ భద్రగజారోహ
వేళ నేనుఁగునకుఁ బిచ్చియెత్తె
మునుపు సాకేతప్రజలు చేసిన యఘంబు
కైకయీదానవీమూర్తి కట్టివచ్చె
మా పయినిఁ బ్రేమచూపితి ఱేపు మాపు
నభినయ మటోయి స్వామి యటంచుఁ జనఁగ

క. రాముండును నాప్రజపైఁ
బ్రేమంబున రథము నిలిపి ప్రియమునఁ బలికెన్
మీ మీ ప్రేమము కాన్పీ!
నా మంచితనంబు లేదు నాయనలారా!

శా. ఏనున్ రాజునకున్ సుమారుఁడనె యట్లే కైకయీపుత్రుఁడున్
దా నెవ్వాఁడునుగాని భూమిపతి శాస్త్రంబుల్ స్మృతుల్ తీర్పుమా
ర్గానంబోవున, నెట్టిఁ డైనఁ బెడమార్గం బేల పట్టున్? మఱిన్
దానై పట్టిన, గొడ్డుపోయిరె బుధుల్ దండింపరో పౌరులన్ [illegible]

ఉ. రామునియందు మీకును దిరంబగు మోహము కల్గెనేని నా
ప్రేమము కై కయీసుతు నరిందము సద్గుణవారిరాశి ప్ర
జ్ఞామతిమీఁదఁ జూపుఁడు ప్రజల్ తను నింతఁగఁజూతు రన్న చో
నామృదుబుద్ధి మీ యెడల నట్లు చరించు ద్విధామనోజ్ఞుఁ మై

ఉ. అట్టులకాక రాజ యని నట్టి వినిశ్చితబుద్ధి మీకు నా
పట్టునమాత్రి యుండినను బల్కెద శాసన మాచరించెదన్
గట్టిగ నెవ్వఁడున్ భరతుఁ గాదనరాద యయోధ్యలోపలన్
బట్టిన నావ్రతంబు నరపాలుని యాజ్ఞయ మీకు నాకునున్

చ. అఱువది వేల వత్సరము లాపతి చల్లనియెల్లి నీడ నం
దఱు సుఖమంది యాధరణినాథుని యీ తుదినాళ్ళలోన విం
దఱు నలుపంపుకారణమునన్ ద్యజియించి కృతఘ్ను లౌదురో
చిఱుతుక మొక్క కై తరువు ఛేదనచేసినమాడ్కి నక్కటా!

వ. అని వారిం బంపించి మఱలఁ బోవుచుండఁగా వెనుక రథ మ్మాపు మాపుమన్న పెద్దఘోష వినిపింప వెనుదిరిగి చూడఁగా

సీ. వాజపేయచ్ఛత్రి వైభవంబులతోడ
సార్వభౌములవోలెఁ జనెడువారు
నవరత్నకర్ణ కుండలదీధితులతోడ
వేల్పుల కై వడి నెడలువారు
సితవిభూతిచ్ఛటాతతఫాలములతోడ
నీలలోహితులునా నెగడువారు
ఊర్జితశ్వేతయజ్ఞోపవీతములతో
యజ్ఞపూరుషులట్టు లలరువారు
కరగృహీతాగ్నులై శిరఃకంప మొప్ప
వృద్ధభూమీసురులు గుంపు లెనసి వచ్చు
చోసి తురగంబులార! సీతాసమేతు
సమరనుతు రాముఁ గొనిపోకుఁ డంచు వచ్చి

ఉ. రామునిచే నమస్కృతులు రామునిచుట్టును జేరి లక్ష్మణ
స్వామిని మధ్యనుంచుకొని జానకినిం బతిఁ జెంత నిల్పి యో ౩౫౧

భూమిధరాత్మజాత! వనిఁబోవుచు మమ్మును వీడిపోయెదో
యేమియుఁ జెప్పకుండ మము నేటి కయోధ్యను డించిపోయెదో?

చ. స్మృతివిహితప్రవర్తనునిఁ జెప్పి ధరాపతిఁ బంపితో ప్రజా
తతి మము నెట్లు పంచెదవు తండ్రి! దినానికి లెల్ల మా హవి
ర్గతి వని నమ్మి వేల్చెదము కానలనున్న ఋషిప్రకాండ మూ
ర్జిత మని మా తపస్సులు వరించుట లెల్లను రిత్తయౌనొకో!

ఉ. పుట్టకపుట్టినాము రఘుపుంగవ! నీవు నయోధ్యలోన మా
పట్టిన స్రుక్స్రువంబులకుఁ బట్టిన జిడ్డు తమోఽపహంబుగా
ముట్టెను బ్రహ్మలోకమున మూర్ధము కోసలరాజకన్యకం
బట్టివి నిన్నుఁబట్టె నుము భ్రష్టులఁ జేయకు మింతలోపలన్

సీ. ఇతరనానాధదైవతములఁ దొలఁగించి
సామవాక్స్తోభలఁ జనిన నీవు
అమర సపానసపాత్రప్రముఖులఁ ద్రోపెట్టి
ఋక్స్వరస్సులఁ బ్రసరించు నీవు
ఆహవనీయజిహ్వాగ్రభాగంబుల
నఖిలయజుఃఫల మైన నీవు
శాంతిపౌష్టికహోమసంపదర్థంబుల
మఱి యథర్వంబులై మాలయు నీవు
అక్కటకట! యాస్మాకీనమైన దగు ను
పాసనాసర్వమునయందుఁ బట్టి నిలిపి
యిపుడు నినుఁబోవనిత్తుమో యేము కూడ
నిన్నుఁబడి వత్తుమో రమాసన్నమూర్తి

వ. అనిన శ్రీరామచంద్రుండు వారికి నమస్కరించి యిట్లనియె

సీ. నే రాచనగరున నిలచి మీ యిండ్లుల
సామవాక్స్తోభలఁ జవితినేని
నే రాచనగరున నిలచి మీ యిండ్లుల
ఋక్స్వరస్సులఁ బ్రసరింతు నేని

నే రాచనగరున నిలచి మీ యిండ్లుల
నఖిలయజ్ఞఫల మైతి నేని
నే రాచనగరున నిలచి మీ యిండ్లుల
మఱి యథర్వంబులై మలతునేని

రాచనగరున నున్న న న్నాచి మీ యు
పాసనావీథి మీయిండ్ల( బట్టనైన
వనములందున్న న న్నేల( బట్టరాదు
కరుణ( జూడు(డు బ్రాహ్మణాగ్రణులు మీరు

క. లోకము గతానుగతికము
నాకుం బిల్చియు లంచు మీము వనంబున వెంటం
గై కొనిపోయిన( జూడు(డు
సాకేతం బెల్ల నచ్చు( జన దనవశమే ?

వ. అనిన బ్రాహ్మణు లెల్లరు నోసలు లందలి చెమ్మటలు తుడుచు
కొంచు( బోయిరి

మ. రథముంబోను ధరాపరాగపటలీరాజద్వితానంబు తీ
ర్చె ధరిత్రీసతి కాతుస్స్నెడ( బేర్మిన్ నాగ నశ్వంబులున్
బృథుకర్ణంబులు నిక్కి మెట్టువిసెపూల్ వెట్టంగ ధూళిచ్ఛటా
విధముల్ దెచ్చిన నీడలన్ విరిసె నుర్వి న్నాగవల్లీ వనుల్

ఆ. మఱల వెనుక(దో(చెను రథచక్రధ్వాన
మశ్వహేషలు( గళలాడు సడులు
వెనుకనుండి ధూళి విరిసి ముందుకు సాగి
యూగు మంచు( జేతు లాచినట్లు

శా. క్రీడామిత్రులు రాజపుత్రికులు సాకేతావనీభార్గవ
చూడారత్నము లా త్రిదైన్యవదనుల్ జూతిపవిధానపవిధ
క్ష్వేడామ్లిష్టవచోనిగుంఫనులు వెన్వెంటన్ సమీపించి మా
టాడంజూడక తోడుగా రథములున్ సాకూతిఁ బోనీయుఁగన్ ౩౨

గీ. తన రథ మ్మాఁపె రాముఁడు తారుకూడఁ
దమరథమ్ముల నాపిరి దశరథాగ్ర
సుతుఁడు నరదంబు డిగినఁ జూచి వారు
తమరథమ్ములు డిగ్గి రుత్తములు కడఁక

క. ఒక్కొక్కరిఁ గౌఁగిటఁగొని
చెక్కులఁ జేతులను నిమిరి స్నేహం బలఁగా
నిక్కరణిది మీవచ్చిన
మక్కువ నా శీలమందు మణిముక్కగదా!

మ. అరయన్ నన్ బడి మీరు వచ్చిన నయోధ్యారక్ష సేయంగ వె
వ్వరు కోదండులు? వృద్ధభూమిపతి మీపై నాసతో నుండు నా
ధరణీనుండును, నేను లేక సముదాత్తప్రేథబాహాధురం
ధరులౌ మీరును లేక యిప్పటిస్థితిం దానెంత దుఃఖించునో?

శా. అస్మన్మిత్రులు మీర లుండి నను ధైర్యంబూని నేఁబోయెదన్
నస్మేరాననుఁ డౌచు, నేటికి భవత్సన్మైత్రి యిట్లు మహా
పస్మారం బయిపోయె నా శపథ మేవారేని నిందింపరా
దో, స్మృత్యుజ్జ్వలధీను, లేఁ జనుటలో నున్నట్టి సౌఖ్యంబులన్

ఉ. మీరలు నాకు నిక్కముగ మిత్రులయైన నయోధ్య కేగుఁ డా
ధారముకండు రాజునకుఁ దా భరతుండును మంచివాఁడు నా
పై రహింపెల్లయున్ భరతుపైనను జూపుఁ డతండు రామున
ట్లే రహించు, స్నేహమదియెల్లయుఁ గూడి చరించుటేకదా

క. ఒక్కొక్కనిమిత్తముచే
నొక్కొక్కరితోడఁ గలిసియుందుము నదియున్
మక్కువగాఁ గనిపించును
చక్కని గుణములనుగూడ సంధానించున్

వ. అని వీడుకఁబలికి వారిని బంపించిన

మ. రథముం బోయె సుమంత్రచాలితకశారావంబు నశ్వంబులున్
పృథునేత్రంబులు ప్రత్తికాయుతలవలెన్ విప్పారగా విచ్చి విం
చు ధరాధూళిఖురాగ్రధూననధురాత్తోదంబుగాఁ బోవ వే
పథుమన్మ స్తకలగ్నసీడజగరుత్పత్రాగ్రశంస త్స్వరన్ 333

చ. జలముల నల్ల నాచుఁ దమసానది వచ్చెను గాంతి రేక లం
చలముల నల్ల నాచును విశాసతి నచ్చెను నచ్చి వాహినీ
జలముల నుర్వులై మెఱయుఁ జాల్మన జాలక పీలిరంగుగా
మలఁచె బ్రివాహవారి కుసుమంబు లనెల్లను నల్ల కల్వలై

మ. తమసాపశ్చిమతీరసంజ్వలితకాంతాగమ్ములో నున్న వృ
క్షములుం జీఁకటిముద్దలంబలె వనీసర్వంబు పిండీకృతో
గ్రము దోషాకృతిఁ గానిపించె విహగవ్రాతంబు దాక్షిణ్య జన
క్రను మేపారఁగ స్వాగతమ్ము నెఱపెఁ రాత్రిస్థవిస్తాంబరుఁ

వ. అంత శ్రీరామచంద్రుండు సీతాలక్ష్మణులం గాంచి యిట్లనియె

ఉ. ఈ నది ప్రోంత వించు నుది నెంచెద నందఱు నింటిదగ్గరఁ
దీనత దుఃఖరావమునఁ దేలుట యీవిశే యింతనల్లనై
తానుగఁ దండ్రిదైన యెడఁదఁ మది నెంచెద నంతశోకముఁ
బూని సహింపఁగల్గునొకొ భూపతి యాపతితవ్యధామతిఁ

చ. కొలయిడి భక్తిఁ జూపు ననుఁ గొందును దా భరతుండు తల్లి తం
డ్రులఁ బ్రియసాంత్వనోక్తుల గడుంగడు నాదుకొనుఁ మనోజ్ఞ పే
శలమతి సాధుసంగతుఁడు సద్వ్రతిరి క్షపథానఁ బోఁడు నా
వలనున మిక్కిలిఁ బ్రియుఁడు వాఁడును నావ్రత మాదరించెడుఁ

చ. నిజముగఁ దమ్ముఁడా! మఱియు నీవును నన్బడి రాకయున్నచో
నజగరసింహదైత్యబహుళావని యీవని నొంటి నే విదే
హజఁ బరిరక్షసేయుటను నోదునొ? నీ నిట నాకు సాయమై
ప్రజయెడ వాఁడు సాయమయి, రాముఁడు నిక్కముగాఁ గృతార్థుడే!

వ. ఈ రాత్రి నేను మంచితీర్థము పుచ్చుకొనిమాత్రము పరుందునని
సుమంత్రుం గాంచి

క. తాతా! శ్రమయిచ్చితి నీ
కేతావునఁ గలదొ రేవు నీ గుఱ్ఱములుఁ
వే తోరహాతు బడలిన
వే తేరుట నీరువెట్టవే దయ ననుచుఁ

గీ. అందఱును సాంధ్యకృత్యము లాచరించి
వేగ నశ్వంబులకు నీరువెట్టి మంత్రి
యేటియొడ్డునఁ జెరిగి మోకాటిలోతు
పచ్చికందమన మేపి కప్పడము కప్పి

చ. చివురులు నాకులేర్చి నునుసెజ్జ ఘటించి సుమిత్రబిడ్డ రా
ఘవునకు సీతకున్ వినయకంపితహస్తుఁడు కొంతదూరమం
దవనిని దాను మంత్రియుఁ గరాగ్రధనుష్కుఁడు నుండి యన్నగా
రు వదినె నిద్రపోవఁగ నిరూఢరఘూత్తమభక్తిభావుఁడై

క. ఆ రాత్రి రాత్రియెల్లయు
శ్రీరామునిసద్గుణాలిఁ జెప్పుచు నుండన్
దూరగప్రాచీముఖసిం
దూరతిలకమైన తరణి తోఁచెన్ దానై

ఆ. ప్రాచి వెలుగురేక వాటినయంతన
మేలుకాంచి తూరుపేలు కాంతి
మొగుడుకనుల రామమూర్తి కాంచుచుఁ దమ్ము
తోడనున్ సుమంత్రుతోడ ననియె

సీ. పసపుపచ్చనిరంగు పల్లరేకల చివ
ళ్ళన్నుఁ దెల్లగన్నేరుపువ్వులు విరిసి
పసపుఁగుంకుమ సామువాళ్ళుగాఁ జల్లిన
తీరైన బంతిపూనారు వోసి
మొగ్గయై విరియుసొంపునఁ బైని పసరాకు
వాలించు నెఱ్ఱకల్వలను బూఁచి
మెఱుపు క్రమమ్ముగా విఱుగుట వేఱుగం
గుల ముద్దుమందారములను జూపి
మల్లికలును జేమంతులు చల్లినట్లు
మఘవసౌధప్రఘాణసంపత్తి నెఱపెఁ
బ్రాగ్దిశాదేవి పతిమీఁది వలపుకొలఁదిఁ
బోవునో పోదో పతి వనిఁ బోవునేని?

ఉ. ఈ తమసానదీపరిసరస్థితపక్కణవాసులౌ ప్రజల్
చేతములందు మేల్కొనరు శీఘ్రముగాఁ దమసానదీజలం
బాతలఁ జేరిన౯ జనములందఱు మేల్కొనిరాఁగ విఘ్నసం
పాతము లేకయుండఁ జనవచ్చును తాత! రథంబు కట్టవే!

చ. అనిన సుమంత్రుఁడు౯ రథమునందున యుగ్యముల౯ ఘటించి రా
మునివచనంబున౯ రథము బోవఁగనిచ్చి యుదఙ్ముఖంబుగా
జనులఁ బ్రమత్తుల౯ సలుపఁ జక్కఁగ నాపయిఁ జెట్లచాటుకై
కొని చనుదెంచి యందఱును గూడి నదీతరణంబు సేయఁగా

సీ. సాగి గిట్టలలోతుజలములౌ నొడ్డున
వెనుకాడి సీళ్లులు విరియఁజిమ్మి
తూఁగి మోకాలిలోతు జలంబులందున
ముంగాళ్ళఁ జిమ్ముచుఁ జెంగలించి
వంచిన ముట్టెలపై దూఁకు కెరటాల
బుస్సలఁగొట్టుచుఁ బోవఁద్రోఁచి
జలసిక్త పృష్ఠదేశము లుబ్బి నిగనిగ
లాడఁ గండరముల నక్కళించి

యున్నమితమూర్ధమధ్యసముజ్జ్వలంబు
పట్టుకుచ్చున దుమికిన వారిబిందు
లవఘళించి శిరశ్చాలనావళీణ
ములను దమసను జనె నశ్వములు బిరాన

ఆ. అట్లు ప్రజలు తెలియనట్లుగ దూరాన
పాటిరేవునందు దాఁటి తమస
రథముపోయినంత రామునిఁగానక
వడి నయోధ్యనుండి వచ్చు జనులు

మ. తమసాతీరమునందు రాఘవుఁడు నిద్రంబోవు నచ్చోట న
బ్రముగాఁ బ్రస్థితు రామునిం గలసికోనచ్చు౯ రఘుస్వామి దూ
రము తోఁతెంచినవారిఁ బొమ్మనఁడు చేరంబిల్చికొంచేగు నం.
చమర౯ రాతిరినెల్లయు౯ నడచి వారచ్చోటికిం జేరఁగ౯ [illegible]

ఉ. రాముఁడు లేఁడు బండి కనరాదు సుమంత్రుఁడు కానిపించఁడు
ద్దామపతివ్రతానుకుటదామము జానకి లేదు, లక్ష్మణ
స్వామి భుజావిలగ్నధనుస్సంబగు మూర్తియు జాడలేదు శ్రీ
రాముఁ డహో వియత్పథమురాగతిఁ గానను జేరఁబోయెనో?

సీ. ఈ రథచక్రంబు లిందాకఁ జనుదెంచి
యిటఁ జాలునాగిపోయిన దిదేల?
యిట బండివిప్పఁ ద్రొక్కఁబడ్డమైన గుఱ్ఱాల
యడుగులు కనిపించు నడచినట్లు
జీర్ణమైన యిచటి పచ్చిక తలల్లేవు గు
ఱ్ఱాలు మేసినవి కాబోలు నిచట
నిది గిదిగో స్వామి యిచ్చోట నిద్రించె
నాకుంజపురుసెజ్జ యమరియుండె

దేవి జానకి యిట్లు నిద్రింప, భర్త
తల్లితొడమీదఁ దలయిడెఁ దాను స్వామి
శిరసుమోపిన యిచ్చోటి బరువులేను
ఎచటి కేగిరో! యింతలో నిట్టుగాఁగ

క. ఇదె యుత్తరాభిముఖముగ
గదలినది రథం బయోధ్యఁగాని చనెనో?
వదలిన యాయోధ్యకుం బో
వుమరా? శుభ మంచు నిట్లు పుచ్చిరి రథముఁ

చ. మనరథ మేమియైనయది? మావులు జేనికి వేల్పుతేఁ దోసం
గినయవి మింటిపైఁ జనెడు కృత్రిమవాహము లే వనంబునం
జనియెను స్వామి? నమ్మప్రజం ద్యజియించుట యంతగుండెమె
త్తనగలసామి చేయఁడు కదా! మనపూర్వకృతంబె యిట్టిదా

సీ. ఏగుఁడు మీరెల్ల నే నయోధ్యకు నేగి
కనుగొందు జాడ బ్రాహ్మణుల నడిగి
విరహినై ప్రాయోపవేశంబు చేసెద
నే నిందు మీ రింటి కేగవచ్చు

తమసానదీజలాధఃపంకమున నేను
గలసిపోదును నేను గదలిరాను
అమ్మ జానకికైన నల్లంత దయ యుండఁ
బడదొ నెమ్మది బండి సడుపు మనఁగ

బిడ్డలకుఁగూడఁ దనపేర్లు పెట్టుకొన్న
మనల నిటుసేయుటయు న్యాయమా ప్రభున్రు
కంచు నల్లాడిపోయి పల్లి జాలి తమస
యొడ్డునఁ బెద్దపొడుగునం దూఁగి చూచె

సీ. స్వాధ్యాయమున స్వామి వసియింపుమనందురు
నవి నేర్వ విప్రుఁడనైనఁ గాను
వింటికొప్పున స్వామివిభవంబు కల దందు
రే వింటిమొగమైన నెఱుఁగనైతి
సజ్జనహృదయసంచారి రాముం డంద్రు
సద్వస్తు వెట్టిదో జాడ యెఱుఁగ
వింతటి త్యాగమహీయుండు మారాజు
త్యాగ మింతైన నభ్యాసపడమ

వదలిపోయెదు సామివెంబడిఁ బథంబు
తప్పిపోవక పోయెదు దారి నెఱుఁగ
వ్యర్థముగ నేర్చి యేమిలాభం బటంచు
నానిల్లిరి బి ట్టయోధ్యాజనంబు

సీ. నేను గైకనుసుమీ కానకుఁబంపితి
రాము నట జంపంగరాదె మీరు
రాజును నేను మీరాముని వనికిఁ బం
పించితి నన్నుఁ జంపింపఁజూడుఁ
డేను దైత్యుఁడను మీ యేలిన రాముని
వని బాధపెట్టెద నను హరింపుఁ
డేను గైకయికోరు నే కోర్కె యాకోర్కె
నన్నదాస్యపిధాన మాచరింపుఁ

దేను రఘురాజులెత్తిన దైన సత్య
వాక్యపాలనావ్రతమును వ్రతము వోలె
గానిపింతును గాని నక్కసిని నేను
నన్నుఁ జంపుఁడటంచుఁ గొందఱు వచింత్రు

సీ. ఈ తమసానది యింతటిద్రోహిని
దీనిని బట్టి బంధింపుఁ డంచు
క్షోణి చక్రంబులగుర్తు మాయముచేసె
నిది భూతధాత్రియా నెట్టు లనుచు
నతఁడు నంతర్హితుం డౌటకు నెడమిచ్చె
నాయెద నిది నల్పి వేయుఁ డంచు
నీమాయ యిది గతయామినీదేవిది
యేమానొ మఱల రానిమ్ము టంచు
విరహాసంజనితోన్మాదవిభవకృతులు
సాధుసాకేతపురనివాసంబువారు
నట్టివెదకుచు వెదకుచు గట్టుపుట్టఁ
బట్టి యిలుదారి విడి పరిభ్రమణ సేయ

గీ. రామునిరథంబు తీవ్రధారానితాంత
గమనమున నేగునట్టి యుగ్యములతోడ
సర్వజనులశోకంబును సర్వజనుల
కోరికలు పండనట్లు దూఁకుచును బోయె

ఉ. వీలయినంతవట్టునకు వీరుఁడు రాముఁడు మంత్రితోడుతన్
దోలుము బండి యూళ్ళపెడఁద్రొక్కుచు నంచును జెప్పెఁ బత్తసి
జాలము వీథులన్ రథముఁ జయ్యనఁబోవఁగ రాదు నెమ్మదిం
దోలిన గుంపులై ప్రజలు త్రోవ గొఱసంగరు దీనవాక్కులై

క. మాయూరు పాడువెట్టెద
మో యయ్యా! యడవి సేసి యుంతను గుఱుతున్
మీయయ్య నేమియందుము
మాయయ్యను నిట్టు లడవి మఱి పట్టింపన్ 3౬౨

శా. ఓసీ! కోసలరాజ్యలక్ష్మి! త్రప లేదో నీకు, నిర్భాగ్యురా
లా! సీతాపతి నీముఖ గ్రయుగునం జారాటపడ్డంతలే
దే! నీమాటివి, వాంఛనుఁ బురిటిలోనే సంపుకొంట్టే మహా
ప్వాసుండౌ రఘురాముడిక తన కేలా పట్టు నిర్భాగ్యనుఁ

గీ. ఓయి! రఘురామ! నీ దర్శనోత్సవమ్ము
దినదినమ్ము సాకేతభూజనుల కట్లు
మాకు లేకున్న నేమాయె మాకుఁగల ద
యోధ్యతో పాటు నీ విప్రయోగవహ్ని

సీ. అంభోధరమ్ముల యందున్న నలుపులోఁ
గోమలత్వంబెల్ల గుస్తరించి
యిందీవరమ్ముల యందున్న నలుపులో
స్వాదుతాగుణమెల్ల బాదరించి
హరినీలరత్నంబులందున్న వెలుఁగులో
నైగనిగ్యంబెల్ల మాగుదేరి
శాపింఛపల్లవ (శ్రీ) పొందు జిలుగులోఁ
జిక్కణత్వం బెల్ల మక్కళించి

మాకు మాగుండెలందున్న యాకసంబు
శారదికదీప్తులను వెదజల్లినట్టు
లెదుట సాక్షాత్కరించెడు పదను మేను
నేఁడు కొక్కమాఱేఁ జూడమేమి మేము

శా. నీవెంటం జనుదెంతు మంటకును దండ్రీ! భీతియయ్యెంగదా
నీవెంటం బడిరా దయోధ్య మఱికానీ కోసలం బింతకుఁ
నీవెంటంబడి వత్తు నన్న నెవరేనీ నవ్విపోరో! మఱిన్
నీవాల్లభ్యముప ట్టయోధ్యకు మహానిందానృథా హేతువౌ

సీ. స్వాహావధూపతిజ్వాలాముఖంబుల
నల్లత నేతిబొట్టందనీము
కోదండల స్తకోత్పాదిపృషత్కంబు
నంగుళం బంత మే రరుగనీము

స్వాపతేయం బెంత సమకూరు నంతయే
చిఱుచిల్లి గవ్వంత పెరుగనీము
సర్వధురీణ ముక్షముఁ జావడిని విప్పి
యఱ్ఱుపైనను గాడి సానసీము

జడతపస్వులమై రఘుస్వామి నీవు
వచ్చునంతకు నిద్ర మా వ్రతము వినుము
వ్రతము నీయది నీది, మా వ్రతము మాది
వ్రతము భంగించు మని చెప్పరాదుగాదె

చ. అనుచును గోసలప్రజలు నాడెడుమాటల నాలకించుచుం
జనుచును రామచంద్రుఁడు ప్రసన్నముఖాబ్జుఁడు లోకమందు భా
జనము లోకాళ్యకళ్ళపరిసంగతిచే నలవాటుపడ్డ భా
వనమునఁజేసి శోకములపాలగు లెంచుచుఁ బోవుచుండఁగా

క. కోసలములు వెనుకఁబడెన్
బేశలసితవారి వచ్చె వేదశ్రుతి యన్
శ్రీశైవాలిని శివజల
కోసలములఁ దరగలొత్తుకొంచుం జనుచున్

వ. శ్రీరామచంద్రుం డందు స్నానమాడి కోసలధాత్రికి నమస్కరించి సెలవుగైకొని

సీ. శరదృతుస్వామి యే సంయమికడ నేర్చె
నదులకై తెలిచీరనాగరకత
కాశికాపతి వింధ్యకలితశిరోనతి
నియతిమై నేయమి నిత్యవిరహి
ఉప్పుమళ్ళుమ్మె మహోదధి యేమహా
యమిసూర్యకరనిపీతాంబు వగుచు
నెల్లతల్లుల కుగ్గులిడ వాంఛితంబయ్యె
శిశులకై యేయమిజీర్ణ శక్తి ౧౨౫

యరయ నా మౌని యుపప్పురందరనిబర్హ
చండసర్పశబ్దశేషచక్రివరి
యా ముని వసింపు దిశఁగూర్చి యరిగె రథము
ఆ ముని వసింపుదిశఁ గూర్చి యరిగె స్వామి

క. తూరుపు పడమరలంగాన
వారక యుత్తరముగందు వసములు లేవో
శ్రీరామచంద్రుఁడేలో
యా రథముం ద్రిప్పె దక్షిణాశాముఖమై

మ. అరదం బేగను సేగ గోమతియు సంప్రాప్తిం చెఁ గల్లోలసా
గరరాడ్భామిని తీరగోచరణరేఖామోహనాకార భా
స్వరగోపీజనబాలమోహని రథస్థానంబు పాథోఽంతరాం
తరమందార్ద్రితపొంది సన్నవడియెన్ నా ద్రోగెఁబో దాటుచో

మ. మఱియుంబోఁ జనుదెంచె స్యందికయనన్ మాయూరకాపోతశా
కరుతిస్వాదుమనోజ్ఞతీరనని చక్రాంగపత్రానాచ్ఛప
క్షనదాకంపితవారిజోత్కరజస్సంకీర్ణతీరాంబువై
మురువొ వాహిని యంత దాఁటె నగదంబున్ దాని నగ్గానియై

ఉ. ప్రాకటమైన తత్పురిసరంబగు దేశము నెల్ల పూర్వమి
క్ష్వాకున కిచ్చెఁబో మనువు స్యందికదాఁకను గోసలంబునీ
క్ష్మాకడ కోసలేతరమహావని, యచ్చటుతోడఁ గోసల
క్ష్మా కడమున్నెటె రాముఁడును గాంచి రథంబును నిల్పుమం చనెన్

క. తనమాటలును రథాంగ
స్వనములు శ్రుతిగలియ రామచంద్రుఁడు మంత్రిం
గని యిట్లనె సౌమిత్రియు
జనకజయును వినుచునుండ సమ్మోదమునన్

చ. ననిఁ బదునాలుగే తిరిగివచ్చెద నెప్పుడు తల్లిదండ్రులం
గని మఱి వారికిన్ ముదముగల్గను జేసెద నెప్పుడెప్పుడో
చని సరయూతటీవసుమసంతతిముగవనీవిలాసమో
హనచరణంబు గాంతు సుహృదావళితో మృగయావినోదినై ౩౭౭

మ. సరయూకాననరమ్యదేశమృగయాసంతోషముం బాయ దా
దర మెక్కెన్ జుమి నాడుగుండె కని యంతన్ దాను సాకేతపుం
బురికిన్ నిల్చుచు నాభిముఖ్యముగ రాముం డిట్లనెన్ 'తల్లి' యో
పురి! నిన్ వీడెద నమ్మ! నాకు కయిమోడ్పుల్ నీవిఁ గైకోఁగదే

సీ. సాకేతశృంగాటకాకీర్ణ మృదువాయు
వీథీవిహారులా వేల్పులార!
సాకేతసౌధరాజవ్రాతగతుణా
ధీనమనస్కులా త్రిదశులార!
సాకేతగృహదేవతాకోటిభూతోప
లాకారబద్ధులా నమసులార!
సాకేతరాజ్యలక్ష్మీకామినీగోప
వీరానతాదులా విబుధులార!

మఱల వత్తును వత్తును మఱల వత్తు
వత్తు మీ యందఱకు బలులిత్తు మఱల
మఱచిపోఁబోకుఁడీ నన్ను మమతఁ జేసి
యిన్నినాళ్లులు మన్నించుచున్న నన్ను

వ. ఈలోపున వేదశ్రుతిగోమతిస్యందికాతరణంబు సేసి యచటఁ జేరిన కొందరు సాకేతవాసులు కోసలప్రజలు శ్రీరామచంద్రుంగాంచి దుఃఖించుచుండ వారితో నిట్లనియె, 'సయ్యాన! మీ ప్రేము నాయెడఁ గోసలంబులుదాటె,నని వారికిఁ బ్రదక్షిణించినమస్కరించి మీరింక నుడుఁగుడు, నాయాన' యని మగిడించి రథముతోలించిన ధనధాన్యవంతులయు దానశీలురయుఁ గోసలంబులు, నకుతశ్చిద్భయంబులు రమ్యంబులు చైత్యయూపసమావృతంబులు నుద్యానామ్రవణోపేతంబులు సంపన్నసలిలాశయంబులు తుష్ట పుష్ట జనాకీర్ణంబులు గోకులాకులసేవితంబులు నగు కోసలంబులు,లక్షణవంతులగు నరేంద్రులయు బ్రహ్మఘోషాభినాదితులగు బ్రాహ్మణులయుఁ గోసలంబులు వెనుకఁబట్టిన

మ. క్వచిదస్తాపదవర్ణసైకత క్వచిద్గంభీరపాథస్కయున్
గ్వచిదుద్భ్రాంతవిహంగసంతతి క్వచిత్కాశప్రసూనాచ్ఛయున్

క్వచిదాసీతతుషారశీతల క్వచిత్కామ్రిస్వరవ్యాప్తయున్
క్వచిదాకాశవిశాలభావకృతిస్ఫ్రాత్పర్యకృష్టాత్మయున్

సీ. ఈవారి శ్రీమహాదేవజటాటవి
చిగురు చీల్చుక వచ్చు మొగలిరేకు
ఈజల స్పర్శమ్మ కుభుజానుగ యశఃప్ర
కాశపాథ స్తటాకంబు కయ్యె
ఈవారి రత్నాకరేంద్రహేలాధృతి
వ్యాలంబి యుత్తరీయంబుమాగు
ఈజలమ్ము మహాఘకృంతనకృతిచిరం
తన మహాసుకృతంపుతరువు వేరు
ఈయమ త్రిలోకికిఁ జను మూఁడుపాయలకును
దుదలును మొదళ్ళు దెలియని విదితవారి
యీనది నిరంతసుకృతసాహిత్యరేఖ
సకలదైవతములకు నాచార్యకంబు

వ. దివ్యయు శివతోయయు నశైవలయు ఋషివిశేషితయు శ్రీమంతము
లవిదూరస్థములైన యాశ్రమములచేత నలంకృతయు సకాల
మున హృష్టలైన యచ్చరలచేత సేవితయు దేవదానవగంధర్వ
కిన్నరులచే నుపశోభితయు దేవాక్రీడశతాకీర్ణయు దేవోద్యాన
శతాయుతయు దేవార్ధాకాశగవిఖ్యాతదేవపద్మినియు జలాఘాతాట్ట
హాసాగ్రయు ఫేననిర్మలహాసినియు, క్వచిద్వేణీకృతజలయుఁ
క్వచిదానవర్తశోభితయుఁ క్వచిత్స్తిమితగంభీరయుఁ క్వచిద్వేగ
జలాకులయుఁ క్వచిద్గంభీరనిర్ఘోషయుఁ క్వచిద్భైరవనిస్వనయు
దేవసంఘాప్లుతజలయు నిర్మలోత్పలసేవితయుఁ క్వచిదాభోగ
పులినయుఁ క్వచిన్నిర్మలవాలుకయు హంససారససంఘుష్టయుఁ
జక్రవాకోపకూజితయు నొడ్డునందున్న చెట్లచేతఁ బూలదండలచేత
వలెఁ బ్రకాశించుచు, వికసించిన కలువతమ్ములచేత నేత్రములు
విప్పినట్లు చూచుచు, బూవులదుమ్ముచేఁ గప్పఁబడి గంధపూఁత
చేతవలెఁ బరిమళించుచుఁ దెల్లనై నిర్మలమైన జలముచేతఁ జేత
నద్దముఁ బూనినట్లు మెఱయుచు నేనుఁగులచేత సేవింపఁబడుచు
భూషితురాలైన మహాలక్ష్మిసన్నిభయుఁ బుష్పఫలకిసలయగుల్మ

ఆ. రథమువిప్పి యశ్వరాజికి నీళ్లొట్టి
చెట్టువేళ్లనందుఁ గట్టివేసి
మంత్రి తమ్ముఁడతోడ మహిజాతతో రాముఁ
డున్నచోట నిలచియుండె నచ్చి

శా. అంతన్ రాముఁడు మంత్రిఁగన్గొనుచుఁ దాతా! నీవు [illegible]
పాలింతా బెల్ల నిషాదుఁడా గుహునిదా రాజ్యంబు నానేస్తు సు
మ్మింతే నాతఁడు నన్నుఁ జూచినను బోనీఁ డైన నరాత్రి వి
శ్రాంతిం గాంతుము యిచ్చటన్ మిరుల గుఱ్ఱాలున్ విశ్రాంతిఁ జెందఁగా

క. అను నంతలోన గుహుఁడుం
జనుదెంచెను మంత్రిసమితి జ్ఞాతులు వృద్ధుల్
తనవెంటరాఁగ రఘురా
మునకును నర్ఘ్యమ్ము పాద్యమును నిచ్చె వెసన్

చ. మొగిఁ గౌఁగింటికిఁబట్టఁబోవు రఘురాముఁ జూచి సానందని
మ్నగ కన్నోసలలోఁ దల తలలు నింపన్ దోసిలింబూని ము
న్నుగ శ్రీరామునకుం బ్రదక్షిణముగానుం బోయి 'యో రామ! నా
మొగసాలం జనుదెంచి రెల్లయును వేల్పుల్ స్వామి! నీరాకచే

ఆ. ఏమి యతిథివచ్చె నింటికి నారాజ్య
మెల్ల నీది నీకు నేమియేమి
వలయు నవ్వి యవ్వి వాడుకో! శ్రీరామ!
యేమి చెలిమికాఁడో! యీవు నాకు

శా. నీకెన్నాళ్ళకు నిండుప్రేమ కలిగెన్ నీదేవితో వచ్చినా
వీ కాంతారపునేల కోయి ప్రభువా! యిందేల మాయింటికిన్
రా! కాయంబును గోసి యిచ్చెదను నీ కస్మద్గృహశ్రేణి శ
య్యాకంథాదులు బోనమెల్ల సదుపాయంబుల్ ఘటింతున్ జుమీ

మ. అనినన్ రాముఁడు కౌఁగిలించుకొని నీదౌ ప్రేమ నేనా యెఱుం
గని దేనిప్పుడు మున్నువచ్చినటులన్ గా దిప్పుడే తాపసిన్
గనుమీ తాపసవృత్తు నింగుది యిటన్ గాలూదితిన్ నీవు నా
కును గల్పించెడి యెల్ల సేనలును నీ గుఱ్ఱాలకుం జేయుమీ ౩౯-౪౦

గీ. రాజచిహ్న మ్మదెల్ల గుప్తాలయందె
కలద యిప్పు డనఁగ గుహుం డలంతఁ బొంది
యశ్వముల సేవకులకునై యప్పగించి
ముకుళితాంజలి రాముని మొగముచూడ

శా. రాముండిట్లను నోయి యోయి సఖుఁడా! ప్రాణంబులో మైత్రి నీ
కేమో యిట్లనిపించు నయ్యదియుఁ బోనీ! నీకు సౌఖ్యంబె? భృ
త్యామాత్యుల్ భవదాజ్ఞ సేయుదురె? న న్నాలోచనం జేయుదే?
శ్రీమజ్జాహ్నవి దారువాహమున నీ సేమంబు మన్నించునా?

గీ. అడవిలోఁ జెట్లుకొట్టి గంగాంబువారిఁ
దేల్చి పరదేశములకు నందిచ్చు నీకు
స్థపతి యను పేరువచ్చిన సరణిఁ జూడు
మనుచు నవ్వె రాముఁడు గుహు నలఁతఁ దీర్చె

క. అని యెల్లనఁ గన్గొని యి
ట్లనె రాముఁడు సంజ యెఱ్ఱనై త్రిదివనదీ
వనములు పుష్పింపించెను
జనకసుతా వేణిఁ గుసుమసంతతి చెఱివెఁగ

సీ. బాహాటనటపీఠిలోహితానతపాద
కంజాతమాణిక్యకాంతి చెదరి
విధురనాట్యక్రియాభివిసృతధూర్జటిజటా
జూటాగ్నిచ్ఛటల్ వేడ్కరేఁగి
క్రమ్మఁదెంచిన సాంధ్యరాగంబునం దను
రాగమ్ము పొందు టబ్రమ్ము కాదు
శివజటానిస్సృతదివిజాపగావారి
పులకితహ్రదజలాభోగ యగుచు

నని రఘూత్తముఁ డిట్లనె నవును గాని
నేను భోజనముం జేయఁబోను నేఁటి
రాత్రి కొంచెము మంచితీర్థంబుమాత్ర
మానియుందును దక్కిన మాటచూడు ౪౦౦

మ. ఒకరాముండు భుజింపరామి మదమాత్యుల్ నీవు నేనల్ల వా
రికి నన్నంబు రుచింప దీ నిశ హిమారిజ్వాల మస్మత్ప్రభు
త్కకదంబంబున జంతుపక్షిభుజగీద్యైతేయపీడాదిమో
చక మానట్లు చరింతు నీ విచట విశ్రాంతిం గనంగాఁ దగున్

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె

సీ. సకలధర్మముల శాస్థాన మీ నా యన్న
యాయనకంటె మహానుభావు
రాలు మా వదినె నా రన్నమ్ములేకుండ
నునుమె తపఃఖ్యులఁ గనులమూయు
వారు, వారీ గతి పచ్చికనేలపై
నిద్రింప నాకుఁగానీ తలంపు
మన్నంబు రుచియించునా ! నిద్రవచ్చునా !
సాకేతమున నున్న జనము లెట్లు
లుండిరో! తండ్రి జీవించియుండునోకో?
తల్లి కౌసల్య యేరీతి తల్లడిలునో?
యెవరు జీవించియుండిరో యెవరు రాము
నీ యెడరు నోరువక చచ్చిరో యెఱుంగ

క. ఆ యంత యయోధ్యను మఱి
మాయమ్మ సుమిత్ర యొకతె మది ధైర్యమునన్
జేయూఁత యగుట కందఱి
కామెంబో తండ్రి యేమియై యుండెడునో?

ఉ. నద్దని నేలపీడఁ బరువా! తన కేమియుఁ బట్టనట్టుగా
నిద్దురపోవు నన్న, ద్విగుణించిన యీ పెనుశోకమంతయున్
ముద్దగవచ్చి నా దయిన మూర్ధమునందునఁ గూరుచుండె నే
హద్దులేక నిద్దురయు నాఁకలి నా కవి యెప్పుడో చనెన్

మ. సయిదోడుందన మందుమో! భరతుఁడున్ శత్రుఘ్నుఁడున్ నేను న
న్నయు నెట్లుందుమొ యట్లులుందుము దురంతంబైన యీ హేతుసం
చయ మేమైత్రికి నెట్టి భంగము ఘటించం జూచునో యీ వ్యథా
మయమై నాయెద యొక్క-క్రోవఁ జన దంబావంచనావిద్ధమై ౧౧౩

గీ. గాధితనయు నపారమౌ కరుణవలనఁ
జెడినలోకమ్ము నిటు వలసిన విధానఁ
జేయఁగల్గుదు మనను జేయలేమ
యింతకంటెను దుర్గతి యేమివలయు?

వ. ఎవ రెన్ని చెప్పినను వినఁడు ఘోరకాంతారవాసదీక్షితుం డనిన,
గుహుం డింకను నేను చేయు నారాజ్యంబు స్వీకరించియుండుమని
యడుగవలయుననుకొంటినన, సౌమిత్రిని స్నేహంబు చెడఁగొట్టుకొనఁ
నుమ, యిదమిత్థ మని యూయనమనస్సు నిర్ణయింపలే మనుచునుండ

క. ఇద్దఱు నిశ్వాసములను
నిద్దఱవమానముల మఱియు నిద్దఱు యాభీ
లోద్దామవచోవ్యాపృతిఁ
దద్దయు నిశయెల్లఁ గడచి తనుములు విరిసెన్

సీ. అరుణజటాకాంతిసరణి రామునిమౌళి
సీతకొప్పునఁ బైడిపూఁతవోలెఁ
గాషాయవల్కలకాంతి రాఘవుమేన
భూసుతమై మేలిముసుఁగువోలెఁ
గందిన మెట్టనికరణి రామునివ్రేళ్ళ
రమణిపాదములఁ బారాణివోలె
బాలసూర్యోదయప్రభ లింగుదీపాద
పమ్ము కొమ్మలనుండి వ్రాలివచ్చి
తడిమెఱుంగక మొట్టని తలలు వేయు
సస్యమునుబోలి పచ్చికఁ జఱచినంత
రామచంద్రుఁడు తమ్ముఁజేరంగఁబిలచి
యమరనది దాటఁగావలె నంచుఁ జెప్ప

క. స్థపతి యమాత్యులతో వ
త్రపుకానులలో నమారుత్రాళ్ళు దులిచి చో
క్కపునావను గొనిరమ్మని
విపుణునిఁ దండేలు రమ్మనియు వచియింపన్

సీ. ఎప్పుడప్పుడు మెఱుఁగెక్కించి రంగు తా
జాతన మ్మొప్ప నేజాపటాలు
జాటుకట్లను నూడ్చి చక్కఁగా శుభ్రమై
పొనుపడఁజేసిన యనిమిత్తట్లు
నటునిటు నాన యూఁగాడకుండఁగను గ్రొ
త్తగ వేసినట్టి లాతాలబిగువు
సమగముత్తట్లునం దందమ్ముంచిందు ని
ర్మాణమ్ముగల భద్రమైన గదియుఁ

గలుగు నావను స్థపతియాజ్ఞాధురీణు
లాటఁబొంతాలు ముడితీసి కేటులాగి
రాటుతేలిన తండేలు ప్రభుతఁ బూన్చి
శీఘ్రముగఁదెచ్చి రేవున సిద్ధపఱుప

ఉ. అంత గుహుండు రాముఁగని సాశ్రువిలోచనుఁ డౌచు రుద్ధకం
ఠాంతరుఁడౌచు నో ప్రభువ! యంచు, ననంతరవాక్యమాడ లే
కెంతయు నావవైపు కరమెత్తుచుఁ జూపిన రాఘవుల్ దయా
వంతులు శ్రీధనుఃకవచబాణములం గొని యెక్కఁబోవఁగాన్

గీ. ఓయి! రఘురామ! నన్నేమి సేయు మనెద
వనె సుమంత్రుఁడు, రాఘవుఁ డతనిఁజూచి
రథము తోలుకపోవయ్య రాజధాని
కింక నడచియె పోదు నే నెల్లతోవ

చ. నెఱినెఱిఁ గత్తి వేసినను నెత్తురుచుక్కయు లేని మోహనో
విఱిగిన యెల్ల శోభయగు వీటికిఁ గాటికిఁ బోయినట్లుగా
మఱియును నన్నుఁ బొమ్మనెదొ మానవనాథుని వానివేత్రియపుం
గఱితను జూడఁ బొమ్మనెదొ కాలుని మృత్యువుఁ జూచినట్లుగా

చ. ఒకఁడొకడున్ సహస్రసము లుర్విని నేలిరి సూర్యవంశనా
యకు లట నొక్కరొక్కరికి నైతిని మంత్రిని వారి దుఃఖముల్
సుకములు వారుగా నగుచుఁ జూచితి నిప్పటి నీవనంబు పో
కకును సుమంత్రుగుండెవలె గాడను పూర్వము నాకు రాఘవా!

క. మీనాయనమ్మ యిందుము
తీనిర్వ్యాజంపుఁజావు దెప్పగమే నై
యీ నీ నవీవిధుగని
ర్యాణంబుంబోలె నాకు సందకపోదుఁ

చ. అది కృతమాదిఁబెంచితిని యాశలు నిప్పుడు నీకు బండితో
లెద నని సర్వజన్మవిమలీకృతిఁ, బాపపుబండితోలితిఁ
మనవతికైక నీ వననుమాటను నేనును బండిబాటకుఁ
ప్రిదరము నల్లెత్రాడునలెఁ బట్టితి నీ వనితోఁ బ్రివఁ బగ్గముఁ

ఉ. నీ వనమేగు నుత్సవము నెక్కఁనగాఁ బ్రభకట్టినట్లుగా
నోవిభు! యీ రథం బిటనె యుండును మాఫ్రులు వేల్పువీటికిం
బోవును నేను నన్నుబడి ముండ్లను గంచెల నీకులాడెదఁ
నీ వలదన్నమాట వినవేరను నేరఁ బురంబుపోవఁగా

మ. ఇనవంశాంబుధిచంద్రమా! శశికళాహీనం బమావాస్యయా
మినియుంబోలిన యీరథంబుపయి సామీ! నేనునై గుడ్లగూ
బనుగాఁ బోయిన నయ్యయోధ్యప్రజ నాపై ఫాలురువ్వఁ నసుం
గొనవే నన్ను సుమిత్రగర్భముగఁ జేకోవే దయాభావనా!

మ. అది నీకిష్టము లేదయేనిఁ బ్రభు! నే నగ్నిప్రవేశంబు చే
సెద గుఱ్ఱంబులతో మఱీ రథముతో సిగ్గేది సాకేత మే
గెద నన్నట్టిది కల్ల, నే నచటఁ గై కేయీముఖాంభోజసం
పదఁ గాంచంగల యోర్పు లేదుజుమి యప్పా! నాకు నిక్కంబుగా

గీ. అని శ్లాఘాంగుఁడైన తనమంత్రిఁ గనుగొని
రామచంద్రుఁ డంతఁ బ్రేమమీఱ
నవ్వి యతని బుజమునం జేయివైచి ద
గ్గరను లాగి యిట్లుగాఁగ ననియె

శా. తాతా! లక్షలుగాఁగ నబ్బము లనంతంబౌచు దుఃఖంబులుఁ
జేతోవీధి నెఱుంగ నేత్రముల సిక్షింపంగనై వచ్చి నీ
చేతోవీధిని నారదేమి మృదువా చేతంబు నీయందు, సే
వాతీర్థంకర! సూర్యవంశతరణిప్రాక్కర్ణధారాకృతీ! ౪౩౦

శా. నీకు న్నాయెడ నింతప్రేమకలిమిన్ నే మున్నె యూహించితిన్
నా కాంతాగని వాస మున్నఁ బదియున్నాళ్లేండ్లు నే వచ్చెదన్
నీకుం గోరికతీరఁ దోలుకొనుపుగానీ మదర్థం బింతలో
శోకం బేటికిఁ జక్కఁబెట్టుకొను మానుప్రార్థ మీ శోకమున్

శా. నేఁడా? పుట్టినదాది వేఱొకఁడు బాడిందోలలేదొక్కఁడే
న్యాయంబుం దోలిన నెక్కలేదు ప్రియమొప్ప న్నేనునున్, నేను నీ
వాఁడన్ జోదితమైన నీరథము నా భద్రంబుగన్ నీవు నా
తోడన్ వచ్చినఁ గాలితో నడచి నాతో బాడిలేకుండఁగాన్

గీ. నీవు నాతోడ వచ్చిన నేరు రథము
నెక్కి యేగితి నందురు నక్కటకట!
రథము నేమయ్యెనో యెఱుంగరాక రాజు
మించి మనయందఱు స్మృతి శంకించుఁగాదె!

శా. నీ వర్గం బోఅ నేను జొచ్చెదను మంత్రిశ్రేష్ఠ! నీ ప్రేమనున్
నా వైదగ్ధ్యములేమి సేయకు ధరానాథుండు నీకోసమై
నా వార్తాశ్రవణంబు గోరుచును నున్నాఁ డింట నీవేగి గం
గావారిం దరియించు టా నృపునకుం గా నీవు విన్పింపవే!

. వినిపించి నత్తు నన్నను
వినిపించిన పైని ధాత్రీవిభుఁ డేమానో
చనుపెంచిన భరతుఁడు త
ల్లిని నే మనునో మతీవ్ర లేక యుండెట్లో?

శా. ధీవృత్తిం గను మింత మద్వననివృత్తిన్ రాజ్య మెట్లుంచునో?
నీవుం గోసలముల్ త్యజించిన మహానిర్వ్యాజసేవాకృతీ!
యీవేళేండ్లులు నిన్ను నమ్ముకొని కాదే యెల్ల యిక్ష్వాకులున్
క్ష్మావాల్లభ్యము గాంచి రింక ధరణీశత్వంబు నమ్మయ్యెడున్

సీ. రఘువంశశాఖ మీ రాముండు నీకు భా
వంబున నంత దైవంబయోని
విక్ష్వాకువంశ మింతింతలోఁ గాంచుట
పరిశయంబు నీ విష్టపడవయేని ౪౩౭

నా వచ్చులోపల నాతల్లి నాతమ్ము
లుదితసౌఖ్యులుగఁ గోరెదవయేని
పదునాలుగేండ్లు నవిదప నీరాజ్యమ్ము
నే నేలుటయు నీకు నిష్టమేని

నీవు నాతోడ రారాదు నీవు రథము
తోడ నగ్నిని జొఱరాదు తోలికొంచు
బొమ్ము రథము నయోధ్యకుఁ బోకయున్న
మేదినీపతిమీఁద నామీఁద నొట్టు

వ. అని శ్రీరామచంద్రుఁడు గుహునిఁజూచి

శా. కోటందీర్చెదునట్టి యల్పపుఁబనిన్ గోడ్డంట నాతండ్రి దా
మాట న్నిల్పఁగఁ దీర్చుచుంటి రఘువంశం బిట్టి మర్యాదచేఁ
బాటింపందగుఁగాదె నే వనముపోవన్ శైలసంస్కారచ
క్రౌటత్వం బదియేల కైశ్యమునకున్ గాంతారవాసాళికిన్

శా. సాధుశ్రేష్ఠులు సన్మునీశ్వరులయోజన్ మేము నల్లె జటా
వీథుల్ కట్టి శిరోజసంతతి తపస్విత్వానుకూలంబు న
గ్రోధక్షీరము తెమ్ము కొన్నిగనిగల్ కోరాదు కేశంబులున్
బాధం గాంచఁగఁ బోదు మీ యునికితోఁ బాత్రింబుగా దేగగన్

వ. అని గుహుఁడు తెప్పించిన మఱ్ఱిపాలతో నన్నదమ్ములిద్దఱు తలలు
జడలుకట్టించుకొని శ్రీరామచంద్రుండు సుమంత్రుని గుహుని
గాంచి నవ్వి

గీ. అడవిలోన నే గింజలు పుడికితెచ్చి
నదినెగారికిఁ దలనూనె వండఁగలఁడో
తాను సౌమిత్రి నాకును దనకు నింక
సరి శిరోజసంస్కారకష్టములు లేవు

వ. పైని నీ నునుపారు తలకట్టులతోఁబోయిన నచటి ఋషు లేమను
కొందు రని ౪౪3

శా. తాతా! యోయి సుమంత్ర!వచ్చెదము,మిత్రమ్మా!గుహా!రాజ్యపుఁ
బ్రీతిన్ వీడక కోశసైన్యములు మంత్రిశ్రేణిరక్షాధురా
స్ఫీతిం జూచుకొనంగనా సుతునకే చేతంబునన్ నన్ను నే
లా తూష్ణీంకృతి నవ్విధాన్యనుఁడు హేలాధర్మలగ్నాత్ములై

వ. అని సౌమిత్రిం గనుంగొని

శా. ఆరోహింపఁగఁ జేయు మీనదినె ముం దాపైని నీ నావ నీ
వారోహింపుము నేను వచ్చెదను దర్వాతన్ సుమంత్రుండు బా
ధా రేఖన్ వెలలించు మోమున నిరంతస్నిగ్ధచిత్తుం డటం
చారాటంపడ నేల? వచ్చితిమి కాదా! తాత! మే మింతలో

గీ. అని సుమంత్రు నూరార్చెడి యంతలోన
లక్ష్మణుఁడు తల్లి నెక్కించి పక్కచలన
మృదుదృగంతమ్ములన్ రాము నెగచి చూచి
తాను నావపై నెక్కి యుంజానసూత్రి

క. నవసంతోషవిచాలన
మవయవములఁ దోప రాముఁ డథిరోహించెన్
కువకువల పైడికంటుల
కవ పాంతమహీజశాఖికల బిట్టులియన్

శా. దిగ్భ్రాంతి న్నిలుచున్న మంత్రిని గుహున్ దీప్తాచ్ఛహాసోజ్జ్వల
ద్దృగ్భ్రేషంబుగఁ జూచి నావఁ జనఁగా నిమ్మంచుఁ జేవీ చెస
మ్యగ్భ్రాంతుంసునివోలె మంత్రిగుహులం దల్లంతఁ గంచున్ జటా
రుగ్భ్రాజిష్ణువు రామచంద్రుఁడు సుధారుజ్మండలీహాసుఁడై

గీ. గడల నొడ్డున దోయఁగాఁబడిన నావ
నిలువుగాఁ దీర్చి నీటిలోపలను దూఁకె
పడవయురముచేఁ జీల్చఁబడిన నీరు
సగము వజ్రాయుధపుటంచు జిగి నెపర్చ

గీ. అనిమిత్తట్టునఁ గూర్చుండి యంబుజాక్షుఁ
డాత్మపాదంబులన్ జలమందుఁ గడుగఁ
దా సహస్రసహస్రవత్సరము లేగ
వెలసె నది విష్ణుపాదోద్భవీత్వ రేఖ

మ. వ్రజసర్వాశుభపింజనార్థము యతప్రాణప్రియానానుకూ
లజపంబుం దొనరింప రాఘవుఁడు హేలాయానమౌ భద్రసా
మజముంబోలె గమించె నావ, విలసన్మందాకినీదూరదూ
రజకల్లోలనితాంతకమ్రనతుషారశ్రేణి వీక్షించుచున్

ఆ. సీత, నడిమపాయఁ జేరగాఁ బడవయుఁ
గడక నంజలించి, గంగతల్లి!
సగరరాజపుత్రసర్వదోర్బలఖాత
వేణిమార్గ! యమ్మ! వేల్పువాక!

ఉ. ఈ రఘుపుత్త్రు లిద్దఱును నేను నరణ్యనితాంతవాసముం
బూరితిసేసి భద్రముగఁ బూర్ణమనోరథవృత్తి నింటికిం
జేరెదమేని మ్రొక్కెదను జేరలఁ బాయస మిత్తు నీకు హా
లారస మిత్తు నీకుఁ బలలంబు నొసంగెద నీకు వాహినీ!

శా. వెయ్యావుల్ ధరణీసురావళికి నర్పింతున్ గటాక్షింపవే
నెయ్యిం బప్పును బైడి యన్నమును దిన్పింతున్ జయంజూడవే
మయ్యోరా! భవదీయతీరనివసత్పుణ్యాశ్రమస్థుల్ ఋషుల్
దయ్యాంబుల్ సకలంబువారలకు సంధానింతుఁ బ్రేయోబలుల్

గీ. చిన్నకలశంబులందున నిన్ను నించి
యమ్మ! రఘురాజపూజాగృహంబులందు
శ్రీసహస్రనామార్చన సేతు నీకు
నీవు దయచూడవమ్మ ధునీమతల్లి

ఉ. ప్రోడలకంటెఁ బ్రోడయు నరుంధతి సర్వపతివ్రతాజగ
చ్చూడమునున్ సనాతనవిశుద్ధవిభూషణ మామెఁబోలె ని
న్నాడెద నెప్పు డామెవలె నంత దయామతిఁ గాంచవమ్మ యీ
కోడలి నీవుగూడఁ గయికోఁగదె యీ వనవాసనిష్కృతిన్

క. అన గాథాకల్లోలచ
లన డిండీరజలజాతలాలితకింజ
ల్కనిభృతహాసనసితాకృతి
ధునీమతల్లి యొలికె వమధువులు నవంబుల్ ౭౫౮

ఉ. అంతట నావ నిల్చె దివిజాపగదక్షిణతీరమందు సం
భ్రాంతుఁడు లక్ష్మణుండు దిగి భద్రిఁ బ్రజావతి దించె రాముఁడున్
స్వాంతమున జానకీశ్లథవిచారము సేయుచు డిగ్గి పణ్య మొ
క్కింతయు లేని నావికుల నంచి విలోచనసాధురేఖుఁడై

ఉ. వారలఁ గాంచె వారలును భక్తిగృహీతనవాంజలుల్ దృగం
భోరుహనమ్రభావులయి మ్రొక్కిన గట్టున, దారిఁ జేరి చే
తోరథమూని తా ననుజుతో వచియించెను లక్ష్మణా! పథం
బారయ ముందు ముందుఁ గలుషాకృతి భద్రముఁగాఁగఁ బోవలెన్

ఆ. నీవు మున్ను నడుము నీవెంట జానకి
నడచు వెనుక వత్తు నడవి నేను
వెనుకనుండి యెట్టి విలయంబు వచ్చిన
మీకు రక్షగలుగుగాక కుత్ర

ఉ. ఉందురు మానవుల్ చనెడు నూళులఁ గానల నెల్ల దారి లే
కుందురు నీవు ముందుచను యుర్విజ నిన్నుబడివచ్చు వెన్క నే
నుందును నెల్ల రక్షయును నొప్పెడుగావుత సీత కే పరా
స్కందియు సీతదగ్గరకుగాఁ జననీయక చూడఁగావలెన్

చ. వలదని యెంత చెప్పినను వచ్చిన యీ యబలాట మెల్లనుం
డెలియును నామెకే వనగతిం బదముంచును బోయి సాహస
స్ఖలలితవత్సదేశములు సాగి జలేజహితుండు సంజమొ
త్తిలు పచరించువేళ నొక రమ్యమహీజముఁ జేరి యచ్చటన్

వ. విడిసి యొకవరాహమ్మునొక ఋశ్యంబు నొక పృషతంబు నొక
రురువు వధించి యగ్ని వేల్చి వండి క్షుత్తుఁ దీర్చికొని సౌమిత్రి చెట్టు
క్రింద బాగుచేసి యాస్తరణ యోగ్యంబుగాఁ జేయనందుఁ గూర్చుండి

సీ. వెనుకకుఁ దిరిగిపోయిన దివాకామినీ
పటునీరఘుతరకేశబంధ మనఁగ
తమముకవచ్చు నక్తంమూర్తి యగు భల్లు
కస్వామి లోమసంఘాత మనఁగ

పచరింపఁజను వనీవాససంగతమహా
క్లేశదుర్దైవతాలీల యనఁగ
నుండలుకట్టి పైనుఱుకు నాశ్రితవృక్ష
వనదళశ్యామలచ్ఛవి యనంగఁ

గ్రమముమీఱి గాఢాంధకారములు బలిసి
సన్నచిదుకుల మంటల జ్వాలచేతఁ ;
గొంత తొలఁగుచు మఱలను గొంతగ్రమ్ము
కొంచు వచ్చెడు నెడ నుస్సు రంచు స్వామి

గీ. ఓయి తమ్ముఁడ! యీ గడ్డు రేయి తండ్రి
మొటిసితిలోన నుండెనో యింటివద్ద
నిచట వెలిగ్రమ్ము చీఁకటు లింటివద్ద
నెంత లోఁగ్రమ్మెనో తండ్రి యెడఁదలోన

మ. ఒక నూన్నాళ్ళకు మున్న సర్వము సుఖజ్యోత్స్నామయంబైన తే
నికి నీ లోపున నెట్టిచీఁకటులు నిండెన్? దండ్రి నే నన్న నూ
రక యంతంత నసువ్రజంబు విడుచున్ శారీరబద్ధంబు చి
ట్టకముల్ దాఁటఁగ నేరికౌనట లఘిష్ఠం బెల్ల సంసారమున్

శా. నాకున్ లో దిగులయ్యెడున్ దలఁచుకొన్నం దండ్రివృత్తాంత మా
కైకేయీవరదాను లైతిమికదా! కాదన్నచో నీమృషా
కాకోలం బెటు మ్రింగనౌ, శిపులమా? కా దేను భూజాత యి
ట్లీ కాంతారముపోదు మీవు చనరాదే తండ్రి రక్షింపగా?

గీ. తండ్రి యీ దుఃఖవార్ధిమధ్యమునఁ దెప్ప
కొయ్యవలె నీవు నే నందుకొనులేక
ప్రాఁతచెక్కల యుడుపంబు పగిది విరిసి
పోవునో యను భీతి యుద్భూతమయ్యె

శా. ఏ నేమో తన చేతికందితి నటం చెంతేనియుం దండ్రియున్
దా నింకన్ సుఖమందవచ్చు నను చింతం డల్లియున్, నా వనీ
స్థానంబేగుట నేమియైరి జననీసౌఖ్యంబు పోఁబెట్టి నే
నైనం బుత్త్రుఁడఁ బుత్త్రడంబుమితమూవ్యాలగ్నదుఃఖాకృతిన్ ౪౭౦

సీ. భరతుఁడు లేకుండఁ బట్టాభిషేకంబు
సేయ వాంఛించుట క్షితిధవుండు
నీయెడ నెదో రాజకీయ మున్నదటంచు
గొందఱన్నను ననుకోనునచ్చు
భరతుఁడే యున్న నీ పాపపుబండితో
లెడిదాన కైక తోలినను సాగఁ
గలదె! యింతకుఁ దండ్రిగారి యీ తొందర
యింతచేసిన దింక నెంతయగునో?

పిన్నతల్లి సుమిత్రపైఁ బెట్టివచ్చి
నాను మా యమ్మభారంబు నన్ను వదలి
యీవు గృహ మేగి తల్లిని భూవిభునిఁ గ
రంబు ప్రేమిడి నాదుకోరాదటయ్య?

ఉ. అమ్మ ననుంబలేక నిను నిరంతము గన్గొను నీవ యామెకున్
సమ్ముఖమందు నున్నను విషాదము పొందదు నాకు నేమి కై
కమ్మయుఁ జేయఁజాలను సుఖంపడుఁ దండ్రియుఁ దద్ద నాయెదన్
గ్రిమ్మన బర్వ త్రోపువడుఁ గానకు జానకిఁగొంచుఁ బోయెదన్

చ. భరతుఁడు వచ్చి నేలఁ దొలిపార్థివులట్లుగ నేలునందువా?
భరతుఁడు వచ్చి ప్రేమ పెనుపారఁగఁ దల్లిని గాంచునందువా?
భరతుఁడు నేని శీఘ్రముగ వచ్చిన నోరిమిఁగాంచు దండ్రి న
ల్వుర నొకఁడైన లేక సుతలోభముమై పిత యేమి కావునో?

వ. అని యుస్సురనుచున్న యన్నంగాంచి సౌమిత్రి నీవులేని యయోధ్య చంద్రుఁడులేని శర్వరి, నీవులేని కోసలమ్ములు కలువలేని సరస్సు, అయినను

గీ. వెన్నెలయు నీడ చంద్రుని విడి యెకింత
యుండఁబోనట్లు నేనును నుర్విజాత
నీవు లేనట్టిచో నుండ నేరమన్యో
దము రఘూద్వహమదితశీతలనవాంశు!

వ. ఒక్కయయోధ్యయేకాదు, స్వర్గమైనను నీవు లేనిది నేనుండ నన,

శా. తూష్ణీంభూతులు నన్నదమ్ములును జేతోమగ్నులై మానసో
చ్చిష్ణుల్ ధాత్రిశయానులై నిశి చనన్ శ్రీరామచంద్రుండు వి
స్పష్టామానసుఁడున్ సుషుప్తిగనె ధాత్రీజాత నిద్రించె ధీ
జిష్ణుండై యనుజుండు చాపకరుఁడై సేవించె వారిద్దఱన్

సీ. పలితపూర్వోషఃప్రభామృదుస్పర్శచే,
శిశిరాదిధవళిమశ్రీ వహించి
యుదితమనాగపరోషశ్ఛవిఃక్లప్తి
శిశిరాంతసుష్క-తాస్థితి నెసంగి
సముషఃప్రభాతమధ్యమకాలభాస్పృష్టి
కిసలాంకురంబుల పసరు నెఱపి
బాలసూర్యోదయపాటలాంశుచ్ఛటఁ
బల్లవారుణనవప్రభలు చిమ్మి
యాకసము లక్ష్మణువిలోచనాంతములును
నమర సాద్యంతశిశిరవనాంతమట్లు
చెలువు గులుకంగఁ దూరపుసీమయందు
బ్రభన్నరోచిఃప్రతానంబు పల్లవిరిసె

ఉ. అంతఁ బునఃప్రయాణకలితాత్ములు రాఘవయుగ్మ మా తరు
ప్రాంతధరిత్రి వీడి దివిజాపగతో యమునాంబుసంగమం
బెంతయునైన తావునకు నేగఁ దలంచి వినూత్నమా వనీ
సంతతిఁ జొచ్చిపోయిరి విచాలితకాననజంతుసంతతిన్

ఉ. లీలఁగ నాడు కుందెలుల లేళ్ళను బెంపుడువానిఁగాంచెఁ గా
నీ లలితాంగి జానకి వనీమృగసంతతిఁ జూడరామి ను
ద్వేలవినోదభావపదవీగతమానసయై మనోజ్ఞ రే
ఖాలసమానచంక్రమణకమ్రతనూమృగరాజిఁ గాంచుచున్

మ. అటవిన్ మార్గములేక గోవితతిపాదాఘాతమే మార్గమై
విటతాటంబుగఁ బడ్డకొమ్మలు ధనుర్విస్ఫారకోటిం దెమ
ల్చుట సౌమిత్రియుఁ బోవఁజొచ్చిరి వనీసూనప్రియామోదవి
స్ఫుటభావంబునస్వామి చెప్పుచుఁ బువుల్ చూపించుచున్ గొత్తలన్

శా. పశ్చాద్దేహము నెల్ల లంఘనవిధాపారాయణత్వంబునన్
నైశ్చల్యంబున ముద్దుగా నెఱపి చన్నన్ లేళ్ళు భూజాత పె
ల్లాశ్చర్యం బెసలార నా పొగసుచే నాకృష్టమై యాగుచున్
బశ్చాదాగతు భర్తతోఁ గలసి సంభాషించుచుం బోవుచున్

మ. కెలనన్ దూరవనీమహోదగదగీకేకాసగాకోరవం
బులు బుక్కుగ్యులులాయసంతతిగళోద్భూతస్వనంబుల్ వనిం
దళమై జిమ్మను నల్పకీటకృతనిధ్వానంబు కాంతారవీ
థులలో రాతిరి కాని రాతిరి మనోదుర్వారమై యొప్పఁగా

వ. అంత పెద్దదవ్వుపోయి యాలకించి శ్రీరాము సంక్రమించు

చ. అలసలఁ దల్లి యింటిపనులందు నిమగ్నతఁ జూడకున్నచో
నెలుకలుదూరి కద్దునను నేర్పున నాసయిఁ దల్లివచ్చి ప్రే
మలోలుకఁ బాలొసంగ మృదుమంథరమంజులమైన సన్నచా
రలుగను బీఱుతో గురగురన్ జననో శిసుకంఠమట్లుగాన్

క. వినిపించెడు నది యమునా
ధునీత్రిపథగావిమిశ్రితోయస్వనమౌ
నన సీత మెల్ల వెనుకకుఁ
జని రామునిఁగాంచి సన్నసన్నగ నవ్వన్

గీ. లవలి పంగకొమ్మ లలితపార్శ్వంబునఁ
గూరుచున్న చిలుకకూసపగిది
రెండునదులు కలసియుండిన యచోట్ఁ ప్ర
యాగ యున్న దచట నతిపవిత్ర

గీ. అది భరద్వాజముని యాశ్రమాంతరం బ
టంచుఁ జనఁ జనఁ జాలదవ్వయ్యెఁ ద్రోవ!
నవిపిముస నూరు కదు సమీపించికాని
యూరియునికి గ్రహింపగా నేరాము

శా. హస్తాస్ఫాలనధూతపక్షిహరిణవ్యాళంబుగా నేగి వి
ధ్వస్తాఘుండగు శిష్యసంవృతభరద్వాజున్ మునీంద్రున్ శిరో
న్యస్తహస్తాంజలు లొంచు ముమ్మాటను బాదాంభోజముల్ తాఁకినన్
స్వస్తివ్యాహృతి మాని శీర్షములు సంస్పర్శించుచున్ వారలన్ రర్ర

గీ. ఓయి రఘురామ ! వచ్చితివా ! యిదోయి
స్వాగతము కన్నతండ్రి! సుస్వాగతమ్ము
వ్యాజరహితమ్ము నీతండ్రి వనికి నిన్ను
నడచుమవార్తలు మేము విన్నాము కుఱ్ఱ!

శా. ఏటుంబోటరి! మీరు వత్తు రని మా కిచ్చోఁ గుటీరమ్ము నే
ర్పాటుంజేసితి నింద యుండుఁడు వనీవాసంబు సర్వంబటం
చాటుంబోటును లేక మత్పదసపర్యానిష్ఠ నిండుండు మం
చాటీకంబగు సర్వప్రేమవిగళద్వ్యాహార మేపారు మన్

మ. అనినన్ రాముఁడు కోసలప్రజలు నాపాలింబలెం దీతు నీ
వనిలో దగ్గఱగాఁగ నున్న దినమున్ వత్తు ర్మరల్ నన్ను ర
మ్మని సాకేతమునన్, క్షమింపుఁ డనఁ గట్టా! యంచు నమస్కరించి రా
మున కర్ఘ్యమ్ము నొసంగి శిష్యతతిచేఁ బూజింపఁగాఁజేయుచున్

మ. పౌరి మూన్నాళ్లుగ నీవు వత్తు వనుచున్ బుణ్యాశ్రమంబే మఱిన్
మఱి యీ పల్లియ పూరిపాక లని యాత్మన్ గన్న మోదంబు రా
పఱె, నీయిష్టము మాకుటీరమున నప్పా! మీరు మీయిష్టమౌ
వఱకే యుండుఁడటంచు సర్వమగు సంభారంబుఁ జేకూర్చుచున్

క. మునిపరమేశ్వరు నాదర
మున నాతిథ్యమున మెచ్చిపోయిరి రాము
డును లక్ష్మణుండు ధాత్రీ
తనయయుఁ దమ పడినబాధ దారిపోడుగునన్

వ. ఆరాత్రి భోజనాంతమున మునివచ్చి వారితో వనవాసగమనహేతువా
న్యాసంబు దక్కఁ దక్కిన నెల్లలోకంపుసంగతులు పలుకరించి
చిత్రచిత్రకథాశ్రవణంబు చేసి శ్రీరామచంద్రుండు దూరమైన
యడవిలోఁ దమకు నివాసయోగ్యం బెచ్చటనని యడిగిన నిట్లనియె

క. ఇచ్చటికిని బదిక్రోసుల
ముచ్చట యట చిత్రకూటభూమీధర మా
పచ్చనిగిరి మీ యునికికి
నచ్చినయది నాకు నవఘనశ్యామలుఁడా! ౪౯౬

ఉ. ఆ గిరిపైఁ దపస్వులు మహాత్ములు, మేనులతోడ వేల్పుపై
డేగినవారునుం గలర యచ్చట మౌనులు, హవ్యకవ్యల
క్ష్మీగరిమంబు కల్గినది చిత్రవిచిత్రమృగాభిరామ రే
ఖాగురువైన యీ నగము కన్నులపండువు జానకీపతీ!

క. మీ రేగునప్పు డగ్గిరి
దారిం జెప్పెదనటంచుఁ దా ముని చన్నన్
వారికిఁ గన్నులఁ గూరుకు
కూరుకవచ్చినది తెప్పకొన లత్తుకొనన్

చ. పోరి మఱునాడు రాఘవుఁడు పోయెద మంచన మౌని వారితో
నరిగి మహెంతో దవ్వీయ యధ్వము సంగమధాత్రిఁ జేరి యీ
సురనదిశాఖికన్ వదలి సూర్యసుతాతటమున్ గ్రహించి మీ
రరుగుచుఁ జూడఁ గన్పడు మహావట మొంతలిరొద్ద నందునన్

క. అట దాఁటవలయు యమునా
తటినిం బ్లవ మొంది భిన్నదారుకృతమునన్
ఘటియించుకొని, ప్రశస్తము
వటవృక్షము దానిసేవ ఫలియించుఁ జుడీ!

మ. అచటన్ క్రోసెడులోనఁ గన్పడు నరణ్యం బొందు జంబూమలి
మ్లుచ శాంతిప్రదమానమై చను నెమళ్లన్ రేగులన్ రావులన్
రుచిమత్పాచన మందుఁ గన్పడెడు పెందోవం జనన్ దారిదా
రి చనన్ సూటిగఁ జిత్రకూటమునకున్ శ్రీయోనిధానాకృతీ!

ఆ. అనిన సెలవు తీసికొని చన్న జానకీ
రామునుండి కనులు రావు మునికి
విభుఁడు దూర మరిగి వెనుదిర్గి చూచిన
నుఱక యట్లె చూచుచుండె మౌని

మ. అమృతస్వాంతుని మౌనిఁ గాంచి రఘువంశాంభోధిచంద్రుండు మో
దమ్మున స్పందనమైన గుండియ దురస్తాద్యాతు సౌమిత్రిలో
నమరన్ జూచితె తమ్ముఁడా! మునికి నేలా! యింత ప్రేమంపుసం
ద్రముగా నింకను జూచుచుండె మన మన్నన్ మెత్తగా నెంచెడిన్

క. ఈ మునుల మంచితనములు
సౌమిత్రీ! వేల్పువీటిసంభారమ్ముల్
రాముం డెంత పొనర్చియు
నీమునుల ఋణంబు తీర్చ్పలేం డెట్టిదమా

మ. అనినన్ జానకి వారి యాశ్రమ మనోజ్ఞత్వాగ్రిమసామీప్య స
మ్యో ననన్ రాముండు నీకు నచ్చినను నీ విందుండు మహాత్ముని ని
న్నును బూంబోత్తుల నుంచు నన్న సతి కన్నుంగోసలన్ వాడిదే
రిన కాంతింగని భర్త, నేం జనెద మీకేయుండుం డంచాడినన్

శా. పోంబో దూరవియ త్తటీవిపులతాపూర్వాంచలతా హేతువై
శ్రీబంహిష్ఠము నాకుపచ్చగిరి వచ్చెన్నాగ న్యగ్రోధమా
లాబద్ధాఖిలశాఖమై కనబడెన్ శ్వశ్శ్రేయసంబెల్ల నే
త్రాబద్ధం బయనట్లుగాం బ్రమదముద్రావాహినీమూర్తియై

శా. ఆ సౌందర్యముం బట్టలేక పతిసంవ్యానాంచలం బూని సీ
తాసీమంతిని శ్రీ రఘూత్తముని చెంతంజేరి భర్తృసఖీ
ధీసాధిష్ఠకరంబుగా నడచెం దద్వృక్షుంబె వీక్షించుచున్
గాసారాగతమోదబాష్పవితతిన్ గ్రైం ద్రోయంగా నేగకన్

శా. చేరంజేరంగ సమ్మహావటము పక్షిశ్రేణినిష్యూతజనా
భోరాశిప్రకటస్వనంబుగ సుతృప్తుల్ రాఘవుల్ సూగ్యత
న్యాలోకోఽధ్వముంబట్టి చేరుకొనుచున్ న్యగ్రోధపున్ ప్రాంకియా
మేగన్ వాహిని దాంట నెంచుతటి సౌమిత్రిం గనుంగొనుచున్

సీ. రాముం డనెం జిన్ని తెప్పం దీర్పంగవలయు
మునిమహేంద్రుండు మనకుం జెప్పినవిధాన
నిప్పు డనునంతలోపల నెగువనుండి
యొకండు తెప్పను ద్రోయుచు నేగుదెంచె

గీ. మనమె తెప్పను నిర్మించుకొనవలె నని
చెప్పెనే మాని, యొచటి దీ తెప్ప యనుచు
ననుకొనుచు నుండ నావికుం డరుగుదెంచి
రామలక్ష్మణులకు భక్తిం బ్రాంజలించి ౫౦౧

ఉ. అట్టి కనంగఁ గూతయిడునంతటి దవ్వునయందు నేటి పై
తట్టున బోయపల్లె నవతామరసేక్షణ! నాదుపట్టు, మి
మ్మిట్టులదాఁట వేయుమని మేలికయాగుహుఁ డంపెఁ గూయి మా
పట్టున రేయి కందినది వచ్చితిఁ బ్రొద్దుటఁ దెప్పఁగట్టితిన్

శా. మీ బంగారపుబొమ్మకై యిచట సామీ! పీటఁగాఁ జేసితిన్
మీ బాణంబులు విండ్లు తీసికొని సామీ! రండు రండన్నఁ జూ
డాబద్ధాంబరులై రఘూత్తములు తోడంబోయి! తండేల! యో
యీ, బంగారపుబొమ్మగా దిదియు నా యిల్లా లనన్ రాముఁడున్

ఆ. నవ్వె నాటవికుఁడు నవ్వెను జానకి
యతఁ డెఱింగి యేమి యమ్మవార!
పురములోని పసపుముద్ద నవ్విన దంచు
చిట్టకములుగాఁగఁ జెలఁగి చెలఁగి

క. శ్రీరాముఁడు ధాత్రీసుత
చీరలు భూషణము లెల్లఁ జేర్పించి తరిన్
దారెక్కిన సౌమిత్రియు
శ్రీరాముఁడు, తెప్ప యమునిచెల్లెలిఁ గడచెన్

వ. అట్లు నావ యమునానడినీటి నున్నపుడు సీత నల్లనినీరు దోయిలించి
యిట్లనియె

క. ఓ తల్లి! నీవు నల్లని
చేతోహరమూర్తి వట్లు శ్రీరఘురాముం
డాతతమేఘశ్యామల
చేతోహరమూర్తి! యొక్కచెట్టుఫలంబుల్

చ. వనజలజాప్రవంశపతి నాపతి, వారల యింటి యాడుబి
డ్డవు మఱి నీవు నీవగు నెడందఁ గృపామతిఁ జూచి యల్ల రా
ఘవులును నేను భద్రముగఁ గాననవాసము దాఁటివత్తుమే
నవునవు నీకు వేయిబలు లిత్తుము గంగకు నెట్లొ యట్లులే ౫౧౪

క. మీ యింటికోడలవు స
తీ ! యీప్రార్థనపథం బలికముగాఁగం
జేయకుము పిన్నదమ్ముని
శ్రీయుతు రఘురాము నీవు చేకొఁగదవే!

వ. అంతఁ దెప్పయెుద్దుపట్టి మువ్వురును నవతరణశ్రద్ధాయుతు లైనంతలో

మ. తడఁ బ్రాణంబులు గుప్పిటంగొని మొటోదాఁటించె వారి౯ విషా
దుఁడు రాముం డిట్లు చూడలేదతఁడు తోడ్తోఁ దెప్ప స్రోతోగతిం
బడి తా గిట్టునఁ దిగ్గుమం జనియె శ్రీపద్మాక్షుఁడా రామచం
ద్రుఁడు తమ్ముంగని యక్కజంపడుచు నన్నుం జానకిం గాంచుచు౯

క. నీ వేమో దేవత వని
భావించెను వాఁడు గుహుని పరమస్నేహ
శ్రీవైదగ్ధ్యము నేమని
భావింతునటంచు విఱుఁగఁబడి నవ్వంగా

వ. ఆయన నవ్వఁగాంచి సీతాలక్ష్మణు లిట్లనుకొనిరి

చ. అడవిని జొచ్చుటాదిఁ బ్రభు వచ్చటిదైన యుదాత్తతాగుణం
బుడిగెనొ? కైతవంబయిన యూళ్ళల నాగరకత్వభావ మ౯
దొడుఁగును బుచ్చెనో? ప్రకృతితో నొకఁడై పసివానిపోలెఁ గ
న్పడుఁ గుహానామనుష్యకృతనాగరబంధము లూడ్చినట్లుగ౯

వ. అంత యమునాతీరారణ్యంబునం బడిపోయి న్యగ్రోధంబును

గీ. ఆత్మనుండి సముద్గతంబైన మనసు
మఱల నాత్మాభిముఖముగా మరలునట్లు
లవనినుండి సముద్గతంబైన పెద్ద
కొమ్మలూడలు ధరఁ జొచ్చుకొన్న యోగి

మ. తన యాకందునె సామి క్షీరనిధి నిద్రాసక్తుఁడై చొచ్చెనో
తన పండే గ్రహియించిరో ఋషులు వేదాంతాళిబీజాంకురం
బని సృష్టిప్రథమాన హేతుక ముపన్యాసంబున౯ నాఁగ భా
వనకుం దృష్టికి బ్రేఁగుగా నగు సదాబ్రహ్మాండమహాకృతి౯ ౫౧౨

మ. ద్విజసంసేవ్యతఁ జంద్రమండలగతోర్వీజంబొ యీమఱ్ఱి సూ
ర్యజకున్ వారివినీలకాంతులను దా నప్పిచ్చె నీమఱ్ఱి ప
ద్మజసృష్ట్యాదికి మూలభూతమగు నీమఱ్ఱిన్ నిషేవించు సా
మజముఖ్యాఖిలజంతుసంతతి త్రయీమాహాత్మ్యవారాన్నిధిన్

మ. భువి నీమఱ్ఱినిఁజూచి స్పర్ధఁగొని జంబూవృక్ష మాసేవ్యమా
నవినూత్నాచ్ఛఫలంబులన్ వెలసికొన్నన్ గాని యీచెట్టు పం
డువలెన్ సంజల నొఱ్ఱనై వెలయ నౌనో యవ్వి? నానాశిఖా
వివృతంబై శివమౌళివోని పెఱయుర్వీజంబె లేదెచ్చటన్

వ. సశిఖాకంబై యర్ధక్రోశాధికంబయిన యా మహావటప్రదక్షిణంబు
సేసి సీత

గీ. ఓ మహావటరాజ! నీ వుర్వి నెల్ల
నాక్రమించినగతి ధాత్రి నాక్రమించి
యున్న జలజాప్తవంశమహోదధి నవ
చంద్రమస్స్వామి రాముని సాకుమయ్య

ఉ. ఈ వనవాసని స్సరణ మీవును మాకుననుగ్రహింపవే
యో వటరాజ! మా తిరిగియూరికిఁ బోయెడు వేళ నీదు శా
ఖావృతమైన నీడల సుఖింపదు ప్రాణులకున్ మహాబలుల్
పూవులు పండ్లు నిత్తు దయఁ బ్రోవవె మత్పతి మానిసన్నిభున్

క. అనుపన్న భూమిజాతం
గని రాముఁడు ప్రేమమెల్లఁ గందనగాయం
ధునివోలె నెక్కఁ దన త
మ్మునిఁగని యిట్లనియె హాస్యముగఁ బ్రేమమునన్

మ. మన కెల్లన్ శుభమైనవాక్యములతో మన్నించుచే తాను న
చ్చినలాభంబుగఁ జేయు మీనదినె దాక్షిణ్యంబు నాసించుచున్
జనుమీ ముందర దారితీయు మనిన్ సౌమిత్రి ముందేగినన్
జనకక్ష్మాసుత ధ్యానమగ్న పతివాచాలీలి యోజింపకే ౫౩౩

క. తనమఱదివెంటఁ జనుచున్
చనునది తా నెఱుఁగకుండఁ జనుచున్ వటరా
జునుగూర్చి యింక నీగతి
యనుచుండెను రామచంద్రుఁ డచ్చెరువందన్

గీ. భూమిజాతుఁడ నీవును భూమిజాత
నేను, సోదర్యమర్యాద నైనఁ బూని
మన్మనోమహేశ్వరు వనమండలీ ని
వృత్తి పాలింపు మాదివశేంద్ర! నీవు

మ. మివులన్ దవ్వుగ నేగిన్ దెలిసెఁబో తన్మజాత రాముండునుం
బువులుం బండ్లు నొసంగి క్రొత్తలు వనీభూజంబులంజూపి లం
ఘువిధామోహనదేహజంతువితతిన్ గాన్పించి సీతామనో
వ్యవధాశోషణ మాచరించి తతనిశ్వాసంబుఁ జేకొంచునున్

వ. చాలదూరము యమునాతీరముం బట్టిపోయి తీరవనంబు వదలి మహారణ్యంబుఁగాంచి భరద్వాజులు చెప్పినత్రోవంబడి యారాత్రి యొకచోఁ గడిపి మఱలఁ బ్రయాణంబులుచేసి చిత్రకూటప్రాంతాటవిం బ్రవేశించి జానకీమనఉల్లాసంబుఁగాంచి శ్రీరామచంద్రుండు నానావిశేషంబు లుపన్యసించుచు

సీ. యౌవనపారంభమందలి యీ కేకి
తోఁకలో నొకకన్ను తోఁచెఁజూడు
పొదవోలెఁ గట్టి యీ పూఁచిన జీడిమా
మిడిఁ జూడు తెలిముసుం గిడినయట్లు
మూడునిల్వుల దీర్ఘముగఁబట్టె నా తేనె
తుట్టె నగ్గిరి కాఁచినట్లు కనుము
చందమామనునుండి జారిపడ్డదియేమొ
శశ మిద్ది తుఱ్ఱున జారిపోవు
కొండ పెనుడొక్కలో దాఁగుకొన్నయట్లు
లీ గిరీంద్రమ్ము కొమ్ములయెత్తు చూడు
బల్లపఱుపుగ నున్న యీ పచ్చియడవి
యవనిధరపుళిందేంద్రు శయ్యాస్థలంబు [illegible]

సీ. కూఁతురు బకుళైన కూఁతగా వాకొను
వాకంబు జరుపు నీ కేకియుగము
కారండవోదాత్త కలితకూజనమంటి
షట్పది పచరించు సన్నుతరము
నీళ్ళాడునాళ్ళ సండెనో నిడనిర్మాణ
మున నటాట్యానువృత్తిఁ జనుఁ జకోరి
యీ ముదికొంగ మిథ్యార్యాధ్వకల్పన
నిక్క యీసడెలోన నిలుచు లేమ

పైనిఁ దామరపూఁజెర్వుఁ బట్టి జాలు
వారు నీ ముద్దుమ్మరల సెలయేటి నర్లి
వలెను బ్రహ్మాసనంబుండి బ్రహ్మబిందు
వుల వెలార్చెడి మనదారి తెలుపునట్లు

శా. శ్రీరాముండును సంతఁ దమ్ముఁగని లక్ష్మీ! యీవనంబున్ బయః
పారీభూతము సాధునిర్ఘరపరీపాకంబు నానాలతా
రారాజత్ఫలబుద్ధి, మూలఖని, సుత్రాసంబు, జంతుప్రితా
నారామంబు నివాసయోగ్య మిట నున్నంజాలు నిక్కంబుగన్

శా. భ్రాజన్మౌక్తిక పథప్రవిష్టులు మునుల్ వాసింతు రిచ్చో భర
ద్వాజుల్ చెప్పిరికూడ నిం దునికి సత్ప్రశ్రేష్ఠముం చిచ్చుటన్
భ్రాజిష్ణుల్ మునిరాజు లుండిరట వాల్మీకిన్ విలోకింత మా
తేజస్సింధువు చిత్రకూటగృహి కాదే మున్ను విన్నట్లుగా

క. అని నానుజాతు నాశ్రమ
మునఁ జని పేరులను జెప్పి ముగురు నమస్కా
రనిభృతి నిల్చిన నమ్ముని
కనుదమ్ములు విచ్చి చూచి కాంచి రఘుపతిన్

క. కూర్చుండుఁ డంచు స్వాగత
చర్చన్ మఱి పలుకఁడాయె నమ్ముని రాముం
డర్చితుని మౌని వీడ్కొని
యర్చిష్మత్తేజుఁ డనుజు నరసి మృదూక్తిన్ ౫౪౩

శా. గండూషించెను తేజముల్ పలుకు బంగారమ్ముగా మాట లే
కుండన్ మానియు నేలవచ్చిరనఁ డిం దుండుం డనం డంచు రా
ముండున్ దమ్ముఁడు వెన్కకుం దిరిగి సభ్రూదృష్టి వీక్షింప శ్రీ
నిండారన్ మునిలోకమాళి కనుచుండెన్ వారినే వారినే

సీ. మఱలఁజని రాఘవులు పుట్టమానిఁ జేరి
స్వామి! మమ్ముఁ గాంతారవాసంబుఁ జేయఁ
బంపె మాతండ్రి పదునాలుగువత్సరములు
చిత్రకూటాద్రి నుండ వాంఛింతు మేము

మ. అనినన్ సమ్మోను మౌని సమ్మోనను వా రాశ్చర్యలగ్నాత్ములై
చని శాలాబహిరంతధాత్రి మఱలన్ శాలాంతరం బేగి యెం
దున యోగ్యస్థలిఁ బర్ణశాల నొకఁడున్ నూత్నంబు నిర్మింప మా
మన సెచ్చోటను గట్టుమందు రనినన్ మౌనీంద్రుఁ డల్లంతనన్

ఉ. లేచి గిరీంద్రపార్శ్వవిమలీకృతధారుణి నొక్కచోటునన్
బ్రాచిముఖంబుగా సలిలభవ్యగృహాదులతో విశాలశా
లాచతురశ్రరేఖలు విలాస్థలి గీసి యొకింతమాట లే
కే చనఁజొచ్చె జానకి మునీంద్రపదంబు నమస్కరింపఁగా

శా. బిడ్డా! లెమ్మని మౌని ధాత్రితనయాప్రీతాస్యనీరేజమున్
గడ్డంబుం గొని యెత్తిచూచి కనులంగన్నట్టి యాచూపు నీ
రడ్డంబై చనఁ బిల్ల లేడి బెళుకౌ నక్షిప్రసారంబుగా
నుడ్డీనార్చిరిరంమదంబుగ నెదో యూఁగాడిన ట్లొప్పఁగా

క. ఆ చూపుతోడ జనకజ
ప్రాచీనమహర్షి యందుఁ బ్రకటార్చాస
ధ్రీచీనంబుగఁ బితృభా
వాచలితంబైన బుద్ధి నవలంబించెన్

వ. అంత లక్ష్మణుండు భిన్నయోగ్యదారుఖండంబులు తెచ్చి చెట్లపట్టను దెచ్చి నారదీసి స్తంభమ్ములు దూలంబును వాసంబులు యథాపరిమాణం బేర్పఱచి గృహంబు నిర్మించి మీఁదత నల్లి గోడలకుఁ బెట్టి మంటితో మెట్టి కప్పుగాఁ డేకాకులు సీఁతాకులు నారికేళపత్రంబులు పెట్టి పైనలికి సిద్ధంబుచేసిన రాముండు తమ్మునితో నిట్లనియె. ౫౫౦

మ. మఱియుం బో గృహదేవతాయజనకర్మం బాచరింపంగ నే
మఱకన్ గైకొని రమ్ము కృష్ణమృగమాంసం బర్థి వాల్మీకి భూ
సురునిం బిల్వుము యాజ్ఞికంబునకు వాక్శుద్ధిన్ మహోమానిఁ బ
త్పరిచర్యాపరిణామసర్వశుభ నభ్యర్థించి తోడ్తో ననన్

సీ. స్నాతుఁడై నియతుఁడై సంగ్రహంబుగ సర్వ
సత్రావసానికసమితిమంత్ర
ములఁ జేసి వాల్మీకిముని వచ్చి తాను స
మాప్తాంగ ముగు లక్షణాత్తమైన
కృష్ణమృగమ్ము దోరించి నిష్టప్తమ్ము
ఛిన్నశోణితము సంపన్నమైన
యగ్నిలో వేల్పించు నాపైని శ్రీరామ
చంద్రుండు తన కిష్టసకలదైవ
తముల యజియించి సర్వోత్తమము గృహప్ర
వేశముం జేసె నంతట విభుఁడు వైశ్వ
దేవబలు లిచ్చి శ్రీమహాదేవవిష్ణు
బలులు ఘటియించి ఋషిదయాపాత్రుఁ డగుచు

ఉ. సంశమనీయవాస్తుపరిసంగతమంగళముల్ ఘటించి సా
రాంశముగా జపప్రయతుఁ డౌచును మాల్యవతీతరంగిణీ
సాంసుజలంబులం దరిగి స్నానముచేసి యఘప్రతానికా
సంశమ ముత్తమంబు బలిసల్పె రఘూత్తముఁ డాత్తధీకుఁడై

క. తన యాశ్రమమ్ము నందునఁ
బొనరించెను చైత్యములును బొలుపగు వేదుల్
కనుకని యాయతనంబులు
వనరుహహితకులుఁడు రామభద్రుఁడు పెలుచన్

ఉ. తావులు గుమ్మనన్ బువులదండలు నస్యసుమాళి వేళ్లు నీ
ళ్లావులు తేర వండి పలలంబులు నెల్లప్రదేశతర్పణ
శ్రీవిధిగా బలుల్ నెఱపి చెల్వముగూర్చి సమస్తభూతచే
తోవశహోమముల్ జపము తోరముగా రచియించె శ్రద్ధమై

వ. అంత గృహప్రవేశంబుచేసి ౫౫౬

క. మాల్యవతీస్నానంబు న
మాల్యము సౌమిత్రి సేవ భూతనయాసౌ
శీల్యంపుగృహిణితనమును
బాల్యంబగు బ్రహ్మచర్యపరమవ్రతమున్

క. మేల్చిందు నెడద నగ్గిని
వేల్చుటయును వగ్గుతబిసిపిండును వినుచున్
గొల్చుటయును బ్రాహ్మణులు
క్రోల్చుటయును నీమ మూఁదుకొని నిల్చుటయున్

సీ. వైదేహిచని మాల్యవతివద్దఁ దడసిన
ననుజునిఁ జూచిరమ్మంచుఁ బంపు
లక్ష్మణుం డడవి నాలస్యంబుచేసిన
ప్రభువు దండడిఁ దానె బయలుదేరు
తాను లక్ష్మణుఁడు నిద్రితై యున్న వైదేహి
సౌఖ్యమ్మును విచారచర్చ సలుపు
నుర్విజతోఁ దానె యొంటరిగా నున్నఁ
బరిహాసశృంగారపరతఁ జొక్కు
మువ్వు రొకచోట నుండిన భూమిపతియు
సుఖముగా నుండెనా? తల్లి సుఖము గలద!
భరతుఁ డరుదెంచెనా? యేమి జరుగు నచట
నని సహస్రశఊహాభవ్యత భజించు

క. తా మచ్చోటనె యుండిరి
తామే సంసారమెల్ల తనుకు నయోధ్యా
స్వాములె యగు టెద్దో లీ
లామాత్రముగాఁగ శ్రీరామలక్ష్మణసీతల్

శా. ఆ చైత్యంబులు నావితర్దికలు తా మా హోమకుండాదులున్
వీచీసంచలసమ్మదాత్మములుగా వీక్షించి వైదేహితో
నా చక్కఁదనమౌను లక్ష్మణునితో నాయాయిచోట్లన్ మత్తే
మో చేయన్ వలె మాప్పలంచుఁ బలుకున్ బ్రొల్లాసియై రాముఁడుఁ

## ఖండాంతము

గీ. ఏది విని, మనోజ్ఞభావనాహేల పట్ట
రానికానో ముక్త్యాలధరాధిపునకు
నిద్ది ప్రస్థానఖండ మదీరిందిరాప!
పరిథితవిశ్వనాథకవీంద్ర వాక్కలాప!

ఉ. కదలఁగరాని కన్నెగుడు కాలమునందున గుండె లోపొరల్
గదలెముగాని నిల్చుకొనఁగా నిలుపోపఁగఁజాల నేమి యె
ల్లిద మిది నందమూరిశివలింగముగాఁ గనిపింతు పోదువుల్
బడపన వెండికొండకును వచ్చెద నీ విట నిల్వలేనిచో

శిఖరిణి.

సమూహావ్యావల్గద్విజసరిదంచజ్జలపృషత్
సమాజోద్యన్మౌళిప్రకటితకృపాస్పృశ్యనతనూ!
అమేయాత్మజ్యోతిఃప్రసృతసకలాజాండవిభవా!
ప్రమాకృత్యాసీతాంకురకదళిషడ్భాసితమనూ! ౫౧౩



# మునిశాప ఖండము

---

క. శ్రీసచ్చిత్సంసర్గ
వ్యాసగ్జనభూతలోకసరిణతిదేహా!
పాపిసంగ్యవాహా! గాఢ
ప్రేంసామగ్రీవిశిష్టశృంగారోహా!

ఉ. ఊనదృశాంబువుల్ నగరులోనికి రాజులు కొంచుఁ జన్న భూ
జానిని, రాజు మూర్ఛఁగని చాలయు దవ్వుగ నల్లెయుండి తం
డ్రీ విలుమంచుఁ దాఁ గలవరించుచు నుర్వులు గ్రక్కుచున్ దినాం
తానతసూర్యబింబజరతాంశుల మెజ్జినిన్గల్గు తగ్గుచో

చ. స్మృతిఁగని కన్నువిచ్చి యతసీకుసుమాభశరీరుఁడైన రా
ముతనువు నిగ్గులెల్లఁ నివిపో చనుదెంచెను రాముఁడేడి యం
చతితరమైన కోర్కె చన, నచ్చటివారలు స్వామి! యిద్ది గా
థతమము లెల్లఁ గ్రమ్మను గడంగెడి తీరదె ప్రొద్దుక్రింకెడిన్

గీ. ఇంక విచ్చోటఁ గోడుక? మీనాంకమూర్తి
రాము నరడ మీనఱకుఁ బురంబుదాఁటి
యెంతదవ్వైనఁ బోవచ్చునే యపంగ
రాజ నే నేగవలదంటి రాము సడవి

ఆ. తండ్రిమాట కడుగుదాఁటఁడు రాముండు
నేను వలదటన్న నేల యేగెఁ
దండ్రిమాట కడుగుదాఁటునే రాముండు
నేను బొమ్మనంటి యేగినాఁడు

శా. అయ్యో! చీఁకటి క్రమ్మెఁబో శబరకన్యానీలగండచ్ఛవిన్
దయ్యంబుల్ విరఁబోసికొన్న జడలై తా రాముఁ డీ చీఁకటుల్
కయ్యల్ కోసిన నల్ల వెల్లిఁబడపోఁగా నేర్చునా? తండ్రి యే
మయ్యెన్ రామునకున్ బృషత్కపథబాహ్యంబైన శత్రుత్వమై ఁ

శా. మోకాల్మీఁదికి జాఱు కేలుఁగవయున్ బంగారు నంసంబులున్
శ్రీకళ్యాణవితర్దివక్షము శిరోవల్లీకారపర్యంత రే
ఖాకల్పం బరుఁ గన్నదోయిఁగని వన్యావీథిఁ గండున్న పు
ణ్యాకారం బఖిలంబు చూచుకొనదో యాహా! పులిందోత్తముల్

ఉ. వేలుపువీటియేలికకుఁ బెద్దయు సాయముగాఁగ మెచ్చి తాఁ
దోలినయట్టివే కలవు దొంబదిలక్షలు కోట్లు జాతి గు
ఱ్ఱాలవి నాదు సావడిని రాముఁడు కాల్నడ నేఁగునే వనిన్
లీలయుఁగాఁగఁ దిండికిని లేని యనాథుఁడు పోయినట్లుగన్

మ. అగు బంగారపుపీఠపై మధురరాగాలాపనన్ మేలుకో
నగు నాతండ్రి గిరీంద్రకందరరవద్వ్యాఘ్రోగ్రగర్జారవా
నుగజాగ్రత్స్థితిఁ గాంచునో మొగుడుఁ గన్నుల్ విప్పి వైదేహి భ
ద్రగతిన్ జన్నదొ లేదొ చూచుకొని యంతన్ నన్ను నిందించునో?

చ. మణిపిడి నెమ్మికన్నులు నమర్చిన మారకతంపుబిళ్ళ వీ
వనఁగొని వీచినన్ నిదురపట్టని నాయన తీవ్రఝంఝులున్
బెనచిన గుమ్మలోఁ చుఁ బెనవెట్టెడు గానవృక్షశాఖికా
జనితసమీరపాతములసందడిఁ జక్కఁగ నిద్రవోవునో?

శా. హర్యక్షంబుల శ్వాపదంబుల దురంతారావభీతిప్రదా
హార్యప్రాంతమహాటవీకలుషశయ్యావీధి వైదేహి, యా
దీర్యత్కంటకబాధ కోర్చుకొని నిద్రించన్ మరాళీగరు
న్మర్యాదావధిసాధుశయ్య నిమురింపన్ లేసి క్రొమ్మేనితో

చ. దశరథుఁ డన్న పేరుగల దానవుఁ డేమి కృతంబుఁ జేసెనో
విశదపురాజనుస్సులను, వీనికిఁ గోడలు లేదు బిడ్డలే
దశనివచోదురంతకుఁ డనాగసుఁ బుత్త్రిని బంపెఁ గానకున్
బ్రశమితకాముఁడో కొడుకుఁ బండితసత్తముఁడైన వానినిన్

ఉ. గాధిజుఁడంత దైవ మడుగన్ సుతుఁ బంపఁగ నొప్పుకొను లే
దీ ధర నే నహా బ్రదుక నెట్టులు? రాముని విప్రయోగపుం
బాధ భరింపఁజాల సుకుమారుఁడు రాముఁడు మూఁడుప్రొద్దులన్
సాధువు వాఁడు నా కనులఁ జాదినఁ గందపుఁ బాత్ర కాఫుటన్ ౧౩

శా. ఈ యంతఃపుర మల్ల దానవిదికాదే! యిందు నన్నుంచి రే
లా! యే నేరదఁ గోసలాత్మజగృహం బచ్చోటికిం గొంచుఁ బొం
డా యోషిన్మణి రాముఁ గన్నకడు పాహా! యామె భాగ్యంబు కా
దే! యోగీశ్వరువంటి బిడ్డఁగని మాహేయీపయఃకల్పునిన్

వ. అనినఁ గాంచుకీయులు రాజుఁ గౌసల్యాగృహంబులు చేర్చిన

గీ. సాధురామలక్ష్మణఫల స్తబకహీన
మవనిజాపుష్పవల్లీ సుహాసరహిత
మైన యా గేహ మన్న యుద్యాన మరసి
మనసు చెడి భూమిపతి తోటమాలివోలె

ఉ. పోడిమి దీవనల్ నెఱపి పుత్త్రుఁడు రాముఁడు గేహదేహళిన్
వీడినయంత నల్పముగఁ బెట్టిన యింటి యలంకృతుల్ నుతిన్
దోడనఁ దీసివేసి నెదతోడి విషాదముచేతఁ దల్లి, యా
పాడయినట్టి గేహమును బార్థివుఁ డల్లెడఁ గాంచి కాంచుచున్

శా. ఆక్రోశించెను బాహులెత్తి విభుఁ డాహా! రామ! నాబిడ్డ! క
ట్టా! క్రూరుండగు నైనఁ దండ్రిపయి నిట్లత్యంతవైరంబు భూ
చక్రంబందున నీవుగాక మఱి యే సంతానమో చూపుఁ గా
మక్రోధోపహతున్ ననున్ వదలి రామా! యెంత శిక్షించెదో?

ఉ. ఆ యెవరో యదృష్టముగలట్టిరు వేఁగుల జాజిపూఁతన
వ్వై యెసలారు రాముని ముఖాంచితకోమలమందహాసచం
ద్రాయితకాంతిఁ జూచెదరు రాముఁడు కాననవీథినుండి సీ
తాయుతుఁడూర్జి సర్వజగదాభరణం బరుదెంచువేళకున్

గీ. నాకు లేదా యదృష్టంబు నాకు లేదు
కైకయనియెడి విషభుజంగమ్ము విసపుఁ
బూఁత నిగనిగల్ కల సన్నమొలకకోఱ
యాకుటా పదునైనట్టి నాకు నేల?

వ. అంత నింటిలోనికిఁ గౌసల్య దివ్వె తెచ్చిన రాజుల్కిపడి

క. ననుఁ బాము కఱచె దివ్వెయుఁ
గనినంతన విసము మస్తకంబున కెక్కున్
గొనిపొందు దివ్వె దివ్వెయుఁ
గొనిపోండీ యంచు రాజు కుంచుకయున్నన్

శా. కౌసల్యాసతి రాజు నానుక భుజంగ(శ్లేషదంష్ట్రా)విషం
బాసీమాంతము నాకు నెక్కినది రాజా! నీకుఁ గాదన్న, భూ
మీశుం డెవ్వతె వీవునా, సతియు నే నెవ్వ ఁగనా? కానసే
చ్ఛాసంసారికి రాములుబ్ధకప్రసూజన్మాక్ కిరాతింజుమీ!

మ. తొలిజన్మంబున నేను బోయెతను నాతో రాఘవాంతఃపురం
బులకుం నచ్చెను పాడుజన్మ, కొడుకుల్ పోవఁ వవీభూమి తా
వలె నిం దుంటిని బీటవెట్టుకొని నా భాగ్యంబు నా బిడ్డలం
బలె దుష్టంబయిపోదు సంపదుదితప్రాసాదవాసంబునై

శా. నన్నుంజూచినఁ జూడకున్న ధరణీనాథా! నిన్నుంబట్టుకే
యున్నా నింత పగేల నాపయిని నా యున్నట్టి సర్వంబు నా
మిన్నా గంటిన దేమిచేయుదును భూమీనాథ! ని న్నందునా?
యన్నన్ నా పసివాంద్రుసుం దిరిగి రానై యున్నదా! చెప్పుమా!

సీ. బహుధా నిరాదృతిభాజనంబై బిట్టు
చీఁకట్లు క్రమ్మె నాజీవితంబు
లోనికి నీ కృపాసాధనమె చనుదెంచె
నొక యింద్రనీలకత్తోన్నపలంబు
ఆ మహారాజు బ్రహ్మజ్ఞుండు జనకుని
కడుపు చల్లఁగను మాఘవతశేకల
మునకు జోడించెను ముక్తాసరోలక్ష్మి
ముగ్ధాంశుచిక్కణమూర్తి నొకఁడు
తాను నా దుస్థితికి జాలిపూని యీ సు
మిత్ర తాఁ గన్న మాణిక్యమృష్టశకల
మొకఁడు జోడిచ్చె నా నీలమునకుఁ దుదకు
నొక్కమణి లేక చీఁకట్లు పిక్కటిల్లె

క.. ఈ గ్రుడ్డిదీప మొక్కం
దుగ్రంబగు తోడుగాఁగ నుంటిని నా యీ
వ్యగ్రంబగు జీవితశా
ఖాగ్రంబునఁ బండ్లు పండి యంత్రస్థితమై                                                    ౨౭

ఉ. ఓలము మూలముట్టు చెడి యొక్కరి నన్న పనేమిలేదు ము
క్కాలము తన్నె నమ్మికొని గాథయతాత్మను ధ్యానమగ్నతన్
జాలఁగనున్న దైనమును జాలి తలంపఁడు నాసి సొమ్ము నా
మూలమునన్ మఱేని చెడిపోయెను గన్గను వాఁడు నమ్మెడై

ఉ. మా వధు వామె యన్న నెుకమాటకె దీటగు నెల్ల లోకముల్
కోవల ముత్తై మా జనకు కాంతుడు రాఘవు లింటికెల్లు వ
న్యావిలయంబు లేలునో సనాతని తల్లి యరుంధతీకృపా
శ్రీవిభవంబు కోడలిని జెందును గాపుత మాశిషంబుగా

క. బిడ్డలు వనవాసంపుం
గడ్డు గడచి మఱల తల్లిగడ్డం దొక్కం
బడ్డప్పుడు వారలచే
నోడ్డుంబట్టెదన? యంత యున్నదో? నాకున్

శా. అయ్యయ్యో! యిది యేమి వ్రాసినది నాయాస్యంబునన్? గుండెలోఁ
గయ్యల్ కోసిన దుఃఖవాహినియు నీకౌసల్యజీనంబులన్
వ్రియ్యం జేయదు సాగరాభిముఖమై వారించ దేముందు నా
యయ్యల్ కానన దుఃఖవార్ధిఁ బ్రళయంబై పోదురో! యేమొకో?

క. నాతండ్రి మఱలవచ్చును
తాతల యీనేల మఱలఁ దా నేలు ననన్
జేతంబు పుట్టదాయెను
సీతా! సీతా! యిదెంత సేగే, తల్లీ!

వ. అని నిరవధికదుఃఖసాగరతరంగతాడనాంతర్హితధైర్య యైన కౌస
ల్యతోఁబాటు దశరథునకు వసనంబు కన్నులంబెట్టికొని కుములు
చుండ సుమిత్రి పట్టపురాణిని నిఠ చేసి యిట్లనియె

క. ఆహా! యే మిది యశుభ
వ్యాహారము లాడె దిద్ద రాజ్ఞగలు బళీ
మోహారిసాహారి నొకరొక
రూహాలపై నూహ లల్లి యుఱక తపింపన్

మ. తనకుం బుత్త్రుఁడు ప్రాణమం చెఱిఁగి చింతామగ్నుఁడౌ భర్తకై
గాని వేరీతులఁదేర్చుకో నగుట లేకుండెఁ సరే! నీవు పొం
గిన దుఃఖంబున బ్రుంగిపోయిన నృపుల్ గేలూఁది యెవ్వారు తే
ర్పను శాలింపను చేయఁగల్గుదురు ధైర్యం బూనవమ్మా సతీ!

ఉ. చిన్నకుఁజాలు బిడ్డననిఁ జేరినవాఁ డఁట చేతకానివాఁ
డెవ్వఁడొ పోయినట్టు నగులేటికి? రాముఁడు బాలుఁడం చహో
నోన్నకు! బాలుఁడే యని మనోగతినుండును దల్లి వాఁట, వాఁ
డెవ్వఁడు? వాని కేమిభయ? మేగిన తోఁవన నచ్చు స్వామియై

చ. సుతుఁడనుకోకు! సూర్యులకు సూర్యుఁడు బ్రహ్మల బ్రహ్మ యెల్ల దే
వతలకు దైవ మా కొడుకు వానిని నగ్ని స్పృశింపలేఁడు భూ
తతతి కుమారునందు వినతంబయి భక్తి సపర్య సల్పు నా
పతికడ నున్న భూసుత కపాయము రాఁ బనియేమి! చెప్పవమా

మ. తొలిధర్మంబున బద్ధుఁడై చనిన పుత్త్రుంగూర్చి దుఃఖంపఁగా
వలెనా? నిన్ననునంటి శీలవతు లా బాలుండు సత్యవ్రతుం
డలఘుం డచ్ఛయశఃపతాక శశిసూర్యంబైన కాలంబు మె
చ్చులమేరై పదివిక్కులందు నెగిరించున్ గాశకాశప్రభన్

శా. శౌచాంభోనిధి రామచంద్రు నుడికించన్ లేఁడు సూర్యుండు శ్రీ
వీచీగంధనహుండు రాఘవుని సేవించున్ నభస్వంతుఁ డ
ర్చాచర్చిక్యనవాంశుసంతతి సుతున్ జంద్రుండు సేవించు వ
న్యాచకాస్త్రులు రామువింటికొప్పిరెన్ గాంచంగ లేరింతయున్

చ. మృదమున దానవేంద్రునిఁ దిమిధ్వజపుత్త్రునిఁ జంపినందుకున్
విధి దయచేసినట్టివి నవీనమహాస్త్రములున్ సుబాహుని
ర్మథనకృతంబు గాధిజుని మన్ననఁ జేకుఱునైన యస్త్రముల్
బృథులభుజాప్రతాపు రఘువీరుని నిత్యముఁ గొల్చుచుండెడిన్

క. ఆతని కీ యిల్లెల్లో
స్ఫీతవనంబులును నల్లె బిడ్డ కరగతం
బై తనరు విల్లుఁగాంచిన
భీతిం జరియించు భూతవితతులు తల్లీ!

శా. నీకున్ నాకును లేదుగాని పసివానిం గాంచు భాగ్యంబు వాఁ
డా! కాంతారపథోచ్ఛలద్దితిజరాడ్వ్యాపాదనోదారబా
హాకోట్టాకృతి నిస్సరించి వనవాసానేహ మేతెంచు నిం
దాఁకన్ వాడని పూవువోలె క్షితికన్యాభ్రాతృసంయుక్తుఁడై

ఉ. జిష్ణుని మానికల్పు కుశచీరధరున్ బదరీవనిన్ మహా
విష్ణువు తాపసాకృతిని వెల్గెడునట్టుల వెల్గువాని ని
స్తృష్ణునిఁ గన్నులెత్తి కనరే ఋషిపుంగవులెల్ల నందు భ్రా
జిష్ణునిఁ గాంచుచున్ తపసుసిద్ధినిఁ గాంచిన మూర్తి నెంచుచున్

శా. రాజై రాముఁడుపోన లక్ష్మణుఁడు మార్గంబెల్ల గోదండవ
ల్లీజాగర్యుఁడు తీర్చు భక్తిమయవల్లీమూర్తి భూజాత నీ
రేజాతాక్షుఁడు భర్తతో సుఖముగా శృంగారలీలానవః
కూజాసంశ్రవణాత్తసుట్టమిత యాకుంబింబెగాఁ బోయెడున్

శా. ఆ రాముండును నిల్చువచ్చుచు నయోధ్యాపౌరనేత్రాంజనం
బై రోమాంచము పుట్ట నీయడుగులం దల్లంత నొత్తున్ బయః
పారావారము పొటుకొగ్గినటులన్ బట్టాభిషిక్తుం డగున్
శూరుండా సుతు ముంగురుల్ తడిపె దాశూద్గారిబాష్పంబులన్

వ. అను చున్న సుమిత్రి మాటలకుఁ గన్నకడుపు కావున మగిమలుఁగు
వడ్డ శ్రీరామచంద్రకళ్యాణానేకగుణంబులును వాని స్వామిత్వం
బును దెరతీసినట్లై కౌసల్య యోరిమింగాంచె

క. జనపతి యదిమొద లాఱగు
దినములు నికురింపలేదు తిన లేకును బ
ల్కనులేదు శయ్యపై న
ట్లనె పండుకొని తెలికప్పులం గనుచుండున్

క. కౌసల్య పలుకరించిన
భాసురముగఁ గనుల నామెవంకకుఁ ద్రిప్పున్
గౌసల్య దుఃఖపడినను
ద్రాసంబవు గనుల సర్వదైన్యము నింపున్

క. ఏ వ్యక్తియైన లోనికి
రా వ్యక్తిచ్ఛవులు కనుల రా వీక్షించున్
దా వ్యక్తి యద్ది కాదని
లో వ్యసనం బందినట్లు లోఁగొను జూపున్

క. బలవంతంబుగఁ దాఁ గో
సలకన్యక నోరుదెఱచి శర్కరిలపయు
స్సులఁబోయఁగ మ్రింగక కో
సలసుత దుఃఖపడ మ్రింగు సాధిష్ఠముగన్

గీ. అంత వినఁబడె నంతఃపురాంతవీథి
గలకలము తోడుపాటుగాఁ గదలిపోవు
వేళ రామునిఁ గొంచేగి వీఁడు వచ్చెఁ
జూడు రాముఁడు లేకుండ సూతుఁ డనుచు

ఉ. ప్రాణములెల్ల గుప్పిటను బట్టుక, వచ్చు సుమంత్రుఁ డన్ బ్రతీ
క్షానిశితాక్షికిన్ సుతవిచారకుఁ బట్టుపుదేవి కేమిగాఁ
దాను వచించునో యనుచు ధారణినాథుని భార్య లన్న దుః
ఖానతవాక్యవైఖరియు నంతిపురంబునఁ జెల్ల రేఁగఁగా

చ. అనుపదమున్ మహాశనివిహారహతాస్మృతిఁ గోరికొంచు లో
నెనిమిదికక్ష్యలన్ గడచి యెచ్చట తేఁడు కలండో యచ్చటం
జని గదిముంగిటన్ నిలువ క్ష్మాపతి కన్నులు విచ్చి చూచి యొ
క్కని నె సుమంత్రుఁ, ద్రిప్పికొని కన్నులు, కన్నుల నీరుగార్పగా

ఉ. వంచిన కన్నులన్ గొలికిపట్టులఁదెట్టులు కట్ట నీ ర్నమ
పించి ధరాపతిన్ మనసు ప్రేఁగున మాటయురాక త న్నెఱిం
గించుక దోయిలించి యొకకేల నిలంబడు మంత్రినామమున్
వించు స్మృతింజెడెన్ నృపతి బిట్టుగ రాఁటులయేడ్పు లొత్తుగా

క. పతితల తొడపై నిడికొని
సతి కోసలరాజతనయ "చనుదెంచెను దు
ష్కృతి కార్యకరణ మొనరిచి
హితముగ మఱి పల్కరింప వేలా మంత్రిన్			౫౫

క. నీ పున్నమాయె మఱి యే
దో పల్కుము దుఃఖ మెట్లు లుడుగును గైకే
యీ పర్యంతము నీ భయ
మా పడతుక లేద యిందు నవనీనాథా"

క. అని తానుగూడ మూర్ఛం
గనెఁ బట్టపురాణి దారఘుట లాగుబ్బై
పెను వగపుగూర రోద
స్వనమున నంతిపురియెల్లఁ జనె నమవసమై

ఉ. మోహమునుండి తేరిన నృపుండును మంత్రిని రామచంద్రవా
ర్తాహవమైన కన్నుల నతంబుగఁ జూచిన మంత్రి పుత్రిగా
ఢేహుని శోకవహ్నికృతశీర్ణాంగులదేహునిఁ దల్పచాలితో
ద్వాహుని డగ్గఱెన్ బ్రియసుతప్రవియోగమహోపనాహునిన్

ఉ. మానవనాథుఁ డిట్లనె నమాత్యుని నాననదైన్యరేఖికా
స్థానవిషాదయోగపలితాయితభృత్యుని రామభావనా
నూనసుతీవ్రతేజితమనోధృతచైత్యుని మార్గధూళి సం
తానసమావృతాపఘనదాసమహోఖిలలోకజాత్యునిన్

క. ఉల్కాపాతము వోలిక
నూల్కొను కోపమున లక్ష్మణుం డే మనియెన్
చుల్కన నాయెడద రివరి
వల్కన శిక్షింప నెపుడు వచ్చెద ననియెన్

చ. అనిన సుమంత్రుఁ డోయి ప్రభువా! పగమర్షి సమానశాంతభా
వనులగు నీ కుమారకులు పల్కెద రెట్టుల నట్టు లట్లు నీ
యనుమతి నేగుచున్ రఘుకులాంబుధిచంద్రుఁడు రామచంద్రుఁ డే
మనినను నీదు సత్యవచనాభిరతిన్ మఱి మెచ్చుటే యనెన్

క. పృథుమతి సౌమిత్రి విలిం
పథికుఁ డతఁ డన్నగారి మాటయె మెపుడున్
వ్యథలేక యన్న చను నీ
వధచింతానిరతవిత్తపఘుఁ డెల్లపుడున్

సీ. హా! రామ! హా లక్ష్మణా! హా సుమిత్రా! యంచు
నాఱుదినమ్ముల కవనినాథుఁ
డేడ్చుచుండినఁ జూచి యెల్ల యంతఃపుర
మఖిలదుఃఖమున సౌఖ్యమ్ము గొంతఁ
గనియె భూపతి మంత్రిఁగాంచి రాముం డేమి
యనియె రథం బెట్టు లవతరించె
జనకజ రథము డిగ్గినవేళ నూత్న భ
యాకంపితాంగిని నాదుకోడలొ

తాను రాముఁడు, నాదు సంతాన మడవిఁ
బట్టినది దిక్కు-మాలి యేచెట్టునీడఁ
బట్టినది యేమి తిన్నది బడలి యెంత
తిట్టిపోసినదో నన్నుఁ దెలుపుమయ్య

శా. తా నిచ్చోటికి నాదుకొన్నది సుమిత్రాదేవి కౌసల్యనుర్
బ్రాణోన్మాథనవేళ నన్నటు సుమిత్రాపుణ్యసంతాన మ
ట్లే నా రాముస సీత నాదుకొనునాళీ యా తల్లి బిడ్డల్ పరి
త్రాణవ్యగ్రులుకాక యీవట కయోధ్యారాజు లే మాదురో?

శా. తోడ్తో నిద్రయుఁ దిండిలేక కులబంధూ! నిన్ను దర్శింపఁగా
నేడుర్ లోనన లోన రాఘవకులహీరగాథ నాలింప నే
వడుర్ గన్నుల వెల్లిగా వగపె నింపంగాని నిన్నడ్గలే
కేడుర్ జానకిపోవ రాదనుచుఁ గానీ మాటలేకుంటినే

చ. అనిన సుమంత్రుఁ డిట్లనె ధరాధిప! రాముఁడు లక్ష్మణుండునుర్
జనకజ నీపదంబులకు సల్పిన చెప్పినవౌ నమస్కృతుల్
కనుకని వేలు, తల్లులకుగాఁ బొనరించిన వాక్కు-లట్లు చె
ప్పినయవి చెప్పకుండ నొకవేయి నమస్కృతు లిచ్చె నీ కహో!

శా. ఆ విద్యానిధి సూక్తిమంజులధురావ్యాహారబాహాటలీ
లావైదగ్ధ్యము నే నటేఁ? తలలు వేయైయున్న శేషాహియుర్
భావం బింతయు బీరువోకనుకరింపర్ లేఁడు, నాస్వామి నా
దైవం బా రఘురాముఁ డన్నయవి చింతాకంత వాక్కుచ్చెడిర్ ౬౭

శా. నీకై యిట్లన నేమి పూర్వసుకృతానీకంబో సత్యోక్తిమా
లోకంతాభరణుండవైన నిను నే నర్థించితిఁ దండ్రిగా
నా కీ జన్మమునందుఁ ద్వద్విమలపన్నాళీక యుగ్మంబునం
జేకోవే ప్రణతుల్ సహస్రములు రాజీవాప్తవంశాగ్రణీ!

చ. కొడుకు వనంబు చన్న యొకకొండొకశోకముచేతఁ జిన్నత
మ్ముఁడు చనుదెంచుదాఁక నగపుంబడి రాజ్యము చూడకుండ మీ
రుడుగకుఁ డాత్తధర్మములు మహానిధు లార్జితసత్యవిత్తముల్
విడువుఁడు పుత్రదుఃఖము వివేకపథుల్ చన రా పథంబునన్

శా. తల్లిం గూర్చి యుపన్యసించె నిట్లులన్ ధాత్రీశుఁడున్ దుఃఖపున్
వెల్లిన్ మునిగిన నీవు నట్లె యయినన్ బృథ్వీమహాకార్య మా
పల్లోలంబగు నీకు రెండవును సేవ్యంబుల్ ధరానాథునిం
బెల్లోర్వన్ వలె నిత్య మగ్నిని హవిఃప్రీతుం బొనర్పన్ వలెన్

ఉ. నీ కొడుకిట్లె వచ్చు మఱి నీ చరణాంబుజసత్ప్రణామ రే
ఖాకమనీయుఁడౌ వగచి కందకు నీవును దండ్రి యచ్చటన్
శోకమునంద నా కడవిచోటులలోన శుభంబుగాదు మీ
ప్రాకటమైన యచ్చటి తపస్సుఖభావన నాకు శ్రేయమా

ఆ. అనుచు నిట్లు చెప్పు మనియె సుమిత్రతో
తల్లి! నీవు నాదు ధైర్యమెల్ల
నీవు లేకయున్న నే వనంబేగెడు
వాఁడఁగాను తల్లి వదలిపెట్టి

చ. మఱియును నీకుఁ జెప్పుమనె మానవనాయక! దుఃఖ మందకే!
భరతుఁడు చిన్నవాఁ డవని పాల్యము పెద్దయు బర్వ నీవు మం
తురులును వానిఁ జక్కనగుఁ ద్రోవను బూన్పనుగావలెన్ వృథా
విరహము పేదగుండె యనిపించుకొనున్ మనుజుం డధీరుఁడై

చ. మఱి మువురైన తల్లులు సమానమె యాదుర యెంతచూచినన్
భరతున, కెవ్వడో నృపుఁడు వాఁ డఖిలంబునఁ దాఁ బ్రసుమల్లు దు
ర్భరమగు శోకభావమునఁబట్టి మఱెవ్వరు కైక నేమి యం
దురొ యనరాద యామె ననుఁ ద్రోలద కానన మేనె పోయితిన్

వ. మఱి సౌమిత్రి యిట్లన్నాఁడయ్య మహారాజా! ౭౫

గీ. తండ్రి లేఁడును నాకును దల్లి లేదు
తమ్ములును లే రయోధ్య లే దుమ్మలికకు
నాకు సర్వమ్ము రామచంద్రప్రభుండె
నాకు దైవమ్ము రామచంద్రప్రభుండె

గీ. సినముగొని తల్లి రాజ్యమ్ము చేసి పెట్ట
నెంచదుచు నాకు వలదు రాజ్యేందిరయును
రామచంద్రపదధ్యానరమ్యమైన
చిత్తమున నన్ను నేఁ స్పృశింపఁబోదు

శా. నాప్రాణంబులలోని ప్రాణమగు నన్నన్ దండ్రి యీ రీతిగా
నే ప్రారబ్ధము తండ్రికిన్ మఱలఁ దా నీ స్వామి యూహావసా
నప్రేమాస్పదుఁ డిల్లు పంపెఁజుమి కాంతారమ్ము నా కోపమున్
దీప్రింబై దహియించుచున్న యది నన్నే నన్ను తా నెంతయేన్

ఆ. ప్రొయ్యిదాఁక నెలికిఁ బోయెదుమంటపై
నీళ్లు చల్లినట్లు నిలమేసు
సుందరుండు నన్ను సూత్రవేష్టనకళా
సూరి యెడద కండెమట్లు నాది

ఉ. ఖేఁడొనరించెఁ దస్త్రాలను రెండిటిఁ గొలుట్టి దాఁచరింపఁడే
న్నేఁడిది చేసియుండఁడు పునీతమతిన్ యయుమేఘవేళ స
ప్రమాడభిరామోగ్యపుత్రజరనంబగుఁ భాయసె మొకట మూద్దగా
మూఁడవభార్యకే రయొసఁగిపోయియు యుండిన నింతయూనాకో

మ. తొలుతన్ నా మనసెంత యున్మ్మలికతో దూఁగాడునో యంతపిం
గల నా కేల నటంచుఁ జల్లపసుఁగాకన్ బ్రాహ్మ్యభాజ్వాల యి
ట్టులమైయుండిన నేమి యయ్యోడిపొ న్స్వడాక్రూర మానేఁత యీ
తల నేలా వచియింపఁ గోరన యయోధ్యాశోభనం బింతయున్

ఆ. ఏల కోరవలయు నా లోకలోకమో
పతిరేకకారణాతి వేల
చలదిరమ్మదాభ శాలీనమూర్తి నీఁ
జెలఁగి యన్న నిట్లు చేసినపుడు

క. అని ఝుంఝు కొండగుహలో
నన జొచ్చి వృథాభ్రమిఁ స్వనంబును మఱి చ
చ్చినరీతి నూరకయ యుం
డెను సౌమిత్రి పతయాళుడింబమువోలెఁ

ఉ. దోయిడికంట రాఘవవధూమణిమాలిక ; భ్రమవంక గాం
గేయశలాక క్రౌంజిగులు క్రేవలఁ గ్రమ్మఁగఁ జూచు లోచన
వ్యాయతి నిట్లగా మఱఁదివంకను గాంచె మతేమి చెప్పలే
దాయమ తల్లి నే నడుగనైనను లే దపు డిట్లు లుంటినో?

గీ. ఒకడు మాత్రము జ్ఞాపకమున్న దతఁడు
లందుఁ గ్రొత్తగ జలపుట్టినట్టి చెలమ
యయిన రాముని లక్ష్మణుఁ డాని నిలచి
యతఁడు పడకుండఁ బట్టుకొన్నట్లు కలదు

వ. అనిన రాజు హాహాకారమ్ములు సేయఁ గౌసల్య వానకాలంబు మలు
సంజవోనికన్నుల నట్లె చూడ, రాజు హారామ! హాలక్ష్మణ! హా!
జానకి! యని మంత్రింగాంచి

శా. ఇంకం జెప్పుమ యింకఁ జెప్పుమ ధరాభృల్లోకపారిప్లవ
త్కాలంబగు నాచరిత్రము న్యళీకంబైన రామాటవీ
స్యంకుప్రస్థితన గమానములు మూర్ధాన రిత్సోష్ణాంశుమిా
నాంకుండై తెలివెల్లి లేని ప్రభువై యీ పోవు వాపోవుటల్

ఆ. మంత్రి చెప్ప నంత మట్టిపా లైచ్చెను
గుహుఁడు వారు మలమకొనిరి జడలు
వేల్పుటేఱు దాఁటి వెడలినారు ప్రయాగ
ముఖముపెట్టి జాలిమొగముపెట్టి

శా. నాకన్నుల్ జలసంభృతంబులుగఁ గన్నా నా జలాపూర్ణ నే
త్రాకారంబులు మిన్ను చేకొనని దీర్ఘాకారముల్ గాఁగ బా
హాకోదండుఁడు లక్ష్మణుండు చన్నెమం దాపైని భూజాత భూ
మిాకన్యామణి వెన్క రాముఁడును సోమింపఁ వస్నిమార్గముల్ రాఁ

మ. అనినఁ రాజు చిరంతనుండగు సఖుండా నీవు నిన్నాళ్ళ నా
ననటఁ గొంచెము మంచిమాట వినిపింపంజేసి తేమంటి ల
క్ష్మణుడుఁ రాముఁడు ముంగు వెన్క-దెసలం గాయంగ మాతల్లి మ
ధ్యను దా నేగినఁ దండ్రి లిద్దరును గోదండోగ్రనారాయణుల్

క. ఆ యిద్దఱ నడుమను జను
గ్మాయోషాప్రియకుమారి స్మగహగనేత్రి
శ్రీయుగ్మమధ్యగత శు
ష్మాయతదృగ్రేఖ ముందఁ యరిగి దహించుఁ

మ. అనినఁ బ్రెగ్గడ రామభద్రదశరథతత్త్వంబౌను ముల్లోక మా
తని ప్రాణాంతరదీపన ర్త్రియగు సీతాదేవి యెందున్న నే
మని, గంగాపరతీరగామము లగు వారల గట్టేగఁగాఁ జూచి చూ
పునకుం దాటిన శూన్య మట్లగని యా భూపాల! నే నేమనఁ

చ. పరమశివుండు రాముఁ డనువాచము పెట్టిన యొట్టుఁజేసి నే
సరథుఁడనౌచు నగ్గిఁజొఁ అజాలక వేలుపుటేటఁ బ్రాణముల్
తొరఁగనులేక ఫి రథము తోలుకవచ్చెద నంచు నెంచినఁ
దురగము లొక్క-ముందడుగు తూఁగవు నా కళ బ్రిద్దలై ననుఁ

వ. ఒకవేళ రాముండేమైనఁ గబురంపునేమో యిందు రెన్నాళ్ళుండు
మని గుహుండు చెప్పిన నట్లే యని యా రెన్నాళ్ల లో రాముండు
భరద్వాజాశ్రమంబుఁ జేరుటయు నచటనుండి బయలుదేరి చిత్ర
కూటాభిముఖంబుగాఁ బోవుటయు యమున దాటుటయును గుహుని
వేఁగులవలనఁ దెలిసికొని

సీ. ఓ మహారాజ! నీయూళ్ళలో, నీళ్ళలో
జెఱువులందున నొక్క-చేఁపలేదు
భూలోకమఘవ! నీ నేలలోఁ బూలలోఁ
దోఁటలందున నొక్క- తేటిలేదు
పృథ్వీశ! నీరాజ్యవీథిలో వీథిలోఁ
బురములందున నొక్క- పురుగులేదు
ప్రభు! వీరు చను నసివాళ్ళలో బీళ్ళలోఁ
బసిమి మేసెదు నొక్క- పసువులేదు

చిన్నికోడలితోడ రామన్న వదలి
వచ్చుచున్నట్టి నాదు దౌర్భాగ్యముఖము
పరిహరించిరో! నాదు సేవకతపోంబుం
బృథ్వీపతి! యెంతగాఁ బరితాపించినావు?

శా. స్వామీ! నీవగు కోసలాబ్దుబిలను నీ సాకేతమున్ వేగ్యథో
భూమిన్ రంధ్రము గల్గి వచ్చిన జలంబుల్ సర్వము బీల్చుకో
నై ముందేగని పెద్దవాగువలెఁ దా సల్లంతటన్ వచ్చు న
ట్లే మాయంబయి పోయినట్లు కనరాదే దారిగాఁ జూచినన్

సీ. హవ్యకవ్యాదిపయఃపాత్రపీఠి మా
హేయి తా నీచుకపోయినట్లు
వాలినగిరి కొప్పువడి గుహాముఖముల
సుడివడి మునులిందు జారిగినట్లు
వలచలు నిదురలో వచ్చి తీసినఁ జూడఁ
బ్రొద్దుట సని బీడువోయినట్లు
నిలువునఁగాచి పండిన తియ్యమామిడి
భుగ్నవాత్యలఁ బడిపోయినట్లు
లోయి రాజ! నీయూళ్ళు నుస్సు గనుచు
దాగుకొనుచును మ స్తకదఘ్నపాక
లీన మగుచును జెదరి నూలినఫలంబు
సగుచుఁ జన నీమకొంచు నే రరుగుదేర

ఉ. బిట్టగు కోపశోకముల వీథివెుగమ్ముచు జూపకుండ నే
పట్టుల నిండ్లలో నొదుగఁ బౌరులు నిర్జనవీథులందు నా
కట్టిన బండిరాఁ దలుపుకంతలఁ బిల్లలుచూడఁ బాపపుం
గట్టెలబండి దానిఁ గనఁగా నల దగ్గుచును దల్లు లాడఁగన్

సీ. ఉదయకాలంబుల నుర్విసురనృహాప్ర
ఘాణంబులన్ బలుల్ కావరాని
మధ్యాహ్న వేళల మహితాశుశుక్షణి
జ్వాలాశిఖాధూమ్యా జాడలేని

తగా

సాయంసమయభైక్షచరణనివృత్తపా
రాశరి శ్రేణి మూరానఁబోని
ప్రొద్దుపోయినవేళ ముఖరవిపంచీమి
లత్కామినీగీతిలవణి లేని

విధిమిళోషస్సులను వటుపీరకంఠ
పీవరస్వానపర్యాయవిధము లేని
యూళ్ళు పెడపెడఁబడి క్రుద్ధయుగ్యములను
నా యదపు సుంత పట్టమి నడుపుకొంచు

సీ. వడిసెలతో నొక్కవనితె మంచెః తేను
సస్యపక్షులయథేచ్ఛమ్ము పొలము
పాలుతీసెడు నట్టివారు లే రుక్కండోద్ఘ్న
లైన నై చికులకు నమితబాధ
తొంగిచూచిన యెట్టితోయజాక్షీముఖం బ
తైలసంస్కృతశిరోజాలిముంపు
చెట్టు చెట్టున మాడి చెడిన పండ్లనఁగ శా
ఖాస్థితమూకమాశలికులంబు
ఒక మహాఘోరుఁ డైంద్రజాలికుఁ డెవండొ
రవిలి మంత్రించి చన్న పురాళివోలె
నైన నీ యూళ్ళులంబడి యరుగుదెంచి
నాఁడ నీగుజ్జములు ఛిన్నవధ్రములుగ

సీ. నిర్జనసాకేతనిభృతవీథుల నేఁడొ
యొకఁడు పుల్కసునకట్లుదరి తొలఁగ
శవము తోవనుఁ గొంచుఁ జనగాఁ బరిహరించి
నట్లు తల్పులు మూయ నందు నందు
మఱియు నీయూరి కమర్యాద యని బండి
దిగి కళ్ళెములు చేతఁ దివిచికొంచు
ముట్టెలఁజను నుర్వ తెట్టెల కుదుపలు
మేవనెండిన నెండి మెత్తుకొనఁగ ౧౦౭

యుగయుగమ్ములు నాపాదు నొడలి నెత్తు
రుల జితించిన సేవానిరూఢభావ
మదుముకొన లేక వినుఁజూడ నరుగుదెంచి
నాఁడ నఘువులఁబానిస నడక చెడక

వ. అనిన రాజు నాలంబంబు చెడిన యింద్రధ్వజంబువోలె విఱుచుకపడి సుమిత్రాకౌసల్యాబాహుచతుష్కాలంబంబు పొంది మఱల సేవ దేరి యిట్లనియె

క. ఏ యేలిక యే ప్రెగ్గడఁ
జేయింపనిదాని నేను జేయించితి నీ
చే యంత్రృభావదోషం
బాయెను నీయందు సేవనాఘఫలంబై

గీ. సేవకుఁ డఘంబు రాజాజ్ఞఁ జేసెనేని
నా యఘఫలంబు సేవకు నంటఁబోదు
పారలౌకికశిక్ష నీవలన లేద
యైహికంబగు దుఃఖంబు నంట దెట్లు

ఉ. నీ వరుదెంతు వంచు మఱి నీవలనన్ విని రామమూర్తి యా
త్మీవచనంబు లాపయిని బాణములం ద్యజియింతునంచు నీ
త్రోవన చూచుచుంటి నిఁక దోసము వెట్టకు నాదుపైని నీ
సేవకు నీఫలంబు దయచేసితి నంచును బ్రియ్యవెట్టకే

ఉ. నా సుఖమందుఁ బాలుకొనినావును దుఃఖపుభోగ మెట్లు పోఁ
ద్రోసెదు? రాముఁ గాననపుఁద్రోవఁబడిన్ దిగఁబెట్ట నీకుఁగా
వ్రాసిన దేరి కే పగిది వ్రాసెనొ యేమని చెప్ప! సద్గతిం
బాసినఁ జెప్పరాని వరపాలన మెవ్వరిలూహ చెప్పుమా!

ఉ. బద్ధులు రాఘవాన్వయనృపాలురు కోసలసర్వభూప్రజా
బుద్ధి కటందుఱ నే నడిగి పుచ్చితినే రఘురాముఁ గానకున్
విద్ధమతిన్ ననుం దోలఁగఁబెట్టి రఘూత్తముఁ దెచ్చికొందు స
న్నద్ధుఁడ నేను మృత్యువదనంబును జేరఁగ శిక్ష నాకదే ౧౦౭

శా. నన్నుం గైకొనిపొమ్ము రాముకడకున్ నా తండ్రి నాకందునా?
యున్నా కైన్ని నసీప్రయాణములు పోనెం జిత్రకూటంబునం
దున్నాడా! వని నెట్టి కోనదరిలో నున్నారొ కన్నోళనే
యన్నా! వచ్చితి, వానిఁ గాంచుటయు నౌనా! నాకుఁ బ్రాణాలతో

క. మీా రందఱు నే నేమో
శ్రీరాముని విప్రయోగచింతానుతి నం
చారోపింతురు రాముఁడు
దూరగుఁడా నాకు నెడదతో వసింపుంచున్

ఆ. వాఁడు నాకుఁ గొడుకుకాఁడు తండ్రినిగాను
నేను వాని కింక నేల చింత
మీారు వాని ప్రజలు మీారాజు రాముఁడు
మీాకు మీాకు నేమి మేర కలదొ?

సీ. హా రామ! హా లక్ష్మణా! హా స్నుషా! యంచు
నాభిస్థమగు శ్వసనంబు వదలి
దశరథుం డిట్లనె దానవి కైకయీ
వరగాధమును బాష్పవర్ధితంబు
నిశ్వాసపవమాననిత్యవర్ధితతరం
గమ్మునగు మంథరాగ్రహ మవని
తనయావియోగలంఘనవేలమును నైన
రామశోకకృపీటరాశి నన్ను
ముంచివేయుటలేదు నా మొగముఁజూడు
మనుచు నున్మాదచిత్రదుఃఖాంబురాశి
మునుఁగుచుండిన భూపతి మొగము గాంచి
మంత్రి చింతాంబురాశినిమగ్నుఁ డయ్యె

వ. అంతఁ గౌసల్య యిట్లనియెఁ దాత! సుమంత్రి! శ్రీ వశిష్ఠులతో
పాటు నీవును నంతఃపురప్రవేశయోగ్యసాధుచరణుండవు, నిప్పుడి
వచ్చినను దప్పులేదు, నన్ను రాముఁ డున్నయెడకుఁ దీసికొనిపొమ్ము

శా. నా తండ్రిం గపురింటం జేర్చుకొని మొన్నాళ్ళైనదోయీ! మఱిన్
నా తల్లిం జనకాత్మజాతం గని మొన్నాళ్ళైనదోయీ! మఱిన్
నా తాతంగని లక్ష్మణున్ మఱియు నెన్నాళ్ళైనదోయీ! బలీ
చేతం బియ్యది నాది రాతిదినలెన్ శీర్ణంబుగా దింతయున్

చ. కలంగిన రాజు భర్తయునుగాండును భార్యనుగాను నేను బి
డ్డలకడ కేగి యుండెద నిటాలజటాలులవద్దం గొండలో
యలసును ఘోరంగాక వనియందునం బుత్త్రిల నెంతమంది త
ల్లులు కనలేదు నే నొకతె లోకువనైతిని గాక సృష్టిలో

శా. ఏ నిం దుండను గొంచుంబొమ్ము వనికిన్ హేలాసరోజాతమా
లా నేత్రాంశులం గన్నబిడ్డల నన్నైలావల్లరీజాలశా
లానిదాఘతులం ద్యజించి మణిమాలాసౌధతూలాచ్ఛశ
య్యానివ్రిం గనలేను బ్రియ్యాసడలే నా రీతి నిద్రించుమఱిన్

వ. అనిన సుమంత్రుం డిట్లనియె

క. నీ కేలమ్మా శోకము
నీకొడుకును గోడలును వనీదేశమునం
దే కాఱియ పడియెద రవి?
వాకన మామాట వేఱు మహిరాణ్మహిషీ!

గీ. వయసువచ్చిన కొడుకు లెవ్వారు తల్లి
నంటుకొనియుండు నది దుఃఖ మనుట లేదు
అతండు తేడైన నేమి వేఁడైన నేమి
తల్లి తనమున నది కొఱంతయును గాదు

మ. ఇంక సీతావిషయంబునం దనినం దల్లీ! రామునితో నున్న సీ
తకు లీలాకరకర్షణత్రుటితరుద్రప్రౌఢకోదండల
స్తక పణ్యాకృతియైన సీతకుం బతిద్రాఘిష్ఠదోస్స్వర రే
ఖకు నీ సీతకు నేమి భీతి? గతదుఃఖా! పిచ్చి నీ కేటికిన్

ఉ. ఆ రఘురామచంద్రుండు మహాటవి కేగిన భూమిజాత నె
వ్వారిటం బట్టకొంగలరు భర్తకు దగ్గరనున్న సీతకున్
నీ రమణీయసౌధములు నీపగురాష్ట్రము నీవు నెల్లరుం
జేరువ నున్న యటు లొకసేగియు సీతకు లేదు కానలో ౧౨౦

క. రోహిణీమణి కార్తస్వర
భూషణములు లెక్కసేయఁబోదు ప్రసవనం
బూసాకృతి పూవులతో
వేషము తీర్చికొనుఁగాక ప్రియ మాయమునన్

చ. అరదముపోవునట్టి పనుయుంబున తేర నుఖ్మణుండు ని
ష్ఠురమగు మఃఖవరానముల బాధను బొందుచుఁ బోవ నామె యా
తనువును జూచి యీ సుమవితానముఁ గాంచి మతే మృగంబునో
యనసి యదే మయాం చదుగు నాత్మవిభున్ మఱదిన్ స్పృహాళువై

చ. సుమములు వాడిపోవుటలు చూచితి తేపునకున్ శిశిరప
త్రములును వాలుసాజలను వ్రాలుటఁ జూచితి నల్లమొన జీ
వములు దివంబునన్ నడిమిభాగమునం దపిఁగుఁగపఁ జూచితిన్
నిముసముఁ జూడలేదు ధరణీసుత యింత కందిపోవుటల్

సీ. అడవిలో నడచినయప్పుడైనను దల్లి
చిఱుకాళ్ళఁ బారాణి చెఱుగలేదు
కోసమొండలు తలన్ గుప్పుమన్నను నైనఁ
గోడలివదనంబు వాడలేదు
బడలికయెంత చొప్పడినఁ జెమ్మటపోసి
చిఱుతకుంకుమబొట్టు చెఱుగలేదు
వడలారి రివ్వునఁ బారగనోలినను జా
యల గంధపుంబూఁత యారలేదు
తల్లి దయ్యాదు చిఱునవ్వు తల్లి మొగము
నందుఁ దొలఁగదు తల్లి కే మమ్మ తల్లి!
జానకీభీతి నీ కవసరములేదు
కడుపుగూర్చిన బెద రంతకంటె లేదు

గీ. అన్నకన్నను సౌమిత్రి యధికమైన
శ్రద్ధ వదినపై నిఁగను ప్రాలనీక
కరశరాసనవల్గుసల్గనసమాన్వ
తాళులదికంబుగా రక్ష నాచరించు

వ. అనినఁ గౌసల్య యేడ్పుడిగి నిజమా? న న్నోదార్చుటకుఁ జెప్పు చుంటివా? యన సుమంత్రుం డిట్లనియె

క. పోఁడిమి చెడి పరలోకము
జాడలయందునఁ జెరించి చన్నానా! యీ
నాఁడును సీతావిషయం
బాడక యాడక యబద్ధ మాడఁగవలెనా?

గీ. అనినఁ గౌసల్య యోదారియును గళంబు
సన్నగా! యోయి రామయ్య! జానకమ్మ!
బిడ్డ! లక్ష్మణ! యని చిన్ని పిలుపు లొప్ప
దైన్యభావంబునం గింత తెలుపఁగఁబోదు

వ. అంత నీలలోహితలోహిత జటాపాటలంబులు సంధ్యారాగంబులో త్రిగిల్లి నీలకంఠకంఠరాశ్యామలంబులు సాంధ్యతమస్సు లావరించి ధృతసితచీరకాంతులందు మాత్రము చాలక యష్టాపదవర్ణదేహ లైన యంతఃపురస్త్రీల ముఖమండలంబులను గనిపింపనీక కొంతు గురగురలు మాని సౌధవలభీకులాయకుహరప్రవిష్టపారావత దేహంబులందుఁగూడ నలుపెక్కించి యుద్యానసరోవారిఁ బారాడు రాజహంసశిశుపక్షంబులయందు మునుగు లేఁతరంగుల భేదంబుఁజూపి విషాదపరిదూయమానప్రజానుకీముఖపిధానంబుఁ జేసి దుఃఖరేఖావిశ్వప్రపాదమంజీరలైన పరిచారికలందుమానంబువహించి నట్లు రాజదుస్థితి భావనిరాజ్ఞ ప్రాజ్ఞసముజ్జ్వలదీపికాపరిహారమున రాజసౌధకోణకోణంబుల మలఁగి మలఁగి చీఁకట్లు భ్రమింగుద మనియు బ్రాణచంగభీతంబులై యోసరిల్లుచందమ్మున మసల సుమంత్రుండు తనయింటికిం జనియె నంత కౌసల్య రాజుతో నిట్లనియె

సీ. నీ బిడ్డ లడవిలో నిభృతహంసీగరు
న్మృదుశయ్యలందు నిద్రింతురేమొ
తపసీయశిలోప్రధానంబులను దలఁ
బోపి సౌఖ్యమ్ము గ్రిమ్ముదురో యేమొ ౧౩౦

కనకకశిపుశీనికాయస్వనత్వాను
గీతికాకలితిఁ జొక్కదరొ రేము
పరిచారికాకృతప్రౌఢహాస్యవ్యంగ్య
భావసంగతి సుఖింపఁదరేము

జాలికాలంబమానవజ్రచ్ఛవులను
గృతసమాచ్ఛాదనమునఁ దగ్గింతురేము
ముసరుకొనివచ్చు నిద్దురముంపుచేత
నడవిలోన భవద్దయామాతులు రాజ!

క. నానారసభక్ష్యసదా
మానకృతాహారులై వినూతన కేళీ
మ్లానులు నీబిడ్డలు వ
న్యానివహాసుఖంబులఁ గృతార్థులు నీచే

మ. ప్రభు! నీచేసిన యీ మహోపకృతిచేఁ బ్రహ్లన్నులై బిడ్డల
క్షుభితుల్ తామ్ములమీఁదఁ గేతు లిడి కాఁర్యంగాంతు రానందవ
ల్లభసుస్వప్నము లెన్నొ కాంచెదరు భల్లాకప్రసర్వావనీ
విభులై రాజ్యము సేయునట్లు సకలర్క్షీసేవలం గన్నటుల్

ఉ. అక్కట! రామభద్రుఁ డొకఁ డవలఁ దాఁ జనుదెంచి యెప్పుడో
క్రక్కన కూటి కాసపడు కైవడిఁ దమ్మునియేలు నేలఁ దా
నెక్కను సింహపీఠ మప్పు డేమగుఁ దమ్ముఁడు? తమ్ముఁడన్నచో
నొక్కఁడు వాఁడుగాని దయయుండఁడు నీకృతి యెంత మేలొకో!

సీ. ఇతరమృగమ్ముచే హతమైనమాంసంబు
విక్కి కన్గొనదు కంఠీరవంబు
ఒకసారి మున్న యజ్ఞోపయుక్తము హవి
స్సును వాఁడఁ డొకసారి సోమయాజి
యన్యసంలగ్నచిత్తాంభోజయగు కాంతఁ
దాఁ బెండ్లియాడఁడు ప్రౌఢాత్యశీలి
యితరకవీంద్రగృహీతభావంబుఁ దా
నందఁడు పరమర్షియైన సుకవి ౧౩౪

మ. అవునమ్మా! రఘురాముతల్లి నను నేమన్నన్ సరే తప్పు లే
దవురా! నీ యనకున్కి నీదు సుగుణంబయ్యోక హృదంభోజసం
భవమఃఖమ్మును వేలయేం డ్లనుముచున్ బల్లెత్తి మాటాడ నీ
సవమఃఖమ్మును నోర్వలేవనుట యైన న్నీ గుణంబే సుమీ

శా. ఇన్నాళ్ళోర్చితి వింతయోర్చుకొనలే కేపోతి వీ సంజ నా
యన్నా! దేహము నాత్మ రెండు విడిగా నై యుండె నాలోన నా
త్మ న్నిన్నంటుకయుంటి నిచ్చటను గాదా! రాముఁడా నేన యా
సన్నుండై భవదీయగర్భగతవాసం జేల చేసెన్ సతీ!

ఉ. తీవ్రము గాఢమౌఁ బ్రిణయతేజము నా జనకుండు నేకప
త్నివ్రతుఁడా మహాప్రభువు తెచ్చిన కోడల! భిన్నచూపుగా
సువ్రతురాల! నిన్ను మరి చూచితి నన్నది కామరోగగే
హవ్రణమే భవత్ప్రశమితాత్మకగౌరవభావ మయ్యెనా?

శా. చానా! యెవ్వడునేఁ బురాబహుజనుస్సాయాత్రికత్వంబునన్
దా నిత్యాగ్నియు నిశ్చలాత్మకుఁడు ప్రాణాయామనిష్ఠుండునై
లూనాఘుండునునై నరుండై జనువునన్ లో నేకపత్నీవ్రతుం
డౌ నా పూర్వపుజన్మలందు నియతంబై లేదు తద్ధర్మమున్

గీ. తండ్రి తెచ్చిన భార్యతోఁ దనయుఁ డెవఁడు
తృప్తుడై యుండు నిశ్చలధీకుఁ డతఁడు
తొల్లిట బహుజన్మల గృహస్థుండు వాఁడు
మలచుకొనినట్టి యింద్రియములు గలాఁడు

చ. శ్వశురులయుండ లేదని విచారము పొందెదు పిచ్చిదాన! నీ
శిశువయిపుట్టి లోకముల సేగిని మాన్పెదు రామచంద్రుఁడా
శిశువును నీకుఁ గాదగిన చెట్టినంటుల లేకపోయెనే
వశమగు పోతి మిద్దఱము వాన్టికి నావిధికిన్ బిసాలికిన్

ఉ. ఇంటను స్వర్గలక్ష్మివగు నింటికి నీకు దోసంగు చేసితిన్
గంటికిఁ గామపుంబొరలు గ్రమ్మెను, జేయుమ లేదటంచు నే
నంటినె? నీ మహాశమగుణాపహరుండను, నీదు నిర్దయుం
బొంటెను సర్వయోగ్యుఁడనుబొల్తుక! దానికి లేదుదుఃఖమున్ ౧౪౭

చ. పతి సతి కెన్న దైవమగు భర్త కృపాళుడా నిర్దయాత్ముడో
సతి మతి యందు ద్వావృశ ప్రసన్నతమాలిన ధర్మలోకముల్
గతిచెడిపోవు, నందగాని కాదట నిన్నును బట్టి సత్పతి
వ్రత మను భావ మిచ్చటను రాఘవు లాతిపురంబులందునన్

వ. నన్ను క్షమింపుము ప్రసన్నవు కమ్మని రాజంజలిం బూని కౌసల్యా ప్రసాదనంబుం జేసిన నాయిల్లాలు పతిపాదంబులు స్పృశించియాయన కొమ్మన నాని యేడ్చి పతికరపరిమార్జితశిరోజయై యిట్లనియె.

సీ. నీ ధర్మనిష్ఠయు నీ సత్యవాక్పాల
నవ్రతనిత్యతత్పరత్వంబు స్వామి!
యే నెఱుంగుదుంగాని యీవేళ నాబిడ్డ
యేఁటినాళ్ళల వనంబందు నువికి
యేఁటియుగంబుల ట్లాత్మలో వ్రేఁగెక్కి
యూర్వజాలకపోతి నుర్వినాథ
శోకకోపమ్ములు చూడఁగా నొకయెత్తు
తద్వశమైన చిత్తంబునందు

ధర్మసత్యభావంబులు తలఁగిపోవు
ధైర్యము సహసిద్ధా విశ్లథంబుఁగాంచు
శోకదాసిని నానాల్క నాకు మీఁదె
నన్నుఁ గైకోవె ధర్మసనాథ! నీవు

చ. అదయుఁడ వీవు నాదెస నటం చనినా నది మిథ్యయం చెఱుం
గుదు దయలేనివాఁడ వనుకొందున నాకడుపుల్ ఫలింపనోఁ
గొదమను నీవుగాని కయికొన్నవిధంబున నీ మనోఽంతరం
బాదిగిన నాదెసం గలుగు నుజ్జ్వలమా దయ బుద్ధి కందునే?

క. నేనే నీవును నీవే
నేనును నాబిడ్డ నేను నీవును నిన్నున్
నే నన్నది నా బిడ్డకుఁ
బో నీయను నేను గాకపోవుట కాదే!

వ. అని యన్యోన్యాభితర్పణులగు నయ్యాలుమగలు సంగమవార్ధి నొకఁడొకఁడు ప్రవాహవేగంబునఁ బొదువుకొని మఱల వెనుకకు లాగి సమున్నతిఁ గాంచి నట్లుండ రాజు కునికిపాట్లు కునికి కన్నులు తెఱచి యిట్లనియె

సీ. జాబిల్లి వెల్గులు చాళ్ళుమున్నిక మింట
దిమిరపుంజం బఘసెంచినట్లు
లానందధామ మైనట్టి నాయెడఁదలో
గాఢాంధదుఃఖరేఖల్లు చెలంగ
నచ్చగల్ మైతాలు విచ్చువేలుపుపేట
దితిజసంతతి క్రమ్మకెంచునట్లు
లతనిపట్టాభిషేకానందపులకిత
మైన యెడంద శూన్యత భజించె
నట్టి యపవర్గలక్ష్మి తా నరుగుదెంచు
నంచుఁ దెఱచిన గృహకవాటాంతరమున
మృత్యుదేవత చొచ్చినరీతిగాఁగ
నతివ! పొలుపఱె నా జీవితాంగణంబు

ఉ. పుణ్యమొ పాపమోను సుఖమో మతిదుఃఖమొ మున్ను చేసినా
మున్నుఁబొనర్చినట్టిది ప్రభుస్థితిఁ గాంచినదైవ కర్మముల్
వెన్నున వచ్చునే తొలఁగఁబెట్టుఁగ సంస్కృతిబద్ధమానవుం
డెన్నడు చాలలేఁ డనుభవేచ్ఛయె జీవికి లక్షణంబుగా

గీ. గొడ్డటల్ మావి నలికితి దొడ్డిలోన
మోదుగునఁ బ్రేమతో నీళ్ళు పోసినాఁడ
నీ వసంతమాసాంతమం దేను ఫలము
లెట్లు లభియించు నని యేడ్చి యేమిఫలము?

ఉ. యౌవనవేళ సంతతిఫలాగమభావన చుల్కనైన యా
హావిలవేళ సంతువిషయంబున శ్రద్ధయు లేక సంచల
ద్భావముచే నపత్యపరిపంథినిమిత్తకష్టఁ జేసి యీ
నా వయసప్పుడా కృతమునన్ ఫలమందుట యెందు నున్న దింక

ఉ. అప్పుడు క్రొత్త నేర్చితి శరాసనవిద్యను శబ్దవేధి నా
కప్పుడు మిన్ను మన్ను కన నైనదె? పుత్త్రుఁడు శబ్దవేధిగాఁ
గప్పను నాదుకన్నులను గర్మయుఁ దప్పకవచ్చె నేటికిన్
దప్పకవచ్చుఁ గర్మ నియంబగు నెప్పటి కల్ల నాటికిన్

మ. నినుఁ బెండ్లాడను లేద యప్పటికిఁ దన్వీ! నేను నాతండ్రి న
న్ననుజేసెన్ యువరాజు వర్షఋతు సన్మా! మిన్ను ను స్నేకమై
చనుదెంచెన్ స్తనయిత్నుమూర్చ్ఛరితగర్జాభర్జనాభీలమో
హనమై యాకసమున్ వనం బలరె ధారానీతసూత్రాకృతిన్

సీ. శంకావహాదారశంపాభరదములు
గుట్టలందున నేనుగుంపు దిగుగ
దిగివట్టె వానకాళ్ళుగ దూరగతతాళ
వృక్షముల్ వార్షుకశ్రీ వహింపఁ
బొదవెన్క నే జంతువుంబోయినను వసీ
చ్ఛన్నత శార్దూలశంకపొడమ
గిరిదరీధాతుకచ్చురమైన నదివారి
సర్వజంతువులును జప్పరింప
నెట్టిధ్వనియు స్పష్టమ్ముగా నేర్పరింపఁ
బాచిబండలవోలెఁ గప్పలును బట్టి
కలును మొలిచిన పల్వలంబులను బిట్టు
నుదరి మొరయుచు వీలు లేకుండఁ జేయ

సీ. నిత్యసంధ్యాభ్రాంతినిబిడవనీవీథిఁ
బవలె శార్దూలముల్ బయలుదేఱ
గిరిధాతువుల నేల దొరలివచ్చిన కొండ
చిలువలవలె ప్రోదినులు స్రవింప
నకులాయబలిభుక్షంబులు వృక్షశాఖాగ్ర
ముల వానలోఁ దపస్సులను సలుప
గాలమేఘావృతాకాశమ్మునను దిక్కు
తెలియక తరణి నిశ్చలత పొందఁ

బట్టిన మొయిళ్లు దున్నలవలెను నచ్ఛ
భల్లములవలె మనుబిళ్ళవలెను ద్విగద
ముల విధమ్మున నాకాశమున జరింప
నాకు మృగయాభిలాష మనంబు దగిలి

ఉ. కైవెలుపూని యంపపొదిఁగట్టి రథంబున యౌవనోదయ
శ్రీవిభవంబునన్ గలవరించుచు నేర్చిన శబ్దవేధియో
గ్యానసగంబు నింద్రియనికాయపుఁజేతఁకు లోఁగిపోయి తీ
వ్రోవరులైన వన్యసరయూతటిసీతటవర్తి నామనున్

చ. నలుదెసలం దిరుల్ బలిసినం గనుపింపద రాత్రి గడ్డుగా
బలిసెను సీరుత్రావుటకు వచ్చిన దున్న నొకండు చంపితిన్
గళమున గుఱ్ఱువెట్టి యదిగాని పదాహతిఁ దీరవల్లి కా
వలి సడిచేయఁ జచ్చినది బాణపథంబున గుర్తుపట్టితిన్

మ. పసనై గుండియ యేని చెప్పుదుఁ గళాప్రాచుర్యలోభంబు పో
వదు తా నొక్కట వేఱ రావలె వధింపంగావలెన్ బిట్టున
న్నది పారీణంబున కాసయై పెనచియున్నన్ సజ్యకోదండదా
రదనారాచవినిర్గమాధ్వమతిధారావ్యగ్రకర్ణుండనై

ఉ. సన్నని మూతి కుండము వెసం జలమందున ముంచు సవ్వడిం
జన్నది బిట్టు దప్పివడి సామజ మొక్కఁడు తొండ మూఁదికై
కొన్నవిధాన వారి నదిగో నిశితోజ్జ్వలబాణలక్ష్యసం
పన్నత నల్లెత్రాడు విడ్రువన్ బెడకొప్పున దాఁక నేసితిన్

క. అదివడి కెవ్వనిఁ గఱవని
కాదమయియున తాఁచు విసపుఁగోఱ విధానన్
వదలఁ జనిన యంపఱ యా
మదగజ మను కొన్నచోట మల్లచఱపుగాన్

చ. హితతమురాలు! రామజననీ! మదనాగవిదారిఘోరఘీం
కృతి బహు లేమి వింటి 'విధి కేవలమైన యధర్మమిట్లు శరా
హతి ననుఁ జంపు నెవ్వఁడో' యుదాన్నని నేనను వాని కేమి చే
సితి నతఁ డెవ్వఁడో యెపుడు చేసితి నెవ్వని కైన న్యాయగాని ౧౬౭

చ. అపు డెటువంటి నిప్పు డెటు లట్టులనుంటిని మృత్యుదేవతా
విపులముఖాభిముఖ్యగతి వెక్కస మాచును, దేరుకొంటి. నే
నపుడు శరాభిఘాతమున నయ్యోడకుం జనుచుంటి నేను దా
రి పోదుగునం బడియు ముఖ్యకృతమఖనిహాస్యమానుఁడై.

ఉ. 'ఆకులు దుంపలుం దినుచు నన్యవసూత్కరవాంఛ లేక ని
ర్వ్యాకులచిత్తతం బరులయందును మత్సరభావ మేని చె
ట్లాకులు పట్టలున్ వసనమై మను నన్నును జంపు నేమి లా
భాకృతికోరి యీ యెవఁడో యక్కట నిర్దయబుద్ధి యేటికో?

ఉ. ఈ జడ లట్టకట్టఁ దపియించెడు నన్నును జంపి యేమి కాం
తాజగ మెల్ల గాపుకొను? సాధులు మెత్తురె దీని? ధారణీ
రాజిది విన్న వానికి శిరస్సును నిల్చునె? ధర్మభావచే
తోజాడు నేలు నేల, యిటులుండిన నిచ్ఛయవృత్తి పోయెనో

మ. తను వేనాట్టికినైన నీ శరముచేతం బోలె నా దానికై
వనరన్ మత్పితృమాతృపాదయుగసేవాధర్మవిచ్ఛిత్తిక
లిన యీ జన్మముతోడి యీ తనువుపై లేదింతయుం గోర్కి నా
చను ధర్మాధ్వము నయ్యె నా చను భవిష్యల్లోక మేలాటిదో?

శా. నన్నుం జూచుక యంధులయ్యు నుగా నాతల్లియుం దండ్రియున్
నన్నుం జంపినవానిచేత మృతిఁ గన్నా రన్నయు న్నాన్నయున్
నన్నుం జేయియుఁ గాలు జీవనము నా నన్నున్ నదీవారికై
చన్నన్ రాని నమున్ దలంచి గతిత్రాశాజీవు లే మారురో?

గీ. అనుచుఁ జన్నంతసేపు విన్నట్టి నాకుఁ
బాలతి! పై ప్రాణములు పై నిబోదనెఁ నను ము
వట్టికట్టియనల మునిపట్టిఁ జేరి
చూచితిని నాఁడు నేఁడును జూచినట్లు

చ. జటముడి వీడలేదు ముఖసంగతతేజము మాయలేదు లే
నిటలమునందు మాత్ర ముని పిల్చెను రెండవు స్వేదబిందువుల్
పటుతరబాణఘాతవినిపాతమహాస్రము పంకమిశ్రమై
వటుతనువెల్లఁ గ్రమ్మినది వానినిఁ జూచితి నే సతీమణీ! ౧౭౮

చ. జటముడి వీడలేదు ముఖసంగతతేజము మాఱలేదు లే
నిటలమునందు మాత్ర మొగి నిల్చెను రెండవు స్వేదబిందువుల్
కటకట రామభద్రుఁ డవిచారుఁడు కానన మేగువేళ సం
కటపడు నవ్వటూత్తమునికై వడి సాధుజనాగ్రయాయియై

ఉ. చూచుచు నన్ను నమ్మునికిఁ జోరుఁడు నీవని నన్నుఁ దీవ్రనా
రాచముతోడఁ గొట్టితివి ప్రాణమునంగగన సాధువైన నేఁ
గ్రాచితినెట్లు నిన్ను వనరాజిఁ ద్యజింపరు మున్ను, నిన్ను నేఁ
జూచినదైనలేదు వినఁగుండను జెప్పము నాకు దోసముల్

క. నీ కపకృతి చేసితినా
నా కది చెప్పు మది చెప్పు నాకని యడుగన్
వే కన్నులు దీనములై
యా కోమలవదను నేమి యందును జెపుమా!

ఉ. ఏ మనుదున్ బెగుల్చుకొని మేనును నిక్కముగ్గాఁగ నీవు న
న్నేమియుఁ జేయలేదనిన నెంతయు నూర్పును గ్రొంచతండు తా
నామెయి నిద్రమేల్కని ఘటాంతరమందున వారిఁ జూచి నీ
రేమియు లేమి శైవలిని కేగి జలంబును దెచ్చిపెట్టవే!

క. అని ననుఁ బంపిరి తండ్రియు
జననియు నను నిద్రలేపి జనుపాంధులు లే
వను లేరు ముసలివారలు
చనుదెంచితి నిటకు నీవు చంపితి నన్నున్

చ. నను నెదిరో మృగం బని మనంబున నెంచితివేమొ యన్న, నా
నని గజపానవిభ్రమము నంచితిఁ జేసితి నిట్టిపాపముల్
జనువునఁ దీరరాని దన, జాల్మని నన్నను జూచి నీవు చం
పినయది నన్నుఁ గాదు విను వృద్ధుల నా యల తల్లిదండ్రులన్

మ. టవళిం జంపితిగాని నన్నదుయుచూడంజూడ నన్ బిల్వ నే
మవు నాతల్లియుఁ దండ్రి వారి తప మేలా సాగు? నీపాటికే
రవులున్ శోకము, దప్పి నాలుక తడియారన్ మత్ప్రతీక్షాధ్వరం
తవిధామ్లానమనస్కు లేమగుదు రన్నా! నన్నుఁ గన్నారొకోంగరం

క. నా కాలిసవ్వడిన్ విని
యా కోఁచలు తండ్రి! నీవురా! మసలితి వే
లా కూలంకష రేవున
నీకై యెదురెదురు చూచి నిలచితి మిచటన్

క. నీ విలుచు క్రోవ వెదుకను
రానైనం గన్నులేక. రాలేము కదా
మా నాయన! నీ రీతు తె
మ్మా! నాలుక పిడుచకట్టె మహికాస్పర్శా!

ఉ. ఇంతకు నింకఁటేటిఁగని యింతలుగొట్టుచు నుంటి వేమొ నా
పొంతలు దల్లి పొంత మతిఁబుట్టెనొ కొండొక చిన్నియల్క? మా
సంతస మెల్ల నీవె కద, జన్మకృతార్థత నీవ! పల్క రా
వింతయుఁ దండ్రి! నీవ యిటు లేచిన మాబ్రదు కేమి కావలెన్

చ. అని కురరీవిలాపములయట్టులఁ బల్కెను యత్నతో గృహీ
తనిభృతవాక్యుఁడై దశరథక్షితినాథుఁడ నేను, గాను మీ
తనయుఁడ, వానకాలు నృపదర్పణశీలము వచ్చి వేటకే
గిన మృగయావ్యథామతిని గేవలశబ్దవిఘాతలోభినిన్

ఉ. తోరము మాటువెట్టికొని దూరమహీరుహశాఖయందు స్ఫా
రేభమనీఘ్నసా స్రవిపీతమహాసరయూజలధ్వనిన్
వారణమంచుఁ గొట్టితిని బాణనిపాతము వెంట దా నఘ
ర్మాగభమాణ మిద్ది యని నమ్యకుమారగళస్వనంబుగా

ఆ. అంతనొత్తు చెట్టునందున్న నే ధాత్రిఁ
గూలి రొదలు దలుపుకోను లేక
మీ కుమారుఁ జేయు నాకైతవక్రియా
కథన మెల్ల వించుఁ గదలివచ్చి

శా. ఓకుం గన్నులు లేవు మీ బకులుగా మీబిడ్డ మీప్రాణ మా
శోకాకారము నేను జూచితి నసృక్శల్యాకృతాపాథయా
టీకున్ ద్వ్యక్షఘటున్ ముఖావికృతుఁ బ్రస్వేన్నాంతఫాలున్ బిత్రు
ప్రాకామ్యవ్రతలోపదుఃఖవచనప్రారంభరమ్యాననున్ ౧౯౪

క. నీకే యపకృతిఁ జేసితి
వాకొనుమని యడిగినాఁడు పరమపితృసప
ర్యాకోమలాత్మ! నీవా!
నాకా! నీ కది పొసఁగు నను వెదఁ గలదే?

ఉ. లొగ్గిడి శబ్దవేధిగతలోభముఁ జెప్పితి, నింతయేడ్చి యీ
యగ్గినలేక దహించు శర మాతల లాగు మటన్నఁ గాదు నీ
మ్రగ్గెడుఁ దల్లి తండ్రులకు మామకపాపము పాపిణశేషముల్
దగ్గరకైనఁ గొంచుఁజనదల్ దుదిచూపునకైనఁ జేసెదల్

మ. అనినం జంపుట బాధవెట్టుటకు మేలంచాడ నమ్మొప్పితిల్
వనిఁ గ్రొన్నెత్తురుకంటె మెత్తసరయూవారిల్ భవత్పుత్రు గం
డితి బ్రిక్షాళనచేసి మీరటకు రానేలేరటం చప్డు వె
చ్చసి మీతండ్రికళేబరం బిదిగో యంసంబందు నేఁ దెచ్చితిల్

గీ. అనుచు వారల యొడులందు నతని నుంచి
వారి వేళ్ళను గైకొని బాణపాత
మైన గాయంబునందున నంతటన్ స్పృ
శింపఁజేసితి వారు విస్మృహులుగాఁగ

క. నే నిటకు వచ్చి చెప్పుట
గానీ నా మంచితనము గాదు కుమారుం
డె నీవు పోయి చెప్పుము
మా నాయనకున్ శపింప మతి పుట్ట దనెన్

క. మీరలు మీఁదగు దుఃఖాం
భోరాశిని మున్న యొలుకఁబోసికొనుం డే
దూరము పోవను శోకముఁ
దీరిన యాపైని నన్నుఁ దిట్టుఁ డనంగా

ఉ. మ్రాన్పడి చీఁకుదంపతులు రాయిడిఁ దాళుకొనంగలే కహో
చొచ్చితి మమ్ము నారకపులోకమునందు నంచునుం
గన్నునఁగొట్టితె చెలికుకాండముకై వడి నీవ వచ్చి యీ
నన్నుల మాటఁదెచ్చితివి నారస మీవె వెలార్చివట్లుగన్ ౨౦౨

మ. నరనాథుం డెవఁడేనిఁ దాఁ దెలిసి వానప్రస్థునిం జంపినన్
సురనాథుండయినన్ దివిప్రపదచ్యుత్యావిలుం డౌను గా
వరమై మానిని జంపఁ దచ్చిరము భూపా! సప్తధా వీలు నీ
పరమాజ్ఞానకృతం బిదే బ్రదికిపోవంజాలి తీ నాటికిన్

ఉ. నీయెడ నా కుమారునకు నిక్కఫుజాలి జనించె నీవుగా
నాయెడ వచ్చి చెప్పఁగ మనంబున నెంచవయేని నీ శిర
స్సాయెను వేయిముక్కలు దయార్ధ్రని వచ్చితి బిడ్డఁదెచ్చినా
నీ యెడ కేమిచేయుకు సరే పొసరించితి వజ్ఞ తామతిన్

వ. అని కుమారుని శవంబుపైఁబడి తండ్రీ! పలుకవేమిర! యిప్పుడ కద నీరు తెత్తునని పోతివి. ఏ వేబ్రికుకైన మమ్మేమి చేసితివి. దూరే త్యుండ వని సంతోషించుటకైన లేకనోయెగదర నాయనా! యాపరిష్టమైన యశనిపాతంబుచేవలె నైతివి. అయ్యో! నీవు చేతి కందిచ్చుచుండనీ కరమ్ములో మృణాలనాళంబులో తెలియఁజాలక కన్నులులేని మేము నీ కరంబులే పట్టుకొని వానికే సంతోషించి తిమి గదోయి. అయ్యో! తండ్రీ! సూర్యోదయమైనదా? అగ్ని సంధానంబుఁజేయుము, నీ యధ్యయనవింపచీనాదంబు చెవులఁ దవ్వు లుట లేదేమి? నే డేమి పాపము వచ్చినది. అయ్యో! నీ తల్లి నెట్లు పట్టుకొందును? గొడ్డుటిచిన ట్లటచుచున్నది. అప్పుడే యమసదనాభి ముఖంబుగ నెంతదవ్వు పోయితివి. కొంచె మాగుమోయి, మేము కూడ వచ్చుచుంటిమి.

క. నే యమునితోడఁ జెప్పెద
మాయయ్య క్షమింపు మితఁడు మాతృపితృసప
ర్యాయుక్తుఁడు నిష్పాపుఁడు
నీయెడకుం గొంచుఁబోకు నీరజతనయా!

క. నిహతుఁ డొక క్రూరకర్మ
ప్రహతుండై యుద్ధవీథి బాణహతులమై
విహరించు వీరులంబలె
విహారయోగ్యుండు స్వర్గవీథుల నితఁడున్

గీ. రాచజోదులు సంప్రహారంబులందుఁ
బిక్కచూపక నిలచి నిర్విషయమాఁ బ్రి
తాపరాసులు హతులయి తారు నే గ
తిం జనెద రా గతిం జను తిష్యవదన!

గీ. సగరకైబ్యులును జనమేజయుఁడు నహుషుఁ
డును దిలీపుఁడు నిక్ష్వాకుఁడును రఘుండు
దుందుమారుడు పుణ్యసందోహు లే గ
తిం జనెద రా గతిం జను తిష్యవదన!

మధ్యాక్కర.
స్వాధ్యాయనిరతులు సర్వసాధులు తీర్థదానకుశలు
లధ్యేషణారమ్ము లనఘు లవనిపు లాహితాగ్నులును
సాధ్యతపోవంతు లెల్ల చననైన సాధులోకములు
నధ్యాపకులు పోవునట్టి యమృతలోకాళి నీ వేగు!

మధ్యాక్కర.
ఏకపత్నీవ్రతు లమృతు లే లోక మే లోకము త్త
మా కోటిదాత లే లోకమహితు లా మహితలోకములు
నీ కాలితోవకుం దుదివి నిలుచుత నిభృతుఁడై గురుని
యాఁకలో నిలుచు శిష్యుని గతాధ్వమ్ము లగుత నీ కైన

క. అకుశలగతిం జనరు మా
మకాన్వయులు నీవునైన మాంబగఘున వా
సుకృతవిభృతలోకంబుల
శకృష్ణపథచారి! చనుమ రా! మా తండ్రీ!

చ. అని జలముఁ గ్రహించుచుఁ బ్రియాత్మజపుణ్యజగత్ప్రమాణవ
ర్ధనమగు సంప్రవృత్తిఁ జనఁ దాపసిబిడ్డఁడునుర్ బుభుత్సులో
మనుకువగాఁగ మింటను విమానమునం గనిపించు తండ్రిలో
ననియెను మీకుఁ బుత్త్రుఁడఁ గృతార్థుఁడనం చని దోయిలించుచుర్

ఉ. లోలుభమైన యీ మహితలోకము లేగద మీఁదయాగ్రిరే
ఖాలసమానవైభవసుఖంబున మీరును మీ మహాతపో
హేల మదా ప్తలోకములకే చనుదెండని శ్రీ విమానకో
త్తాలపథంబునం జనియెఁ దండ్రియు నంతన కొంత తేరుచుఁ. ౨౧౪

వ. కొడుకునకు మిగిలిన కర్మ సమాప్తంబుఁ జేసి నన్నుఁగని యట్లనియె,
రాజా! నీవు నన్నింక వదలిపొమ్ము, తెలియక చేసితి వనుకొమ్ము,
న న్నొక్క బాణంతో నపుత్రకునిఁ జేసితివి. తెలియక చేసిన యీ
కర్మ నీకు బ్రహ్మహత్యలేదు. నేను నిన్ను క్షమించినను నీకర్మ
నిన్ను క్షమించదు

క. నీవును నావలెనే పు
త్రావిలశోకమున నంతమందెదు నానా
జీవుల నానాకర్మల
నావల నానాఫలంబు లంటియయుండున్

ఉ. ఇట్టులె పుత్త్రవింబడిన యేగద మేగక కాలుసేయి లే
నట్టి మముం భరింపఁగలయట్టిఁ డెవం డన నేను మీకు మీ
పట్టివిధానఁ జేతు నన పల్లన నవ్వి మునీంద్రుఁ డిట్టి నీ
యట్టిఁడు పాప మే కృతమొ యమ్మనఁదాఁకితి మత్సుతాసువుల్

క. నీకర్మ బలీయంబగు
నీ కరుణాహృదయఫలము నెక్కొని మృతియుం
గాకయ పోవదు కానీ
నీ కొడుకు వియోగ మొకఁడె నీకుఁ గతంబా

వ. ఓయి! కాదు సేసెద నమ్ముము, నీవురాజవు, లోకారాధనము దీనికన్న
నీకు గొప్పధర్మము, అటవీదారుకాష్ఠచితిఁ జేసిపెట్టుమన నట్లే సేసి
చితికి నేనే యగ్గివెట్టితిని; ఆ మునిదంపతులు స్వర్గారోహులైరి

ఉ. అమ్మునిదంపతుల్ తతచితాగ్నిశయానులు నాఁడునన్ బ్రదో
షమ్మున నీపరిదోషమున సంస్మృతివచ్చెను నాకుఁ గర్మపుం
జమ్మను భావసంగతివిశారద మా ఫల మూను వేళకున్
గ్రమ్మిన దీ శ్లథాపఘనకంపము నన్నను జేత నూనవే!

ఉ. ఆ పదునాల్గవత్సరము లౌటది యేమిరియొ? కార్తికాచ్ఛరా
కాపరిపూర్ణచంద్రములుకాకృతి రాముని నవ్యమోము నే
నోపికఁ జూచుటేమొ? యదియున్నదె? యెక్కడిమాట? మానిదా
ఘాపము వచ్చి నాదు నసుపద్మముముంగిట నిల్చియుండఁగా ౨౨౦

ఉ. లోకములోన యోగ్యపథలోలుపచిత్తులనైనఁ బుత్త్రులం
బోకడ పెట్టరే, నిగమమూలసుశీలుని సాధులోక త
త్త్వాకృతి నల్లకల్పజగుణా నునుగన్నుల వెల్లబిడ్డనుం
బోకడపెట్టితిన్ సకలపుణ్యఫలంబులు బాహిరించితిన్

క. రాముని తల్లికి నీకును
సౌమిత్రికి జనని కల్ల చానకు మీకున్
నా మగనితనము చచ్చిన
దా మగువకు నేను భర్త నాదానవికిన్

మ. పడతీ! యిన్నిదినాల కేను ఋషిశాపం బొం దబద్ధంబుగా
నెడఁదం గాంచితి పుత్రహేతువుగ నే మృత్యుప్రతీక్షిప్తుఁడై
చెడగాఁ దిట్టెను మాని, కోడలివనీసీమం ప్రవేశించుటం
జెడితి నన్మనికిఁ బుత్రశోకమతిఁ దోచెన్ సుంత వ్యత్యాసమున్

మ. మునిశాపంబున లేక యింద్రియఘటామూర్చ్ఛాలతల్ సుంత క
న్నను గన్పింపమి దేహకంప మిదియు న్నాల్గొన్న మాంద్యమ్మునా
తన్నులగ్నంబుగ నుండె నిన్ని మృతియున్ దా విపరీతప్రక్రియా
జనితం బీదృశమై ఘటించునొ మునిశాపాహస్మృతిభ్రాంతిగా

క. నా కొడుకులు నా కోడలు
నా కాననసీమనుండి యరుదెంతురొ నీ
వో కౌసల్యా! వారికి
వాకొను మీ చెప్పినట్టి వచనము లెల్లన్

శా. తాఁగౌసల్యయు విస్మృతిం గమ సుమిత్రా! చెప్పు నీవైన నే
రేఁగుంబట్టకొ వ్రాసిపెట్టుకొనుడీ! శ్రీరామచంద్రుండు న
న్యాగోలోమిని బోలు జాంజాబుతలం దానమ్మ సాకేత మా
జోగిం జెప్పుము నేను జెప్పితినటంచుం బొల్లులేకుండఁగన్

ఉ. ఓరఘురామ! నీవు మఱియొక్కఁడు జన్మము గోరెదేని శ్రీ
ద్ధారతిఁ జూడు కామగుణదాసునిఁ దండ్రిని నన్నుకోకు దు
ర్వారవచోనిబద్ధు బహుభార్యునిఁ దండ్రిని నన్నుకోకు మీ
తీరని తండ్రిమాటఁ గడతేర్చెడు శాంతము లేక యుండుమీ! ౨౨౮

శా. తండ్రీ! రాఘవ! తల్లి! జానకి! సుమిత్రానందనా! లక్ష్మణా!
పుండరీకపత్రదరాసనాభతనుసంభూతద్యుతిప్రేంఖణల్
గుండాగ్రగుంఫియై గల్గు తండ్రినయి మీకుం బ్రేమయుం గల్గునా!
వేండ్రం బెక్కిన మీరు నాపయిఁ గ్రుధావిష్టాత్ములా చెప్పుఁడీ!

ఉ. ఏనును నేకభార్యుఁడను నింకొకజన్మమునందుఁ దండ్రినై
దానును నాకు బిడ్డఁడయి తాగసిలంగలఁడా? రఘూత్తముం
డే నిపు డాచరించిన సుహృత్ప్రతికూలనికారనిష్కృతి
త్రాణము నాచరించుటకు నైనను నన్ దయతోడఁ గాంచునా?

ఉ. ఏ నొక వ్యాఘ్రజీవిని మహేశ్వరమై చనుదేర మిత్రుఁగ
న్యానికి వచ్చి నన్ను దయఁబట్టెను, స్వామికి నెంతచేసితిన్
దానును సిగ్గులేక మఱి తాగసిలు న్నను బిడ్డఁడై కృతా
జ్ఞానిని స్వామి కై కొనుట సాకుట యుండునె దుఃఖతప్తునిన్

వ. హా రామచంద్ర! ప్రత్యూషఃపవమానసాధుసంచలితమృదునీరజాత
కందళదళాభిరామలోచన! హా! రామభద్ర! కార్తికపౌర్ణమాసీ
స్వచ్ఛజైవాతృకావృత్తసుధామండలముఖమండల! హా! రఘువంశ
నారాయణ! దోరగ్రసమవర్తి చండకోదండవినిర్ముక్తైక పృషత్క
విదారితానేక యాతుధానమండల! హా! పరితాపవిష్టరశ్రవస!
త్రిసప్తవారకృతరాజలోకనిర్ధూమధామజామదగ్న్యమహాప్రతాప
గృహీతశిష్యచూడామణీ! ఓయీ! యోగీశ్వరేశుఁడైన జనక
రాజునియల్లుఁడ! ఓయీ! రెండవబ్రహ్మయైన వశిష్ఠముని యనుంగు
బిడ్డ! ఓయీ! స్త్రీలోకచారిత్ర్యాకృతి యయుంధతమ్మ ముద్దుప్రొద్దుల
వచ్చి చూడకుండ నుండ లేని యమృతమూర్తి!

గీ. కూన! నీతండ్రి నవిపించుకొన్న భాగ్య
మిదియు నాప్రాణముల కెదురెక్కి కూల
ముద్రుజముగ్గ నున్నది ముసరుకొనియె
జీవితపరిత్రాణ మ్మిరుల్ చెక్కినట్లు

శా. సాకేంతంబున దాఁటి వారము పయిన్ స్వాధ్యాయనాదామృత
పాత్రికామ్యంబు నుషస్సుబాలతరణిప్రాలేయశీతాంశుమా
లాకోశాంచలమంజుసంచలితకల్యం బల్లనన్ వచ్చి, పూ
రేకల్ విచ్చి మనస్సుఁజొచ్చి వరనారీనూపురారావముల్

క. బారెడు ప్రొద్దెక్కియు రా
జారూఢాంతఃపురంబునందున మేల్కో
లే రెవ్వరు జాగ్రన్ని
ద్రారూఢులు నెల్లరును శ్లథాంగులవోలెన్

గీ. వట్టి యాచారదాసులు వందిమాగ
ధులును మాత్రి చిరంతనస్తోత్రములను
నెఱప నలవాటుకొలఁదిఁ బంజరశుకాది
పక్షులును ముక్కులాడించె బలికినట్లు

వ. అంత సౌఖశాయనికులును శ్రీవర్షధరులును నీ వారముదినము లట్లే మేలుకొంచిరి, పరిచారికలు స్నానార్థము జలంబును నగురు కస్తూరికాదిద్రవ్యంబులును నీ వారముదినము లట్లే యూరక యాయత్తపఱచి యుండిరి, సర్వాభిహారికకన్యయు నైవేద్యమ్మున్ కాని భోజనపాత్రివలె నిత్యమువలె నట్లే యుండె

సీ. అదియు సూర్యోదయం బైనదా నైనది
కుఱుచరెుండలు మేన గ్రుచ్చుకొనెను
నీ సూర్యకిరణంబు లింతింత చిన్నవి
నడిమిని విఱుగక నదపఱచు
రక్కసచీకటి నిక్కిన ముండ్లవి
తుదలు తెల్లనయాచుఁ బొదలుగాని
యివి సూర్యకిరణమ్ములే యన వీలులే
కున్నది, యూనన నున్నదయ్యె
నైన నఖశిఖాపర్యంత మమితకంప
మానలై కామినులు ధరాజానిశయ్య
కడకు బొట్టనవేళ్లపై నడచిపోయి
కనిరి దృక్కైత్న్యమది క్రమక్రమము హెచ్చ ౨౬3

ఉ. ఈ గతరాత్రి పాడుకల లేవిఁకలల్ సకలంబు వచ్చె స్వ
ప్నాగతమైన దుస్స్వప్నము సాత్త్వమ దైనది యంచు లోపలన్
సాగిన భావముల్ వెలికిసాఁగవు నాలుకఁబట్టి కాని య
ట్లే గణుతింపనై చనిరి సేవుల మోహులు సర్వవాస్తయున్

క. వెనుకకు వాల్చిన బొమ్మలో
యన నలచిరి రాజుఁజూచి యంగన లయ్యం
గనలం గనుగొని భూపతిఁ
గనుగొని వారిఁగని రాజుఁ గని యల్లంతన్

చ. అతితరభీతిమగ్నహృదయాంతర పట్టపురాణి తైలసం
స్కృతిరహితావదాతసువికీర్ణనతాలకలన్ విలోచనా
గతిఁ దొలగంగఁద్రోచి సుతు కానన మేగిన దుఃఖబాష్పసం
తతికలితారుణారుణధుతంబులఁ గన్నుల నింపె బాష్పముల్

క. హేమంతపాత్రవర్తిను
ధామంబయి తెల్లుపూవు తునుకు చెడిన య
ట్లామెయి సుమిత్ర కన్నులు
భీమచ్ఛవి పొల్చె గ్రీష్మవేశంతములై

గీ. లిప్తలో సర్వయోషావలీనిలీన
గళతలినశబ్దమెల్లను బిలము నెడలి
యే యభిజ్ఞ ప్రాణంబుల కేక-నోకొ
యెల్ల యంతఃపురంబును గొల్లుమనియె

ఉ. ఇద్దఱు రాణులున్ వసుమతీశ్వరు శీతలదేహయష్టిపైఁ
బెద్దయు నారి మేఁబడి నిపీతమహార్ణవదుఃఖబాష్పలై
బ్రద్దలుగాఁగనై పడిన భాండములై హృదయాంతరాంతరా
పద్దరితాంధకారబడబాజ్వలనోద్గతధూమరేఖలై

చ. ధరణిపుఁ డున్నయట్టి గది దాఁటి విరోదననిస్వనంబు ని
ర్భరమయి సౌధసౌధమును బట్టి ధరాపతిసర్వగేహబం
ధురమయి బిట్టుపోఁచిన వినూతన మాపదవెంబడిన్ మహా
సరసిఁ బతంగసంతతులు సారెకుఁ గూసెదునట్టు లేచినన్ ౨౪౦

ఉ. అంతట మంత్రులెల్లరు ధరాధిపుగేహము లేగుదెంచి వృ
త్తాంత మెఱింగి యశ్మనిభ్రుతాకృతులై పరతంత్రిలోచనో
పాంతపరిస్రవద్విధురబాష్పకదుష్ణజలప్లవుల్ దృశా
ప్రాంతవినీలిమన్ నిలచినట్టిరు నిశ్చలయట్లై యుండఁగా

క. పెగ్గడికత్తెల బెత్తపుఁ
బగ్గలమున్ నిలుచఁబడిరొ పరిచారకులున్
బిగ్గొనలేని యేడుపు
లుగ్గడ పెగ్గడలయాను నూరుకొనంగన్

వ. అంత మహార్ఘ్యప్రియమై సర్వభావనాసంస్తంభహేతువైన మొదటి దుఃఖతరంగమ్ము కడచినఁ గౌసల్య పతి మేనిపైవ్రాలి యిట్లని దుఃఖించె

క. నా కష్టఁజెప్పిపోయిరి
నీ కొడుకులు విన్న మఱి వనీభూములన్
సాకేతమ్మును జేరిన
యాకడకును నేమి చెప్ప నుందువు నన్నున్

శా. ఆ తీవ్రవ్రతపాలకుండగు సుతుం డయ్యారణ్యమ్ము నే నెంచి నా
చేతోదోషముఁ జెప్ప నీ మృతికి రాజీవాక్షుఁ డే మందునో
యూ తీవ్రవ్రతుఁ గానసంబునకు నీ వంపించినా వంచు స్వా
మీ! తప్పించితి నీదుప్రాణ మని వాఁడేమైననుం పల్కెడిన్

క. నిన్నిన్నేండ్లకు నంటిని
నిన్న నొకటి పొల్లుమాట నీ వది మదిలో
నన్నఱపి యింత చేసెద
వన్నది నే నేరనైతి నయ్యా! స్వామీ!

శా. చేతస్సర్వపథానుశాసకుఁడు రాజీవాక్షుఁ డా బిడ్డ తా
నీతిం జెప్పను గాదటే కొడుకుకంటెం భర్తయే ప్రేయుఁ డం
చా తాత్పర్యము నే నెఱింగితిని రాజా! నీవు నీ రీతిగాన్
జేతోవీథిని, వాని కాననమె పొచ్చెంబయ్యె నీ కంటెనున్ ౨౪౭

ఉ. ఏఁచిన కైకయందుఁ గల యొగ్గునఁ బట్టపుదేవి నంచు నీ
వై ననుదెంచినా విటకు నక్కట వచ్చినవాఁడ విచ్చటన్
దోఁచదు నీకు నిం కునికి తోఁగపుఁగిన్కను నింతలోన నే
లా! చన నేమిచేసినదయా! నను నీ సతి యొక్కమాటకున్

క. ఆ కొడుకు తండ్రి వౌదువు
నా కొం చెపువగాట కింత న్యాయమె చేయన్
నీ కౌసల్య యటన్నన్
నీకుం గల గౌరవమ్ము నిండెనె? స్వామీ!

మ. అనయోక్తుల్ పది కైక చెప్పిన నృపుం డాలించి తా నూరకుం
డును దత్ప్రతికి రాఁదు నా గృహము నన్నుం గాని కన్గొన్నఁ గ
న్గొనలం దోసముఁ జెప్పికొంచు భయమగ్నుండై మదాశ్వాసనం
బున నాయందున గౌరవంబు నెఱపున్ భూమీశుఁ డిట్లయ్యెనో!

ఉ ఏ నిటనుండి రామజననీ! యని నన్నను బల్కరింప వే
లా నృప! కాకపోయితినటయ్య! మఱిప్పుడు రాముతల్లి, నా
కాననవాసితల్లి ని సుఖంబుగ నుంటిని పెద్దకోడలన్
నే నిటనుంటిఁ గన్నులను నెత్తి కనుంగొన దేమి ధాత్రిపా!

మ. తొలిదైవంబ! మఱెంతచేసితివి! పుత్రుం డన్న పుత్రుండు నా
వలఁ గాంతారముఁబట్టి యిప్పటికి నీ శారమ్ము కాలేదు లో
పలనే యిట్టులఁజేసి తేమి కరుణాపర్యాప్తముల్ నీదుచేఁ
తలు వేఱొక్కనృపాలవంశమున లేదా? నీకుఁ దాత్పర్యమున్

మ. ధరణీనాయక! పెద్దభార్య యిదిగో తా దుఃఖముంబొందె శ
ర్కరిలక్షీరముగాని నోరెరచి వేకైకోవె! యహారార! శ
ర్కరిలక్షీరపుగిన్నె యే పగలెనా? కౌసల్య మున్ జేసె నే
దురితం బా దురితంబు సర్వమును నీతో నిండెనా! భూమిపా!

మ. అసిధారావ్రతుఁడైన రాముఁ డిపుడేలా రాఁడు తాతా! సుమం
త్ర! సమూహ్యాఖిలవేత్రపారిషదతీర్థా! మాకుఁ దంత్రీ! వశి
ష్ఠ! సరే! రామునిఁగొంచుఁ దెండు సముపార్థంబైన యత్యాహితం
బు సమస్తంబును జెప్పి తెండు రఘురామున్ వీతకామున్ సుతున్

వ. అంత ననూనస్రస్తశిరోజాత, సితసిచయధారిణి, నిరంతరస్రవద్బాష్ప ఝరవిదూషితారుణలోచన, శాణిసహితయయ్యుఁ బాణిరహితఁ బోలినయామె నిరస్తసమస్తభూషణ, ముఖంబునందు మాత్రము కుంకుమంపుబొట్టుకలది కైకేయీదేవి, రాజును రాణిని దగ్గఱుటకు భయపడుచున్న యామెనంతఁ దననూపు మఱలగాఁ గౌసల్య యాక్రోశించి యిట్లనియె

క. ఓ యమ్మా! కైకమ్మా
నీ యాడినమాట ఫలము నెక్కొనె నంటే
మాయురె! నితో పాటు ధ
రాయోషయుఁగూడ విధవరాలయ్యెఁ గదే!

క. నీ కోర్కె నిండినది మఱి
నీకన్నులు చల్లఁబడియె నిఖలధరిత్రీ
శ్రీకంఠమందు వ్రేలఁగ
నూఁకొని యూరేగవమ్మ! యో కైకమ్మా!

శా. నాకేమి! పతితోడ నగ్గిచితిపైనన్ మ్రగ్గెదన్ నీవు నీ
యాకారంబును భర్తృహీన మగు సర్వాశాప్రపంచంబు న
స్తోకశ్రీకత బావుకొందు మఱి నీతో నమ్మ నీధాత్రి, వ
ల్లీకోదండమహీజసూర్తి కొడుకేలెన్ గాననానీకముల్

ఆ. నీదు నముఁగుబిడ్డ నీరజాతాక్షుని
నతని నీవు నడవి కంపినావు
నాదు నముఁగుభర్త మేదినీనాథుని
జాగి నేనుగాని చంపినాను

శా. నీ పుట్టింటనె యుండె నీకొడుకు తల్లీ! యెల్లకాలంబు నీ
వా ప్రేమం బఖిలంబుఁ జూపితివి నీలాంభోదమాలాచ్ఛవి
క్షేపాకారుఁడు రామచంద్రుపయి, నీ చిత్తంబు నీరీతి వి
క్షేపంబై చనుదెంచెఁ జూడఁగదె నీచేఁతల్ ఫలం బెట్టిదో? ౨౭౦

చ. ఒక నిముసంబులోన నట నుండిన గొల్ల జనంబు బుద్ధిలో
నకటకటా! పురాకృతమహాదురితం బిదిగాక యిట్టి కై
కను మఱి యట్టి యూహ మెటుకల్గెను గానన నంపు నూహ దీ
పికయటు నిల్గ యూహ యనిపించెను సాధుననోవశంగతిన్

వ. అంత నడిమింటికై మార్యసౌధదేహాలీకవికాంతోపలతాడిత ఖురాగ్రమ్ములు సప్తాశ్వవాహకులు సకిలించినట్లు వట్టియాకసంబున నెగసుచు నెంకువెదకిన నారం బోసిన నద్దు కానరాని బంగరు పిచ్చుకలు క్షుధార్తములు కిచకిచలాడ, సాకేతనగరీశృంగాటకమ్ముల నిస్తిలకులై యుపపరిధానములైన జన్యములు రహస్యంబు లాడినట్లు రాజశరీరదహనసంస్కారమేగు యని యాడుకొనం జొచ్చిరి, కైకేయీకౌసల్యాసమాగమవార్తాశ్రవణసంజాతకౌతూహల లయిన యుత్తమస్త్రీలు సంకోచములంబడి రాజాంతఃపురపశ్చాద్ద్వారంబుల నంతిపురికిం బోవుచుండిరి. ఆతపప్రతారిత బలిభుజంబు లొండు రెండు తా మాశ్రయించిననింబవృక్షశాఖ వదలి కూయుచు నన్యశాఖకుం బర్వెతె, పురంబున నగ్నులులేవు, పసివాండ్రకుం జల్దియన్నములె లేవు, తలలుదువ్వి నీళ్ళువోసి తిలకంబులు వెట్టి క్రొత్తపరికిణీలు కట్టి కన్నెపిల్లల దినము ముస్తాబు చేసెడుం దల్లులు రాజాంతఃపురవార్తావ్యాపృతమానలై కూతుండ్ర వంకన చూడలేరు

ఉ. ఉగ్రమయూఖతప్త సన యూపరయూ నతరంగరంగ వా
యుగ్రథితాంబుజాతశిఖరోన్నతపత్రము లెల్ల రాజవం
శాగ్రియసూర్యదుఃఖవిముఖాకృతిం జేసి జివళ్ళుమాడి వా
రిగ్రసమానబాష్పమిష రేసె నశిస్రవరాతవృష్టులన్

౧. రాజులోం బ్రాణములు ధర్మరాజు, రాజు
నుండి తొలగింప నెంతగా నునుకులేడొ
రాజు వెలిప్రాణములను భాగ్యలను రాజు
నుండి తలంగ కుంత్రుల కంత యునుకు లేకు ౨౮౦

ఉ. మంత్రులు లెల్లనల్ల బతిమాలి విరక్తివచస్సులాడి సీ
మంతిను లెల్లరన్ దుదకు మానవనాథుని వీడిపోవఁగా
నెంతగఁ జేసినన్ వదల దింతయుఁ బట్టపుదేవి మంత్రులూ
హాంతరమేది నిల్వఁ దుద కా యమఁ జేరి సుమిత్ర యిట్లనెన్

క. అక్కా! యీ మోహమ్మే
యక్కజమైనది నృపాలుఁ డరుదెంచునె యీ
ఫక్కి దురపిల్ల దేహము
ముక్కచనున్ సూత గాలిపోయినయంతన్

ఉ. మేనులవీడి జీవులు గమింపరు పుణ్యపులోకముల్ మఱిన్
మేనులకైన సంస్కృతి శమింతురు ప్రేతములైన జీవులా
మేనులు ధూళిమగ్నముగఁ గ్రిమిగ్రసితంబులమైన నారకా
స్థానము వాసి జీవులకు దాని నెఱుంగవె నీవు రాణివై

చ. పలుకఁడు రాజు చూడఁడును బాధ్యపుఁ డించుకయైన నిన్ను నా
పలికెడుఁ జూచువాఁడు తనపదతిఁ దానుగ నేగెనల్ల యా
పలికెడివానిపై వలపు పల్కని యీ వెడమృత్తుపైని నీ
వొలుకఁగఁ జేసినన్ నెడఁగవో పయికార్యము లెట్లు సాగునో?

మ. పవితంబై చను నీదుశీలమును నీ ప్రాజ్ఞత్వముం జూచి నే
మనలే రీ మతిమంతు లిప్పటికి సూర్యాంశుల్ నిమున్నేధిమం
గున నిల్వేవక యొడ్డిగిల్లఁబడె నీకుం గల్గు భాగంబు నీ
కనులే లే దిఁక రాజధానిబహుధాకార్యంబు లెట్లౌనొకో?

గీ. రాజు లేఁడ యిపుడు రాజుబిడ్డలు లేరు
భరతుఁ డిట్లె తిరిగి వచ్చుదాఁక
పట్టమహిషి నీవు పాలింపకుండిన
నేమి కావలయునో యీ యయోధ్య

వ. అని తానుగూడ దుఃఖాందోళిత యగుచుఁ జెప్పిన సుమిత్రచేత రాణి యోసరిల్ల జేయఁబడిన మంత్రులు రాజునకు సంస్కారమ్ము చేసి తైలద్రోణికానిక్షిప్తుం గావించిన రాణు లెల్ల ద్రోణికమున్నుం జేరి

మ. తనపై జేనికి నెప్పుడో తగిలెఁ జిత్తం బంతఁ బెండ్లాడెఁ గూ
డునకుం గుడ్డకునైన రాణులము నేఁడో మేము కౌసల్యతో
డను దీకైతిమి భర్తృహీనతకుఁ గంటంజూడఁగా నైనఁ ద
ప్పెను భూమీశుని భర్త యంచు దురితాభీలత్వ మేపాటిదో?

ఉ. మా కడుపందుఁబుట్టని కుమారుని రాముని గన్న మేము రా
జా! కడుసంతసించితి మయా! నిను భర్తఁదలంచి కానకుం
బోకడయైన రాఘవుని పుత్రవియోగజదుఃఖహేతువై
మాకును నేఁటి నీచనుట మానసముం దహియించుచుండెడిన్

ఉ. ఏ యొకనాఁటిదో వలపు నెంచి నినున్ స్మరించుకొంచు నీ
వేయిదినాల కొక్కపరి విచ్చెదు ప్రేమమెడందకోసమై
మా యెద లెల్లఁ గాచుకొని మన్ననచేసిన నీవు పోయినన్
బోయెను బొమ్మ దూరమగు భూమి వెలింగెడి వెల్గుసైతమున్

శా. మాలోఁ గొందఱ నీవు కానుకలుగా మన్నించి తాక్రొత్తలో
నీలోభంబును మా మెఱుంగులును నిండెం బ్రాతవడ్డంతలో
నీలోగిళ్ళను మేము నందఱముగానే యుంటి మట్లయ్యు భూ
పాలా! మిక్కిలి మాయఁజేసితివి సౌభాగ్యం బయోగ్యంబుగన్

చ. లలితగుణుండు మా బ్రదుకులన్ గడతేర్చునటన్న బిడ్డఁ గా
నలమను బంచితీవు నయిన న్నిలుపోసక పోయి తేమిగా
వలయును మేము నీ యనుఁగుభార్యయుఁ గైకొను తొల్లి భర్తనే
వెలియిడెఁ బుత్త్రిచేత వెలివెట్టురు నేఁడు సమగ్ర యన్నిటన్

మ. పసపుంగుంకుమ చెడ్డ మా మొగములన్ బాలుండు రాముండు దీ
పసముస్స్నేహమనోజ్ఞహాసవదనప్రారబ్ధమర్యాదుఁడై
యసకృత్స్నేహనమూర్తి వేత్రెడు నృపాలా! నీవు నీ పుత్త్రుఁడున్
మసలంగాఁ జన దూరదేశములు నేమైపోతి మే మిచ్చటన్

క. అని తైలద్రోణికపై
నునిచిన చేతులను బట్టు నుస్సు రనెడు వా
రిని గని కౌసల్యాసతి
యనియెను మీ రేల దుఃఖ మందఁగ నిట్లై ౨౯

మ. మును సంభోగమునందు నేఁడు కరుణన్ భూపాలసంబంధమై
చనె మీ కేట్టులో విప్రలంభ మదియున్ సందీప్తమే నాకునున్
మనుజాధీశుని మీరు నేను బ్రతికింపన్ లేము మీ రేల భీ
తిని గాంచన్ బతి యున్నయప్పు డెటులో దీపించు నల్లేసతుల్

ఉ. మీ కడుపందుఁ బుట్టఁడని మేకొను దుఃఖము రామచంద్రుఁడే
లా? కమలాననల్! మఱియు నాతఁడు పుట్టఁడు పుట్టెనేని నీ
కాకయు లేకపోయెడిదికాదె మఱిన్ భరతుండు రామచం
ద్రాకృతి మీ రెఱింగెదరు తాఁ జనుదెంచిన యంతలోసలన్

వ. సమాశ్వాసిల్లుఁ డనిన నందఱును గించిల్లజ్జానతవదనలై భర్తృ
వియోగదందహ్యమాన లగుచున్న, రాజస్నేహితులందఱుఁ గొడుకు
రాక లేనిదహనం బంగీకరింపమి చీఁకట్లుపడి రాత్రి సమీపించె

క. అంతఃపుర మంతఃపుర
మంతయు నిశ్శబ్ద మగుచు నపుడప్పుడు సీ
మంతినుల ముసుగు సన్నని
గొంతుల యేడుపులు ముసురుకొనుచున్న వియై

క. వెకలింపఁబడిన మణివే
పికలై యామదమూలోడఁ బెట్టిన దివ్వెల్
మకిలిపడి కొడింగట్టిన
నౌకరును గొడితీయువార లొప్పని యుంటన్

క. తగ్గికొని ప్రమిద లంచుల
విగ్గుకొనం దివ్వె లేరు నెగసన త్రోయన్
మొగ్గమిని బ్రమిదలోపల
నగ్గికణంబులుగ వత్తు లారెఁ జెఱుపొగై

వ. అట్లు యామినీదేవి బహుప్రయాసపడి తెల్ల వాఱిన

సీ. పరమేశ్వరస్తుతిప్రకటవాచారూఢి
దైనందినమ్ము మేల్కొనునైన
సాకేతవాసులా జనము లాపొద్దుట
హా! రామచంద్ర! హా! హా! నృపాల 303

చంద్ర! యంచును. సన్నసన్న యేడుపులతోఁ
దేలికనిద్దురల్ మేలుకొనిరి
సరయూనదీతటరసాలవనీకిసా
లయనీలగుచ్ఛంబులఁ దనంతఁ

జాటుచేసికొని హరిదశ్వశిశుబింబ
ముదయపర్వతశిఖరమ్ము నదలలేఁడు
వలసపోయిగో సాకేతవాసు లన్న
యట్టి వీథులఁ దగణి యల్లాడె వచ్చి

ఆ. రాజు విన్నఁ బోయె రాముఁడు వన మేగె
భరతుఁ డింతవఱకు మఱల లేదు
రాజ్యభాగమున నరాజకత్వాకృతి
కలికిఁ గొంత యాసకలిగె సుంత

సీ. చేటలవలె నైన చేతులతోడ వి
ద్యున్మాలిఁ బర్జన్యుఁ డోలువాఁడు
దున్నినచాళ్ళ విత్తులు చల్లు పిడికిలి
మించుఁ బుర్వులను బట్టించువాఁడు
తండ్రిని బుత్రుచేఁ దరుణిచే భర్తను
సిగ్గఱ సేవింపఁ జేయువాఁడు
నయథార్థతను బట్టాభిషేకము చేసి
బుజగణంబు నధఃకరించువాఁడు

విప్రభోజనముగ విందోలగంబులు
తీర్చువాఁడు సిలుగుకూర్చువాఁడు
రాజ్యభాగమున నరాజకత్వాకృతి
కలికిఁ గొంతయాస కలిగె సుంత

సీ. తాను హింసాకృతియై నవ్యయజ్ఞసం
స్కృతమేషవధము దూషించువాఁడు
యజ్ఞకర్తలచేత నాహితదక్షిణల్
చెడఁగ నపహరింపఁ జేయువాఁడు ౩౦౬

వృత్తివిద్యలు నాట్యవిద్యలు కులకర్మ
లగుట హాస్యంబున నెగుచువాఁడు
పసుగు రొక్కటఁగూడి పరిచిన ననుమూన
పడి శిక్షఁ బరిహాసపఱచువాఁడు

సతులయందుఁ గ్రొత్త స్వాతంత్ర్యములు దెచ్చి
కులవివక్ష లెల్లఁ గూల్చువాఁడు
రాజ్యభాగమున నరాజకత్వాకృతి
కలికిఁ గొంతయూస కలిగె సుంత

సీ. ఆశ్రమధర్మముల్ వ్యత్యస్తముగను వా
నప్రస్థమేగ వనంబు చేయుచు
ధనవంతులను దోచుకొను పేదవారికిఁ
గుక్షియు నెన్నంటుకొనును, బద్ధ
ఘంటలు కుంజరఘటలు విషాణులు
షాష్టిహాయనములు చనవు పత్త
నీవీథులందుఁ బండితులైన శస్త్రాస్త్ర
ధారులు ధాత్రిమధ్యమున లేరు

వణిజు లెల్లరను సభాపరాధీనత
నితరదేశములను నెగుచుచుండు
తేజు తొలఁచువాఁ డరాజకత్వాకృతి
కలికిఁ గొంతయూస కలిగె సుంత

సీ. కామమ్మ దేవతాకారమ్ముగాఁ గొల్వఁ
జేయువాఁడు తపస్సు మాయువాఁడు
తనసేన శత్రుసంతతిచేత నోడింపఁ
జేయువాఁడు మహస్సు తోఱియువాఁడు
వేదవేదాంగార్థవితతి నిర్మూలింపఁ
జేయువాఁడు మనీషఁ దీయువాఁడు
ప్రోది నానాదేశతాదూషణానేక
పరిపాకకృతవాకు వాస్యువాఁడు

పూలు నత్తరువులు పూతగంధంబు ల
నాగరకత యంగము సాగువాఁడు
రాజ్యభాగమున నరాజకత్వాకృతి
కలికిఁ గొంతయాస కలిగె నంత

సీ. నదులలో నీరు వనంబున గడ్డియు
నమ్మించి భయముచేయంగలాఁడు
అమృతమాహేయీ పయఃపానము మేపడ
గోవుల పొదుగులు కోయువాఁడు
నగ్నిహోత్రమున ధ్వజాకృతి ధూమమున్న
నిండ్లలోఁ గనిపింపనివాఁడు
నిదినాది యని యెన్న రేసియు ననుకోను
ఫీలు లేకుండఁ గల్పించువాఁడు

చేపలనుబోలె నొక్కరిచేత నొకరి
నుర్వీజనులను దినిపించు నుక్కలుండు
తా నరాజకత్వాకృతిన్గైన కలిమ
హాపురుషున కయోధ్యపై నాస కలిగె

గీ. నాస్తికులును వైతండికుల్ నగ్నమతులు
ప్రభువుచేతను శాసింపఁబడక భావ
మునకుఁ గల్పింపఁబడక భూమిని జరించు
కలికి సాకేతమునయందుఁ గలిగె నాస

శా. చేతస్సర్వపథానుశాసకుఁడు ప్రాక్సృష్టిప్రథామూర్తి ధా
త్రీతీర్థంకరమాళి సర్వజగతీస్థితీజ్వలద్ధ్యానసా
పోషితస్సాగరరాజు స్వామియు వశిష్ఠుం డా వశిష్ఠుండు సా
కేతంబందున యోగదండవిధుతి క్రీడాప్రసంగంబుగన్

క. అదలించెఁ గలిని గలియును
మదవిహ్వలధూర్తగహసమార్గంగికుఁడై
పొదలంబడి పోను స్పృహా
భిదాగదమ్ము పరిహాసవృత్త్యభినీతిన్ ౩౧౭

వ. అంత మార్కండేయ మౌద్గల్య వామదేవ కాశ్యప కాత్యాయన
గౌతమ జాబాలి ప్రముఖు లెల్లరు దీర్చిన పరిషత్తున నెల్లరును జేసిన
విన్నపము లందికొని శ్రీ వశిష్ఠదేవుడు తా నిట్లనియె

క. జనకుమృతి వచించియు రా
ముని దేశాలము యతం డమోఘవచస్కం
డనృతచ్ఛాయాదూరగుఁ
డును బిత్రువాచాధురీణుఁడును గావుట చే

క. కావున భరతుని గొనిరా
నే వలయున సూర్యవంశ మీా మనరఘురా
మాన్వితనుతిలోభము చేఁ
దావల మగుటా? మృషాపథంబున కకటా!

క. వేఁగుబఁ బుత్రెంతము భర
తాగమనార్థం బనంగ నందఱు ఋషులున్
వాగంగీకృతిఁ జూపిన
శ్రీ గురుదేవుం డయిన వశిష్ఠరి వెసన్

వ. సిద్ధార్థుఁడు విజయుఁడు జయంతాశోకుఁడు నందనుఁ డనుచారుల
రావించి యిట్లనియె

క. మీా రిం దున్నట్లుగఁ జని
తేరవలయు భరతరాజ ధృతిజవనములన్
గూరిచినలఘురథంబుల
మీా రాకఁ బ్రతీక్ష ప్రతినిమేషము మాకున్

ఉ. లెస్స మొగాలఁ జింతయును లేశములోఁ చఁగరాదు దేహాని
విస్సరణంబునందునుసనె నిల్చినవానిని నిల్చినట్లు వ
ర్చస్సముపేతుఁ దీసికొనిర మ్మని నాదగు నాజ్ఞగాఁగ శ్రే
యస్సులు చెప్పి తేవలయు నావలితప్రతివాక్యవేదులై 3౧౫

సీ. మీ పురోహితుఁడును మీ మంత్రులును మీర
లాదుకు లెస్సగా నడిగి రంపు
నే మెఱుంగముగాని యేదియో యవసరం
బైనట్టి పనియున్కి యూడి రమ్ము
శ్రీరాఘవుని వసిష్ఠను మాత్రియుఁగాని
వెసరబద్ధంతయు వెలికిఁబోవ
నీకుఁడు జనకుని మృతిమాట జరుగనే
లేదనుకొండు ప్రహ్లాదముఖులు
నృపదలుగఁగొంచుఁ గేకయాధిపునకు భర
తునకుఁ గౌశేయములును భూషణము లొప్ప
నడ ననంతరితప్రయాణములఁ బోయి
రంపు భరతరాజును గొనిరండు వేగ

మ. అనఁ బాథేయము గట్టికొంచుఁ జని దివ్యాశ్వంబులం దెచ్చి పూ
న్చిన శైబుల్ గొని నాల్గు మాని సెలవుం జేకొంచుఁ గౌశేయభూ
షణముల్ భద్రముగల్గఁగా ముడిచి హేమాసూచిశీఘ్రప్రధా
వనవాంఛాహయసంతతిం బఱపి రాన ర్స్వనన్మాసలన్

వ. సాకేతంబునకు దూరాన వ్రేలాడుచున్నట్లు గనిపించుచున్న పడ
మటిదిసంగల తాళ్ళకు నదీతీదిశగాఁబోయి మాలినీనదిందాటి
హాసినయందు గంగానదీతరణంబుఁజేసి పడమునకుమళ్ళి కురుజాంగ
లమునడుమగాఁ ద్రొక్కి పాంచాలమ్ములు పాళించి కార్యవశ
వ్రతగమనులు సరస్సులయు నదులయు సౌందర్యమ్ముఁ గాంచుటకు
నాఁగక ప్రసన్నోదకయు దివ్యయు నానావిహగసేవితయు జన
నివాసతీరయునైన శరదండానది నధిగమించి యట నొడ్డున నున్న
సత్యోపయాచనము దివ్యమైన వృక్షమ్ముఁ జేరి ప్రదక్షిణించి పునః
పునఃప్రణామమ్ము లాచరించి కులింగాపురంబుఁజేరి పైని నభికాళంబు
పోయిరి

గీ. అంత నభికాల మేగి యనంతరమున
బోధిభవనంబునం దుండి పుట్టినట్టి
మహితపుణ్యాంబు వగు నిక్షుమతిని దాటి
యా మహానది యొడ్డునయందు ఋషులు 

వ. అంజలిగృహీతవారిమాత్రభక్షకులు వేదపారగులా ప్రభువులకు
దూరమునుండియే నమస్కరించుచు బాహ్లీకదేశములలో నుండి
పోయి సుదామపర్వతముం జేరిరి

క. ఆ పర్వతమ్ము శిఖర
వ్యాసృతహారచూడమై యధోఽక్షజపాద
శ్రీసరితచూడమ్మై
దీపించె శిరస్స్రివన్నిర్ఘరమై

వ. చని విపాశాశాల్మలీనములను తోరివశంటుకొని పాంథతృషాపనో
దార్థనిర్మిత బహుదీర్ఘకలును తటాకములు పల్వలములు సరస్సులు
నటవీపథంబుల సింహవ్యాఘ్రమృగద్వీపంబులును దాటి

గీ. ముట్టెలను హయాళికి నుర్వితెట్టెలుగను
గట్టి చిద్రుపలు చిద్రుపలుగాఁగ ధరణి
భుక్తపుణ్యులవైన గీవులు వియత్తు
వదలి పడుఁ దారలట్లుగాఁ బడుచునుండ

క. గుఱ్ఱమ్ముల దేహమ్ముల
నట్టులగుచు స్వేదబిందుపటలియు నొండొం
డెట్టితిరిగి గొలుపిడిచేఁ
గొట్టునటె నుర్వికట్టుకొని పోవంగా

ఆ. జీను క్రిందనున్న సీరయుఁ దడిసి ము
ద్దమ్యో మునిగి తానమాడినట్టు
లట్టులయ్యె వార లదలించి గుఱ్ఱాలఁ
దోలుచుండి రెదలు తూలునట్లు

క. పతికార్యగతపరాధీ
నతఁ దామును దాముగాక నానాదేశ
వ్యతికర మతిక్రమించుచు
జితత్వర గిరివ్రజంబుఁ జేరి పెలుచన్ 330

గీ. రాజహిత మెంచి నృపకులరక్షణంబుఁ
దలఁచి కులపరిగ్రహసముదాత్తమతులు
విజయసిద్ధార్థనందనుల్ విమలమతులు
సాధుమతి జయంతాశోకసహితు లగుచు

చ. తలఁపులు కంటికాంతిసుపథంబును బొందకయే యహేడ మా
నులు చని సన్నచీఁకటులు నూల్కొను వేళకుఁ గేకయాధినా
థుల నృపగేహముల్ దరిసి తోడన రాక నెఱుంగఁ బంచి రు
జ్జ్వలమతులై ధరామఘవసద్మములందునఁ జేరునట్లుగన్

గీ. అప్పటికె ప్రొద్దుపోయిన దవుట వేఁగు
లుగకనొని గమ్మని వశిష్ఠు లాదిపలుకు
టను బలుకుట నిద్రాగతుఁడైన భరతు
మేల్కొలుపలేను సంబంధమ్మదుజనంబు

మ. రఘువంశాంబుధిపూర్ణచంద్రుఁడు తమిస్రాపశ్చిమానేహ మం
దఘభూయిష్ఠము స్వప్న మొందుఁగని క్లిష్టాత్ముండు తోడ్తో న్నథా
లఘునిద్రాగతి మేల్కనెన్ మఱియు మేల్కన్నన్ గతస్వప్నపా
రిఘఘాతంబులు మానలే దెడఁద నారించెన్ భయభ్రాంతిచేన్

చ. కనుఁగుకుఁ గట్టినట్లు కలఁ గన్పడుఁ దండ్రి విశీర్ణమూర్ధజుం
డును పెనుకొండకొమ్ము నడిడొంతున వ్రేలుచు గోమయహ్రదం
బునఁబడి తేలి దోసిటను బూనిన గిన్నియనుండి నూనె గై
కొని తెగఁద్రావుచున్ గనులకోసలు మూఁతనడంగ నవ్వుచున్

చ. నలఁకువ బిట్టుగా వెకిలినవ్వులు నవ్వుచు నువ్వుపిండి ము
ద్దలు తినుచుం బడెం గుతకుతం దలక్రిందులుగాఁగ మున్గి న
ట్టులు మఱి సాగరంబులు కడుంగడు వింకిన యట్లు విందు జా
బిలి ధర జారి పడ్డటులు పెల్లగు చీఁకటి క్రమ్మినట్టులున్

ఉ. పట్టపుటేన్గుకొమ్ము గునపంబుల బ్రద్దలుకొట్టినట్లు సాం
బట్టు మెఱుంగుజ్వాలల శుభంకరుఁడై చను దక్షిణాగ్ని పై
మట్టిని జల్లినట్లు మహిమండలి నాకులు పూలు పిందెలున్
వట్టిన చెట్లు మ్రోళ్ళు కనుపట్టిన యట్టులు తల్లక్రిందులై 332

మ. పెకలింపంబడి పెద్దశైలములఁ గప్పెన్ ధూమసంతాన ము
ర్వీకళత్రుం డగు తండ్రి నీలవసనావిష్కారదేహుండు వా
లికఁ గార్ష్ణాయసపీఠికాగతుఁడు నోలిన్ నీలదేహాంగనా
నికరప్రావృతుఁడై హసించుచుండుటల్ నిండాఁ దృశాపీఠిలో

క. ఎట్టని నీఁగలు తొలిచి
యెట్టని మైపూఁత లొప్ప నృపుఁ గ్రోధముచే
నెట్టి కనుసెరల దానవి
జట్టున లాగెను శిరోజసంగతి మొదలన్

మ. ఖరయుగ్యంబురథంబుపైఁ జనియె నాఁగన్ దక్షిణాదిక్కికిన్
నరనాథుం డిది యెల్లనుం గనియె స్వప్నంబందు యోజించినన్
భరతుం డా కల సర్వముం దలచి బీభత్సంబుగా నా మనో
తరమం దాఁగను లేకపోయెఁ బితృజాతంబైన వృత్తాంతమున్

ఉ. ఆరఁ బురానుభూతివిషయంబులు బుద్ధినిగూఢగాఢసం
స్కారముచేత స్వప్నములుగాఁ జనుదెంచు నటండ్రి నీదృశం
బారభమాణమై చనినయట్టిది వృత్తము వాంఛనీయతా
దూరము దీనికిం దొలుత తోఁచదు జీవుని సేకరించుటల్

ఉ. ఈ యఖిలానిలాధ్వముల నెల్లను నిండిన ప్రాణశక్తి తా
నై యొకఁ డొక్కవేళ సకలాంగములు ధ్వనించు నెక్కడో
స్వీయము నేకదేశ మగు వృత్తము నొక్కఁడు నన్యదేశ మం
దాయెడ జీవలక్షణసమీపతఁ గల్గిన చోటులందునన్

శా. ఈ కాలాకృతియైన జీవునకు ముందే లేదు, తా వెన్క లే
దే కాలంబును నొక్కఁడై చనుట నీ వృత్తాంబు మున్నైననున్
గాకన్ వెన్కను నైన నిక్కువముగాఁ గావచ్చు నీస్వప్న గా
థాకల్లోలిని జీవవాహిని నిరంతాంభఃప్రవాహార్ద్రియున్

ఉ. ఏ యశుభంబు తండ్రి కగు నే మగు శ్రీరఘురామమూర్తికిన్
శ్రీయుతుఁ డన్నగారు నొక సేగిని గాంచునె, రామచంద్రబా
హాయమితారి తండ్రి కగునా యశుభం బని, కాదయేని నీ
పాయనిదైన పాదుకల వచ్చిన యీ ఫలమేమి, చెప్పుమా! ౩౪౪

శా. ఒక్కొక్కప్పుడు స్వప్నముల్ మనవధారోద్వేగసంకల్ప్యతన్
జిక్కంబట్టవు నిశ్చితార్థముల హృచ్చింతాభరాత్తోహాసం
స్ఫూర్తుల్ తండ్రికి మేలయంచుఁదలఁతున్ శ్రీరాముఁ డాగూపయో
ముక్త్రమాకృతి వాని కేల కలుగుంబోపో! యకళ్యాణముల్

చ. అని యనుకొంచునున్న సమయంబున వేగులరాక బందుగుల్
చని వచియింప స్వప్నమును జారులరాక పరస్పరాహతం
జని భరతుండు శీఘ్రముగఁ జారులసన్నిధి కేగి రాత్రి వ
చ్చినయది యింతదాఁక ననుఁ జెప్పరు మంచివివేకు లంచునున్

ఉ. శ్రీరఘురామచంద్రునకు సేమమె యంచన సేమమే యనన్
ధారణినేత సేమ మటె తండ్రి యటన్నను సేమమే యనన్
దోరపుటూర్పు విచ్చి భరతుం డనె నిద్దుర లేపరాదటే
వారక యింతదూరమున వచ్చిన సేమముకంటె నెక్కువా?

శా. తల్లుల్ సేమముగాఁగ నుందురె యయోధ్యావాసు లానందధూ
ర్వల్లీపూలము శ్రీవశిష్ఠుల తపోవర్ధిష్ణులే యన్న సం
ఫుల్లస్వాంతులు వేగులందఱును జెంపుం గాంత్రు నీ రాకచే
నెల్లన్ మేలగు శ్రీవశిష్ఠులును స్వామీ! విన్న వే నమ్మనెన్

సీ. అడిగిరి నీ సేమ మఖిలమంత్రులు, పురో
హితులు, వశిష్ఠులు నెన్నిరోని
వస్త్రముల్ నగలును పంపిరి నీకును
నీ తాతగారికి నేమిధర్మ!
విన్న నిల్చినవాని నిల్చినయట్లుగాఁ
గొంచురమ్మనిరొ నెక్కువఁగ స్వామి
బ్రహ్మసూనాని మార్తండవంశార్ణవ
శ్వేత్ర్యైయసతీరసగరమూర్తి
కడఁగి తొందఱకల రాజకార్య మేని
తాను జతగూడెనో చెప్పనైన లేదు
వేగులము మేము నడిగిన వెక్కసంబు
నిదియు జాగింతయును సహింపదు కుమార! ౩౮౯

వ. అనిన భరతుండు గిట్టునఁదిరిగి వృద్ధరాజుకడకుఁ బోయి 'తాత!
తాతలు వశిష్ఠుండు దూతలఁబుచ్చిరి. నేను మా యూరుపోయెద'
ననినఁ గైకేయుండు దౌహిత్రు నాలింగనంబుసేసి శిరము మూర్కొని
ప్రయాణంబు సమకూర్చి మనుమనికి వేయిరుక్మనిష్కంబులుఁ బది
నాఱువేలు గుఱ్ఱంబులు విశ్వాస్యులయిన మంత్రులను సేనలను
రథములకుఁ గట్టిన వేగరులగు ఖరంబులను బసిపట్టిపోయి పొదల
లోని వ్యాఘ్రంబులఁ గోఱలతో వెలికిఁదివ్వ నడుమున్నని జాగి
లంబులను గానుకలిచ్చిన భరతుండు తాతగారియు మేనమామయు
సెలవుఁగైకొని రథారోహణంబుచేసినఁ గైకేయుండు భరతునిచేయి
రథ స్తంభంబు పట్టుకొనిన దానిపైఁ జేయివైచి యిట్లనియె

క. విను కన్నతల్లి కైకయి
నినుఁగనుటఁ గృతార్థురాలు నిక్కమ్ముగ నా
యన! నీ తండ్రిని నడిగితి
నని చెప్పుము వేల్పుసేన కండగునతనిన్

ఉ. నీకులు రాములక్ష్మణులు పెద్దయుఁ దాతలు తాత లంచు నం
జేరిన నీడిపోనరు నిశీథచరాఖిలధూమకేతులన్
వారిని నేనుగా నడిగి నానని చెప్పుము కౌఁగిలింపుమన్
వారికి నన్న వయ్యవియు వారి! నా యని యాము నియ్యవే!

మ. అని శత్రుఘ్ను రథంబునుం దరిసి నిద్దా! శ్రీవ భద్రంబు చూ
చిన యే వస్తువుఁ జూడకే భరతుఁడున్ జాలింపుకొంపుండు లో
నన తా చెప్పెడిదో సమ స్తమును గంటం గాంచుచుం బోయ్ము పం
చిన యీకానుకల నీవి నీవు గొనుమా శీఘ్రం బయోధ్యాపురిన్

క. అన నన్నదమ్ము లిద్దఱుఁ
జనిరి జనీస పలాప్రసారణిమృదువా
సనలేచు పుంత్రోవన్
గణగణరథనేమినిస్వనంబులు సెలఁగన్

వ. అట్లు ప్రాఙ్ముఖంబుగాఁ జనిన రథంబులు పూలుదంశ్రుచ్చినట్లున్న
తరంగమ్ములచే నన్వర్థాభిధ సుదామానదిందాఁటి యేలాధాననగర

సమీపమునందు పోతిన్ను తెకురుతిరిగి వెడల్పైక్క యొడ్డులు దూరమ్ము చేసికొన్న శతద్రూనదినిఁ దరించి యపరపర్వతమ్ములు ప్రాప్తించి చెకుముకిరాళ్లతో నిండి ప్రవాహవేగపరస్పరఘట్టన జనితాగ్ని కణములచేత నంతఃశీతఘ్నకవాలె నున్న శిలావహా వాహినీనిస్తరణంబు సేసి మహాపర్వతంబులు గమించి చైత్రరథాభిముఖంబుగాఁ జనియె, గంగాసరస్వతు లిరుప్రక్క స్రవించెడు పథంబున రమ్యతాహ్లాదనములైన రాచకొలఁకులు వీరమత్స్యదేశంబులందు భారుండమను వనంబుఁ బ్రవేశించె నంత యమునానదిం దాటె, నాయమున యనమశిలాపథంబునఁ గొండలలోయలలోఁబడి పోవుచుఁ బ్రతిపదంబు బ్రపాతవేగంబున నిలుకడయుండె నచటఁ గులింగ యను మాఱుపేరున వ్యవహరింపఁబడుచున్న యా నదీతీరమ్మున దిగిన గుఱ్ఱంబులు కొన్ని చలిచేత బిగుసుకొనిపోయి కొన్ని ఘాతాపిష్టములవలెఁ బ్రకంపమానము లగుచున్న నడవి కట్టెలు తెచ్చి యగ్నిచేసి వానికి శైత్యాపనోదంబుఁ జేసి యందు విడిసి వంటలుచేసికొని యారగించి తజ్జలంబులు కుంభంబుల సేకరించుకొనిపోయిరి; అచ్చటి త్రోవ మహారణ్యమధ్యగామి; భరతుఁ డచ్చోనిముసమాగత బలంబులు తోలుకొంచు వాయుదేవుం డాకాశమున నేగిన ట్లేగె; నమ్మహారణ్యం బతిక్రమించి ప్రాగ్వటంబని విశ్రుతంబయిన యంశుధాననగరంబునందుఁ దరింపరాని భాగీరథిం దరించి పైని కుటికోష్ఠికానదిని బలములు దాటించి ధర్మవర్ధనమైన తోరణంబుకుడిసగమునందుఁబోయి జంబూప్రస్థముం జేరె నంత వరూథ మను ముచ్చటైన పల్లె జేరి దాని నానుకొనియున్న పూఁదోటయందు మఱల విడిదిచేసె నచట బయలుదేరి తూర్పుదిక్కుగాఁబోయి యుజ్జిహానానదీతీర ప్రియకతరూద్యానములుసేరి కడిమిపూముంజువాసనల మఱిగి మఱలని మత్తాశ్వంబుల మత్తవారణంబుల ముందుండి తీయించి యుజ్జిహానం దాటె; దారిపోడుగునఁ దీర్థంబులు సేవించుకొంచు నితరములైన పెక్కుకొండవాగులు దాటునెడఁ గొండలఁ బెఱిగినగుఱ్ఱాలచేతఁ దరించుచు హాస్తిపృష్ఠకమును గుటికయు నతివర్తించి లౌహిత్యనగరంబునఁ

గవీవతీరణంబు సేసి యేకసాలమున స్థాణుమతిని వినతమున గోమ
తిని దాటి కళింగనగరంబున వనంబు ప్రాప్తించి యలసిన వాజుల
నూఁదఁదీయక యాత్రాత్రిమొల్లను బ్రయాణంబు చేసి యావనంబు
దాటి యరుణోదయ వేళ

సీ. రిపుశతఘ్ని మహాగ్నిశిఖాళిః దగ్ధ
ధూమసంపిహితమౌ దుర్గమట్లు
శిల్పికృతశ్యామలాల్పమృన్నిర్మిత
క్రీడాగృహసమాజకేతువట్లు
ఝంఝావినిర్ఘాతిసంఛిన్నసర్వస
త్రాల్పశాఖమ్మగు మహాగమట్లు
మఱి రాఁజి రాఁజి క్రమమ్ముగాఁ జల్లారి
యసితమై చను నిఱుకామమట్లు

చిఱుతవెలుఁగులలో దూరసీమయందు
చలియుఁజప్పుడు లేక నిశ్చలముగాఁగ
నున్న సాకేతపురిఁ జూచి యుల్లమందు
భరతునకు నల్ల కదలించు పగిది నయ్యె

సీ. అంతఃపట్టణంబందు వేఁగునన్నైన
సవ్వడియెంతైన దవ్వునమ్చు
ప్రాతరధ్యయనసంఘాతిరీటస్వనం
బనిలాధ్వమెంత దవ్వైనఁబట్టు
గ్రామబహిఃప్రదేశామలకోద్యాన
ములయందు గతమానినుల శయించి
విరతంబుషఃకాలనిర్గతవృద్ధశా
జన్యరథంబుల జాడలేదు

రుద్ధకంఠసమాయాతరూక్షశోక
రావ మది యుండియుండి దూరంబునందు
నీలపిట్టలు కూసిన ట్లెగుదెంచు
పరయువున సన్నగాలులు చలచినట్లు 3౫౭

ఉ. పట్టివిభూతిపండువలెఁ బాండురమై పొలుపేది యున్న యా
పట్టణముఁ గనుంగొనుచు శాత్రుఘ్నసూనుఁడు సూతుతోడఁ దా
నిట్టులనెన్ గనుంగొనఁగదే మహాపట్టణ మొట్టులుండె దూ
రాట్టమనోజ్ఞకాంతి కనరాదు పురాసమయంబులం బలెన్

శా. నాకై వాగ్గను బుచ్చి యప్పటికినైనన్ వత్తు నన్నట్టినా
ళ్ళా కోట్టాగ్రమునందు నిల్చి జనకుం దన్వింబు వీక్షించుచున్
నాకుం దోతురు మున్ను సేవకులు మార్గా నవచ్చి గ్రామాంతమం
దా కైనీడల కన్నులం గనరు నేడై యింతగా డగ్గఱన్

చ. పరిచిత మెన్నియైన తడనల్ మును నేనును దాతగారిదౌ
పురమునునుండి వచ్చుచును బోల్చుట పట్టణవీథియానసిం
ధురతరుణీపదాంబుజవినూతననూపురఘుం[illegible]రావం
బొరసి శకుంతరావముల నామట తా వినరాదు నేటికిన్

మ. బహుజన్మల్ గని నేటికీ రఘుపతిభ్రాతృత్వ మొప్పన్ సుఖా
వహమౌ జన్మముఁ గాంచి తృప్తికను నప్పాటన్ బురావేళలన్
స్పృహతో నిచ్చటఁ గుంకుమ-లఘుసంపృక్తాగురుద్రవ్యభూ
మ హారాత్తాడనధృత్పరీమళరివంసం గండు, లే దిప్పుడున్

గీ. దోషరహితంబుగాఁగ నింద్రుడు జయంతు
వెడలనడచిన యప్పటి వేల్పువీడు
జోడుగా నున్నది యయోధ్య చూడఁజూడఁ
దోలుమా రథంబును గశాధూర్వహముగ

గీ. అనుచు శత్రుఘ్నునిం గల్పికొని నిమేష
మాత్రమున నయోధ్యారాజమార్గ ఘనక
వాటసామీప్యమున కేగి ద్వారమల్లె
తెఱచి రేయెల్ల నుండిన తీరుజూచి

శా. ద్వారశ్శోభాపరిహీణమై నవహరిద్రాకుంకుమాసీతభా
విశ్వేషంబయి లంబమానసుమవేణీరంగవల్లీ యవీ
యశ్శాలీనత తోఁచి గుత్తములు ముందైయేగ నిర్వంకలన్
దోశ్శాలుల్ భటరాజి నిల్వరు పురీదుష్టసంచారంబుగాన్ 3౬౮

ఉ. రేసి పథంబునం బరిహరింతురు కొందఱు దీనమూర్తులై
మానసదృష్టిపాతమున మున్న నజేతుకు కొంద రెవ్వరో
కోసలవిల్లు చేరుగ నృపున్ కుంబలె వంగి నమస్కరింతు రా
యాసము పొందు మున్ముకనినంతన కొందఱు పౌరులెంతయున్

చ. కలితకవాటముల్ సుబలితార్గళహీనము లారి మూర్గలు
త్పలదళమాలికావిరహితంబులు తోరణముల్ నవాగురూ
జ్జ్వలతరధూపవర్జితవివర్ణములున్ భుజికన్న పేరయున్
నలుగనుచుండగాఁ గుటుంబిభవనంబులు తేజు తొలంగి కన్పడన్

సీ. దేవాలయంబులు దీపధూపవిసర్జి
తంబులు, శిఖరహితంబులయ్యె
యజ్ఞగోష్ఠులు, పూవుబాగళ్ళ సుమదరి
ద్రంబులు, విరహితఫలము లయ్యె
రత్నాపణములు, పౌరజనంబు పరిదీన
మూర్తులు, విఘటితభోగ మయ్యెఁ
జైత్యంబులందు, విస్వనమాధురీ రేఖ
ఘనశకుంతంబులఁ గానరాదు

తను శుకశారికాదిపంజరములెల్ల
నామకానికి పౌరులు గృహాంతరములు గాక
బ్రొద్దు బారెక్కె గడపల ముగ్గుకట్టి
పట్టి తీసినయట్టి పాపానఁబోరు

ఆ. వెనుక వీథులందు వెసులుబాటుండదు
యడుగుదీసి మడుల నడుగుపెట్ట
నా యయోధ్య మనిసు లందఱు విలపపో
యిరో మనసులయందు విడిచినారో!

శా. విఘ్నానేకవిదారితాంతరుఁడు పూర్వోద్ధీమహోదారతా
నిఘ్నాంతఃకరణుండు సంచలదగత్నిప్రస్థఘాతంబు హ్రా
ద్ఘ్నుండై చనురీతి సందియము లుద్దండంబుగాఁ బోయి శ
త్రుఘ్నజ్యేష్ఠుఁడుతంత్రిరాచనగరంబున్ బ్రాణెవాయుత్వరన్ ౩౬

చ. జనకుని దుఃఖభారవివశంబగు గుండియతోడి రామచం
ద్రుని గనకుండ నాకిచటఁ దోఁచ దటంచును బిగ్గనేడ్చి లే
చిన సుతుఁగాంచి కైకయి విశీర్ణహృదంతన యోయి యోయి నా
యన! వినుఁ జెప్పె దెవ్వసును నయ్యది నేన వచింపఁగావలెన్

గీ. శ్రీవసిష్ఠులు నన్ను శిక్షించుటకును
నీకు నిజమైన నార నందింప లేదు
తల్లి యని యింతకున్ మున్ను తాల్చినట్టి
యదుగు లంటినచేతులు కడిగికొమ్ము

చ. అనుచును కైకయీవదన మంచునఁ దైన్యము కన్నులందునన్
గనలును దేహమంతనను గంపముఁ గల్గి తనంతఁదాను గా
దనినటులన్ వచించె సకలావని నీకయి చేసిపెట్టితిన్
గొని ధర యేలికొమ్ము తనకుం బ్రియమైనది రాచబిడ్డకున్

చ. ఇలపయి రాచవానికి మఱెవ్వరు లేరు జఘన్యుఁడైననున్
బలయుతుఁడైన రాజ్యపరిపాలన వానిది రాజ్యలోభవి
హ్వాలమతికాని రాచకొడు కాతఁడు రాజకుమారుఁడా! ధరా
వలయగతోగ్రలోభము ధ్రువం బగు భూష నృపాలకోటికిన్

చ. కలిగిన రాచవానికిని ఖడ్గమువంటిది నీతి, నీతిచే
గెలిచిన గెల్పు ఖడ్గమున గెల్చిన దానికి బోల్చగాదు దో
ర్వలయమహాప్రతాపశిఖ శ్రీప భుఁ డా రఘురాముఁ గత్తితో
గెలువను రాను, నీవునయి గెల్చుటె రాముని దల్లి నీతిచే

చ. అనయము రాచవానికిని నన్నలు లేరును దండ్రి లేఁడు మె
త్తనిమెతతోడి రాజనుఁడు ధారుణికిన్ దనకున్ సహస్రయో
జనముల వాఁడు, బంధుజవిషాదము పుట్టినరాచబిడ్డ పు
ట్టను దగుఁ బాములింటనో! కడంకను మూఁడవజాతియింటనో

చ. ఉరకయ తండ్రిపోయె నని యుమ్మలికంబున నంతగారినన్
తిరిగియు రాఁడు తండ్రి యగతింజని వేళ్ళను నంకుమన్న యు
ర్వర నొకమాఁటుగాఁ దతకత్తంబును జాచి గ్రహింపకుండ బి
త్తగపడి తాఁకఁబోయినను దవ్వగుఁ జేతికి నందకుండెనున్ కేల

ఉ. కాదని తండ్రిదుఃఖమునఁ గష్టములు వార్చెదవేని యుండెనే
శ్రీదివిషజ్జగత్ప్రగణశీలిని తండ్రిని నీకు నాకునే
భేదము మాకు గుత్తగొను ప్రేమమునం గననౌట ధైర్యసం
పాదనచేయు మీ యెడఁదపండిన పుణ్యపుఁబంట మాన్యమై

శా. ఈ రాజ్యంబునుగాని నీవు గొనినన్ హేలాఘను శ్రీకళా
పారావారుఁడు రామచంద్రుఁడిసుముం బట్టించుకో, దాశ్రిన
ప్రాగ్రూఢాకృతి వానిపక్షమునఁ జెప్పంగల్గుమే రాజ్యల
క్ష్మీరమాఃపరికృష్టి నీ తెగువ సంలీఢంబుగాఁ జేయుమీ!

గీ. అనిన భరతుఁడు శ్రీరాముఁ డనని నాథు
నమఁగు నైన జ్యేష్ఠాపత్య మాతఁ డేల
దీనిఁ బట్టించుకొనఁబోవఁ డైన నేను
బోయి కనుగొందు ననఁగఁ గైకేయి నవ్వి

సీ. కొని యెంకుఁబోయి కన్గొందువా యిఁక! ధరా
జాని నీ తండ్రి నిస్సంశయముగ
వలదని యనఁడు శ్రీపతి వనీవాసంబు
సలుపఁబోయెడు నిమేషములయందు
నన్నుచోఁ జాలు సటంచు మీ నాయన
మోమునఁదాన బెట్టు మోముపెట్టి
చూచి చూచి నిజంబు, మూఁడిపోయినది నా
గుండియ కాలుష్యకుధరము నని
నన్నుఁ దిట్టుటయే కాని నలిననేత్రు
రామువల దనఁడాయె శ్రీరామమూర్తి
వనము లేగి యీనాటికిఁ బతునాల్యో
బాలుఁడా! నేటి కిది కృష్ణపక్షనవమి

గీ. అనిన భరతుండు శ్రీరాముఁ డడవి కేల
యేగె జనకుండు నుఱక నిన్నేల తిట్టె
ననినఁ గైకేయి యిట్లని నట్టు లడుగు
ముట్టిపడివచ్చుఁ బుట్టు పూర్వోత్తరంబు ౩౮౭

క. అది యెప్పటిమాటో ము
న్నా దైత్యసంహారవేళనుజ్ శ్రీపతి యొ
ప్పిద మగు తేజమ్మని ఋ
ల్లిదమై కౌసల్య పన్నాళించదు ఋరువై

ఉ. అప్పటిమాట నీ జనకుపాణిమ్ము కాంచితి నేను రాజనుం
దెప్పిరి నన్నుఁ గోరుమని దిట్టిరి కోర్కులు రెండు కోర్కలే
దెప్పుడు నాకుఁ గాదనిన నెప్పుడో కోరెద నెండి యంటి నా
యప్పుడు నిప్పుడైనయది యా యిరుకోర్కుల వేళపాటుగా

శా. ఏపై నాకును లేనిపేరెము యాని నిండెజ్ మంథరాదాసికిజ్
నీ పల్యంకిక దానిపల్లకి యటే నీకోస మా కోర్కులజ్
వ్యాపింపించితి నీవు రాజగుట యొం డా దైత్యసంహారగా
థాపాండిత్యసముద్రమూర్తి చనఁ గాంతారమ్ము రెండై చనజ్

మ. ఒకయేడా! పదునాలుగేండ్లు మఱి నీ పుత్రీమహారాజ్యముజ్
మొకమోటం బనిలేక యేలుకొనుమీ భూపాలుఁడా దుఃఖనా
రికదంబంబులు నేల్గుకట్టి సుదులై శీతత్వముంబొందె నా
యన! శ్రీరాఘవ! లక్ష్మణా! జనకజా! యంచుం బరిభ్రాంతుఁడై

క. అన భరతుఁడు తండ్రియు ల
క్ష్మణా! జనకజా! యటంచు ప్రలాపం బే
లను బొంద రామచంద్రుఁడు
చన రామా యంచు నగవఁజనుగా కనినజ్

ఉ. కైకయి బిగ్గగాంచి తుదికన్నులు, ధాత్రిని నీకు నేలు థీ
శ్రీకత కల్గు రాముఁడు వసింపని నీకు నయోధ్యలోపలజ్
కైకయి కాక జానకియుఁగైకొని లక్ష్మణుఁడుజ్ వసింతురా?
యాకున నీసెలుజ్ వదలి యాకని యందునటోయి భూమిపా!

క. ఆ లక్ష్మణుండు లేమియె
మేలగు శ్రీరామునంత మేలు కలఁడు వాఁ
డాలీఢచాపల సక
మాలాజ్వాలాశరాళి మన్నింపునటే!

ఉ. చక్కఁగ సీతనుఁ భృకుటిఁగొనుసంగను నక్కఱలేదు లక్ష్మణుం
డొక్కఁడనుండియుండి నొదిరౌ ప్రియంబునుఁజేయు నన్న భీ
యక్కఱ లేదు కోసలములన్నియు జన్నియపాలుగాఁగఁ బై
జిక్కనివిమాంగఁ జల్ కలఁక చెందని నన్నియు నాదరింపుమా!

మ. విరతంబున్ ననుఁ బెంచి నా వలస సంతృప్తిం గనన్ లేదు మం
థర స్వైవై థరనాథుకొంగులు మాఱింతన్ బట్టినన్ బంధిరిన్
నిరుగంజల్లఁగ నీ విహారమును ధాత్రీదూష్యసర్వాంత సా
గరశీతానిలధూతమందవిలసద్గారాలకామోఘమై

మ. అన దిగ్భ్రాంతిని బొంది నిల్చి భరతుండా మాట లాలించుచున్
దన లోఁ గుందియు స్పందనం బణఁచి నంతన్ మాట జిహ్వాగ్రమం
దున యత్నంబునఁ దెచ్చికొలుగ నన్ దోర్నిశిపరిస్ఫూర్తిలో
చనుఁడై గోఁతుకలోన నుండవలె శుష్కంబై పెగల్పంబడన్

ఉ. పేరిమి నిన్నుఁ దల్లియని పిల్తున యింతటి గాలిమాట నా
పేరున నేలకట్టితివి పెద్దయు రాముఁడు పత్నిమైనచోఁ
దోరము నేను నీనె యగుదున్ విడియా కగునంత ధూర్వహ
త్వారభమాణమై చనదు నంతటి చిక్కన లేదు నా యెడన్

క. నే నెఱుఁగలేన యైతిని
మానసమందొక్క డడియు నుఱి యడిగెద ?
న్ని నీవు చెప్పువైఖరి
నానంబట్టను ద్వదీయమగు వాక్రీతిన్

మ. నను నిందించెదొ సంతసంపడెదవో నామేలు నేనీతి కో
రినదౌచుండెను నీ యెడంద రఘుమూర్తిన్ రామచంద్రున్ నిజం
బునకున్ గానకుఁబంపు నంత పగయొట్టా బున్నంబు నీ కెట్టు తోఁ
చెను (శ్రీ)రామునకు నీకు లోచనపురస్కృత్యానుదీప్తమై

ఉ. పుట్టిననాటనుండి ననుఁ బొందదు నీదగు ప్రేమ యూరకే
యుట్టిపడెన్ విచిత్రముగ నున్నది, మైనను నీవు నా కహా
పట్టముగట్టి తిప్పుకొనఁ బట్టునకుం జనువెంచె దల్లి లో
గుట్టగు ప్రేమ, మైన నిదిగో ధరయేటి కహా త్రిదండికిన్ ౨౦౦

గీ. అనిన భరతుని గొంతులోనన వెలుంగు
రామచంద్రుని గొంతుతోనను నెఱింగి
నాయనా! వచ్చితివటోయి! నా యనుంగ
తెచ్చుకొనుచును సుతుఁ గౌఁగిలించె రాణి

చ. తొడపయిఁ జేర్చి తా నలక దువ్వి మొగమ్ము స్పృశించి కన్నులుం
గడలుకొనంగఁ బ్రేమఁ జిబుకంబును బూనుచు మోముజూచి నె
వ్వడు చనుదెంచినా విచటఁ బుట్టిన వన్ని మెఱింగినావె త
క్కడనలె నయ్యొ విచ్చటను క్రిందును మీదునుగాఁగ నన్నియున్

క. మీ తాతగారు సేమమె
నీతిచెడిన రఘువ్రులిండ్ల నెక్కొనువార్తల్
మీ తాతలిండ్లఁ దెలిసెన
చేతోరీథావిధావిశేషము లకటా!

వ. అనిన భరతుండు

శా. తల్లీ! తాతలు శ్రీవశిష్ఠులును వార్తన్ దాఁచియే పంపి రీ
యెల్లన్నాకును వారికిం దెలియరా దిచ్చోటి యీ రద్ది యో
తల్లీ! నే నిటవచ్చి యీ సకలవార్తాసూరాలదేవీగృహం
బుల్లాసంబునఁ బోయి వచ్చితిని దుఃఖోద్గారి బాష్పచ్ఛటన్

మ. అనఁ గౌసల్య యదేలరా యనుఁగ! రాజ్యంబెల్లఁ బ్రాప్తించె నీ
కును నీతల్లి నృపాలనీతిధిషణాకౌశల్యసంప్రక్రియన్
జనెఁబో రాముఁడు వేఱుమాట యని యీ సంప్రాప్తమా సర్వధా
రణి నిక్షేపముగాఁగ నేలుకొన వోరా! దుఃఖమే లయ్యోనాన్

గీ. భరతునకు నీళ్లు గిఱ్ఱునఁదిరిగి కనుల
దొలుతఁ గౌసల్యతోడదిగి దోయిలించి
యమ్మ! న న్ననవలసినయట్టిమాట
యా యిది? యెంత భేద మెంతయ్యో నీకు

శా. ఇన్నాళ్ళింతయు మత్సరంపడను దల్లీ! రామునింగాఁర్చి నే
డెన్నంబడ్డ విధాన నీ కడుపునం దేనైన జన్మించియే
యున్నన్నన్నిటువంటిమాట యనదో యో చెల్లి! కౌసల్యబి
డ్డన్నే నంచునె వచ్చు నోటికి వశిష్ఠం బాను నా కెప్పుడున్ ౪౩౮

వ. అని పరీక్ష నిలంబడియున్న సుమిత్రింగాంచి

గీ. రాఘవాంతఃపురావలిరథిక భావ
పాలనీ! యిట్లు లన్పింపవలెనె నీవు
కాడనుండి తల్లికి బిడ్డకాడఁ జేసు
వెట్లు కాలమ్మె మిక్కిలి బెట్టిదంబు

శా. ఏ కొక్కింతయు నీఁ దెలుంగకయె తా నింతైన దవ్వేగునా
యీ రాజసాకృతకష్టసీతిసఖనుం జీ రీతి మీరే మదిం
బాయంబెట్టగ నేని యెవ్వరిచ్ఛుదం బాయుఁ మజీనింద స్వా
ధ్యాయంబై చను నేం సంచియు మహాధ్యాసర్వవర్గంబులన్

గీ. ఇంకఁ బూర్వికపుల్లంత యెఱుఁగకట్టి
భగవనింగూర్చి సందేహపడెడువారి
కెఱుఁగనా నేను రాము నోకేను నెట్లు
చూతునో వానియందు నా సూటి యేమొ!

మాధ్యాక్షులు.

ఎవఁ డార్యుఁడగు రాముఁ డడవి కేఁగుట నెఱుఁగునో వాఁడు
తవిలి శాస్త్రోక్తగబుద్ధి తన్ను బొందని జోగి వాఁడు
నవసూతికను గోవుఁ బాదనాళంబునం జన్ని నిహతుఁ
డవువాఁ డసాధుకృతి సుకృతా తలోకాలికిఁ గాక
సేవకుచే కష్టకర్మఁ జేయించి చెకునట్టి వాఁడు
భూవిభుఁ బితవలె జనముఁబోవని నా భూమిాశు ద్రోహ
భావంబునం జూచువాఁడు పడయు నే పాపంబుఁ బడయు
నే వాఁడు శ్రీరాముఁ డడవి కేగుటో యెఱుఁగునో వాఁడు
క్రొవ్విన తాఁ బన్నులు గొంను క్షోణిపత్తుఁడుగాక క
నిన్పాటిలంజేయు ధారణీపతి నెగడు నే ద్రోవ
నెవ్వఁడు శ్రీరాముఁ డడవి కేగుట యెఱుఁగునో వాఁడు
త్రప్పకోఁగలవాఁడు వాఁడు తత్పాపరాశి యంతయును
బున్నమా యజ్ఞదక్షిణాలు మునులు చెప్పాట కడకిడ
ముక్కోత్తుగా నాడువాఁడు యుద్ధమధ్యోర్వి నధర్మ
మొక్కమిఁ జేసెడువాఁడు నోగియాము రోలసి య ట్లగున
యెవ్వఁడు శ్రీస్వామి యడవి కేఁగుట యెఱుఁగునో వాఁడు ౨౨౬

క. నే నెఱిఁగి రామచంద్రుఁడు
కానకుఁ బోవుటకు నైనఁ గాని వికుంఠా
ననవదివ్యదర్శన
మానందము నంత శేత్రివా నా కకటా!

క. నే నెఱిఁగి రామచంద్రుఁడు
కానకు నేగుటకు నేను గ్రత్వర్థపయ
స్సానను గురూపదేశ
స్థానభ్రంశంబు నొందఁ దల్లీ! యింతేఁ

ఆ. కాల నావ్రు తగులఁ గాల్లాడ గురువును
జెలిమియందు ద్రోహచింతసేయ
నమ్మి యాడుమాట నడిపింప విధిని
నెఱిఁగి నేను రాముఁ డెల్లు చనును

గీ. అయ్యొ తల్లీ! కృతఘ్నుని నన్నయట్ల
కర్త నన్నట్లు త్యక్తాత్ముఁ గలుషశీలు
నన్నయట్లుగ నంటివి యట్టివారి
యొఱుక రాముండు కానకు నేగుఁగాని

చ. అనయము దారపుత్రులు క్షుధార్తులుగా విలపింప మృష్టభో
జనుఁడగువాఁడు తుల్యకులసంపద నాలి యాలు తెచ్చి సం
తునఁ గులకన్నను జెడిన దుష్టుఁ పాపాలు రామచంద్రునిఁ
వనికిని బంపునూహగలవారలు తేరితఁ గలిపరిచారకుల్

ఉ. శ్రీపతి కానకుం జను కెఱింగిన యాతఁడు యోగ్యగేహినీ
వ్యాస్పృతజీవితార్థ్వమునయందున సంచ్యుతుఁడై యపత్యరే
ఖాసగిహీనుఁడై నదుమ నాయువు త్రుంచుక పోవువాఁడు వాఁ
డై పసినాంద్ర యంగనలయందున గొంతులు నుల్మి చంపెడుఁ

సీ. అని తనయదోషమతి నుపన్యాసగతి స
రోషమతిఁ జెప్పి కౌసల్య రూక్షశోక
భావసాగర వేలాసుభంకరుండు
భరతుఁ డాననదైన్యవిభాసికాఁగ

చ. ఎవరికిఁ గా శోకమొక్కఁడుగ నెప్పుడొ వచ్చిన వచ్చు నింతయుం
దప్పులు వచ్చొక్కఁడే పరిణతంబుగ రెండును నొక్కసారిగా
గదిసెను నన్ను దేనికయి కందుదు జ్యేష్ఠుని కాననశోకకా?
యనవనిపతిప్రమాథమునకా? జననీకృతకచ్చగానికా?

శా. స్వాధ్యాయావిహతప్రచారగుణసంపన్నుండు బ్రహ్మన్యహాన్వై సత్ప్రియుల్
విద్యాగ్నిక్రియఁ బ్రత్యవాయమునఁ గాదిల్లన్ యాయజూకుండు తా
నధ్యాత్మాధ్వమునందు నిష్ణాతుఁడునై యంతం బరివ్రాట్టు సా
న్నిధ్యం బొందర యంత కేశవనిబిడాగ్నిజ్వాలికామాలికన్

క. అట్టులైన భరతుఁ గనుగొని
నిటాలఘటకైకయోగనిభృతాగ్ని మహా
నటలీలాకృతి శాంత
స్ఫుటతేజము శ్రీవశిష్ఠముని యిట్లనియెన్

ఉ. చాలును సర్వజంతుసహజం బగు దుఃఖము పట్టిపోకు ము
ద్వేలగుచాపరితారణము దెప్పరమైనను దండ్రి పుణ్యలో
కాలికి నేగు కర్మ తొలి నాచరణీయము తైలకుంభముల్
వేగిలెడు తండ్రి! నీ వనుసరింపుము సద్గుణపేతకార్యముల్

వ. అనిన మహాత్ము లెల్లరు నానీతతైలద్రోణికాపనీతరాజకళేబరు
లయిన భరతుండు నానారత్నపరిష్కృతభూమిశయాను దండ్రిం
గాంచి

గీ. ఒక్కపెట్టున నఱచి యో యుర్వినాథ!
నేను భరతుండ నరుదెంచినాను దండ్రి!
యెంతదయ లేవు కానన మేగె నన్న
యని గణించితి నా హేతు వంది కాదు

ఉ. తాఁ బెదతల్లి నొంచిన విధంబున నీవును నొంచినావొ యీ
జీబులుకొన్న సంఘటనచేసిన చేఁత లనూహ్యమయ్యెఁ దం
డ్రీ! బధిరుండలెన్ నిలిచె దేటికిఁ బూర్వపుఁబ్రేమ పోయె నే
నే బయకారి కాన యిది యెంతయు నిక్కము నమ్మవే ప్రభూ!

క. విన్నఁడిగినా నటంచును
మన్ననగాఁ జెప్ప మునియె మా తాత! యిదిన్
విన్నావో! యాంఁయున మా
టన్న న్నీ కోడఁసాధు లవి యేమయ్యెన్

శా. పాపం బేమనఁజెప్పుఁ దండ్రి సుగుణావస్థాగతుండైనచో
నా పై పెమ్పునఁ దూలుచేఁ గొలసిన్ గ్లేశన్ గళింబంగు ని
ల్లే పోయాంగను సేమి కర్మఫలమో హా నైన లేసే ఫరా
నేపథ్యాభినవార్థిరాముఁడును లేనేలేఁడు శ్రీరాముఁడున్

మ. మహనీయంబులు ప్రాణగుప్తములు పేర్మిస్థానముల్ రెండు నా
కహహా! రెండుకాంచు బోయి కానసములా దల్లాడు నీ రెండు నీ
విహలోకంబును దాఁటిపోయితివి తండ్రీ! వప్రఖేయోగ్రదు
గ్గ్రిహమా దుర్గము శత్రుసైనికుల ఖడ్గవ్యత్యయం బైనటుల్

క. వచ్చెదను దండ్రి యొడిలో
మచ్చిక నిదురింతు నంచు మది నెంచిన నా
హెచ్చరిక తలఁపులన్నియు
ముచ్చిగఁబోయినవి యడవిమూలల యందున్

మ. ఒకనాఁ డా రఘురామమూర్తి ననుఁ బ్రేమోద్గారినేత్రాంశుసే
చకుఁడై యిట్లనెఁ దమ్ముఁడా! ధరణిరాజ్యం బెల్ల నీవేలు మూ
రక నే నుండును నామమాత్రముగ నోరా! నీవు సాకేతకౌ
తుకమై పోతివి తాతగారి గృహమున్ నిత్యవాసంబుగన్

ఉ. తమ్ములమీఁద నా దొరకుఁ దాఁగొను నచ్చపుఁబ్రేమతోడి వా
క్యమ్ముల నిల్లు పట్టునని యర్థ మెఱుంగఁగలేన మైత్రి నన్
గ్రమ్మినయట్టి మందమతిఁగాని యథార్థవచస్కు నాని వా
క్యమ్ముల నాభిముఖ్యముగనై చనుదెంచు మహార్థసంతతుల్

చ. అని విలపించు రాజసుతు నంత వశిష్ఠులు చూచి యోయి నా
యన! గతమెల్ల యర్థమును నంకున ఖిన్నులుకారు పండితుల్
కనుగొను ప్రేతకర్మవిముఖంబుగ నుండెన యిన్నినాళ్ళ నీ
వనలశిఖాపరీతసుకృతార్థ్యము చేయుము తండ్రిగారికిన్ ౪౭౭

వ. అనిన భరతుండును శత్రుఘ్నుండును చీరకాంగులఁ గన్నీళ్లొత్తుచు
కొంచు స్నాతులై వచ్చి ఋత్విక్పురోహితాచార్యకృతానేక కర్మ
కలాపంబుల విచ్ఛిన్నాగ్నిహోత్రశాంతులును యాయజూకుండైన
రాజు నంత్యకర్మకు విహితంబులైన యనేకక్లిష్టకర్మలును గావించి
రాజకళేబరంబు శిబికారూఢంబు చేసిన

క. పదినాళ్లుగ లోలోపల
నుదుముకొనిన శోకరావ మది పొంగి వియత్
పదమెల్ల నిండి పురమున
సదనసమాజమ్మయ్యెన్ విక్లిష్టమై హృదయంబున్

సీ. ఇన్నాళ్ళుగాఁ దలకు స్నానమె రాయక
సన్నగిల్లిన శిరోజముల తుదలు
మొగములపై వ్రాల ముంజేతులం దోయి
లించి మోముల నావరించు హస్త
యుగ్మంబులన్ రాజు నువిదలు మూఁడునం
దలమేఁ బడఁగ్రుంకు విహ్వలత బిట్టు
రోదింప భరతుండు స్రుక్కి వారికిఁ దోయి
లించి రోదనంబు నివారించి పట్ట
మహిషిని సుమిత్రనం బట్టి యోర్చి
వేఱు లక్షలుగాఁగను వెంటవచ్చు
పౌరసంతతిని సంతతఁ జేర నాయు
వునను దత్తైకభూమియందు

గీ. చనిన భూమీశదహనసంస్కార నిత్య
కర్మలైనపిన్ నాపు సక్కట! యయోధ్య
యిపుడు నాక్రమించి చల్లిన మొడలఁ దాఁచు
కదలికంబోలె దుఃఖనిష్కంపమయ్యె

చ. ఇటియును నిత్యకర్మ ఘటియించి దినంబును నన్నదమ్ములి
ద్దఱు జనుదేర నిండ్లకు విచారితమానస రాజలతాంగి యూ
తెఱలి విశాలరోదనము దెప్పరమై చన నిల్చి యున్న యి
ద్దఱు నిలువన్న యట్లె నిరతస్రుతిబాష్పదృగంతులై చనన్

చ. ననయుచు నట్లనే పదిదినంబులు చేసి దశాహకర్మ శా
స్త్రవిధిగ సల్పి యంత కృతశౌచుఁడు సల్పెను శ్రాద్ధకర్మలన్
సవమణులున్ ధనంబులు ననంతములై చను నాలనుండలున్
గొనకొనియిచ్చె బ్రాహ్మణులకున్ మృదువాససముల్ మహార్ఘ్యముల్

గీ. అంతఁ బదుమూఁడవ దినంబునందు సంచ
యనము సేయుచు భరతుఁడు నశ్రుతముఖు
వేగతాడితుఁడై చితావిద్ధభస్మ
మూలమునఁ బడి బూదియఁ బూసికొంచు ౪౫

ఉ. అవురుమంచుఁ దండ్రి! యిదియా పోషించితి నన్ను రామచం
ద్రాన్వితమఃఖవేగ విగతాసువవై వెలివెట్టినావు న
న్నావల నేమిచేసితివయా! జగదీశ్వరిఁ బెద్దతల్లి నో
హో విభు! పక్షపాత మిది యొప్పునె జ్యేష్ఠకుమారునం దిఁటల్

శా. పోనేపో నిక నే నయోధ్యకు నవీభూముల్ మఱల్లే చనం
గానా నాకును నవ్విపోయెదరుగా కా మూఁక సాకేతదే
శానేకాకృతు లేమిచేసితి వయా యన్నన్న నా గుండెలో
నానాధారము కత్తిఁ గ్రొన్విలితి దుగంత క్లేశసంబాధిగా

క. ఓ నా నయ్యా! తండ్రి
యే నెలయుం దిరుగకుండ నేనో నాకై
నానాభక్ష్యమ్ములు భూ
షానిధు లంపెదవు తాతసదనంబులకున్

క. ఆ యంతపేమ యేమై
పోయిన దే నింక బ్రమకఁబోవను దండ్రీ!
వే యగ్నిలోనఁ జొచ్చెద
మాయురె నా యంతరాగ్ని మండించదయేన్

మ. హిమవత్పర్వతమంత ధైర్య మది నా హృద్వీధి మున్నుండె ధా
త్రిమహీశానుఁడు నాకు తండ్రి కలఁ డెంతే నంచు నా యెల్ల ధై
ర్యము నయ్యగ్ని శ్మశానభస్మ మయి నా యం దింతగా భీతి స
ర్గము దుర్భేద్యతి నాక్రమించినది యయ్యా! యింక నేమౌదునో?

చ. రఘుపుల వంగసంబునను రాలిన దియ్యది తోఁకచుక్క యి
ద్ది ఘృతము కైక యీశిఖమతికి మతిత్రోవల గుంటనక్క యీ
యఘమతి దీనిమోము జ్వలితాగ్నిని మాడినపెంకుముక్క తా
మఘ జనియించి పుట్టఁబడి మాయను దీనితలంపు లన్నియుఁ

క. మా యంతిపురము పట్టిన
దీ యెనుఁబోతైన చీడ యీ ఢాకిని కై
కేయింబడివచ్చిన నాఁ
డే యెఱుఁగుదు మేదొ కొంప కెత్తు నటంచుఁ

మ. అనుకొన్నంతయుఁ జేసె బట్టుకొనుఁడా యంచుఁ మహాగ్రజుం
ధనముం గైకొని దానిఁగట్టి మతిసుపంబైన కోపాగ్ని యె
ల్లను గుబ్జాగతదర్శనంబునను జ్వాలల్ రేగ శత్రుఘ్నుఁ డుం
డిన యచ్చోటికి నప్పగించిరి వరాటీబద్ధనుఁ మంథరఁ

క. ప్రభు! సర్వపాపకర్మ
ప్రభవం బిది దీనిచేత రాఘవు లిట్లె
రభయతఁ జరించునే దుం
దుభివలె నై దీని గ్రుద్దు తోడఁగనలయుఁ

మ. అన శత్రుఘ్నుఁడు శోకకర్శితుఁడు నేత్రాంతంబు తీక్ష్ణంబుగా
వన మేగఁ బ్రభు వైన స్వామి పితి దుర్వారుండు నిట్లయ్యె శా
కిని నంతఃపురిఁగొంచు రండిదె పతంగిఁ యోగ్యశిక్షాపథం
బునకుం దెచ్చెద నంచుఁబోయెను జనంబుల్ మంథరంగొంచురాఁ

క. అరదము తోలింపకయే
భరతుఁడు నిలఁబడియెఁ గుబ్జ బహురోదనదు
ర్ధరవార్యుక దర్శనని
ర్భరశమున వింటఁ జెద్దగద్ది యొనర్చెఁ

శా. ఆ నగ్గోలున కెల్ల గుంపులుగనై యంతఃపురీసర్వకాం
తాగుచ్ఛంబులు చేరఁ గేకయపురీతఃప్రా ప్తకుబ్జాసఖుల్
వేగక్లిన్నముఖాంతలై యఱచుచుఁ విక్రాంతితో వచ్చి యీ
యాగం బెంతయు బాగుగాఁగలద కట్టా! కుబ్జ యె ట్లయ్యెనో!

సీ. సాము మట్టాగుమ్మ సడగయుఁ బగయటన్న
సామెతగ నుండె నేడు కుబ్జావధంబు
చేపు మా మొల్లరియు మృగయావధంబు
నంచు నానావిధంబుల నాడుచుండ

శా. తా శత్రుఘ్నుఁడు రక్తనేత్రములఁ గాంతాపాళి వీక్షింప నా
క్రోశం బొప్పఁగ వారు మాను గతిలేరో మొవ్వ నీ కోటలో
రాశీభూతకృపాత్మ కోసలసుతాప్రాలంబనుం గాంతు మం
చాశంసుల్ చని కంతఁ గోసరినవాఁడై తాను శత్రుఘ్నుఁడున్

ఉ. మంథర జుట్టుపట్టుకొని త్రొక్కసలి నీడ్చుచుఁ బోవుచుండఁగా
మంథర కాళ్ళఁజేతులను మట్టసి యందిన సర్వవస్తువుల్
బంధురరీతిఁ ద్రోయుచును బగ్గముపాడుగఁ జేయుచుం జనున్
సింధురసత్వు దారి విరఁజిమ్మెన ముక్కలుగాఁగ నన్నియున్

మ. సగ లెల్లన్ నుసికాఁగ చీర చిరుగన్ నద్ధంబుగా దేహమున్
సిగలో వెండ్రుక లూడిరాఁ బరిగతస్వేదంబు త్రొమ్మె యెల్లఁ దీ
ర్పుగనై కాలువ కట్ట నీడ్వఁబడి నుర్వ్యాల్ గ్రక్కునా దాసి బి
ట్టుగఁ గై కేయిపురోధరిత్రిఁబడ నెట్టుంబొంది నిశ్చేష్టగాన్

చ. పెరికిన వాలుచేతఁగొని పెల్లగిలంబడు నీసు తెట్టుగా
భరతునితమ్ముఁ డిట్లనియె బమ్మెరవోయెద వేల చూడు నీ
గురుతెపుటల్లి కన్ మొకట్టుఁ దోఁచిన దాగపుటుండ గొంతుక
త్రైన యిడెదన్ నూఁడ్డముగఁ దె మ్మెనరో కనుగొందు నిచ్చటన్

గీ. పాలు త్రావెదవా? లేక పత్తిగిత్తు
లం దినెదవా యటన్న శాంతిం దగి ప్రశి
దానికిఁ దలూఁచు రాము డఁ గాను నేను
సాఁగ రామాజ్ఞ గట్టు లక్ష్మణుఁడఁ గాను

చ. భరతుఁడఁగాను ధీసహజబంధురశాంతిసమేతుఁడన్ మిమున్
దరిగెదఁ గత్తివాడర నుదారమనస్సకలాధ్యు రాముని
దిరిగి యయోధ్యవీథులకుఁ దెమ్ము; సుఖంబుగఁ గూరుచుండియు
ద్వార సకలంబు భోజనపరంపర చేయఁగ నెంచుచుంటివో. ౨౦౦

క. అయ్యో! సాకేతమునం
దొయ్యనఁ దుఃఖాపరాభవోల్బణవార్తల్
ముయ్యేఱులు గావించును
దియ్యపడిరి జనులును గసితీరిఁ యట్లై

శా. భూమీనాథుని కీకసంబులు వియత్పూతాంబులం జేరెనో
హోమో! వేలుపువీట దుందుభిరవం బేపార నానాప్సరో
గ్రామానేకవిమాత్ననాట్యసుపరీక్షాసత్సభాధ్యక్షుఁడై
భూమీనాథుఁడు పొల్చెఁ గోసలము లాపస్ఫంబుచ్చె నొక్కింతగా

క. అంతంత నెలయుఁ గడచెను
వంత కరుగగా నయోధ్య పౌరులు నిద్రా
శాంతింగని రా నాటికి
శాంతమతియు భరతునందుఁ జను ప్రత్యయమై

**ఖ ం డా ం త ము**

గీ. ఇద్ది మునిశాపఖండ మాంహితసమస్త
జంతుతతికర్మపరిపాకసార్వభౌమ!
సత్యకవి నక్త ముక్త్యాలస్వామి శోభిత
నేత వీవెల్ల చైతన్యనిభృతకళకు

చ. తెలిసిన మగాథులంచు జగతిం గలరే కద వారిలోన ను
జ్జ్వలతరుఁడేను జంతుతతి జన్మలు భ్రాంతులు చావు లన్నియుం
దెలిసియు బిట్టుచీఁకటుల తెన్నున బొప్పెలు కట్టుచుండె నీ
వెలుతుకులోనికిం గొనుచు వెళ్ళవె మాళిశశాంకరోచిషా!

మా లి

తృప్తశైలదుహితృప్రియా! ధీ
సుప్తసంవిదతిశుద్ధతత్త్వా
దీప్తతైజసనదీప్రియా! వి
క్లిప్తభావవిమలీకృతతత్త్వా! ౫౨౩



# ప్రథమ ఖండము

క. శ్రీవిశ్వేశ్వర! దుఃఖిత
భావసముద్గతవిరాగభావైకతనూ!
కైవల్యవిఘటితజనూ!
నీవారశ్లక్ష్ణశూకనిభృతశితతనూ!

సీ. ప్రాగ్దిశామృతసరోవారి మునిగిన వేల్పు
ధేను కొమ్ములు పైకి నెత్తె ననఁగ
మాంతరపింగళుల్ మార్తాండ పారిపా
ర్శ్వకులు బెత్తంబులు పట్టి రనఁగ
నిశలఁబై కొను నిశాకరుసేన యర్ధచం
ద్రవ్యూహమునఁ దీర్చి నడచు ననఁగఁ
దుదిదాఁకఁ బండిన పొదరేయి గేదంగి
పూ ప్రక్కరేకలు పొడిచె ననఁగ
నగలిచెను సూర్యనారాయణోల్బణమున
చనమ యామినీ మంటప స్తంభ మిల్లె
రెండునాఁ జీలె నన నుషోరేఖ లొక్క
రెండు లవలీలతాగ్రిమశ్రీ వహించె

సీ. తూర్పుఁ బెండ్లికూఁతురుకు నల్లెవాఁడు దీ
ర్చిన మధుపర్కంబు చెంగు లనఁగ
చేతికిఁ బై జేర్చుచేయుగాఁ బ్రాక్కాంత
బుజము లూనిన కరాంబుజము లనఁగ
తృష్ణామందేహాగ్రిదంష్ట్ర లూర్ధ్వప్ర
సారమ్ముగాఁ బైకి సాగె ననఁగ
గములబంధుచ్ఛవి కామధేనువిషాణ
యుగ మంధకారంబు నూఁటు ననఁగ
భ్రాజ పటర పతంగాది భాస్కరులయు
బారిషదులును గూర్చున్న పంక్తి చిత్ర
మన నుషోరేఖ లొక్కరెం డాకసమున
నభయహస్తంబు లెత్తిన యట్లు పొలిచె

సీ. ఆగ్నేయ కౌబేర మౌను దిశల్ ప్రాప్తిన
మేఘవాహను పొలిమేరగీత
లబ్జినీయౌవన ప్రారంభసమున ప్రా
మోహన శ్రీ ప్రేమముగ్ధరేఖ
లాదిత్యయుగ్మసూర్ధాగ్రభాగోచ్చల
త్సితచామరప్రభాచ్ఛిన్నవీథు
లలయు కళ్యాంతీనుడగు సూర్యదేవుని
తీక్ష్ణకనీనికాదీప్తికుల్య
లనగ నుదయాచలాగ్రనిర్వ్యదీప్తరేఖ
లాకసము మూఁడు భాగమ్ములైన యట్లు
చీల్చి పొలపరు లట్లు వెంచేసె నింటఁ
బ్రిభువుమార్గంబునను సుష్టుపటము నట్లు

చ. మనసులనుండి మెల్ల ననుమానము సర్వము జాఱిపోయి మో
హానచరణుండుగా భరతుఁ డన్నను నిష్టముకల్గి పౌరు లా
తని ధరణీంద్రుఁ డౌటకు నెనల్ మురియుంచుక రాజవాక్యపా
లనమునుగూడ కారణబలంబుగ నట్లె మనస్కరించుచున్

ఉ. అంతట రాజకర్తలును నా పమనాల్గవనాఁటి ప్రొద్దునన్
బంతున నాభిషేచనిక వస్తువులం గొని రాజకార్యవ
త్తాంతవిదుల్ వెసన్ భరతు నంమున భక్తివినమ్రము నొంచఁ జా
మంతట సంతసన్ ద్రుతకృతాంజలు లిట్లనఁజొచ్చి రున్నతిన్

శా. మా కెల్లం బరికాఁడుగా దశరథ క్ష్మాజాని భూమిప్రజా
నేకం బన్న మదద్విపంబు నడపెన్ నిత్యంబు సేనాధియై
మా కాల్బంటుల వేల్పు సేనవలెన్ మన్నించె నా స్వామి దు
ర్ధీకంబై చను దైవకృత్యమునఁ జేరెన్ స్వర్గలోకంబులన్

ఉ. ఆ నరపాలమౌళి సుకృతాత్మ మనోధృతి సత్యపాలనా
నూనవిధాపరిక్రముఁ డనుష్ఠవుఁ డీ సకలప్రజాలికిన్
వానిని గోలుపోయితిమి పార్థివలోకనియంత దత్సమా
ధానము నీ ధరావహనధర్మము కర్మదమార్గమర్మమై ౮

చ. ఒక నెలనాళ్ళుగా సకల మూర్వ్వి యరాజకమై వశిష్ఠమౌ
సికి బరువయ్యె మంత్రులును నెవ్వడిఁ బట్టను లేరు నీవు మా
మకము నభీప్సితంబు మతి మన్నన చేయుము మీరు రాఘవుల్
సకలధరావలాహకనిసర్గ నివస్వతిమూర్తు లెంతయుఁ

సీ. అ తండ్రిపైఁ బ్రేమ యేతాదృశంబు నీ
యందున్న గతి వేఱొకందు లేద
యా యన్నపై భక్తి నీయందు నెగడిన
గీతి యన్యమనోజ్ఞనీతి కాద
యా ధర్మవైఖరి సాధువై నీగుండె
హత్తినయది యచ్చక్రోత్తపణితి
యా రాఘవుల నీతి సారధారావాహి
నీరూపముంగట్టి నీకు నెడఁద

గమ్ము దయ సేయుమయ్య! ధరాపరిజాళి
పడనవలె రేవునంగట్టబడియె రమ్ము
నీవు చుక్కానిఁబూనుము నిఖలమంత్రి
జన మరిత్రంబులై పోతమును నడుపఁగ

సీ. తాతతండ్రులనాటిధాత్రి నీ చెప్పిన
యట్లుగా మసలు రవ్వంత తొలఁగ
దిక్ష్వాకులకుఁ గృత మొప్పఁగా యచ్చొత్తి
నుండి మచ్చికపడ్డ యుర్వి చెక్క
కిటకిటలాడి పోవుటయయ్యె గడియను
మున్న శ్రీరాఘవభూమిపాల
పరిషన్మహామంటపంబు; లేవయ్య య
రుంధతీప్రాణేశరూపితావ

నీమహాపాలక! దశరథత్మ్మ మహేశ
తేజమా! పూతజలములు తెచ్చి సిద్ధ
ఘటము లుంచిరి చిత్రశిఖండిలోక
మరుగుదెమ్ము మందప్రచారాభిగమన!

జతనపఱచినయట్టులఁ జనునుగాదె
యీ మహారాజ మెల్లను నేను నేని
యనిన నా రాజనందను డుద్యత్క-రాబ్జ
యుగఁ మోవాఁకుడై కన్ను లూడిపడఁగ

క. నీ వాక్యంపువు ప్రజా
భావమహాసాగరంబు పట్టినలోఁతుల్
భావంబున నెఱిఁగిన మే
ధావంతుఁడ నందు సమ్మోదంబునఁ బలుకన్

చ. భరతుఁడు నన్ను యీవృశము భావము లోపలనుంచి ధారుణీ
వరుఁడవు గమ్మటంచు ననుఁ బల్కితి రీ వెడమాట పొందు నాన్
విరవిరఁబోయి వారు రఘువీరుఁడు చెప్పినయట్లు యాత్రకున్
దెరువును దీర్చు శిల్పకుల దేశములం జని యాజ్ఞ పెట్టినన్

ఉ. తొమ్మిదివేల యేనుఁగులతోడి చతురాగమనాభి యోగ్యవ
ర్త్మసుమ్మనుగాఁగ శిల్పులు ముఖంబున వెంటనె చేయఁజొచ్చి గే
హమ్ములు కూపముల్ నదులయందున నావలున్ ఘటించి మా
ర్గమ్మున నెల్లనుం జమనుగా ఘటియించిరి సేనపోకకున్

గీ. అంత మఱునాఁడు సౌఖశాయనికు లరుఁగు
దెంచి భరతుని నిట్లు స్తుతించినారు
కోటమొగసాల కోడిమె నుద్ఘుష్టమైన
భేరికాశంఖరావముల్ బోరుకొనఁగ

సీ. మీ రాఘవుల మహోదారశౌర్యచ్ఛట
జిష్ణుని రాజ్యలక్ష్మిపతాక
తనువుగా నిద్రపట్టినదా మహాప్రభూ!
లలితసుఖస్వప్నములును గనిర!
మీ ధరానాథుల మేలియూహాలు సురా
రామకామగవీ ధురావహములు
ప్రభు ! నిద్ర—యన్నంత భరతుండు మేల్కని
యీ యప్రశస్తకార్యేచ్ఛ మా[illegible]

మ. ఇదిగో చేతులు దోయిలింతు వనిఁ దానె చొచ్చెద నన్నాఁడు రా
ఘవుఁ డాస్వామిపదాంబుజాగ్రణముగాఁ గైకొందు నన్నుం గృపా
ధవుఁడా రాముని బాసి నన్నుఁ బరిపత్సర్వప్రజల్ మేలు మే
లవు నన్నట్టి ప్రశంసవాక్యములు సర్వాంభోదగర్జం జనెన్

క. అవునోయి! బిడ్డ! మిక్కిలి
యవునోయి యటంచు వృద్ధ లాడెడు నట్టే
సచ్చిదానందకదుష్ణాం
బువులై యుద్ధావచోనిముగ్ధులు గాఁగన్

చ. మఱల వచించె నిట్లు రఘునందనుఁ డాసయుమాసి యార్తికిన్
దిరుగఁగ దెత్తు నాపనియు చెప్పనిమైనను నేను గానని
దిరానిద రాముతోడ గుణుతించవుడో నన్నును దిక్కుమాలి బలెన్
బోరిపోరి మార్గశోధనముల బుచ్చితి నింతనుమునే యాదటన్

శా. సర్వాయోధ్యయుఁ గోపమన్నది దిదృక్షాతీవ్రమై నాయెడన్
బర్వెన్ శ్రీరఘురామునూహా పిత్రుతః ప్రస్తంబు దుఃఖంబునుం
బర్వెం దుర్జ్వలనక్తి నన్నుఁ గనినం బాయున్ మహాశోకమ్ముటం బో
దర్వాచీనమునుండు నన్నుఁ గన కేలా నిల్చు నాప్రాణముల్

క. ఓ యయ్య సుమంత్రా! మఱి
సాయంపము మింత స్వసాకేతమునం
దీయాత్ర తెలియఁజేయుము
యీ యుషసున బయలుదేరు కీ వే చరమా!

చ. అనిన సభాసదుల్ మగిడి రందఱు నిండ్లకుఁ దా సుమంత్రుఁడుం
జని భరతానుశాసనము చాటెను నింత మొగంబులై జనుల్
కనుకని నేను జెప్పితిని గాదట కైకయిబిడ్డ రాముచం
ద్రునిఁ గొనితెమ్మనం చనుచుఁ దూలిరి పట్టరాని మోదమై

వ. అంతఁ బ్రయాణసన్నాహమైన యా యూరున వీరపత్నులు భర్తృ
కవచఖడ్గంబులకుఁ బలిపూపుపెట్టుచు, సారథులు పాథేయంబులు
మూటగట్టుకొంచు బ్రాహ్మణు లగ్నికుండంబులందుఁ బదిదినములకు
బిడుకలుపెట్టి యొముంకతో బూదితోఁ గప్పుచు జనంబులెల్లఁ బని
నాళ్ళ ప్రయాణంబునకు నలసిన యుడుపులు భద్రంబు చేయుచు

నెందుఁజూచినఁ దా మూయ త్రొపడుచుఁ గాళ్లకుఁ జేతుల కడ్డమ్ముగ
వచ్చెడు బాలబాలికలఁ గోపించి తోలుదొబ్బువారు తమ కది
యందియనే గి యందియలేదని భాగవతులను గేకలువేసి బుజ్జగించు
వారు నొకనస్తుపు దీయఁబోయి నుజీయొకండుఁ గొనువారునై

చ. నిముసములో నయోధ్యయు వసిగసానంబున సిద్ధముగ్యా ను
త్తమహయయుక్తమైన యనదంబులు వేలను వేలు పట్టలే
దమరనరూధినీచయముననట్టుల మిన్నున వైజయంతికా
విమలనవచ్ఛటల్ విరిసె వెన్నుల పినిన యిట్టునపైమై

ఉ. అంతిపురంబులో భరతుఁ డందఱ నమ్మని నొక్కరొక్కరుక
సంతస మెంతో లో నిముడఁజాలక యారక మాటలాడుచుక
నంతులుపోయి సిద్ధపడు వైఖరి నెవ్వరికంటె మున్నుగాఁ
జింతితనస్త్రజాలములు చేర్చుచు ముంగిట నిల్పుచుండఁగా

చ. నుజీయును వేగపెట్టుచు సుమంత్రుని తెచ్చినబండి నెక్కఁగా
భరతుఁడుఁ దమ్ముఁడుక్ వెనుక బండిని దల్లులు ముగ్గు రెక్కరా
దరమున శ్రీవశిష్ఠులు రథంబును భార్యముతనందుఁ జోఁపగా
జరిగె రథాళి వెంటఁబడి సైన్యము వచ్చె మహార్ణవాభమై

గీ. ఆ కదలిపోవు సైన్యంబునందు లక్ష
గుఱ్ఱములు పదివేల యేనుగులును రథము
లన్నియును వే లయోధ్యలో నచటఁ బిట్ట
పిసుకలట్లుగ జనమెల్ల వెగిలి వచ్చె

వ. బ్రాహ్మణక్షత్రియవైశ్యులు సగసాలులు కుమ్మరులు సాలెవాండ్రు
కత్తులు సేయువారు ముచ్చెవాండ్రు అంపపుకోఁతవాండ్రురోచకులు
వేధకులు దంతకారులు సున్నపుఁ బనివాండ్రు గంధద్రవ్యంబు
లమ్మువాండ్రు సువర్ణకారులు కంబళ్ళు సేయువారు సంవాహకులు
వెజ్జులు చాకలును కుట్టుపనివాండ్రు పల్లీజీవనులు గొల్లవాండ్రు
నాట్యవృత్తిచేత జీవించువారు పల్లెవాండ్రు నెడ్లబండ్లమీఁదను
రథమ్ములమీఁదను నెక్కి యయోధ్య యయోధ్యయంతయు భర
తుని వెంబడించిన నందఱును మందమందప్రయాణంబుల శృంగిబేర
పురసమీపగంగానదిం దరిసిరి ౹౹౧౦

చ. భరతుఁడు మంత్రులంగని విభావరి యిచ్చటఁ బుచ్చి యందఱున్
గరిసెన మందినాఁడు నడకన్ మన సైన్యములెల్ల గంగకి
ద్దరితట మాక్రమించి సమతన్ శిబిరంబులు తీర్పఁజేయుఁడా
దగమున రేపు దాఁటుద ముదాగసుపర్వజగత్తరంగిణిన్

క. ఇటఁ దండ్రి కౌర్ధ్వదైహిక
పటుకర్మలు సేయుదుము సుపర్వాంభోని
ష్కుటతటణాయత్నమునఁ జూ
మట తగు మీరెల్ల మును సుహోవేళబడిన్

చ. అని శిబిరంబు లేర్పఱిచి యామినిలోన్ విడియంగ సాగరం
బనఁ బెనునేలఁ గ్రమ్ముకొని యశ్వగజాదుల రావఘోషమై
చనిన చమూవిడంబనము సర్వముఁ జూచి నిషాదరాజు లో
నన నొక సందియం బొదవినన్ దన పెగ్గడలందుఁ జూపుచున్

శా. దుయ్యంబట్టిన యుట్టు గాంచనపుఁ జెట్టుం డెక్కెనో మాత్సం
బయ్యారే! భరతుండు కావలయు సైన్యం బింత యేలయ్యె నా
యయ్యన్ రాముని జాలదా? వనికిఁ దానంపించెఁ బో యింతన
డయ్యం జేయఁగ దండయాత్రఁ బడెఁ గాఁడా! చూత మా సర్వమున్

ఉ. కైకొని తల్లి నా ప్రభుని కాననవీథికిఁ బోవఁ బంపె ని
దాఁకను నూగలేఁడను బృందాపువు తా నరుదెంచి రాముని
జేకొనవచ్చెనేమొ గుహుఁ డిచ్చ మెఱుంగఁడు గంగదాఁటి యా
దా కమలాక్షు రాఘవుని దా స్పృశియింపగలండు దండిమై

ఉ. ఈతఁడు గంగదాఁటుటయు నేఁ గనుగొందును గాని మున్న ద
చ్చేత మెఱింగిరావలయుఁ జెట్టతలంపున వచ్చెనేనియున్
నీతసము స్తసేనకు ధ్వనింబడిఁ బెట్టెద నీపాటిపాఁతరల్
గోతులు త్రవ్వకుండ, ననుకూలత వచ్చెనయేని మంచిదే

క. ఆటునిటుఁ బది యోజనముల
తటముల గల పడవలెల్లఁ దండంబులుగా
నిటుచేర్చి పగులఁగొట్టెదు
విటలాటంబుగను నేను బెట్టినయాజ్ఞన్ ౪౨

చ. అన గుహుఁ డా రఘూద్వహుని యందున వార్తను వింత పేశలోఁ
జనెదరు మీరు మీ రెటుఁగఁ జాలరొ బద్ధజటావిటాలురా
మునిఁ గన వింతసేనయును బోవలెనా! వలెనేని నేను జె
ప్పను వలెనా? భయపడియు పల్కకురే జనులైన వార్తలన్

ఉ. నాఁటిని మంత్రి చిన్నగవ్వున భరతుంగన వచ్చినావు నా
భూవిభుతమ్ముని గనఁగఁబోదువు రమ్మన దాశరాజు చిం
తావశుఁడై ధరాపతికిఁ దమ్ముఁడొ! తానవఁడా ధరేశుఁడా
భూవిభుఁడేమొ కానలకుఁ బోయెన; యీయన వేనితమ్ముఁడో?

ఉ. మఱియును నాగమండపన సుమంత్రుడు లోనికిఁబోయి కాంచుచుం
భరతుని దాశరా జిటకు వచ్చెను లోనికిఁదెత్తునా యనం
భరతుఁడు తానుగా వెలికి వచ్చి గుహుంగని యోయి రామసం
ద్రరసితబుద్ధి! నీకొఱకె! రా! మఱి రమ్మటఁ గూరుచుండుమీ

మ. అన నాసీనత గాంచుచుం గుహుఁడు తా నర్పించి యాయాయుపా
యనముల్ రాజన్య నీవు నీసకల మిందై యుండఁగా వచ్చె నీ
నవిజాతంబఖిలంబు కాయలును కుంపల్ మాంసముల్ మత్స్యముల్
గొనితెత్తున్ భుజియింపుఁడీ యనని మీకున్ సొంతయిల్లే సుడీ

గీ. రేయి యిందుఁగడపి రేపు పోనున్నను
మీ సమస్తమును మేలొ? యన్న
భరతుఁ డనియె వింతపాటి సైన్యంబున
కెట్టు నీవు సుఖము నేర్పరింతు?

శా. నే నెల్లప్పుడు తాతగారి గృహమందే యుంటి నీతోడి మై
త్రిని శ్రేణిక కట్టఁ దండ్రియును భ్రాతృజ్యేష్ఠుఁడున్ నీకు నం
తే నేస్తంబులు నిన్ను నమ్మికొని కాదే వచ్చితిన్ వేల్పువాఁ
గైనన్ దాఁటఁగ నన్ను దాశపతి యట్లా మంచిదే! తూ ప్రభూ!

క. నా యాతిథ్యముఁ గొని యీ
రేయి [illegible] దద్ది రేపటికథ కా
దాయన్న భరతుఁ డల్లే
నీ యాతి[illegible] నే స్వామి[illegible] లేదే!

చ. అనిన సుమంత్రుఁడుఁ గుహుని కయ్యెను సందియ మొందు రామభ
ద్రుని గన నింత సేయును చోఁ గొని పోవలెనా యటంచు నదే
మనసును విప్పి పల్కెడన మంత్రి ముగంబును జూచి శైకయీ
తోఁగయుఁ గను తాత! యెల్లరి మొదల్ తొలి నిట్టులె యాట నేలొకో?

ఆ. అమ్మ మొదలు గుహుని యందాఁక భరతుని
నెఱిఁగి కూడ నేలొ తెలియఁగలేరు
సర్వజనుల హృదయసాగసంబులు రాజ్య
వాంఛ మీఁది బలము పట్టికొనిరొ

క. మది ధర్మయుక్తమైనను
మదిలో రాజ్యానుగతసమంచితమహిమం
బది మహిమ మన్న భావము
పొదలున్ వెలకట్టు మందురో! యా కొలఁదిన్

ఉ. లాగదు నన్నలంతియొ వలంతియొ రాజపుటన్న భావము
ద్వేగము లేక నా యెడఁదఁ బ్రజ్వలింపుచుటయున్న రాజ్యలో
భాగతికిన్ మనస్సునను ద్వారము లేదు మతేమి సేతు మే
ధాగురుపైన రాముని పదాబ్జమె యుండిన యీ మనస్సులో

వ. అని గుహుని వంకఁ దిరిగి

ఉ. నన్నును వేఱుగాఁ దలఁచినన్ మది నిమ్మన లేదు కోపమున్
నిన్న గుణించి, మెచ్చుటను నిల్పిన నొచ్చుటఁ జూచినన్ సరే
యన్నయెటన్న నింత ప్రియమాటను నిక్కము నాదులోన నే
నున్నది నేనకానయితినోయి తరించితి మీ మనస్సులన్

క. ఆ మేలికఁ దెచ్చుటకై
పోయెద నీ సేవకోడఁబో! నీవును రా!
నా నెడఁ గోపలి భక్తి క
టా! యానన మందుఁ దోఁచదా! యది నాకున్

చ. అపునవు రాచవారి మొగమందునఁ గోపము పేరిమ భక్తిము
న్నవు నెదలో విభావములు నాటవు రేఖలటన్న దాశరా
జవినయమయ్యెనంచు బిడియంపడి నిక్కము సామి! సామి! పం
డవుసుమి నీకుఁ బోలిక నడెందలు మాయని కచ్చరంబులై ల

శా. నీ వన్నట్టుగ నాకు రాజ్యములు లేనేలేవు నా రాజ్యపుం
భావంబంతయు నుద్దయా సకల దస్వా! త్రెంచుకోలేక యా
భావంబుంబడి నన్ను నాహాలబడిం బర్యాప్తమా గుండె లో
డీ వై దేహము నోనాహుంబడి వనం బేలా చనన్ జెప్పుమా!

ఉ. ఆయన యొంటియుండినను నంద వసింతు నటంచు బోవరా
దా! యిట దాశరాజ్య మొక యల్పము నా కధికప్రియంబుగా
నాయె నటన్నఁ దా భరతుఁ డాతనిఁ గౌఁగిటఁజేర్చి యూఱడిం
తాయుత! నిన్ను నే నెఱుఁగనాయెను బండినబుద్ధిశాలినిన్

చ. అనిన సుమంత్రుఁ డోయి గుహుఁడా! యిదియేటి కబద్ధమాడ? రా
మునిబడిపోక రొప్పుఁడు ప్రభుండని నేను వచింప మానినా
నన; గుహుఁ డూరకే కనుల బాష్పములం గురియంగఁ గైకయీ
తనయుఁడుకూడ దుఃఖచలితంబగు గుండియచేత డస్సినన్

క. నాయేలిక! రాముని కే
నీయెడఁ బొరపాటుపడితి నే నిదె యిపుడే
పోయి సమస్తము తీర్చెద
నా యాతిథ్యంబును బ్రతనకు నని గుహుఁడున్

ఉ. గాఁతిగ గంగయొడ్డున నిలింబడి కూసెను గాంచె గొప్ప సం
కేతము దానిలోఁగలదా గబ్బున నాతలియొడ్డునం బ్రతి
ఘాతకులాత్ములైన గుహులట్లు సమస్తము సర్వఖాద్యముల్
పోతము లెల్ల నింపికొని మోదముగం జనుదెంచి రీతులన్

ఉ. ఆ గుహుఁ డాచరించిన మహాదరవైఖరి యానుకూల్యరే
ఖాగణనంబుగాఁ జమువు గట్టిగ రాముఁడు వచ్చునన్న యూ
హాగతి వానియిచ్చిన పదార్థములం బరితృప్తి పొంది ని
ద్రాగతులైరి దాశపతి తా భరతుంగని యేగె నింటికిన్

చ. శుచికటువైన యే విశృతోదనమో స్నానమో శరీరపుటం
బలికిన గుండె కొట్టుకొని యంగము కంపము పొంగఁ గైకయీ
సుతునకుఁ బాపపుం బలుకు వచ్చినచోఁ జెవియందు బిట్టు దుః
ఖితుఁడగు రేయియెల్ల నుడికెన్ గుహుఁ డందిన సంశయావధున్ ...




సీ. క్రిందుగానుండి పైకిని దూసిపోవుచో
నెమరు రాపిడి గలుగకున్ననియు
నీ పొలుపుతె వచ్చి మొగమునకుం దాఁకుచో
మొగలుయున్నను మొక్క సోఁకుననియు
చలిగాలి కొంగు నాకంబుల నాఁకుచో
నిజవేషలన్ మొలుంగక్కనియు
నడ్డమ్ముగా వచ్చి యాకుల మలయుచో
నిట్టట్టుల నను నెక్కనియు
నైన తన చేత కిరణము లంబుజాప్త
డింగుదీతరుపత్రమ్ము లెగడి కొంగ
దన మహాశక్తిఁ ఘమాత్రప్రయాత్మ
మునను సరిమాముకొన్నట్టి పొలుపు తోప

వ. అంత గుహాంతమునిం గుదీపాదపములు శ్రీరామాయణప్రదేశం
బులు భరతశత్రుఘ్నులకును దదంబాత్రయమునకును జూపించుచు

మ. ఇవి నాతండ్రిపదాంకముల్ నిగమసాహిత్యాధ్వఘట్టంబు లి
య్యవి వైదేహిమనోంబుజాంగజుని సంధ్యానందనార్చాకృతి
ప్రవణంబై చనుచోటు లిచ్చటనె నిండారంగ నా స్వామి రా
ఘనవంశాగ్రణి వీచిశాగదికరాకారాభ్రితారియుక్

క. ఆ రేయికిం దండ్రి పయః
పారాయణ మాచరించి పవళించెన్ సే
వారతి సౌమిత్రి పదాం
భోరుహసంవాహనంబు పొలుపుగఁ జేసెన్

సీ. తల్లికిం దనచేయి తలగడ ప్రభువైన
తనకును దలగడ తల్లి వక్ష
మట్లు నిద్రించి రా యయ్యయు నమ్మను
ష్యవికి వారి సుషుప్తిభంగభీరు
లము నేను మంత్రియు లక్ష్మణుండును దూర
భూమి కేగి రహస్యములుగ బిట్టు
గుసగుసలుగ నాడుకొంచుంటి మారాత్రి
వార లెల్లరు నిరాహారులుగనె

ఉ. ఆ పని తెల్లనున్ భరతుఁ డంబుజనేత్రుని కాననాంతయా
త్రాపతియాళుమానసధురాస్త్రవ మందుచుఁ బెద్దతల్లి చిం
తాపరిదీనయాచనమునన్ గని వాలిన వేళ రాఘవా
లాపముఖుండుగా మోసులం దినె నాలుగు తల్లి పెట్టఁగా

గీ. కంచమందునఁ జేతులు కడిగినంత
తల్లి మెడపను జేతు లావేల్లనమున
వేసి దుఃఖించె మెడపైని వేసినట్టి
చేయి కౌసల్యమెడయందు శీతలముగ

ఉ. భరతుఁడు సంబరంపడిన వచ్చిన యట్టి యయోధ్య నెల్ల సం
బరపడు, లేబరంపడిన వచ్చిన యట్టి యయోధ్య నెల్ల లే
బరపడు, నా సరల్ మఱి విభావరి తద్భగతానుబోధి బం
ధురమతి క్రిందుమీదునయి సూలిరి యేతముతో క్రిక్కిఱిసల్లుగన్

వ. అంత శోక యోగాంతం బగసి కైకేయి భరతునితో నిట్లనియె

ఆ. పరమధర్మతత్త్వపటువు రాముని బుద్ధి
లెక్కసేయఁబోవఁ డొక్కఁడింత
భావమందుఁ గష్టపడునంచు నీ విట్లు
లైనయెడల నతని దేనలేవు

ఉ. అన్నిటి కన్న చెప్పి నిను నంపున యింటికి నీవునున్ వ్యథా
ఖిన్నమనస్కుఁడై యతని కేశవాదముముందు నిల్వలే
నన్నయటన్న బుద్ధి హృదయంబున బాఁచు మతండు రాజు నీ
నన్నను రాజగావు మఱియొక్కఁడు లేకను నీకు రాజ్యమున్

క. ఆ బిగువున నుండినచో
ధీబంధురుఁ డతఁడు కొంత దిగివచ్చును మే
ధాబంహిష్ఠుఁడు రాముఁడు
ప్రాంబలుకులమీఁద నంత పట్టువై నిలుచున్

క. విగ్రద్రోక్కు నింతమాఖము
నెగచి తుదీయాఘుసర్వనిష్కృతి సలుపన్
దగుదు నని యన్నమాటల
మొగమై నిల్వను తొడందఁ శోకము వ్యాయమై [illegible]

గీ. ఉన్నవాఁ డున్నయట్లుగఁ గన్నువిప్పి
భరతుఁడుం దల్లిఁ గాంచి యంబా! యదేమొ
దాఁచితివొ చెప్పితివి సముద్రంబులోఁతు
తెలియరాదు కదా! మాటతీరునందు

క. నీ చెప్పినట్లుచేసెద
ధీచాతురి మఱల నీవు తెల్పింతువా? వ
న్యాచారణు శ్రీరాముని
నీచాతురి కాదె యడవి కేగించినది౯

గీ. తాను కౌసల్య వచ్చెఁ దలోన మఱల
భరతుఁ డాననగతదుఃఖభావరేఖ
విడిలియుండినఁ గౌసల్య యెడఁదలోన
సంతసంపడి చన నా ప్రసక్తి లేక

శా. ధారాతాండవధూర్జటిప్రసృత సంధ్యాదేవి రాగిల్లెఁ ద
ద్ధారారాగము నిర్జరాపగపయి౯ దారాడె గంగాంబయు౯
నీరంబు౯ విసలించె నెంతయు సపత్నీమత్సరత్వంబున౯
దీరంబందలి తమ్మిమోములబడి౯ ధిక్కారముం జూపుచు౯

శా. ఆ రేయెల్లను కైకయీతనయుఁ డూహాపోహమార్గంబుల౯
ధారాభావనగాఁగ రాముని యయోధ్యానీతికి౯ భావనం
దేరీతి౯ మది చిక్కఁబట్టవలెనో యేరీతి వాకొనువా
ప్రారంభంబులఁ దీర్పఁగావలయునో యాలోచనం జేయుచు౯

గీ. అంత మఱునాటి ప్రొద్దున నరుగుదెంచి
గుహుఁడు భరతునిఁగని పిల్చికొని నృపాల!
వచ్చి మీయొడ్డునందు నావలును నైదు
వందలవి సిద్ధముగనుండె బయలుదేరు!

క. మీ యన్నదమ్ములిద్దఱు
మీ యంబాత్రయము నాదు మేలిపడవపైఁ
బోవుదరు స్వస్తికాభిధ
నావోడ శుభంబు మీకు నాణియ మగుత౯

వ. అనిన స్కంధావారం బంతయు సన్నద్ధంబై యొల్లతలతాళ్ళు
పడవలకుఁ గట్టి చేతఁబుచ్చుకొని కూర్చున్నవారు నాలోఁకలు

గీ. మది భరద్వాజముని యాశ్రమం బటంచు
నెఱిఁగి క్రొత్తసేన దూరాన నెల్ల సేన
నుండ నియమించి శ్రీవశిష్ఠుండు భరతుఁ
డల సుమంత్రుండు నాశ్రమ మ్మరిగినారు

గీ. వ్యక్త మఖిలంబు బీజ మైనట్టి దొక్కఁడు
నొక్క డవ్యక్త సకలసుమహోవిధాత
శ్రీవశిష్ఠభరద్వాజు లాన్మృతాద
రామృతాక్షులు మృదుకంపితాంగు లగుచు

శా. ఓయీ! గాలవ! యోగికాశ్యప యుదో! యోగ్యాంబువుల్ వన్యముల్
వే యుండీ! పరమర్షిలోకపవిత్రం జేతెంచె సర్ఘ్యంబు తెం
డీ! యీశానుఁడె వచ్చె నాశ్రమము మీకెల్లన్ మహార్షింగనం
గా యోగ్యావసరంబు వేచికొనుఁడీ! కంచే వశిష్ఠుల్ సుడీ

శా. ఈ ధాత్రిస్థలి రాజవంశములు లేవెన్నన్ని యీ స్వామి తా
సాధిష్ఠంబుగనై పురోధసుఁడు భాస్వద్వంశపుణ్యంబుచే
నేధింపించునుగాక నే విక్రుతి లే దీస్వామి కానందచి
న్నీధీదీపము నిడవాగని మహాదీపంబు తా నామునుల్

ఆ. విధివదర్ఘ్యపాద్యవిభవంబు నెఱపి తో
నైనవాఁడు భరతుఁడు న నెఱిఁగి
వశి ననామయంబు నడుగఁగా భరతుఁడు
వాని యనుగుఁ జేర్చె మస్తకంబు

శా. స్వామీ! మీకృపచేత మీతపసుచే సర్వంబు భద్రంబగున్
మీ మేధ్యాగ్నులు విశ్వవృక్షమృగముల్ మేలేకదా యన్న న
ద్దాముండై ముని యిట్లు వచ్చితివి నీ ధాత్రీసతీపాలనం
బేరింజేసితి రాముఁడైన వనముం దేగన్ గదా! భూమిపా

మ. అడవింబట్టెను రామభద్రుఁడు సమస్తాశాంతమా నేల కీ
వాడయుండైతివి నీకుఁదక్కవటె యేలో వచ్చితీలాగు నా
ల్గడ నీ సేనను దాంధి వచ్చితివె కాంతారస్థుఁడైనట్టి రా
ముఁడు నీపైఁ జనుదెంచునా యతనిపైఁ బోవంగ నెవ్వగల్ గంటి

మ. మఱి నిష్కంటక మంతసేయవలెనో తమ్ముండ యొల్ల, రాముండు చే
కుఱునా! నీకును దల్లి నీతి సులభక్రోడంబు సాకేతముం
బెఱికాటంబుగఁ జేసికోక చమువై పెల్చేర్చి పెల్లోరుచా
కుఱుమట్టంబుగ నీ బలంబునను నా కోదండ వేదండునిన్

శా. దిక్కాలంబులు పట్టనుండఁజన భ్రాతృజ్యేష్ఠుఁ డా యన్న నే
ముక్కాలంబును నంటిపెట్టికొని నేసేవంగఁగాంక్షింతు తా
జిక్కంబోవఁడు నీకుఁజిక్కిన నహా చిక్కించుకోలేవు వాఁ
డొక్కం డీ సకలంబునౌ పృతన వేర్వేఱ ప్రేలిగోరో సుమీ

ఉ. బిక్కమొగంబు పెట్టెడివు పేరిచి రాముని పైకి దండుపో
వక్కట మంచిబిడ్డఁడవ యౌనుపు మీ రఘువంశగౌరవం
బెక్కడ? నీచభావ మది యెక్కడ? రాముని రాజ్యపీఠమం
దెక్కఁగఁ జేయఁ గోరుచుఁజన నేగను నేను తెలుంగుదుం జుమీ

మ. మిగులంగుండియ గాడిపోయితికదా మాయింట నీదంట యౌ
నగడుం బుట్టిన నీవు సాత్వికుఁడ వేలా సేయు దా రీతి నీ
సిగలోఁ బూవుగ నెంతు రాఘవుని దాసీవాక్యరోధంబు ని
మ్మగ చేన్ రామునిఁ దెత్తువా యతఁడు నిందే విల్వకుండంజనన్

గీ. అని భరద్వాజమౌని యుల్లాసమొంద
నీ త్రిలోకంబులం బెల్లగిల్లఁ బడియె
భరతు పుణ్యంబు నా రాత్రి ప్రౌఢచంద్ర
కాంతిఁ బెల్లలు పెళ్ళలుగాఁగఁ దిరిగి

వ. అని మఱల భరద్వాజుం డిట్లనియె

శా. ఆ దూరంబున నేలయుంచితివి సైన్యంబెల్ల వే కొంచురా!
నీ దామోదరమూర్తి యన్న పయినన్ నీ కున్న సౌహార్దమ
ర్యాదాభావముచేత నీయెడ నా కత్యాదరంబయ్యె నీ
యౌదార్యంబున కెల్ల యోగ్యముగ నే నాతిథ్య మిత్తుంజుమీ

క. ఈ బడుగు బాపఁ డింతటి
యీ బంధుసైన్యమునకు నే మాతిథ్యం
బూనును సంతానం బను
కోఁబోకుము సైన్యమెల్లఁ గొనిరావయ్యా! ౨౬౧

చ. పరవశమైన మేనులను వచ్చి చమూసకలంబు దేవతా
సరసున మున్కలాడి పసుసంతతి నీటనుదోలి కడ్గి పె
న్నరదము లన్నియుం గడిగి యంతట భోజనశాల లేగి బం
ధురగతి సూదకుల్ సముగుదోనతు లీయఁగ వే ధరించుచున్

సీ. చిన్నారితొడిమల సన్నగసపూవుల
నునుపైన సన్నయన్నంబుతోడి
క్రొక్కాఱుతోఁటల దక్కులు నన్నల
నలువైన నాసు వ్యంజనములతోడి
నానాబిలంబుల మోసాల కెదు రెక్క
చను గుబాళింపు చోష్యములతోడి
బంగారురంగుల పొంగారు తావుల
సర్వవిధాల భక్ష్యములతోడి
గసన రయొజ్జగఁ బచ్చళ్ల పసలతోడి
కూడు మీఁగడ పెరుగులతోడి పాత్ర
పార్శ్వములను గంధాగురుప్రకటదివ్య
ధూపములతోడి క్రొత్తవిందులను గుడిచి

ఉ. ముత్తెపు భస్మమున్ దమలపుంగవటాకులు జాజికాయ జా
పత్రిరి యేలకుల్ ననసనల్ చికిసిలును బచ్చకప్పురం
బుత్తమమైన కస్తురియు నొప్పగు కుంకుమపూవు సూచిపు
చ్ఛాత్రములైన చల్లమిరియాలు లవంగము లాదివస్తువుల్

మ. సొగలూ చెత్తెను దేవతావిషయతాంబూలంబు సేవించి క్రొ
జిగురుల్ వెన్నెలవత్తులైన యువతుల్ శృంగారలీలారసా
నుగహేలాపరిచర్య గంధముల మేనుల్ పూయఁ గ్రిగన్నుప్రీ
తిగ జవ్వాజియు నత్తరుల్ పునుఁగు లందీయం గటాక్షించుచున్

ఉ. తీయని యూహలన్ బయలుదేరి సభాభవనంబుఁ జేరి గాం
గేయమయూఖ్యంబు లగు కెంపుల పీఠముల న్నిసణ్ణులై
పోయుగ మొప్పు నున్నయెడఁ జొక్కులపైనను జొక్కు తెచ్చు గీ
తీయుగపత్రప్రవిష్టు గుణింతించి [illegible]యపుత్రు నంతటన్ ౧౭౫

సీ. ఇది పాలమున్నీటి మొదలిలేఁగెరటంబు
తొలిచూలుకాఁబోలు తొంగివచ్చు
నిది వేలుపుల జన్ని మొదపులో నొదవిన
కవల కాఁబోలు లక్కనము నెఱపు
నిది కోరుకుల చెట్టు నునిరికొమ్మకును సై-
దోడుగాఁ గాబోలు డుఁగియాడు
నిది యొక్క జడదారి పదునైన యెదజారు
కోర్కి కాబోలు పెక్కువలుచూపు
నన భరతశాస్త్రసర్వరహస్య మిట్లె
పఱచినట్టుల నచ్చెపడఁతులెల్ల
భరతు ముందున నాట్యసంపదలు చూపి
తెరలి రానందమున నెడల్ తేలిపోవ

సీ. ఆఁ వికుంఠమ్ము మహానందధామ మ్మ
చంద్రచంద్రికలును జయవిజయులు
సనకసనందాది సర్వర్షి సంఘమ్ము
శార్ఙ్గకౌమోదకీసహితమైన
యొక దివ్యతేజోమహావారిరాశిలోఁ
గళపెళల్ గా మహాకళిక యొకండు
వెలువడి వైకుంఠవీథిని గతిసుహా
స్సర్వలోకములను జారిజారి
యొక్క యాషాఢమేఘమ్ము నొఱపుతోడ
తాపసియుఁ జాపియైనట్టి రూపుకట్టి
నట్టి తేజోఽవతరణకథాంశ మొక్క
యప్సరోరత్నమాలిక యభినయించె

శా. అంతం దానొక యప్సరోజగదుదారాంభోజపత్రాక్షి దృ
క్ప్రాంతమ్ముల్ తెలిడాలుగా మలచి గ్రీవన్ పాంచజన్యంబు వృ
త్తాంతం బొక్కటి యెత్తి భక్తి ధమన్యంబై నట్లు సూచించె హా
స్యాంతప్రక్రియ ధీసదం బభినయామాత్సర్యమ్ము దీపింపఁగన్ గాఁగ

ఉ. ఆరని తమ్మిరేకు రొకరొయుచ్చరు తాఁ గనకాంగిఁ ద్రొట్టి నం
చానము వేసి జాతు లుప జాతులు కోమలతీవ్రతీవ్రగాం
ధారనిషాదముల్ దుసభ దైవతముల్ పచరించి పాణిపుం
దూరపుఁ గోఁతు చెన్నుఁ దగిడిన తేనియగాఁగ పాడినన్

ఉ. తుంబురునారదుల వీణెపయిఁ దూలని సానువిభక్తి సుస్వరా
లంబనసంవ్రదైవతములన్ మదబంభరనాదసాధురూ
పంబులు కట్టి తీగపయిఁ బట్టిన వేళ్ళును సట్టుగుండ దూ
రంబుగఁ బట్టి సన్నసి స్వరంబుల నాకస పొల్లు నింపఁగా

శా. ఆరామోన్నమహానమోహనకళానిధానానుష్ఠై దేవగాం
ధారగ్రామవివాదిసూక్ష్మకము చేతస్స్వమార్గంబులం
దారూఢింజని వీడఁగాఁ బనవశత్వంబై నానిరాళి ని
ద్రారూఢిం గని రెచ్చటంగలరొ తా రచ్చోట నే వెల్లరున్

క. భరతుండు శత్రుఘ్నుండును
నరిగి తమకు నైన యుటజమందున బ్రహ్మ
ర్షి రచిత దివ్యాతిథ్య
స్ఫురితజగన్నాథు రామమూర్తిం గంచున్

సీ. అప్పుడాగీత రాగార్ద్రిత యొక మెట్టి
మంచు రేఁగురిసినమాద్రిగాఁగ
గతరాత్రి వంటయుల్గాడిపోయిర్యుల లోని
పొనుగల గ్రమ్మని విస్పారలు గాఁగ
రే నప్సరఃపాలినృత్యావేశాస్రస్త
మాణిక్యకాంతులు మలసె ననఁగ
నల భరద్వాజుని యాతిథ్యభానది
నావేళ మలుసంజ వఱలె ననఁగ

నెచటకో పోయి యప్పుడ యేగుదెంచి
యచటి కానన వృక్షంబు లెచ్చరువుగ
జూఁకఁ జివురుల తల లెత్తి చూచు ననఁగ
వ్రాలి తొలిసంజ యెఱ్ఱదనాలు విరిసె

వ. అంతన యోధ్య యంతయు మేల్కని యొకఁ డిదియేమి యీ వృక్ష
మూలంబు తలగడగా నిదురించితి నని, యొకఁడు బాపురే! యీ
శాద్వలంబున నిదురపోయితి నే పురుగైన ముట్టుకొన్నది కాదని
పలుమంది లేచి యొడళ్ళు దులుపుకొనువారును గొందఱు
మజ్ఝారే! విశ్వాచి! సెబాసు! ఖుష్బాచి! యను ప్రశంసా
వాక్యంబుల లేచి వట్టియుడవి గాంచి దిగ్భ్రాంతి పడువారు గొందరు
రాత్రి యేమి భుజించితిమో యింతవఱకు కఱుగ లేదని నోరుపైన నే మసలు
వారును గొందఱు గతయామినీసముపభుక్తసౌఖ్యలీలాస్మరణవశం
వదచిత్తులై నే నిదుర కదల ననువారును మఱికొందఱ ఉన్మత్త
ప్రాయులును నై యుండ భరతుండు లేచి మునిఁ జేరఁజని నమ
స్కరించి నిలచిన భరద్వాజుండు

క. నా తీర్చిన యాతిథ్య
ప్రీతులె నీ సేనయెల్లఁ బ్రియమైనదె నీ
కా తీరు చెప్పుమన్నను
జేతోభక్తిప్రణీతసేవాంజలియై

చ. భరతుఁడు స్వామి నీమహిమఁ బ్రాంతుఁడు మాదృశుఁడా నుతించుటల్
సురలును నబ్బురంపడుచుఁ జూతురొ చీకృతి సర్వసేనయున్
మరలును గొంచు నీ యుటజమండలియందె నివాసముండు నం
దురు రఘురాముదర్శనము త్రోవను పట్టరు తృప్తచేతసుల్

శా. నాకున్ రామునిత్రోవఁ జూపఁగదె యన్నన్ సౌని మీరిట్టులే
నాకప్రోతసి సన్నపుంగటము వెంటన్ యోజనం బరమున్
వే కాంతారముఁ బట్టిపోం డచటఁ గన్పించున్ లతాసేవ్య
ప్రాకారంబయి చిత్రకూటగిరి రామావాసతీర్థం బదిన్

క. ఈ రేయికూడ నుండియు
పోరాదా యనఁగ దప్పుపోవదె స్వామీ!
శ్రీరాముం డేమనునో
తీరిక లేదెడఁద నేమి తెల్పుదు ననినన్ అంగా

గీ. అంత భరతుండు శ్రీవశిష్ఠాననంబుఁ
గాంచి యిట్లనె నో తాతగారు! చూడుఁ
డల భరద్వాజముని చెప్పినట్టి గుర్తు
లెల్ల సరిపోవుచుండెను సుస్థలాన

సీ. రవితేర నడిమి గుఱ్ఱము మోపవన్నె నీ
పాలింతయున్న పచ్చిక రంగు వహించె
గిరిగహ్వరాభిముఖీన కేసరపంక్తి
స్వానమంద్రధ్వని సాగుచెంచెఁ
గావమ్ము మాల్యవతీపయఃపరిణాహ
మా దూరమునఁ బక్షులాడు చోటు
గిరిధాతుమండలీ కిమ్మిరితంబైన
కొమ్మగు నిది చిత్రకూట మనఁగ

దరులు మృగములు నూత్ననూత్నముగఁ దోఁచు
ధాత్రి పౌష్కల్య మేమి చిత్రమ్ముగలదొ
యధికసౌందర్యవిజ్ఞాత యన్నగారు
నిచట నిలుచుట కానిచో నేలఁ గలుగు?

మ. అని శత్రుఘ్ను నిఁ గాంచి యిట్లనె రిపుఘ్నా! నీవు మీయన్నఁ జూ
డను సాకేతజగత్పతిన్ మనము చూడంగల్గు నట్టీ చషియా
జనముం బున్నము కాననాంతరజటిస్థానంబు లీ మూఁక చొ
చ్చిన గగ్గోలగు నప్రసన్నుఁడగునో శ్రీరాముఁ డాహేతువై

మ. సకలేశుండగుఁ గౌసలేయుని కృపాసర్వస్వసంపాదనా
నికయత్నమ్మునఁ గాక సేన వనవీథిం దాను బాదంబు నె
త్తక పాదంబిడరాదు తల్లియగు సీతా శ్రీవిహారస్థలం
బకటా! పావనతీర్థ మీ గిరిసమీపారణ్య మర్చ్యంబగున్

ఉ. చూచితివా! మృగీవితతి చూపులవైఖరి రామశాంతిరే
ఖాచణముల్ విదేహసుతకాననవాసవిభుగ్నచిత్తరే
ఖాచణముల్ చమూవితతిఁ గన్గొని పాఱవు లేళ్ళు లక్ష్మణాం
సాచితచారువీక్షణకృతార్థితధైర్యపరాఙ్ముఖప్రముల్ ౨౧౧

ఉ. పాతమునందుఁ బట్టికొని బిత్తగుణంబు బలి మాలిమా గజా
నీతగళస్థశృంఖలల నట్టగ బిట్టుగ ఘీంకృతిప్రణే
తాతిమహాగ్రహస్థ నమహాబులు వన్యగజాళి, యే స్పృహా
కీలిగొని మాలిసై యమ సరిగ చేయుఁ బట్టపుటేనుఁగాగతిన్

సీ. తొండమ్ము లెత్తి యుద్ధగబృంహితములతో
విస్ఫురదంతముల పెండెములుగాఁగ
వివృతాస్యములతోడి విపినగజాళి మో
మును నీరుతోడడి మోటబావు
లట్లుగా మెలదిన యల్పపుచ్ఛములుగా
నడచుఁ గళ్యాణమంటపము లట్లు
పథమెల్ల మనవెంటఁబడి వచ్చుచున్నవి
పత్తి నీ సంసర్గభయము లేక
పట్టియంబారితోఁబోవు నట్టి పట్టు
పేన్గువెంబడి వచ్చు నీయేన్గులెల్ల
బహుళశుభదాయిగా మనవచ్చుపనికి
సూచనము చేయుచున్నవి సూ! రిపుఘ్న!

వ. అనిన శత్రుఘ్నుండు సేనయెల్ల నొకయెడ నడవిలోని విడియ
లున విడియించి యాశ్రిమభద్రింబుగా నాఁటి పట్టి చుట్టుకైన వేగ
రులఁ గొందఱ శ్రీరామచంద్రుని విడిదలను గనుగొన నియమించిన
నం దొకరుండు నొకచోఁ బసినుంచుకొరు వేఁగునఁ దామరాకుల
కొలనుమీఁదవలె నొకచెట్లగుమ్మపై హోమధూమేతరంబయిన
పొగకట్టుఁబోల్చిచూచి శత్రుఘ్నున కెఱింగించిన

క. భరతుఁడు విడి సవనాగ్నిం
బరువడి పొగరేఖకట్టు వంటిల్లుపొగే
విరిసి పొగకట్టు గట్టను
వెరకన గోధూళి మంచు వెలింబోలెన్

ఉ. పచ్చనిచెట్ల [illegible] వాడిన కొమ్మ[illegible]యు [illegible] లక్ష్మణుం
డచ్చట [illegible]వంట [illegible] కేగతిఁదెమ్మను బ్రాహ్మ్యముం[illegible]
విచ్చలు [illegible] వెవ్వగఁ [illegible] మానుల్లు [illegible]
వచ్చిన కీడు [illegible] రేమిన్యాయమో ౨౨

లీనసౌదామినీజలదపంక్తిశ్యామలరేఖాకృతి
లూనసత్కీకనృత్యావళీలులితశైశిరవనాంతాకృతి
ప్రాణనిర్యాణానేహోవిభారహిత బాంధవముఖాకృతి
శ్యేనీచంచూవ్యాహతిపృష్టశీర్ణసంధి రాజిలవైఖరి
పరశురామప్రీతిఁ బొందిన పానశాలవిధాన మైనది
విరహితాఖిలవైణికస్వరవిధుర రేఖాధూత మైనది
తనుశింకంకణకింకిణీస్వరతాళమానము నేదియున్నది
యరయ నష్టాపదవిభూషణు లైన పురుషులు కానరానిది
అచటి వాతాయనము లందున నగురుకోలకకుందురుష్క
ప్రమసధూమవిసారి రేఖావాసనావిరహితము లైనవి
యచటి వాతాయనము లందున నాత్మేశ్వరభుజాగతచిబుక
లుచితలజ్జలు బాలగేహిను లూఁగి చూడఁగ రాక యున్నది
పురాసముయంబులం బలెఁ డను ముద్దుపేరుల మొదలిరెండ
క్షరాల్పలికెడు చిలుకపకులల సవ్వడియు ముంగిళుల వినఁబడ
దు, రామ! రామ! యీయయోధ్యను దొంగలుదోచుకొన్నారేమొ
ధరాఖండ మ్మిది దుర్దైవతమ్ములు మోచుకొన్నారేమొ

తాదృశంబగు నయోధ్యాపురిఁ దాను భరతుఁడు ప్రవేశించెను
తాదృశంబగు దుఃఖమయహృదిఁ దాను భరతుఁడు ప్రవేశించెను
తాదృశంబగు రాజసౌధము తాను భరతుఁడు ప్రవేశించెను
లోనికల్ మొగమందు దైన్యము లొంగిపోయినయెడఁద భరతుఁడు

గీ. మఱి యయోధ్య చూచినదాది మాట పలుక
లేక హృదయసముద్భూతశోకభార
వినతుఁడై నట్టి భరతుఁడు వెడలి వెడలి
శిరసుపైఁ బాదుకలతోడఁ జేరి నగరు

గీ. రత్నసింహాసనంబున రామచంద్రు
పాదుకల నుంచి డస్సినవాఁడువోలె
దైన్యగుణ మెల్ల నదలి సంతాపుగ్న
వివృతవదనుఁడై దుఃఖించె వెక్కి వెక్కి

క. ఈ పాదుకడిన, సాధు
శ్రీ పాసిన, రామచంద్రనృపతనుసుషమా
కూపారభంగ మేదిన
యీ పట్టము నొందుఁగాని యెవఁ డనుగు నిటన్

గీ. వెడలినాఁడయ్య! భరతుఁడు వెడలినాఁడు
తెచ్చినాఁడయ్య! భరతుఁడు తెచ్చినాఁడు
పాదుకావ్యాజమున రాజ్యభార మెల్ల
నుఱఁ దానే సహించెను మాట నిజము

మ. పదమా! యోయిసుమంత్రి శ్రీరఘుపతిప్రోద్యోగ్రతేజోభరా
స్పద మైక్ష్వాకునృపాగ్రపుత్రధనికిన్ సాకేతమున్ నిల్పుటా!
పదమా! పాదుక లిప్డె మోసికొనిపోనంగానలేన్ నాకుఁ గా
నిది సాకేత మిఁ దేల పోవుదము నందిగ్రామమునం దుండఁగన్

క. నే నిం దుండను బదవ
య్యా! నందిగ్రామమునను నప్పట నార్య
పానహముల్ భుజియించుచుఁ
దా నయి యార్యుండు వచ్చుదాఁక సుమంత్రా!

శా. శత్రుఘ్నుండును నేను నే మిరుదెసల్ చామీకరోద్యత్ప్రసుక్
వేత్రంబుంగొని చామరంబుఁగొని సేవింపంగ నీ పాదుకల్
ధాత్రీపాలన మాచరించు సముదాత్తప్రౌఢశుంభజ్జ్వల
ద్వ్యాత్తస్ఫారశిఖామణిప్రభలు నర్తింపంగ మత్సేవకున్

వ. అనిన మంత్రు లెల్లను నీకు మీ యన్న యెడఁ గల ప్రేమ కిది ప్రేఁగో
యని యనుమతించిన బాదూయుగాధోభాగఘట్టనమున నైన కిణ
ములు కుమురుగాఁ దలపై నునుమతించి శంఖభేరీపటహాదివాద్య
స్వనంబులు సాలంకారముఖాటోపానేకపంబులుఁ గళ్యాణపల్యాణా
రంజితమహాశ్వంబులు రథంబులు వెంటరాఁ గామకోటిసన్నిభాన్వైఖరి
భరతుండు నందిగ్రామంబుఁ జేరి పాదుకాపట్టాభిషేకంబుఁ జేసి

శా. ఝుంకారాత్మప్రసామగానములతో శైవాలినీకేతికా
లంకర్మాణమనోజ్ఞనాదములతో లావణ్యరేఖానిరా
తంకంబై చను పాదుకాయుగముఁ బ్రోద్యత్సింహపీఠమ్మునన్
శంకాపేతముగాఁగ నుంచి రఘువంశస్వామిగాఁ జూచుచున్ ౫౭

సీ. మేలుకోవే స్వామి! మేలుకో నాస్వామి
గా యని వందిమాగధులు నగుచు
నస్వప్నసుఖనిద్రయైసదా భద్రమా
యంచును సౌఖశాయనికుఁ డగుచు
నే వేళ నే యాజ్ఞ యిచ్చునో ప్రభు వంచుఁ
గొనకంట లాలాటికుండు నగుచు
ధాత్రిసంవహానవార్తలు వచ్చి స్వయముగాఁ
దెలిపెడు సభ్యమిత్రీణుఁ డగుచు

సంచితకరాభిసృష్టసవ్యగ్రపాణి
కార్యవేళకు సంవాహకుండు నగుచుఁ
బ్రోది నొకటయి యొకటి కాలేదొ భగవతుఁ
డావృతసుభక్తిఁ బాదుకాదేవతకును

సీ. ప్రొద్దున నే లేచి పులికాపుపెట్టుచు
నింబరసాభిషేకంబుసేయు
తడితొల్లఁ బ్రావార మిడి మార్జనముసేయు
భక్తిగోఁ బీఠంబుపైని జేర్చి
సేవకుల్ తెచ్చిన పూవుల నర్చించు
ధూపదీపాదులతో యజించు
నలఁత సహస్రనామార్చన గావించు
నైవేద్య మిడిన యన్నమ్ముఁ దినును

ఊర్ధ్వసంవ్యానమును గటి కుగ్గగట్టి
నిలచి సాష్టాంగపడి నొసల్ నేలతాఁక
లేచి స్తోత్రమ్ములను పాడి లీన మగును
పరమభాగవతుం డైన భరతరాజు ౫౭౮

## మంగళము

సీ. ఇద్ది స్వామి! పాదుకాఖండ మిద్ది పరమ
పైన స్వాదువు నీ స్వరూపావగతికిఁ
భాను చంద్రమౌళీశ్వరప్రభువు స్వర్గ
కీర్తి విజ్ఞాననిధియు మత్కృతతపస్సు

చ. అకట! ప్రతీపసంస్థితికి నైతిన యీగతి నాకుతల్లక్రిందుతీ
ఱు కడపి తొల్లి నాటికి స్వరూపజగత్తునఁ జేతనత్వ మా
పకయ క్రియాజగత్తున జడత్వము వైఖరి చేసిపెట్టవే
ప్రమపితశైలరాడ్దుహితృపాణినిమీలితలోచనచ్ఛవీ!

శిఖరిణి

హృదంభోజాతాంతర్గళిత మధురశ్రీకృతమహా!
సదాఽధర్మక్రీడద్దనుజపరిషజ్జాల్మతమహో
మృదూకృన్మాయాఘుటితతట వారిజ్వాలదినం
మదోద్యత్కాసారాకలితసుమనస్సమంజాలయమా! ౫౦



# అరణ్యకాండము

క. శ్రీపతి వాణీపతి కృత
రూపాన్వేషణవిధానిరూపితతత్త్వా!
పాపవనీదహనశిఖా
వ్యాపారమహాస్త్ర! శత్రుహా! విశ్వేశా!

సీ. చిత్రకూటాద్రికాననచిక్కనైనతరుసంత
తాసితచ్ఛాయల యనుపువలన
నీలాంబుదోదరస్నిగ్ధమౌ రఘురాము
దీర్ఘ తనూకాంతి తెగువవలన
తొమ్మిదేవతామూలగర్భశైశిరరేఖ
లలము జానకి కంటిహద్దువలన
మాల్యవతీపయోఘుఘనశైత్యవిమిశ్ర
మగు గాలిచాళ్ళు యనవవలన

నొడ్డుకొని యొడ్డుకొని సందు లున్న రెమ్మల
దూసికొని సూదులంబలె మోసులగ్రి
తరణిజరతాతపమ్ము లుద్ధానము లగుచుఁ
బర్ణశాలాంగణమ్ములఁ బారుతెంచె

సీ. పొరయించికొను నెండపొరలకుఁ బరిగిన
లోచ నెందీనశాలులిత యాగుచు
నెత్తి నొంటికాలిపై నిలిచి నిలుకడ
కోర్చి యొకొక్కకాలు మార్చుకొనుచు
గతదినమ్ముల యసంస్మృతి గరుకెక్కి మూ
దుకు సాగు కూను తొఁగ్రోచికొనుచు
తడిసీళ్ళస్నానాలబడి యేకభుక్తముల్
బడి చిక్కిచను మేను బట్టుకొనుచు

దూరదూరమ్ము చన్న బంధువుల వంకఁ
గనులు సన్నసన్నగాఁ జేసి కనుమనున్న
మైథిలీకాంతఁ గాంచె సౌమిత్రి తిరిగి
పర్ణశాలకు వచ్చుచువాఁడు తాను

గీ. అరిగె లోనికి సన్నగృహాంగణమున వ
ధిజ్యధనుసున నొరిగి దృగ్వ్యసనిశ్చ
లాత్మ మొప్పెడు సూక్ష్మహేల విచారు
సన్నధుఁ బదాభివాదనం బాచరింప

ఉ. తా రఘురామచంద్రుఁ డనుజన్మునిఁ గాంచి విదేహజాతకై
శ్రీసచిరంబుగా కనులఁ జెందఁగఁ గన్గొని నాల్గువైపులన్
ధారణిశాంతుఁడుం గదక తమ్మునిఁ గన్నులఁ బృచ్ఛచేసి శా
లారుచిరాంగణంబున నిలఁబడి యుండఁగఁ గాంచె నేడుచున్

ఉ. బందువు లెల్ల రిప్పగిది వచ్చిరి వెళ్ళిరి దానఁ గ్రొన్నగల్
పొందిన గుండెయై తరుణి పోయిన దారినె చూచుచుండఁగాఁ
గొండలమంది స్వామి యనుగుంజనరాలి మనస్సుఁ దేర్పఁగా
సుందర మొక్క యూహ పొడసూపి వనింబెడబట్టి యేఁగుచున్

క. దూరముగా నేఁగె ననీ
వా రేగిన దారిఁ దిరిగి వచ్చెను పృథుకామం
దారూఢశోభనవనుఁడు
శ్రీరాముఁడు సీతతోడఁ జెప్పఁగ వచ్చెన్

క. విను వదలిపోయినా మని
యనుకొను చున్నార యత్తలందఱు నినుఁ దో
కొనిపోయెదఁగాని పోమె
యని వారలు వగచుచుండి రంభోజాక్షీ!

ఉ. అప్పుడు వారినవ్వులు చలాచలవార్నిధిఫేనపుంజముల్
చప్పగ నొక్క మల్లియల జాజుల వెల్లసి రేక విప్పు లా
యప్పటి వారికన్నులు వతానవ్రాగ్గగనావలంబి సాం
ద్రాప్పతి నీరదప్రథమదర్శనముగ్ధమయూరపింఛముల్

క. ఆలోలలోచనాంశులు
లీలాలంబితకరాంగుళీకము గాఁగన్
హేలాయానముగాఁ జని
రేలాసల్లకివనీసరిత్తూపేక్షన్

చ. కుటజలతాంతపాళి మొలగోలుగ సన్ననిరేకలార్చి యు
త్కటముగ నవ్విపోయ నెసకంబుగ నూగిసలాడు మల్లికల్
సటమదబంభరచ్ఛలమునన్ దెసు వడ్డగ వచ్చివచ్చి ముం
దటికిని వందమంది మఱదంద్రు పరాచిక మాడినట్లుగన్

క. మృదుమందహాసమున భా
మిదుహిత మృదుపాణిలతల మేకొని తోలంగం
గదియించుచుండ రాముఁడు
విదేహరాజ్యపరిచారవిభవముఁ గంచున్

వ. పోయి పోయి తచ్చిత్రకూటపరిత్యంతధాత్రి వెండివన్నెల నెత్తుప
పన్నెల పసపుపచ్చని తొగరువన్నెల నెలరాలజిగుల గిరిధాతుదేశం
బులఁ దిరుగుచు మావులు నేరేళ్లు లొద్దుగలు ప్రియంగులు పనసలు
మారేళ్లు రేఁగులు మోరటు లూడిగలు నెమ్మిమారేడులు వెలగలు
నిప్పతరులు వెలఁగ లుసిరికలు మొదలయిన బహుపుష్పితవృక్షము
నడుమను బుంతలను జూపి చెప్పుచుఁ బోయిపోయి

సీ. భరల యాజానుబాహులగాఢంబులం
తోంగలికవుఁగిళ్లఁ దుసికిలించి
గమణకవోష్ఠాధరస్పృష్టిమధురచుం
బనము లర్థంబునఁ బరివారించి
నాథహేలాపాంగసాధుహాస్యాగ్రిచే
లాంచలాకర్షణయత్న మాఁగి
విభుకరాగ్రసరోజవిధుతసమోహర
సముదైకసమయుత జలకరించి
చిత్రకూటదరీకేళి సిద్ధసాధ్య
యక్షకిన్నర కామిను లరుగుదెంచు
జానకీరాములకును లజ్జావిధుర
భక్తి నొడ్డిరి లతానతులఁ బట్టుచుండ ౯౪

మ. భరితేందీవరపుండరీకవిలసద్భృంగీగణీగంధబం
ధురపాథోలహరీకిటమణిబంధుప్రోథశీతశీకరభా
స్వరసంభావనసాంబులై యనిలముల్ వచ్చున్ ధరాశస్యకా
దరవల్లీపుంసుక బంధసంశ్లథనవ గ్రస్నోదసంస్కారముల్

ఉ. పెట్టిన వేసవోలెం దలపెట్టిన కోరికవోలికన్ శిలా
పట్ట మొకందుగాంచి రఘువంశమహేశ్వరమూర్తి తా జగ
త్పట్టపురాణికిన్ క్రమము వాయంగ నప్పుడు గూరుచుండి యి
ట్టటు చరించు చిట్టనిదె నానసతైక్ష్ణ్యము కొంతతోఁపగన్

క. ఈ చిత్రకూటగిరి శో
భాచాంద్రీమహిమసిప్రభావము మృగులి
పాచారణకవృషస్యం
తీచార్చిక్యముల వన్నె దెచ్చిన దతివా!

గీ. తెలివ! యీ కొండగువ్వగుత్తికలు తుంగ
ముస్త పులిగోరుచెట్టుల ముసరు తావి
యావి వదలెడు లోపలి ప్రాణములకుఁ
బరిహరించిన సౌఖ్యముల్ పాదుకొనఁగ

శా. ఏతత్సుందరకందరాంతరముల న్హేలామహేశాను లా
పాతోత్పాదితబ్రహ్మలోకులు సుహృద్భాచంయముల్ స్థాండిలుల్
చేత స్తంభనమాత్రయోగము లక్షిప్రోతపూష్ముల్ స్పృహా
పేతుల్ నిల్తురె ప్రాగ్రహారజలముగ్వాసారలోలాలసా!

వ. అని శ్రీరామచంద్రుఁడొక్కముహూర్త మూరకుండి మఱల
నిట్లనియె

క. నీవును మా సౌమిత్రియు
నా వెంబడినుండఁ జూచినావో లేదో
యీ విశ్వస్వవైభవ
మావిష్కృత మైసయుట్లు యతివా! నాకున్

మ. అనినన్ జానకి రామచంద్రుఁ గని హాసాంకూర మేపార ని
ట్లను సాకేత మవెప్పుడో తిరిగిపోమా! తాతపాదున్ వశి
ష్ఠునిఁ బ్రశ్నింతు నరుంధతివ్వాపము దమ్మద్ధాంతరంగంబునం
దున నెడ్డే ననుమానముం దగిలెనా ఘోరంబు నీ కంచునున్ ౨౨

క. నే నొకదానికిఁ జూచితి
మానసమున వేఱుగాఁగ మున్నింతియు వి
వైనను నా లోనను సీ
వైనను నీలోన నే నయూరే! కానా?

గీ. నిముసనిముసమ్ము చూడక నిలువలేవొ
నిన్ను నత్తలు మువ్వురు నిన్ను సకలి
వారు పోవఁగ వారల భాగ్య మెల్ల
స్వార్థపరురాలనై నేను దోచికొంటి

మ. కితవప్రక్రియ రామచంద్రుఁడు నరాంగీ! వ్యంగ్యసద్వస్వభా
రతి! నాలో మఱి యిట్టులా! యయితి వౌరా! యన్న, భూజాతె నా
మతికిన్ దాఁచుట చేతకాదనిన నీ మాత్రానికా కోప మం
చతివం గౌఁగిటఁ బూని నవ్వులని యూరార్చెం బ్రభుం డంతటన్

చ. నిశితగరుత్ప్రచాలనసనిస్వనభాస్వర దేవవాహినీ
శిశిరపృషత్పరంపరలు చిందుచు వచ్చెను బాఱు బాఱు గం
చసితమృణాలనాళశకలాంతరఘట్టనసూచివాక్కులై
దిశలను సితచ్ఛటాపరిణతిం గనఁ గ్రౌంచవిహాంగసంఘముల్

సీ. నీ చేతిరాళ్లులు నా చేతిపూవులు
పట్టించి బాలనంతపెట్టి సీత
నవ్వించికొన్నట్టి నాథునిమోడ సుప్ర
సన్నమై ప్రేమాబ్ధి జనకదుహిత,
హృదయాళు నీలలోహితమౌక్తి కోష్ణీష
మమృతాన్నకాలంకపాంబుమజ్జ
నాతిధౌతాపఘనాధికదర్పమ్ము
లీ క్రౌంచములు తెక్కలెత్తి నీరు
చిలకరించెడు మనపైనఁ జెల్లుగాదె
యింత దర్పము లైనను గృతసురాంబు
సేవనము చేయువారికి శ్రీనిధిల
వారిధరముగ్ధమోహనాకార! యనిన

క. చెట్టాపట్టాలు పుడమి
పట్టియుఁ బోఁ బూని గంగపట్టెకుఁ జని నీ
రాట్టముల నీటబెగ్గురు
పిట్టలు తల దాఁచుకొనుచుఁ బ్రియమున నునికిన్

శా. గాణేయత్వము దాటిపోవఁగను గంగాభిన్నకూలంబులన్
బ్రాణాయామము లూని కొందఱు శరీరక్లేశముం గార్చి క
ళ్యాణాపేతముగాఁ గొందఱు భల్లూకప్రదేహాల్ వసి
నేణీకంటకితోపబర్హాలు మునుల్ వేఁగాడుచుం గొందఱున్

ఉ. అన్నియుఁ గంచుఁ బోవుచు జనాఖిలదూరగ మొక్క రేవునన్
దిన్నెలుగాఁగ నొడ్డునను దీర్చిన రాలు గలట్టి చోటఁ బైఁ
జెన్నగు వారవాణములు చేరిచి రొమ్మొడ్డున, సీత దూఁకి గ
మ్మన్న భయంబు వొందు జనకాత్మజఁ గేల్గొని లాఁగి వాహినిన్

సీ. మునుఁగుచుండిన భార్య మొగి నంసభాగంబు
నం దేనుఁగు మృణాళ మట్లు బూని
ప్రక్క నీదుచు నున్న భార్య నేత్రంబుల
హార్యక్షుపతి శిశునట్లు గాంచి
వెనఁగుచుండిన భార్య పృష్ఠవంశోర్ధ్వమ్మ
న గరుడి యమృతమ్మనా గ్రహించి
వడిఁ గౌఁగిలించినభార్య నొక్కకరాన
జారు బిడ్డను తల్లి సరణి నూని
చిన్నరి సయాటగా నీరు చిమ్మి చిమ్మి
లీలగా నీరములు పుక్కిలించి యుమిసి
పారిజాతనికుంజప్రవాహచలిత
వారిజాతసువాసనల్ వలచి వలచి

వ. తత్కాలవేగసమాయాతవివృతవదన నొక్క మొసలిం గాంచి శ్రీరామచంద్రుండు సీతాదేవి నొడ్డున దూఁకుపశిలాతలంబున నునిచి పతిఁ గొందఱఁ గాంచి యేమి కారణమని యడుగుచున్న యామె కేమియు లేదని సమాధానంబుఁ గావించి మరల జలంబుఁ బ్రవేశించి

మత్తాకోకిల.

పరిశయవేళాపరిశ్రమణ బంధురబ్రధ్నాత్మజాత
నిలయగణాపాతవిధుర వేగదర్వీకరపుచ్ఛ
కలితతాడనఘోరఘటితి గంగాంబుఘటు లెల్లఁ గలఁచి
యలజడిం గావింప మొసలి యాతని నండఁగాలేక

మ. సుడిగుండంబుల నైనఁ ద్రిప్పుకొని చొచ్చున్ గ్రాహ మాశీలగా
సుడపరాంతవిశీర్ణఝుంఝుముగ నీరున్ భాణిపాదోరుమ
గ్గడకాభీలవిధూతి మందరగిరిగ్రావాకృతిం జన్న రా
మడు తత్రాంతజలస్థలంబు దరియంబోఁగాక పెన్గాకమై

గీ. కొంతవఱకును బలిఁ గలగుండు పెట్టి
దరియఁగానిచ్చె బరివివృతంబు గాఁగ
నైకమోమున వచ్చు గ్రాహంబు రెండు
దవుడలును బాహువులు చాచి తివిచిపట్టె

గీ. అడ్డముగ నీడుచుండినయట్టి మొసలి
నిలువుగాఁ బడి తల్లకిందులుగను బడి
పార్శ్వములఁ బడి గగ్గోలుపడియు స్వామి
పట్టు తప్పించుకొనలేక పల్లటిల్లె

వ. ప్రాణపర్యవసానమై ప్రియతన్ను మేచిన స్వామి దాని ద్రోసివేసిన
నది కొంత తెప్పిరిల్లి యిట్లనె

క. మాటలాడకుండ దవుడలు
వేటాడెను సామి మనవి వినిపింపఁగ నీ
చోటి కరుదెంచి యె తిన
నోటికి గడవేసి తేమనుదు నా తండ్రి!

చ. వినుఁ దినవచ్చినా ననుచు నీ పెద నెంచితికాని స్వామి! నిన్
దినుటకు దాడ విచ్చికొని తెచ్చిన సర్వవియత్పదంబు చా
లనిది ఖరుండు దూషణుఁడు లగ్నకవృత్తులు లంకలోన నీ
కును గల వైరభావమునకున్ బ్రభు! జాగ్రత! భద్ర మయ్యెడున్

చ. అని తలక్రిందులై మొసలి యంబుప్రవాహములోనఁ బోయినం
గని రఘురామచంద్రుఁడు నికామదయామతి క్రూరజంతుదు
స్త్రనుత తదీయసన్నిధిసదంబు నెఱుంగను జేయరాని దం
చును విలపించె మానసవిశుద్ధిని దానికి ముక్తి గోరుచున్

వ. అంత విచారగ్రస్తుఁడై తనయొద్దనకుఁ జేరిన భర్తఁ గాంచి జానకీదేవి యిట్లనియె

సీ. కడు మంచిబాగాయెఁ గాని యిం కెప్పుడుఁ
గానలె నంచు నిక్కట్లు గాని
కొని తెచ్చుకొనఁబోకుఁ డని యింతసేపు నా
ప్రాణాలు ప్రాణాలలోన లేవు;
తీరమ్మునకు వచ్చినా ననుకొంటిని
యింతలోపల మఱి యేగినారు
మఱల నేఁగుట యేల మ్రింగిన మొసలికై
యింతగా వగచుట యేల మీకు
నంత జాలిగుండెయైనప్పు డది యెట్టి
జంతువైన దానిఁ జంప నేల
దాని యంత నదియ తాఁ బైకివచ్చినఁ
దొలఁగనీయకున్నఁ ద్రోచు టొప్పు

మ. అనినన్ స్వామి వచించె నీ గతిని గంగానేకతీరంబులన్
మును లంబుల్ గొనఁబోదు రీమొసలి చంపున్ వారినం జెంది దా
నిని దోరించితిఁ బాప మా మొసలికాని! మంచి దీకానలో
దనుజుల్ పెక్కురు వారినిం గుఱిచి భద్రం బంచుఁ జెప్పెం జుమీ

గీ. రాము తా మొక్క గొకరి నోదార్చుకొంచుఁ
బిడిచికొని గుడ్డలను నెండఁ బెట్టికొంచు
నగ్నవివృతతనూకాంతు లానికొంచు
జానకీరాము లొకకొంత సంచరించి

ఆ. మఱలఁ జిత్రకూటగిరిశృంగకానన
సుమకుటీరములను జొచ్చి విచ్చి
యున్న ననలదండ లురములయందున
మాళు లందుఁ దాల్చి మంజులముగ ౯౩

తెల్లని యాసామి యసితదీధితి తెచ్చుకొన్నాఁడు
నల్లని యాతల్లి తెల్లనునుపు మేన ఘటించుకొనియెఁ
జెల్లరె యిది హిమశైలశృంగాంతసీమ కాంబోలు
నల్లదె చుట్టినచ్ఛ్రేడిని నాకముగ్ధాంబుశైలిని
భాగీరథీవృత్తు కాదు ఫాలస్థవహ్నినేత్రములు
శ్రీగంధి పన్నముల్ కావు శిరసునఁ జిన్ని నంకురులు
యోగవిద్యామూర్తు లిమయు నుగ్రుండు సద్దీక్షచాప
భోగాయతాంసులౌ శబరమూర్తి కాంబోలు నీజంట

సీ. ఇసుదెసఁ బూలపందిరి ప్రాఁకఁజేసిన
లీలఁ బ్రియంగువల్లీచయంబు
నగ్గాస ముంగిట రంగవల్లులు తీర్చు
గతి భద్రదారుపరాగపటలి
పీతారుణసువర్ణధాతుసంతానంబు
పసపుకుంకుమతీర్చు భద్రసరణి
ద్వారస్థశుకశారికారమ్యమంజులా
హ్వానసౌభాగ్యమర్యాద కలిమి
ప్రభువు లరుదెంతురని చేసుపఱిచి రేమొ
కేళిగృహ మన్నగతి సమాలోచారు
తానిధానంబు శైలకందర నొకండుఁ
జెంగటం గాంచుచుం ప్రవేశించినారు

౧. ఇల సోమకుండు త్రయీగ్రంథపటలిచం
క నిధికి క్షీరసాగరము నుఱుకఁ
బెనుచోఱ యిచ్చట పెకలించి ముట్టియు
కాసమ్మంటికో వార్ధిఁ గుద్దలించు
నిట సురాసురులు వాహినిలగ్నగిరిప్రాంత
గల్లపాణులు దైన్యకలితముఖులు
నిట్టితాఁబే లిందుఁ జట్టుప లెత్తిన
గరుడినాఁ బర్వైత్తి కాలుసాచు తా

సీ. నే నింతవ్రతచర్య నీకయి పూనలే
దుమ పూనినట్లుగా నగ్రజునకు
నీవిల్లు నీచేతనే యుండె నట్లు నా
నగవమ్ము నోహరా పినాక మిద్ది
నీచేత భగ్నమౌ నాచాప మెటు లుండె
నటచూడు త్రిపురసంహార మిద్ది
సౌమిత్రివదనంబు చాయగాం దోచు నీ
యన యెవ్వరో శరవణభవుండో

నాకు మెడ నొప్పివెట్టుచున్నది యనంగ
సీత, యీ పతితిమామాల శివునికథలు
చివరగలవయి పోయెనే చెలువ యంచు
క్షోణిసుత రాఘవుం డానికొనియెం బూని

మ. వినతాత్మీశ్లథపక్ష్మకేతకి రసాభృత్కందరాచిత్రపా
ర్శ్వనసుస్వేదజలాభిషేచనపరిశ్రాంతన్ ఘరాతన్వకన్
తన బాహుద్వయిం బూని కాననలతాంతస్వాదుశాఖాసమీ
రణమార్గంబుల రాముడాత్రి పరిచర్యాయత్తుడై ప్రోల్చెన్

మ. ఒకచోటన్ బహువర్ణచిత్రితము కాంతస్నిగ్ధసర్వాంగ పక్షిగో
శకసంతర్పణశీలముం గని ప్రసన్నాత్మాశ్రితా వేది యా
నుక యొక్కొక్కరు కాపుచుండి ప్రేమ పో నూల్కొన్నవై దేవతా
న్యకకున్ రాముండు లక్షురన్ దిలకమాస్యంబందునం దిద్దగా

గీ. నడుమను గురంటకలతాంతనవ్యసూక్ష్మ
కర్ణికాకృతి మృదుపిశంగచ్ఛవియుగ
దానిచుట్టుగ నరుణవర్ణానతము
సైగుంద్ర రేఖయు మండలమంతుచుముగ

శా. కారువ్యాకృతరమ్యమై చనంగ రేఖామండలాంతాంశమా
లారమ్యంబుగ శ్వేతవర్ణమణిమాలారేఖగా వ్రాసి ఫా
లారూఢంబు చలభ్రుపార్శ్వగము కళ్యాణంపు బొట్టుంచి తా
శ్రీరాముండు మెడన్ మలంచికొనుచున్ సీతాముఖం బెంచుచున్

సీ. ఉఱికి పండ్లు గిలించి యుద్యోలలూంచి శా
ఖాగ్రభాగమ్ము బాహాస్ఫాలించి
కుప్పిగా నెగిరి లాంగూలసంస్ఫోటన
ప్రకటఘాతములఁ బత్రములు రాల్చి
యాడ్రుచ్చి కాపచయంబు చేసి రెమ్మ
చప్పిదాడలతోడఁ జప్పరించి
సాంద్రదేశములలోఁ జన గోళ్ళ బోనిచ్చి
కంపిత మూర్ధ్నరుభాగంబు గోఁకి
నగము కొంతమేర దిగి కొంతమేర ధా
రణికి దూఁకి జనకరాజు కూఁతు
ముందు నృత్యమాడ భూసుత త్రాసిత
భయవిమగ్నమయ్యె బడలిపోయి

ఉ. కెవ్వునఁ గేక పెట్టఁగ మృగీనయనాగతవీథి కంతగా
దవ్వున నున్న స్వామి కని తానయి శ్రద్ధగ సేవిపట్టి గా
పువ్వులు జారఁగా విడచిపోయి శరాసనము కరాశ్రితమ్మై
రివ్వున బట్టి చేత బెదరించెఁ బ్లవంగమసార్వభౌమునిన్

శా. గోలాంగూలమహేశ్వరుం డతఁడు గన్గొంచున్ నిమీలించి పం
తాళీఘట్టనరావమేదురముగా ధాత్రీస్థలిం ద్రొక్కి మే
ఘాళీఘంబగు గర్జగా శిరమునన్ హస్తద్వయిం జేర్చి వ
న్యాలీలాధ్వమునం జనెన్ ధరణికన్యాభీతి పాయం జనన్

గీ. ఎంతో శ్రమపడి తా రచియించిపెట్టి
జానకీదేవి ఫాలస్థచంద్రరేఖ
వోని తిలకమ్ము స్వేదసంతానలహరిఁ
గరఁగిపోయినఁ జూచి రాఘవుఁడు తాను

మ. అపురా! వానర మొక్కఁ డిట్లనిన భీతాహమ్మనన్ రాచపు
ట్టావు నీకే తగునంచు వల్కాలపటాటోపంబుగా జానకీ
నవఫాలంబున స్వేదముల్ దుడుచుచున్ నవ్వించుచున్ జాలు నిం
[illegible]వనీయాన మటుంచు నింటికిఁ జనంగా నామె కొప్పించుచున్ ౭౦

వ. పర్ణకుటీరమేగిన వారికి సౌమిత్రి యేర్పఱచిన సర్వసంభోగములు ప్రమోదదంబులయ్యె; నతఁడు చేసిన పరిచర్య సౌఖ్యదాయిని యయ్యె సౌమిత్రి హరిణమాంసంబులు యజ్ఞపరిశేషంబులు సంభరించిన నొక్కనాఁడు జానకి వాని నెండఁబెట్టుచుఁ జేత నొక్క పుల్లను గొని పక్షుల నదలించుచు నున్న సమయంబున శ్రీరామచంద్రుండు సీత తొడపైఁ దలచేర్చి నిద్రించుచుండె నప్పుడు

క. ఇంద్రుని కొడుకు కాక కాకము
రుంద్రగరుచ్చాలనోగ్రగరుత్కము ఖేలా
సాంద్రామిషలవహాగణా
తంద్రచలచ్చంచు వగుచు దర్పము మోయన్

క. ఎండఁబెట్టిన యామిషఖండములనుఁ
జొఱదు సీతాపయోధరశోణితంబు
రుచి మఱిగినట్లు లెడదనొఱచి గ్రహింప
ముక్కుచాచుక తల్లిపై మొనసి దూఁకి

శా. తా నట్టిట్టులఁ దూఁగినన్ బతికి నిద్రాభంగమౌ, హా సఖా
ప్రాసం బాయదు కాకి, భూమిసుతవక్షస్స్థానమున్ ముక్కునన్
దానై జీరును బాసిపోవు ఖగ మా ధాత్రీసుతోరస్సున
గ్రాసన్ వ్రాఁకలు కట్టె దుష్టబలిభుక్చంచూపరిమ్లానమై

శా. తా వైదేహియు నెంత కొంచెము పరధ్యానమ్ముగా నున్న రే
ఖావిస్ఫోటముగాఁగఁ జేసి చను ధ్వాంక్షుతోరిట, కాష్ఠాహాశిం
జేనం బాయద, యంచె లంచెలుగ నిచ్చేయున్ నటచ్చంచు ఖ
ర్వాద్వేధాకృతి ఱెక్కలన్ విద్రుచుకొంచున్ దుష్టకాగం బోగిన్

క. మొగమెల్ల మొఱ్ఱపడియెను
జిగురుకనులు జేవురించె సీతకు రక్తా
నుగమై తడి చీకంటిన
నిగము గదిరె నిద్రలేచె నీశ్వరుఁ డంతన్

చ. చెదరి వివర్ణమై పొలుచు సీత మొగంబునుగాంచి ఝొమ్మునన్
ముదిరిన మొఱ్ఱవన్నె తడిముద్దఁ గనుంగొని స్వామి యేమి యి
య్యది యనఁ జేయిచాచి జనకాత్మజ పల్లకిబొంగువోని ము
క్కుద్రుచుచు వచ్చు దుష్టచర కాకము వంకనుజూపెఁ జూపినన్ ౨౨

నదీప్రఘోషము :

పూని సామీప్యముం బొందఁగా రాకయే
నినాదఘోరాకృతి వార్ని ధానజీ
వసియోగ్రభంగాళి వారించె విష్వ
క్సేనుండు వేత్రాగ్రవిసృత్వరుండునా

ఇంద్రవంశము :

ఆకాశమందైనఁ గటా! చనన్ దరం
గాకీర్ణ ఘోరాకృతి చూడనీయకే
రేకైన తెక్కల్ వినికృత్తశక్తినై
కాకంబు విష్ణ్వాశ పోకారి పోవఁగా

క. సర్వాశాస్థానంబుగ
సర్వజ్ఞుఁడు చంద్రమౌళి స్వాంతము దవులన్
గుర్వాభీలముఖంబుగ
బర్వన్ తెక్కలవి యూడిపడునో యనఁగన్

ఆ. కాకపక్షకాంతిఁ గైలాసశిఖరంబు
మచ్చతోడి చంద్రమండలంబు
పోలె నుండఁ బోయి వ్రాలె ధూర్జటిపదాం
తికధరిత్రి మాకలికపతత్రి

గీ. ఉర్వి నెల్ల కోర్కు లుడిగిన దైనను
నుడుగనట్టి దొక్కఁడుగ్రి! నిన్నుఁ
గూర్చినట్టి చివరికోరిక నేనిట్లు
యంటుకొంటి స్వామి! యూర్పు పవిస...

స్రగ్విణి :

ఓరి దౌర్భాగ్యుఁడా! యుర్వి వేఁడొక్కఁడ
వ్యోమ్య చిరంసాపథం బొందఁడా నీ తమో
ధ్యారమాస్వామికా కాఁగకే తల్పధాం
ఘోరుహం బూనుమీ పోయి జ్వాలాకృతిన్ గా ౨

చ. ఖరుఁ డను రాక్షసుం డొకఁడు కల్గును మాఁతితిఁగొన్నమి త్రిమై
తిరుగునువాఁడు వాని గడిదేశీనబంటులు వాఁడు, నీవు నీ
తరుణియుఁ దోడ నీ యనుఁగుతమ్ముఁడు వచ్చిన మీ ధనుఃస్ఫు
స్ఫురణముఁ జూచి రక్కసులమూఁకకుఁ గన్నులు కుట్టవో ప్రభూ!

గీ. జ్వరితు లైనఁ బ్రమాదంబు సంఘటిలిన
నువ్వుగింజంత వ్రేలు ప్తి నిల్వటిలినఁ
గాఁచి నియమముల్ సడలిన నేని మునుల
ప్రాణముల్ గొందు రా ఘోర రాక్షసాళి

శా. స్నానంబాడ నదీతటంబు చనినంతన్ నమ్ము రొక్కరుని గా
హానన్ దాఁ బొలిమేరకొక్కఁడునువాఁడున్ నమ్ము నొక్కరుని వ్యా
ఘ్రాన్ వాసనపట్టి వచ్చెదరు నక్రశ్రేణి యాహారార్థం
గానన్ వారలఁ దట్టుకో. నరిది మేఘుస్నిగ్ధ దేహద్యుతీ!

ఉ. ఇచ్చట నూరు నెత్తికొని యేగఁగ నెంచుచు నుంటి మేము మీ
రెచ్చటి కేగఁగాఁ గలరొ యేమయి యిమ్మురు డించిపోవఁగా
వచ్చెనటంచు మాయెదలు పట్టవు నే మిట నుండియుంచు మీ
రిచ్చట నిల్వకట్టుటయు నేమొ యిటంజను టేమి చెప్పుదున్

శా. ఓ స్వామీ! పదిసార్లు చెప్పితిపి మీ రుద్యోతితానంతబా
హాసంపన్నులు వారి కేమి యని కట్టా! యీయడవిం బొందు వి
శ్వాసం బూనఁగఁ జేయఁజాల విడిపోవంజాల రీబ్రాహ్మణుల్
మీ సీతాపరిదీనమోహనదృశామిథ్యాభియోగంబునన్

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె

గీ. మీరు నను వీడిపోవఁగా లేరు నేను
మిమ్ము విడిపోవఁగాలేను మీకు నాకు
నడుమఁ గాకుండఁ జేసెడు కడకపూప్పు
దితిజాలను మిమ్ముఁగూర్చి సాధింతు నేను

చ. ఇది యెపుడో వచింపనయ యిప్పుడు చెప్పితి రప్పుడైన మీ
సదనము లెల్ల వీడిచనుసంగతి లే దఖిలంబు బండ్లపైఁ
గుదిగొన నెత్తిపంపి యిది కూడ దనన్ మఱీ యిప్పు డేమి చే
యుదురు సరే యటంచును రఘూద్వహుఁ డేగెఁ గుటీరభూమికిన్

శా. నైకంబుల్ కలవమ్మ చూసి పసిదానా! యూర్జితం బైన వా
స్నాకీనంబులు సత్తపంబు లోక వాంఛం గోరు మేని చ్చెదన్
నీకుం గోరిక లిచ్చునైన దపమే నీలాంబుధారాధర
శ్రీకోలాహలసితసుచిస్వినాన్నకేర్జాలకా!

చ. అని జనకాత్మజాతయుఁ గృతాంజలి యై పెదతల్లి! నీవు బి
డ్డను ననుఁ బాసచేసెదుఁ గడంకను జూపను నా తపస్సు స
న్నను బొసరింపనిమ్ము సవనూతనమైన భవద్దయాగుణం
బును దప మాచరించుతఱిఁ బ్రోద్బలమై చనుఁగాక నాకికన్

ఉ. నావిని మౌనిపత్ని చిఱునవ్వున నిన్నును బోలుదాన వే
నీవను దల్లి! తా నయిన నీపతి తన్ను నుబోలువాఁడు కా
నీ! వసుధాకుమారి! మొద నొక్కొను మోదముఁ బట్టలేను నీ
కే విధమైనదో యొకటి యింపు ఘటిల్లఁగఁ జేయనేవలెన్

గీ. ఇద్ది మైపూఁత యిదిగంధ మిద్ది చీర
యిద్ది పూమాల యివియుఁ దల్లి! మదీయ
సత్తపఃకల్పితమ్ములు సాధుశీల!
వీని గైచేసికొనవమ్మ వినయరాశి!

వ. అనిన జానకి యించుకంత లజ్జయు నించుకంత బాగునగా లేచి యా మైపూఁతఁ బూసికొని యాచీరఁగట్టుకొని యా పూమాల మెడలో వేసికొని యా గంధ మద్దికొని కట్టిన చీరక్రొత్తకుచ్చెలలు కుచ్చిళ్లుగాసర్దుకొని శోభాయమానముగా ననసూయాదేవిపజ్జఁ గూర్చున్న నామె యిట్లనియె

క. ఈ పూమాలయు వాడదు
మైపూఁతయు జిలుగు సెడదు మధురాపాంగ
శ్రీపాలితలజ్జా! నీ
మేపు చెడదు చీర నలుగదే! నా తల్లీ!

క. ఈ గంధము ననపనగా
శ్రీగంధమనోజ్ఞ మృదుపకీసుళ రేఖల్
సాగి భవదీయపతి నా
సాగోళము వించుఁ జెలియఁజాలని తొల్తన్

గీ. పొద్దుపోయెను నీ వింకఁ బోయి వీడు
పతిఁ గలసికొమ్ము నా కగ్నిపనియుఁ గలదు
మీ కుటీరమ్మునందున మీరు కూడ
నగ్నిపరిచర్య చేయుఁ గటంచుఁ బంప

వ. అంత నత్రి తమ కేర్పఱచిన కుటీరమందు సౌమిత్రి సంధానించి కూర్పఁగా రామచంద్రుం డగ్నిహోత్రంబు నిర్వర్తించిన యనంతరంబు జానకి యి ట్లనియె

క. మన వైపున ప్రజ శ్రీతు ల
యున సంతోసము కొలంది నిత్తుము ధనముల్
గొనుమన్న రీతి ఋషిఋషి
వనితలు తప మిత్తు మంచుఁ బలుకుదురుసుడీ!

మ. అనినన్ రాముఁడు కొంపతీసి యనసూయాదేవి సొ స తపం
బున నే యింతో గ్రహింపలేదు కద యో పున్నాగవేణీ! యనం
గను వైదేహి విదేహరాజజ రఘూత్తంసా భృత్యున్నషన్ నీకు భా
గ్యను వద్దంటిని నా తపంబు నను జేయం జొప్పవే యంటినాన్

క. రాముడు సంతోషంపడి
యోహో యచ్చెరవిధాన నెసఁగెద వనినన్
భూమిసుత యిక వింతే
శ్రీమునిపత్నీకటాక్ష సేవాఫలమై

చ. అని తన గందపూఁతమొదలైనవి చెప్పిన రామచంద్రుఁడున్
విని యొకనాఁడు నీవయి నవీనతఁ బాసెదె నాదు కంటికిన్
మునిసతి పొంగులో కరుణపుట్టుటకా కన సీత కాపురం
బునకును వచ్చినట్టితఱిఁ బుట్టిన నీకు విరాగ మేమియో

క. నా మొగమె చూడలేదే
యామెయిఁ గొన్నేండ్లు మఱల నటు జరుగ దటం
చేమో నమ్మక మకటా!
మీ మాటలు నమ్మరాదు మీకో మీకో! [illegible]

క. కాకి మహా బిడ్డ మటీఁ
నాకొనియె వనిమ నమ్మవలదే తల్లీ!
యీ కాకుత్థ్సు నటించును
నా కపి మొప్పుటికి నుండు జ్ఞాపక మనినన్

గీ. అనిన శ్రీరాఘవుండు నవ్వి యుంబుగాటి
యుందుకనియా! గ్రహించితి నా మునీంద్రు
నతివ యిచ్చిన యాగరాగాదు లంచు
గ్రువ్వి మునిమునిసనవ్వులు నవ్వుకొనెను

ఉ. అమ్మలు నాగపు వాగలును నత్రికడన్ సెలవొంది చిత్రకూ
టమ్ము సమీపదేశము విడన్ మదినెంచిరి యంతనంత న
గ్రమ్మగు దండకాఖ్యమగు కాఱడవిం జన నెంచి రంతటన్
గ్రమ్మరు జీఁకటుల్ పరిసరమ్ములు కన్పడరాని చీఁకటుల్

సీ. హుతసప్రజహావ్యపరిఖడ్గధా
రాకృత్తపక్షమహా రక్కసివలె
హోమకుండోద్గతధూమమాలికయన్న
చోటమీ సూచ్చిన వారిధివలె
నగ్నిస్ఫులింగమ్ము లన్న మిణ్గురులవె
ల్గులు చొచ్చెడుఁ దమాలకుంజమువలె
శిఖిశిఖాసంతాశితభల్ల పరిలగ్న
మహితదేహంబైన మహిషమువలె

వితతసౌదామనీపరివిద్ధపునరు
దారసంక్రాంతకాలాంబుదంబువోలె
నొలసికొంచును విరిసికొంచుండె నాగ
నాథ రామాగ్నిగృహ మంధకారపటలి

గాఢ

న నూ




## ఆ శ్వా సాం త ము

గీ. మోహన మనసూమూఖండము జగదీశ!
యిద్ది, ముక్త్యాలచంద్రమౌళీశ్వరుండు
దీని విని యేమి ఫలము సాధించుటకును
గోరె నాయన కది సమకూర్పు స్వామి!

శా. ప్రోవా సర్వకవిత్వమన్మనిమొఁడన్ భూభృత్సుతానాయక
గ్రైవేయీకృతు శోభనావిరసుతుండన్ గారుణ్యమాధుర్య రే
ఖావి త్రిర్వతి వేంకటేశకవితాగంగాహిరణ్యాబ్జమా
లావైకత్సకమూర్తి సాధుసుజనాలాపప్రియుక్తాత్ముఁడన్

శా. స్త్రైకోద్రిక్తజమర్త్మిమి తేకమదేనఃపుంజముఁ దా నయో
ధ్యాకాండ మ్మని సాహితీవిమలతీర్థం బార్పుత వెండికొం
డై, కైలాసము నందమూ రగుట మేలై, నీవు నీవై, యుమే
శా! కైలాసము కాదొ నీవెచట ను న్నాచోటు విశ్వేశ్వరా!

ఉ. చేయఁగలన్ని పాపములు చేసితి ముఁ వెనుకల్ గణింపకే
చేయఁగనైన పుణ్యములు చేసితి నీదయకల్గుదాఁక దూ
రాయితమయ్యె నీజనిమరాత్మత, రామకథాప్రపూర్తి వే
కాయుతిగాఁగ దేహ మవలంబన చేయును చాలు నోప్రభూ!

న ర్కు ట క ము.

సలిరజవారిజాక్షసురనాథమనోఽబ్జరవీ
సలలితభక్తలోకపరిసంగతకామగవీ!
విలసితసాధుతానిభృతవీక్షణసంభృతవి
గ్నలతగరూక్షదృష్టిగతమానసయజ్ఞహవీ!

మ ణి మా ల.

భంగామలచూడా! బాణాసురహేడా
శృంగారవిరామా! నృత్యాహితకామా!
సంగేతరవృత్తీ! సంవ్యానితకృత్తీ
సాంగాగమమూర్తీ! సాయుజ్యదకీర్తీ!